# అంకితము.

రాజమహేంద్రపురవాస్తవ్యులును, హిందూదేశీయమహాసభా
కార్యదర్శియు, చెన్నపురి హిందూపత్త్రికాసంస్థాపకులలో
ఒక్కరును, ఉన్నతన్యాయస్థానన్యాయవాదులును,
మతనీతివిద్యాభిమానులును, సంస్కృతాం
ధ్రాంగ్లేయభాషావిశారదులును అగు
మ-రా-రా-శ్రీ,

## న్యాపతి సుబ్బారావుపంతులు,

బి ఏ, బి ఎల్, గారికి

ఈ

## వివేకానందవిజయము

అను దివ్యగ్రంథము

వినయపూర్వకముగా సమర్పింపఁబడినది.

ఓమ్.

“ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్య వరాన్ నిబోధత!”

**“Arise ! Awake ' Stop not till
you reach the goal ”**

# పీఠిక.

శ్లో. "పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగేయుగే" గీత ౪ ౮

"సజ్జనుల సంరక్షణముకొఱకును, దుర్జనుల సంహారము కొఱకును, ధర్మమును స్థాపించుటకొఱకును, ప్రతియుగము నందును, ఆయాకాలములయం దవతరించుచుందును" అని శ్రీకృష్ణపరమాత్మ బోధించినప్రకారము అప్పుడప్పుడు ఆభగవంతుఁడు అవతరించుట సత్యము దుష్టజనరక్షణమును శిష్టజనరక్షణమును జేయుభారము భగవంతునిదే కావున నతం డాయాకాలములయం దవతరించి లోకోద్ధార మొనర్పఁగలఁడు ఇది ఆస్తికులెల్ల రంగీకరించినవిషయము గాన విస్తరింపఁ బనిలేదు క్రీస్తుశకము పదునెనిమిదవశతాబ్దియందు నానావిధములగు దుష్కృతము లుదయమైన కతన యాస్తికజనమనోవేదనాగ్ని ప్రజ్వరిల్లసాగెను ఆజ్వాల లెగసి పరమవస్తువును సైతము దహింపఁ జొచ్చెనేమో యనునట్లును అన్నివారణచేయుటకుఁ బూనినాఁడో యనునట్లును భగవంతుని వ్యూహములలో పరవైభవములు రెండు నీభారతదేశమునందు ప్రభవించెను పరావతారము శ్రీరామకృష్ణపరమహంసస్వాములనియు, విభవావతారము శ్రీవివేకానందస్వాములనియు నెన్నఁదగు

శ్రీవివేకానందస్వాము లవతరింపనిచో పరదేశములయందు మనమతమహిమాతిశయములు ప్రసిద్ధములు కానేరవు ఇది ముమ్మాటికినిసత్యము ఈమహాపురుషుఁడు లోకోపకారార్థమై తనజీవితము నంతయు నిమిషమాత్రమేని వ్యర్థముచేయక

ధారవోసినాఁడు. ఇతనింగూర్చి యెంతయేని వ్రాయవచ్చును అట్లు వ్రాయుటకంటె నతని మహోపన్యాసములను జదివితిరేని మేము వ్రాయుదానికంటె నెన్నియో మహిమలు వారినిగూర్చి మీరు తెలిసికొందురు కావున విస్తరింపలేదని పాఠకులు విసిగికొనకుందురుగాత మని ప్రార్థించెదము.

ఈమహామహుని దివ్యోపన్యాసములలోఁ బ్రకృతోపయోగులగు వానిని గొన్నింటి నాంధ్రీకరించితిమి క్రమక్రమముగా మాయావతిలోఁ బ్రకటింపఁబడుచుండు శ్రీవివేకానందులవారిచరిత్రమును, వారి సత్కైంకర్యప్రభావాదులును గలమహాగ్రంథమును నచిరకాలమున యథారీతి తెనిఁగించి ముద్రింప నెంచినారము ఇప్పుడు మేము ప్రకటించిన యీ గ్రంథమునందు, శ్రీయుత న్యాపతి సుబ్బారావు పంతులుగారి యనుమతిచే మ-రా-రా-శ్రీ, నందూరు మూర్తిరాజు, బి. ఏ., గారి వలన నాంధ్రీకరింపఁబడి కాకినాడ సరస్వతీముద్రాక్షరశాలలో ముద్రింపఁబడిన "వివేకానందోపన్యాసములు" అను గ్రంథములోనుండి రెండుపన్యాసములను శ్రీ పంతులవారి యనుజ్ఞఁ గొని చేర్పించినారము ఈదివ్యగ్రంథము ను తెనిఁగించి ముద్రింపుఁడని మాకు సెలవిచ్చిన రాజమహేంద్రవర నివాసులు శ్రీయుత న్యాపతి సుబ్బారావుపంతులు గారికి మా కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుటయే గాక, పంతులవారి సన్నిధియందే దీనిని సమర్పించుట సమంజసమని భావించి యట్లొనర్చితిమి శాంతచిత్తు లగు సాధుసజ్జనుల కింతకంటె విన్నవింప నేల యని విరమించినారము.

ఇట్లు,

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# విషయసూచిక.

శ్రీ రస్తు

# శ్రీ వివేకానందవిజయము.

" ఒకపరి ప్రకాశముం గాంచిన శలభము మరల
ంధకార మాశ్రయించుట లేదు శర్కరయందే పిపీలిక
రిరవియోగ మొందును గాని యావలికి మరలుట లేదు.
ద్విధముగానే సాధు వగు భక్తుఁడు ముముక్షు వయి తా
ాశ్రయించిన యీశ్వరునకు సంతోషపూర్వకముగాఁ దన
్రాణ మర్పించుచున్నాఁడు "—శ్రీ రామకృష్ణపరమహంస
ారి 'ఉపదేశరత్నమాల' 423 వ మహావాక్యము

[శ్రీ వివేకానందస్వాముల బాల్యదశ - విద్యాభ్యాసము - మనో
విభ్రమణము - గురువు నాశ్రయించుట - గురుమూర్తి యవతారమున
కావశ్యకము - శ్రీరామకృష్ణ పరమహంసయుపదేశము - పరమ
హంస సిద్ధినొందుట - శ్రీవివేకానందస్వాముల క్షేత్రయాత్ర]

శ్రీమద్వివేకానందస్వాములవారు, కలకత్తానగరమున
క్రీ. శ. 1863 వ సం॥న శ్రేష్ఠమగు *కాయస్థకులమున జన్మించిరి
ారిపూర్వాశ్రమనామధేయము 'నరేంద్రదత్తుఁడు' బాల్య

* కాయస్థుఁడు అనిన గణికుఁడని యర్థము. ఈకులజాలు బంగాళ
న మిగుల సంపన్నులుగా నున్నారు. మన చెన్నపురిరాజ్యమున బ్రాహ్మణు
ట్లు విద్యాధికులయి గొప్పయుద్యోగముల నెలయుదురో, అట్లే కాయస్థు
ను బంగాళమున నన్నిట నుచ్ఛ్రాయదశనొంది విలసిల్లెదరు

మునం దతఁ డందఱ హృదయముల నాకర్షించు సౌందర్య రేఖయు వీరచిహ్నములను వహించి యుండం జేసి, జననీజనకు లతనిని 'వీరేశ్వరుఁడు' అను నన్వర్థనామ మిడి ముచ్చటగాఁ బిలుచుచుండిరి. ఆతని పెద్దలు, న్యాయవాది (వకీలు) వృత్తి నవలంబించి జీవించుచుండిరి. ఆతని జనకుఁడయిన 'విశ్వనాథ దత్తుఁడు' 1860 వ సంవత్సరము మొదలు 9, 10 సం॥ ముల దనుక మధ్యమాగాణములయందలి ముఖ్యన్యాయస్థానమున (Chief Court) న్యాయవాదిగా నుండి, పిమ్మట కలకత్తా నగరమున జేరి యందలి హైకోర్టున అటార్నీగా నుండెను. కలకత్తానగరమునందలి న్యాయవాదులలో మిగుల సమర్థుఁడని ప్రఖ్యాతిఁ గాంచిన దేశాభిమానియైన బాబు ఉమాచరణ బంధోపాధ్యాయుఁడు (W. C. బానర్జీ), స్వాములవారి కుటుంబమునుగూర్చి చక్కఁగా గుర్తెఱిఁగి, వారితో మైత్రి సలుపుచు వచ్చెను. స్వాములు, ఆత్మచరిత్రమును గూర్చి యెవరితోను బ్రశంసించినవారు కారు; కావున, నితరులవలన మాకుఁ దెలియవచ్చినసంగతులనే యిచ్చట ముచ్చటింపవలసి యున్నది.

బాల్యమునుండియు వారికి సత్సాంగత్యమునను సన్మార్గ ప్రవర్తనమునను చిత్తము లయించి యుండెను. వారికి బాల్యమునుండియే యేకాంతస్థితిని చిత్త మీశ్వరాయత్తము చేసి ధ్యానమునం దమరుటయు; క్రీడాసఖులనుసైత మట్లుచేయఁ బ్రేరేచు నలవాటును గలవు. శ్రీరామచంద్రునియెడలను సీతాదేవియందును వారు వహించియుండిన భక్తికి మేరలేదు.

శ్రీసీతారాముల పావనచరిత్రమే స్వాముల భగవదనుగ్రహ సంపాదనమునకు పరికరముగాఁ బరిఢవిల్లెను.

ఇట్లు కొన్ని యేండ్లు గడువఁగా, నరేంద్రునకు బాల్యము దొలఁగి యౌవన మంకురించెను. వారు పాఠశాలలందు విద్యా పరిణతినొంది, పిదప, కలకత్తా సర్వకళాశాలలో 'కళాకుమారుఁడు, (Bachelor of Arts) అనఁగా B. A అనెడి విద్యా వైషయికబిరుదమును బొందిరి.

వారు సర్వకళాశాలలోఁ జదువుచున్న యదనున వారిని గూర్చి ప్రశంసింపఁదగిన వింతసంగతు లేవియు తెలియక పోయినను, వారు తమతోఁ జదువుచుండిన సహాధ్యాయుల పొగడ్తకెక్కు చుండి రనుటమాత్రము పోల్లుకాదు. వారు చదువునప్పుడు విద్య నుపేక్షించుచు వచ్చినను వర్షాంతమునఁ బరీక్షలో నుత్తీర్ణునుగఁ గృతకృత్యు లగుట యెవరి కాశ్చర్యము గలిగింపదు? వారు సంగీతసాహిత్యములయందును, నర్తనచిత్రవిలేఖనములయందును బ్రవీణులుగానుండిరి. వారు, గంభీరాకృతియు, చూచువారిని స్వవశమున కాకర్షించు సౌందర్యరేఖయు వహించి, మూర్తీకరించిన కరుణారసమా యనఁ బొలుపారుచుండిరి

వివేకానందస్వామి మెత్తని చిత్తవృత్తి గలవారనుట, వారి విద్యాభ్యాసకాలముననే వెల్లడి యయ్యెను. ఒకానొక తరుణమున స్వాములవారు చదువుచుండిన తరగతికి నుపాధ్యాయుఁడగు యైరోపీయపండితుఁడు, తనవిద్యార్థులకు సత్య

వేదమును (Bible) బోధించుచుండ, మాణవకులు గొందఱు, ఆతనిని బలముగా నాక్షేపింపఁ దొడఁగిరి వారి యాక్షేపములకుఁ దగినసమాధానములను జెప్పలేక యుపాధ్యాయుఁడు మిగులఁ గలఁతనొంది యుండుటను గాంచి, విద్యార్థు లందఱును జేతులు చఱచి నవ్వసాగిరి అప్పు డాపండితుఁ డుండిన పరితాపకరస్థితిని గాంచి, ఓర్వలేక, నరేంద్రుఁడు, దిట్టముగా లేచి నిలుచుండి, నయవచనములఁ దనసహాధ్యాయుల కోలాహలము మాన్పి, విద్యార్థులు నోరు మూయునట్లు సమతులు పలికి, తనయొజ్జకుఁ గలుగనున్న యవమానముఁ దొలఁగించి యానందమును గలిగించెను

వారు, 1884 వ సం॥ బి ఏ పరీక్షయందుఁ గృతార్థులయి కులక్రమాగతంబయిన (వకీలు) న్యాయవాది వృత్తి నవలంబించిరి అతరుణమున వా రున్నతస్థితి నొందుట కైన చిహ్నము లేమియు వారియెడలఁ గన్పట్టినవి గావు అయినను వారక్కాలమున మతవిచారమునఁ జిత్తము చొనిపిరి ప్ర ప్రథమమున వారు హిందూమతాచారముల విసుఁగునొంది, ఆకాలమునఁ బ్రబలదశయందుండిన బ్రహ్మసమాజ మాశ్రయించిరి. వారు సంగీతవిద్యయం దత్యంతసమర్థులు గావున సమాజపుటారాధన సమయములయందు వారే 'హార్మోనియ' మాదిగాఁ గల పరికరంబులతో గానసుధ వెల్లిగొలుపుచుండిరి కొన్నిసమయములయందు, హరిదాసమాజమును, మఱి కొన్నివేళల క్రైస్తవసమయోద్ధారణసైన్యమును జేరి, భక్త్యావేశపరవశులయి వీధులవెంబడి నాడుచును బాడుచును బోవుచుండిరి.

వారు, ఆంగ్లేయభాషను జదివి, యందలి విజ్ఞానకళను (Science) లౌకాయతశాస్త్రములను విమర్శించినవారగుటచే సర్వమతముల సిద్ధాంతములను దుచ్ఛీకరించు నౌదాసీన్యము, వారిహృదయమునకుఁ జొప్పడెను వారు, తమపరిసరములయం దున్న మతాభిమాన ఘనులయందును వ్యర్థపు దురభిమానమే తలమీఱియుండుటను గనుఁగొనిరి అట్లుండియును మతరహస్యముల యథార్థమును దెలిసికొనవలయు నను తలంపు వారికి గాఢముగా నుండుటచే, అది యెచ్చట లభించునో యని తమలోనే విమర్శించుకొనుచు, దానిని గనుఁగొనుటయు సుసాధ్యమో యని సందేహింపఁ జొచ్చిరి అది మొదలుచేసి, వారు, క్రైస్తవ మహమ్మదీయాది సర్వమతముల యాచార్యులయొద్దకుఁ బోయి, వారు చెప్పువానిని వినువారైరి "మీ రుపదేశించిన సూక్తిరత్నములు సత్యములని మీ కెట్లు దెలియును? ఇది మీ స్వానుభవపూర్వకముగా గ్రహించినవా?" అను ప్రశ్నలనే వా రయ్యాచార్యుల నడుగుచుండిరి వారిట్లు ప్రశ్నించుటకు, వారంద ఱేకగ్రీవముగా "లేదు; మే ముపదేశించునవి, స్వానుభవపూర్వకములు గావు; ఇవన్నియు శాస్త్రప్రసిద్ధములు. వేదశాస్త్రాదు లిట్లే యుద్ఘోషించుచున్నవి" అని బదులు పలుకుచుండిరి వారు దూరదేశముల సంచరించియు సంశయాకులమగు వారిచేతమునకుఁ దృప్తికలగలేదు. ఎట్లయినను సత్యమును కనుఁగొనియే తీరవలయు నను దృఢసంకల్పము వారిహృదయమునం దంకురింపఁగానే, స్వానుభవ సాధ్యమయిన సత్యము నుపదేశించు సద్గురువును వెదకుటయందే కొంతకాలము వినియోగించిరి "ఇంక నా

కట్టియాచార్యుఁడు లభించుట దుర్లభము. ఇంక నిట్టి యడియాసతోఁ బనిలేదు" అని వారు విసిగికొను తరుణమున, తమ్మాశ్రయించువారికి, గౌరవలేశములేక, సత్యముపదేశించువారును, శిశువువలె సాధువును నగు నొకజ్ఞాని నాశ్రయించు మహాభాగ్యమునకు నోచుకొనిరి అప్పుడు కూడ వారామహానుభావునిం జూచి "అయ్యా, మీరు భగవద్దర్శనము చేసియున్నారా?" అని తన యలవాటుమేరకే ప్రశ్నించిరి. అందులకు వారు స్పష్టముగాను దృఢముగాను "ఆహా! నేను భగవంతుని దర్శించియున్నాను" అని బదులు పలికిరి. ఆమాట నరేంద్రున కానందమును నాశ్చర్యమును బెంచెనని చెప్పవలయునా? ఆయీశ్వరుని నాకుఁ జూపుదురా? అని మరల నడిగెను. ఆమహాయోగి యించుకంతయు వెనుదీయక "ఆహా? చూపఁగలను" అనిరి

ఈసాధు వెవరనఁగా బంగాళమునందలి దక్షిణేశ్వరమున కాళికాదేవ్యాలయంబున వెలయుచుండిన శ్రీరామకృష్ణ పరమహంస యను యతీశ్వరుఁడు అదిమొదలు నరేంద్రుఁ డీ సంయమిశ్రేష్ఠుని పాదచ్ఛాయ నాశ్రయించి వారి యుపదేశముల శ్రవణము సేయుచుండెను నరేంద్రుఁడు, వారిని పలువిధంబుల ప్రశ్నించియును, తర్కించియును, వా రుపదేశించునట్లే యనుష్ఠించువారా యని పరీక్షింప వారి రహస్యాచరణముల గమనించియును జూచెను "ఇంక వీరిని విశ్వసింపవచ్చును మోసము గలుగదు" అను మనోనిశ్చయము గలిగిన పిదప వారికి శిష్యుఁడయ్యెను. పరమహంసయొద్ద తా ననుదినము ప్రత్యక్షమునఁ గాంచుచువచ్చిన యనుపమాన సచ్ఛీలప్రభా

వంబునంజేసి భానునకుఁ దొలఁగు నంధకారముభాతి తన సంశయ మంతయుఁ దొలఁగెను

పాశ్చాత్య మండలములలోని లోకాయతమత మను మహాజలప్రవాహము, ఘోరతమముగా నీహిందూదేశమును నాశము చేయుచున్న తరుణమున మనదేశములోని యువులు పాశ్చాత్యాచారమనెడి మధుపానవశమునఁ గైపు తలకెక్కి, ఆర్యమహాసనాతన ధర్మములయెడల సత్యమును గనుఁగొన లేక, మూర్ఖులయి తిరుగుచుండు కాలమున, మనవారు, తమ పెద్దలమతమున విశ్వాసరహితులయి పరదేశీయవేషభాషాచారముల ననుసరించు సమయమున, శ్రీపరమహంసస్వాము లవతరించి ప్రతిమతమునందును, మతవిశిష్టత సమగ్రముగా నమరియున్న దేగాని ప్రత్యేక ప్రత్యేకముగా లేదనియును, ఊరక పుస్తకపత్రములను ద్రిప్పుటయందు బుద్ధిఁ జెల్లింపక, తత్త్వభూతిని స్వానుభూతికిఁ దెచ్చుకొన్న నే యాసత్యము గోచరించు ననియును, వారు తమ పవిత్రాచరణమూలమున లోకము వారికి వ్యక్తపఱచిరి

శ్రీరామకృష్ణ పరమహంస యవతరించిన కాలమున నీ దేశస్థితినిగూర్చి వివేకానందస్వాములు 'భగణఖండపు ఋషి శ్రేష్ఠులు' అను శీర్షిక క్రింద చెన్నపురమున నిచ్చిన యుప న్యాసమున నీక్రింద వివరించినట్లు దెలిపియున్నారు

"శ్రీశంకరభగవత్పాదాచార్యుల యపారజ్ఞానశక్తియు, కరుణావిశిష్టు లగు శ్రీకృష్ణచైతన్యస్వాముల యుదారహృద

యమును తాఁదివ్యశరీర మాశ్రయింపఁగాఁ దేజరిల్లువారును, సకల సంప్రదాయముల యందును, ప్రాణిసముదాయముల యందును సాక్షిభూతమై ప్రకాశించు నఖండ బ్రహ్మస్వరూపంబునుం గాంచి యమందానంద పరవశులగువారును, భరతఖండమునఁ గాని, వెలుపలఁ గాని గల దీనులు, అబలులు, జాతిభ్రంశులు, దురవస్థాప్రపీడితులు, లోనగువారికొఱకు మనస్సు కరఁగి యనుతాప మొందువారును; హిందూదేశమునందును దదితరప్రదేశములయందును పరస్పరస్పర్ధావశమున వాదులాడు మతముల నన్నిటని సమన్వయపఱచి, భక్తిజ్ఞానములతోడి యైక్యకరమగు సామరస్యము సిద్ధాంతీకరించుటకు మహాపురుషు లవతరించుకాలము పరిపక్వస్థితిని వహించి యుండెను అట్టి తరుణముననే యీ మహానుభావుఁడవతరించెను ఆతని పాదారవిందములకు సేవచేయు మహాభాగ్యము నాకు లభించెను. అందు విశేషాంశ మొకటిగలదు: పాశ్చాత్యఖండవాసుల యుద్దేశములను, ఆచారములను ఇండియాలోని తక్కిన ప్రదేశములకంటెను నెక్కువగా నవలంబించి యైరోపానాగరకమునకు ముఖ్యముగా వెలయుచుండిన కలకత్తానగరమునకు దాపుననే యీతని చరిత్రమంతయు కొనసాగెను ఆతఁ డచ్చట జన్మించి యెట్టిశాస్త్రములు జదువక యే విజ్ఞానసంపదను సంపాదించెను అట్టి యుత్కృష్టజ్ఞానియయ్యును దనపేరు వ్రాయుట కాతనికిఁ దెలియదు అట్లుండియును మన సర్వకళాశాలయందలి కళాపరిశ్రమచేసి, పట్టపరీక్షలఁ బ్రఖ్యాతివహించిన ఘనులుసైత మాతని యపారపాండిత్యమున కాశ్చర్యపడిరి.

శ్రీరామకృష్ణ పరమహంసయొక్క వాగ్వినిర్గతములు యైన అనుగ్రహరూప ధర్మోపదేశము, మన భరతఖండమున హఠాత్తునఁ దలచూపిన బ్రహ్మసమాజము, క్రైస్తవమతము, ఇస్లాము లోనుగాఁ గలవానిని బోలిన నవీన సంప్రదాయము గాదు అతని ముఖమునుండి ప్రవహించినది సనాతనమయిన వేదాంతజ్ఞానపూరమయమైన నిర్మల వాగ్ఝరియేగాని మఱియొండు గాదు అట్టిదే యయ్యును, ఆప్రవాహము తొంటికంటె నెక్కువ వ్యాపకము వహించెను తొల్లి యది కొందఱకుమాత్రమే లభ్యము కాఁదగి యుండెను ఇప్పుడు, జనులందఱు తారతమ్య వ్యవస్థలేక యాప్రవాహమునందుఁ దమ తాపత్రయపరితాపము దీరఁ గ్రుంకులిడ వచ్చును ఆతఁడు, సర్వసమయసామరస్యమును, బ్రహ్మానంద సర్వస్వమునే యందఱి హృదయములయందును నెలకొనవలయునని భావించినట్లు దోఁచుచున్నది కలకత్తాలో, గొప్ప వేదాంతాచార్యుఁడుగా నెగడు నీబ్రాహ్మణోత్తముని యనుగ్రహము గాంచినవారిలో వివేకానందస్వామి యొకరే యిమ్మహానుభావుని దివ్యచరిత్రోపదేశముల యథార్థాభిప్రాయమును తాద్రాక్ష్యముగ గ్రహించును తమశక్తిని వహించినవారని తెలియవచ్చెడిని. ఆతఁడే యామహానీయునియంతరంగశిష్యుఁడును.

నరేంద్రనాథుఁడు, గీర్వాణాంగ్లేషములయం దపార పాండిత్యము గల ఘనుఁడు గీర్వాణమునందలి వేదాగమ శాస్త్రములను,ఆంగ్లేయభాషయందలి వస్తుతత్త్వము, తర్కము, మనస్తత్త్వము, లోకతత్త్వము లోనుగాఁగల యుద్గ్రంథముల

సూక్ష్మాంశములను విమర్శించి, కరతలామలకముగ తెలిసికొని
యుండెను ఇంతేగాక, సాధారణముగా, హిందూమతమును
దానియాచారములను, అందలిమాహాత్మ్యములను, ఆకాలమున
పరిహసించుచుండెను. అట్టివాఁడు, ఒకయక్షరమైనను తెలియని
వెఱ్ఱివాఁడని జనులు నుడువునట్టి స్థితియందుండిన శ్రీరామ
కృష్ణ పరమహంసయొక్క మహిమల నెట్లు గ్రహించి, వారిని
గురువుగాఁ జేసికొను మహాభాగ్యమునకు నోచుకొనెనను
సందేహ మెల్లరకును బొడమవచ్చును యథార్థముగా నిట్టిసంభ
వము, అద్భుతావహమే. ఆయత్యద్భుతమును నరేంద్రునిమిత్రుఁ
డయిన శ్రీరామకృష్ణానందస్వామి నుడివినట్లు, ఇచ్చట సూచిం
చెదము నరేంద్రునకు రామచంద్రదత్తుఁడను మేనమామ
యొకఁడు గలఁడు ఆతఁడు, వస్తుతత్త్వము, రసాయనము, మొద
లగువానిని గూర్చిన శాస్త్రములయందు మిగుల నిపుణుఁడు,
దైవభక్తి గలవాఁడు ఆతఁడు, పలుతడవలను శ్రీరామకృష్ణ
పరమహంసయొద్దకుఁ బోయి, వారి యుపదేశమును పొందు
చుండును నరేంద్రుఁడు పలుమాఱు, తన మేనమామతో
మతవిషయముగా తర్కించుట గలదు ఒకనాఁడు, రామచం
ద్రుఁడు నరేంద్రునిం జూచి, దక్షిణేశ్వరాలయమునందు పెద్ద
లొకరు గలరు వారియొద్దకు నాంగ్లేయభాషను జదివిన పండి
తులు పెక్కుఱు పోవుచున్నారు నీవచ్చటికి పోతివేని, వారు,
నీయాక్షేపములకుఁ దగినసమాధానములు చెప్పఁగలరు; నేను
నిన్ను పిలుచుకొని పోయెదను" అని చెప్పఁగా, నరేంద్రుఁడు,
"ఆవెఱ్ఱివానియొద్ద నాకేమిపని? వాఁడు, మూఢభక్తిగలవాఁడు

గదా! నా యాక్షేపణలను వాఁడువిని, దగిన సమాధానము చెప్పలేక నన్ను 'అధిక ప్రసంగి' యని దూషించి కొట్టుటకును సాహసింపవచ్చును అట్టి మూర్ఖునితోడిసంగతి నాకేల?" అని బదులు నుడివెనఁట అందులకు, రామచంద్రదత్తు, "అట్లు తల పోయరాదు. పెద్దమనుష్యులెల్ల రచ్చోటికి వచ్చెదరు వారు, పరమశాంతస్వాంతులేగాని మూర్ఖులు గారు తక్కిన విషయ ములయందెంతో ధైర్యమూని మాటలాడునట్టి నీవు, వారు కొట్టుదురేమో యని భయపడి, వాదమునకు వెనుదీయుట మంచిది గాదు అట్లున్న నిన్నుఁ బిఱికివాఁడని కదా చెప్పవలసి వచ్చును" అని నుడువఁగా, నరేంద్రుఁడు మిక్కిలి యభిమాన వంతుఁడగుటచే, 'ఆయోగిమూర్ఖుఁడుగానున్న నేమి? ఆతనియొద్ద కేగుటయేసరి' అనితలపోసి, తనమేనమామను గూడియాతనిని జూడఁబోవుటకు సమ్మతించెను ఏలనఁగా, నరేంద్రుఁ డీబైరా గీలను, గోసాయీలను, మూర్ఖులనియే భావించియుండెను కావున, 'నే నచ్చటికి పోయినను మిగుల దాపున కేగరాదు; దవ్వున నున్నట్లే కార్యము కొనసాగించుకొని రావలయును.' అనుదలంపుతో నే యేగెను అప్పుడు ఘనులనేకు లచటికి వచ్చి యుండిరి శ్రీరామకృష్ణ పరమహంస శాంతస్వరూపిగా నొక మంచముపైఁ గూర్చుండి యుండెను రామచంద్రదత్తు, నరేం ద్రుని నతనిదాపునకుఁ బిలుచుకొనిపోయి, నరేంద్రుని విద్యా విశేషమును, బుద్ధిసూక్ష్మతను, సద్గుణములను గూర్చి పరమ హంసతోఁ బొగడి చెప్పి, "ఇతఁడు కొన్నాళ్లనుండి షతవైష యిక సందేహములను గలిగియున్నందున వాని నివర్తించు

కొనుటకై యిచ్చటికి వచ్చెను" అని విన్నవించిరి ఆమాటలను
పరమహంస విని, నరేంద్రుని బ్రియపూర్వకములయిన వచన
ములతో నుపచరించి, ఆతనికిఁ గల సందేహములను జెప్పిన
చో తనకు సాధ్యమగునంతవఱకుఁ దీర్చునట్లు సెలవిచ్చిరి.
పిదప కొంత దనుక వాండ్ర యిరువురలో పెక్కు విషయము
లను గూర్చి సంభాషణ జరిగెను వానివలన, నరేంద్రుఁడు
మంచి బుద్ధిశాలియనియు సత్యము గనుఁగొనుట కిచ్ఛ సంపూర్ణ
ముగ గలవాఁడనియు, ఆతనిని యుక్తిమార్గమున యోగశక్తిచే
త్రిప్పినయెడల లోకమునకు మహోపకారము జేయఁగలఁ డని
యును శ్రీరామకృష్ణ పరమహంస దలఁచెను. నరేంద్రుఁడును,
శ్రీ పరమహంస తాను తొల్లి భావించినట్లు వెఱ్ఱివాఁడు గాఁడ
నియు మూర్ఖతలేక సాధుస్వభావముతోఁ దనసందియముల
నన్నిఁటిని విచ్ఛేదింప శక్తిగలవాఁడనియును, ఇంతేగాక యంత
ర్ముఖదృష్టియుఁ గలమహాత్ముఁ డనియును దెలిసికొనఁగలిగెను
అయినను నరేంద్రుఁడు, ఈ పరమహంసయొద్ద నేమేమి మహిమ
లున్నవో కనుఁగొనవలయు ననియును, త్వరలోనే యితనికి
లోఁబడరాదనియును దలఁచి మఱుచటిదినము వచ్చునట్లు
నుడివి పరమహంసయొద్ద సెలవుదీసికొనెను నరేంద్రుఁడు, మఱు
చటిదినము రాఁగానే, పరమహంస, ఆతనికి మిగుల చనువు
చూపి దగ్గఱకు వచ్చునట్లు చేసెను పిదప నధ్యాత్మవిషయము
లను పెక్కింటిని జాలసేపు ముచ్చటించుచుండెను ఆదినము
సైతము విశేషమేమియు సంభవింపలేదు నరేంద్రుఁడు తన
యింటికిఁ బోయెను నరేంద్రుఁ డలవాటుచొప్పున మఱుచటి
దినము సాయంసమయమునను పరమహంసయున్న చోటును

జేరెను. పరమహంస, ఈదినము నరేంద్రునియెడల తన సంపూర్ణానుగ్రహము వెలయింపఁ దలఁచి, యాతనిని తనకు ప్రక్కన మంచముపైఁ గూర్చుండఁ బెట్టుకొనెను నరేంద్రునకు పరమహంస విషయమయి యింతకు మున్నే భయము గదిరి యుండెనని చెప్పియున్నాముగదా! ఆతఁడు, తన్నుఁ దనప్రక్కనఁ గూర్చుండవలయునని చెప్పినప్పుడు, ఏమిచేయునో, అతనివలన నెట్టి కీడు మూడునో యని యించుక బెదరినవాఁ డయ్యెను, 'నాభుజము లేమి నిస్సారములా' అట్టి తరుణము తటస్థించెనేని యొకచేయి చూచుకొనెదను గాక!'అని తలపోసియే పరమహంసప్రక్కకుఁ బోయి కూర్చుండెను నరేంద్రుఁ డట్లు గూర్చుండఁగానే, ఇతఁడేమిఁ జేయనున్నాఁడు; దీని కిదయే ప్రతికృతి; అని తలపోయుటకు నైతము అవకాశ మొసఁగక, వెంటనే పరివ్రాజకస్వామి, మెఱపు మెఱసినట్లు, తనబాహువల్లితో బిగఁగట్టికొని, తన దివ్యకరపల్లవ మతని యెదపై నుంచెను ఆస్పర్శమాత్రమే యాతనికిఁ దెలియును. పిదప నొకముహూర్తకాలమాతనికి శరీరము మఱచి, ప్రజ్ఞాభంగము గలిగియుండెను ఆతని కన్నుల కఖిలమును అఖండస్వరూపముగఁ గన్పట్టెనఁట. ఇదియే సమాధిస్థితి. యోగానుభవమును, పరమహంస తన మహిమాతిశయమున, కేవలకరస్పర్శమాత్రముననే నరేంద్రునకొనగూర్చెను. అదియే నరేంద్రుని వివేకానందునిగా మార్చుటకైన శుభముహూర్త మయ్యెను ఆతనికిఁ దారక తత్త్వోపదేశము లభించెను వైరాగ్యబీజ మాతని హృదయప్రదేశమున నాటికొనెను. అప్పు డాతనిని జూపి, పరమహంస 'వీఁడీలోకము

సంతతి నొకయాట నాడింపఁబోవుచున్నాఁడు.' అని యచట నున్న వారితోఁ జెప్పెనఁట వారి వాక్కు చరితార్థమగుట లోకప్రసిద్ధము.

సర్వేశ్వరుని నిర్ణయానుసారము, రామకృష్ణపరమహంస, తాను సమాధి కావలసియున్న తరుణమున, అంత దనుకఁ దన్ను భక్తిశ్రద్ధలతో సేవించుచుండిన శిష్యవర్గమును కరుణాపాంగదృష్టుల జూచి, 'ఇఁక మీరలు శీలముతప్పక నడుచుకొని, పరిశుద్ధములయిన వేదాంతసూక్తులను ప్రజల కందఱకుపదేశింతురుగాక!' అని యనుగ్రహాపూర్వకముగాఁ బలికి సమాధిగతులయిరి.

నరేంద్రనాథుఁడు, రామచంద్రదత్తునివలన పరమహంస యొక్క యాశ్రయముఁ బొందిన యొకసంవత్సరముననే తురీయాశ్రమమును బొందెను అప్పుడు, వారితోఁ బరమహంస శిష్యబృందమును జేరి యాతని యనుగ్రహమునకుఁ బాత్రులయిన (గొప్పయాంగ్లేయపరీక్షలఁ గృతార్థులయిన) బంగాళీలు ఇరువది యిబ్బండ్రుండిరి. 1886వ సంవత్సరము పరమహంసస్వామి సమాధిగతులుగాఁగానే, వివేకానందస్వామి తచ్ఛిష్యులనందఱ నొకటిచేర్చి, వన్న్యాసాశ్రమము స్వీకరించునట్లు చేసి వాండ్రకుఁ బెద్ద తానాయెను. పిదప, వారు లోకమునందలి శాస్త్రముల నన్నిటిని సాంతముగాఁ జదివిరి ఇట్లు కొంతకాలము గడువఁగా, అందఱు నిట్లు ఒకటిగూడియుండుటవలన ప్రయోజనము లేదు వెవ్వేఱుగా నేగి యాత్రచేసి సకలకష్టముల నను

భవించి తన్మూలమున నింద్రియనిగ్రహశక్తి సంపాదింపవలయు ననియును దీర్మానించుకొని, మొదట నలువురు నలువురుగా విభజింపఁబడి వెవ్వేఱు దెసలకుఁ జనువారైరి పిదప, మువ్వురు మువ్వురుగాను, ఇరువురిరువురుగాను ప్రత్యేకపడిరి. అట్లేగిన వారిలో వివేకానందస్వామికిఁ దోడుగ నుండినవారు, చెన్నపట్టణమున విచ్చేసి వెలయుచుండిన శ్రీరామకృష్ణానందస్వాములు. వారిట్లు సంచారము చేయుచుండినకాలమున నొకకొన్నిదివసములు ఆహారము దొరకక పస్తుపడి యుండవలసివచ్చును అట్లుపవాసములున్న యదనున నెచటనైనను భిక్ష లభించెనేని, ఆ సమయమున సన్నార్థులెవరైన వచ్చినచో, వారికాభోజనము పెట్టి మిగిలినయెడల తాము భుజింతురు. మిగులనియెడల నుపవాసమేయుందురు ఇట్లు కొన్నాళ్లు సాధించిన పిదప, నింక మన మిరువురుగాఁగూడి సంచరింపరాదు; వెవ్వేఱుగానే సంచారము చేయవలయును; అని నిశ్చయించుకొని, ఏకాంగులుగాఁ దిరుగఁ దొడఁగిరి ఇట్లు శిష్యులందఱును బలుదెసలకుఁ జెదరి పోవఁగా, వివేకానందస్వామి హిమాలయమునకుఁ బోయి, అచట సంచరించుచున్న కాలమున, నాయాయిచోట్లఁ దమ సహాధ్యాయులను గలిసికొని, ఇఁక మన జన్మభూమికి, శక్తివంచనములేక యేదయినను మేలొనగూర్పవలయును; అని వారికి బోధించి, వాండ్రను దయతోఁ బిలుచుకొని కలకత్తా నగరమును జేరి, అచ్చట నొక మఠము నిర్మించి, శిష్యుల కందఱుకుఁ బెద్దగా వెలసి యుండిరి ఇట్లు కొంతకాలము జరుగఁగా వివేకానందస్వామికి మరల దేశసంచారము చేయవలయు ననెడి కోర్కె పొడమెను.

జనులు, తమ ప్రీతివిశేషమునకును, వాత్సల్యాతిశయమునకును స్థానభూతములని దలఁచునట్టివాని నన్నిటిని, బాల్యమునందే వివేకానందులు పరిత్యజించి, సన్న్యాసులకుచితమయిన కాషాయవస్త్రమును ధరించి చేత భిక్షాపాత్రమును బూని దేశాటనము చేయ నారంభించి, భరతఖండమంతయు యాత్ర చేసి, సిద్ధపూరుషులను జూడవలయు నన్న కోర్కెతో హిమాద్రికావలనున్న ప్రదేశములకు వెళ్లిరి అచ్చటచ్చట నేకాంతప్రదేశములయందు నిలుచుచు యోగాభ్యాసమును ఈశ్వరధ్యానమును జేయుచుండిరి ఈసంచారకాలమున వారనుభవించిన కష్టములు చెప్పితీఱవు! తన్మూలమున నెట్టి శ్రమమునుగాని యోర్చుకొనునట్టి శరీరసాధకము నేర్చుకొనినట్లు వారే యొకప్పుడు చెప్పియున్నారు ఆసంచారకాలమున, వారు డబ్బును కన్నెత్తియును జూడకయు, ఆహారమునకై యొకరి నడుగకయు నుండునట్లు సంకల్పించుకొనిరి. ఆకాలమున వారుండిన స్థితినిగూర్చి, పిదప నొక సమయమున వారే చెప్పియున్నయంశమిచ్చటఁ దెలిపెదము:— "పదునాలుగుసంవత్సరముల కాలము క్షుద్బాధ యిట్టిదనుటను స్వానుభవమున గనుఁగొను స్థితియందే యుంటిని ఱేఁపటికెచ్చటభుజించుట? ఎచట నిదురించుట యనుటయుఁ దెలియదు. వెచ్చన యించుకంతయు లేని యత్యంత శీతలప్రదేశములయందుఁ గౌపీనమాత్రధారినై నివసింప సాహసించితిని."

## II.

[శ్రీవివేకానందస్వామి చెన్నపురికి విచ్చేయుట - చెన్నపురివాసులు వారిని 'చికాగో' యందుఁ గూడునట్టి సర్వమతసభయందు హిందూమతమును గూర్చి ప్రసంగించుటకుఁ బంపుట - వారి కచటఁ దటస్థించిన కష్టములు - స్వాములు సర్వమతసభను గూర్చి చేసిన వర్ణనము - వారు, అచ్చట చేసిన హిందూమతప్రసంగము - పత్రికల యభిప్రాయము - వారు చేసిన ప్రసంగములు - న్యూయార్కు నగరమునందలి వేదాంతసభాస్థాపనము.]

శ్రీవివేకానందస్వాము లిట్లు దేశములం దంతటను సంచారము చేయుచు 1892 వ సం॥ తిరువాన్కూరు రాజ్యమును జేరినప్పుడు, అచటికిఁ దన స్వంతకార్యమును వహించి విచ్చేసియుండిన చెన్నపురి అకౌంటాంటు జనరల్ ఆఫీసు ఉద్యోగస్థుఁడైన బాబు - మన్మథనాథ భట్టాచార్యుఁ డా పరివ్రాజకస్వామిని జూచి మాటలాడి, తాను మరలి వచ్చునప్పుడు చెన్నపట్టణమునకుఁ బిలుచుకొని వచ్చెను. వచ్చి యిచ్చటనే కొద్దిదినములు వసించుచుండినప్పుడు, ఇంగ్లీషు మాటలాడు సన్న్యాసి యొకరు విచ్చేసి యున్నారనుసంగతి వ్యాపింపఁగానే, తిరువల్లిక్కేణి, మైలాపూరు మొదలగు ప్రదేశములయందు వాసముచేయుచుండిన యింగ్లీషు భాషాభిజ్ఞులగు ప్రముఖులు, వారియొద్దకేగి చిక్కులయిన ప్రశ్నలు పెక్కులడిగిరి స్వాములు వానికన్నిఁటికిని దగిన సమాధానములను బలికి తృప్తి యొన

గూర్చఁగా, వారియపారశక్తి కద్భుతపడి, వారియెడల గౌరవ మతివేలముగఁ గాన్పింపఁ దొడఁగిరి.

ఆంగ్లేయభాషయందలి వస్తుతత్త్వశాస్త్రములను జదివి, ప్రాచీనార్యశాస్త్రముల నవమానించి, గర్వపర్వతాధిరూఢు లయియున్న నాస్తికులు గొందఱు వీరితో వాదించి యప జయమొంది తుద కాస్తికులయిరి. వారు, ఆఁకలి నీరువట్టు లను మఱచి, అహోరాత్రములు విరామములేక, తమయొ ద్దకు వచ్చునట్టి జనుల సమయసందేహముల నివర్తించి వేదాం తముయొక్క యున్నతిని నిరూపించి చెప్పునప్పుడు, వారి కిచ్చట శిష్యులు పెక్కుఱు చేరిరి. హిందూమతము మూఢ భక్తికి కాణాచి యని నమ్మియుండినవారు, వీనికంటె నుత్తమ మిత మొకటి లేదనుటను జక్కఁగాఁ దెలిసికొనిరి

అప్పుడు, అమెరికాలోని చికాగో నగరమున 'మహా కొలంబియన్ ప్రదర్శని' అను నొక పెద్దసంత చేర్పఁబడవల యుననియును, అందు, ప్రపంచములో జనులందఱు, వెవ్వేఱు వృత్తుల ప్రవర్తించి యిదివఱకుఁ బొందియున్న యభివృద్ధిని గనఁబఱుచు నిమిత్తము, శిల్పము, చిత్రము, మొదలగు కలల యందును, తక్కంగల పలువిధముల హస్తశిల్పములయం దును, ఎక్కువ పనితనముగల వస్తువులను, ఆయాదేశముల నుండి రావించి యాచోట నుంపవలయుననియును, ఆప్రదర్శన మున కొకభాగముగా, సర్వమతమహాసభ నొకదానిని గూర్చ

వలయు ననియును నిర్ణయింపఁబడెను. లోకమునం దంతటను క్రైస్తవమత మొక్కటియే సర్వశ్లాఘాపాత్రమయినది యను టను స్థాపింపవలయుననుటయే యాసంఘ మేర్పఱచినవాంఛ ముఖ్యోద్దేశము అట్టి యుద్దేశముతోనే, లోకమునందలి సర్వమతములవారును దమతమ ప్రతినిధులను ఆసభకు పంపు నట్లు, అన్ని దేశములకు నాహ్వానపత్రికలఁ బంపిరి ఐరోపా యందును, అమెరికాయందును, ఆసియాలోని బౌద్ధముహమ్మ దీయ దేశములయందును గల యితరమతస్థులు పెక్కుఱు తమ లోని గొప్పపండితులను, ఆసభకుఁ బ్రతినిధులుగాఁ బుత్తెంచిరి. ఇండియాలో దానిఁగూర్చి యెట్టి ప్రయత్నము చేయఁబడ లేదు అమ్మహాసభకుఁ బంపఁదగినవారు, సంస్కృతమునందలి మతగ్రంథములను బాగుగాఁ జదివి, ఆంగ్లేయభాషను సొంత ముగాఁ దెలిసికొని యందు ప్రసంగించు శక్తిని వహించిన వారుగా నుండవలయును. ఇంతేగాక, తాత్కాలిక విజ్ఞాన శాస్త్రములను సైతము సందేహ మొకింతయు లేక తెలిసి యుండవలయును. అట్లు లేనున్న నమెరికనులయెదుట మన మతమునుగూర్చి ప్రసంగించుట దుర్ఘటము. ఇన్నిలక్షణము లతోఁ గూడిన యొకఁడు లభించుట మిక్కిలి దుర్లభముగా నుండెను సంస్కృతమున శాస్త్రములన్నియుఁ జదివిన మహా మహోపాధ్యాయులు పెక్కుఱు మనలోనుండియును, వాంఛ కాంగ్లేయభాష నొక యక్షరమును దెలియక పోవుటంబట్టి యీవిషయమునకు వారు ప్రయోజకులు గారైరి. ఆంగ్లేయ భాషయందు ఎం. ఏ. పరీక్షను గృతార్థులయినవారు, అనేకు

లుండియును, వారికి సంస్కృతజ్ఞానము లేమింజేసి వారివలనను బ్రయోజనము గలుగదు ఒకవేళ ఇన్నియుద్గుణము లొకని యందే గలవనుకొందము; 'సముద్రములను దాఁటి నావికా యాత్ర చేయఁదగదు' అను నిర్ణయము ముందుపడి యాటంకపఱచును కాఁబట్టి హిందూమతమునకుఁ బ్రతినిధిగా నొకనిఁ బంపుట మిక్కిలి యసాధ్యముగానే తోఁచియుండెను. అయినను, సర్వశక్తియుక్తుఁడయిన సర్వేశ్వరుఁడు, మనల నిట్టి తఱుణమునఁ జేవదలునా? భరతఖండపు గొప్పతనమంతయు దానిమత భక్తిచేతను; దానిజ్ఞానాతిశయముచేతను నేకదా ! సర్వమత మహాసభయొక్క యుద్దేశములను మార్చి యట్టి గొప్పసభకు న్యాయముగా నుండవలసిన సామరస్యము నిర్ణయించునట్టి యోగ్యత, అన్నిమతములకును జన్మస్థానమయిన భరతఖండమునకుఁ గాక మఱి యేదేశమునకుఁ గలదు

ప్రపంచమునం గల దేశములలోనెల్లఁ బుణ్యభూమిగాఁ బొగడ్తకెక్కిన యీభరతఖండము, ధనసంపన్నములయిన రాజ్యములచేతను, విశాలములయిన నగరములచేతను,పర్వతరాజయిన హిమవంతునిచేతను, దివ్యనదియగు గంగచేతను, తక్కిన నదీనద సరోవరములచేతను ఘనతవహింపలేదు. మఱి దేనివల ననిన నిందు సూచించెదము —

ఎవ్వని సంకల్పమాత్రమున నీ మహాప్రపంచముత్పత్తిల్లెనో, అట్టి జగత్పతియగు సర్వేశ్వరుఁడే యాజగత్తునకుఁ బ్రథమాచార్యుఁడు. ఆతని యనుగ్రహవిశేష మత్యంతము వహించిన మహర్షులు మొట్టమొదట భరతఖండమునందు

సస్వరవేదసూక్తులతో నిట్లు నుడివిరి "అద్వితీయుఁడై వెల యుచు తనయంతఁ దేజరిల్లువస్తువే నాశములేని పరమవస్తు వగును. అది నిరాలంబముగాను, సకలభువనాధారముగను వెలుఁగొందును" ప్రణవమునుండి యుత్పత్తిల్లి చాతుర్వేద స్వరూప మనుసరించి ఏకమేవాద్వితీయం బ్రహ్మ అను నద్వైతమహావాక్యమే భరతఖండముయొక్క మహాధనమని పెద్దలచేతఁ గొనియాడఁబడుచున్నది దానివలన ధర్మమున కును నీతికిని గావలసియున్న సర్వాధారములును లభించినవి. ఆయాధారముల బలమును వహించియే సజ్జనులయొక్క యాచారానుష్ఠానములు శాశ్వతములుగా నెలకొని యున్నవి. ఇట్లు, వైదికమార్గమున వైభవమొందిన భరతఖండము, సదా చారము, జ్ఞానవిజ్ఞానసంపద, అను వానిని బొంది గొప్పగాఁ బ్రఖ్యాతి వహించెను వెన్న చే పాలమేలిమియు, చేవబలి మిచే చెట్లయొక్క యుత్కృష్టతయు, ధాతువర్గముల పెంపుచేఁ బర్వతముల శ్రేష్ఠతయు నెట్లు నిశ్చయింపఁబడునో, అట్లే యీదేశముయొక్క గొప్పతనము పెద్ద లనుష్ఠించు వైదికా చారానుష్ఠానముల యతిశయముచేతనే యనుట విజ్ఞానుల మతము.

సర్వేశ్వరుని సంతానమున సర్వులు సమానులే యయ్యును సుఖదుఃఖానుభవములు వారివారి కర్మానుసారము దోఁచు నవి యనియును, దురభిమానరహితమయిన బుద్ధితో సర్వాభి ప్రాయములను పరిశీలింపవలయు ననియును, వెవ్వేఱు మతభేద ములను పక్షపాతరహితబుద్ధితోఁ గనుఁగొనవలయుననియు, మూఢభక్తి గలవారు, ఆచరించు నజ్ఞానపూర్వకములగు

కృత్యములును సద్గతిని బొందవలయునను నపేక్షను వహించినది గాన దాని నోర్పికొనవలయు ననియును, కర్మచక్షువుకంటె జ్ఞానచక్షువే యుత్తమమైన దనియును, ఎట్టి తత్త్వజ్ఞుఁడును పూజార్హుఁ డనుటయును, మహాప్రకృతియొక్క తత్త్వంబులను దెలిసికొనిన బ్రహ్మావాదులచే భరతఖండమునందు స్థాపింపఁబడి నట్లుగా నీప్రపంచమునం దెచ్చటను గానరావు.

కావుననే మహాగూఢార్థములను వెల్లడిపఱచు యోగ్యతను వహించిన భరతఖండము భువనమునకు బుద్ధీంద్రియ మయి పొదలుచున్నది యని పెద్దలు వక్కాణించెదరు. ఈదేశపు జ్ఞానలేశమాత్రముననే యన్యదేశీయులు తెలివి గలవారయిరి. దానిధర్మమో మిగుల నుత్కృష్టమయినది కావున మానవ వర్గమున కంతటికిని విధింపఁబడిన సచ్ఛీలాదులు స్తోత్రపాత్రములే యగును

ఇట్టి యున్నతితో వెలయునట్టి భరతఖండమునందలి వైదికమార్గోన్నతిని సర్వమతమహాసభయం దుద్ఘోషించి పలుకుటకు సామాన్యులు దగియుందురా? అని యిట్లు పలువిధంబులఁ దలపోసి తలపోసి, విధానము గానక పరితపించువారి క్లేశము పోకార్ప, తమ యాచరించిన పూర్వపుణ్యపరిపాకమే యట్లు మూర్తీభవించెనో యన వెలసిన వివేకానందస్వామిని దేవుఁడే వారిమ్రోలకుఁ దెచ్చి నిలిపెనేమో. సర్వమతమహాసభకుఁ బోవఁదగిన హిందూమతప్రతినిధికి నుండవలసిన యోగ్యత లన్నియును వారియందు సంపూర్ణముగా నమరియుండెను. వారు, ఆంగ్లేయగ్రంథములందును, సంస్కృతగ్రంథముల

యందును పారము గనుఁగొన్న వారు. ఇంతేకాదు, ఒకమహాయోగికి నంతరంగశిష్యులు కావున శివానుభూతిసంపదను గలవారు. ముముక్షు వగుటచేత సముద్రయాత్ర చేయఁదగదను కులాచారధర్మములకు మీఱినవారు.

చెన్నపురమున వారితోఁ గూడియుండు భాగ్యమునకు నోఁచుకొని, విద్యయందును శ్రవణసంపదయందును నున్నతిని వహించిన వారందఱును వారి విశాలమయిన బుద్ధిని, విమర్శతోడి శాస్త్రవిచారమును జూచి యచ్చెరువొంది, సర్వమతమహాసభకు హిందూమతప్రతినిధిగాఁ బోవఁదగిన వారు, వీరే యని గ్రహించి, మైసూరు మహారాజాగారు, రామనాథపురము మహారాజుగారు, న్యాయాధిపతి యయిన శ్రీసుబ్రహ్మణ్యఅయ్యరుగారు లోనగువా రొసఁగిన ధనసహాయమును వహించి, శ్రీస్వాములు అమెరికాఖండమునకుఁ బయనమయిరి.

వివేకానందస్వాములు నావయెక్కి జపానుదేశమార్గముగా సముద్రము దాఁటి 1893 వ సంవత్సరము మేనెల చికాగోను జేరిరి వారు, ఇందియాను వదలి ఖండాంతరమునకుఁ బోవుట కదియే ప్రథమతరుణమగుటచే, సముద్రయానమువారికెంతో కుతూహల మొసఁగునదియయ్యెను వారు చికాగోను జేరుటకు మున్నే, తాము సముద్రయాత్రను గాంచిన యతిశయములును, తమ యభిప్రాయములను విపులముగా వ్రాసి, చెన్నపురిలోని తమ నెయ్యులకుఁ బంపిరి. అందు, ఇండియనులు కూపమండూకములవలెఁ దమయింగ్లణమందే యుండువారయి

ఖండాంతరయాత్రలు చేయకుండుటచే, లోకము చెందుచున్న
యభివృద్ధిని దామునైతము పొందుటకుఁ గానివారయి
దినక్రమమున క్షీణించుచున్నారు. తమపెద్ద లేర్పఱచిన
యుత్తమమతముయొక్క సత్యాతిశయము మఱచి, కంఠశోష
ముగా వాదులాడుచుఁ దమ జీవితకాలము వ్యర్థపుచ్చు
చున్నారు మనవారు పురోఽభివృద్ధినొందవలసియున్నయెడల,
నుత్తమవంశస్థులును ధనాఢ్యులును తమయున్నతియే యుత్తమ
మని దలపోయు దురభిమానమును వదలి, దరిద్రులకును అగతి
కులకును దీనులకును దోడుపడవలయును, అనుటను సూచిం
చిరి జపానుదేశమును గూర్చి చెప్పునప్పుడు, జపానువారు తమ
యూళ్లను, గృహములను, దేహములను శుభ్రముగా నుంచు
కొని యున్నారనియు, వాండ్రు దమకుఁ గావలసి యున్న
వానిని బరదేశములనుండి దెప్పించుకొనక, అగ్గిపుల్లనాది
చేసి యోడలవఱకును గలవాని నన్నిటిని దామే చేసికొనెద
రనియును, వారి బౌద్ధాలయముల గోడలపై సంస్కృతశ్లోక
ములు గొన్ని ప్రాచీనపు బంగాళియక్షరములతోఁ జెక్కఁ
బడి యున్నవనియును, వారిదేశములోని బౌద్ధమతమునకు
జన్మస్థానము భరతఖండ మగుటంబట్టి వారు మనదేశమును
మహాపవిత్రమయిన పుణ్యభూమిగాఁ గొనియాడెద రనియును,
మనదేశము నందలి ప్రతియువ్వఁడును జపాన్ దేశమున
కొక్కతడవకైనను వెళ్లి చూచి వచ్చి, తనదేశముయొక్క
యున్నతస్థితికై ప్రయత్నింపవలయు ననియును, కేవ
లము 15 రూపాయల నార్జించు లేఖరిగానో లేక న్యాయవాది
(Vakil) గానో వచ్చుటకుఁ దనయావచ్ఛక్తిని వినియోగిం

చుట పరితాపకర మనియును, మనలోఁ గొందఱైనను దేశాభివృద్ధికై యాత్మలాభమును బరిశీలింపక జనసమష్టి సుఖము నుద్దేశించి పరదేశముల కేఁగి యచట వారికి మనమతోత్కృష్టతను బోధించి తన్మూలమున మనదేశపు కీర్తిస్తంభము ప్రపంచమునం దంతటను నాఁటి, పరదేశములందలి లౌకికధర్మములలోఁ బ్రశస్తము లయినవానిని మనదేశమునకుఁ దెచ్చి వెలయింపఁ బ్రయత్నించిననే దేశాభివృద్ధికి హేతువు గలుగుననియును దెలిపిరి

ఆతఁడు చికాగో నగరమును జేరినప్పుడు, సర్వమతమహాసభ చేరుటకుఁ గొన్ని మాసములు పట్టునట్లుండెను అంతదనుక వేచియుండుటకు స్వాములయొద్దఁ బైకము చాలదు మోమెఱుఁగని దూరదేశమున నెవరిని యాచించుట! పాప మతఁ డేమి సేయును? వారిస్థితియం దితరు లుండినచో నెంతో పరితపించి యుందురు అయినను మనస్వాము లావిషయమయి యించుకంతయుఁ జింతిల్లినవారు గారు "నే నిచ్చటికి సర్వేశ్వరుని కార్యము నిర్వహింప వచ్చియున్నాఁడను; ఇది సత్యమైనచో న న్నాతఁడే రక్షించును గాక!" అని ధైర్యము వహించి యుండెను వా రీశ్వరునెడల నుంచియుండిన విశ్వాసమునకుఁ బ్రతిఫలముగా, వారి నామధేయముసైతము వినియెఱుఁగనివాం డ్రందఱు వారి మహాశక్తికి వశ్యులయి యెదురేగి తోడ్కొనివచ్చి యాదరించుచుండిరి

వివేకానందస్వాములు పిలువఁబడకయే పోయినవారగుటచే, సర్వమతమహాసభయందు వారు మాటలాడఁ దగదని

యాక్షేపించి నిరాకరించుట సులభకార్యమే యయ్యెను, ఆసభ కగ్రాసనాధిపతియగు డాక్టరు ఫరోస్‌గారు మిక్కిలి కారుణ్య మగపఱచి యట్టియాక్షేపముఁ దొలఁగించి, వారిని సభకు రావించి మాటలాడుట కనుమతి యొసఁగిరి.

వివేకానందస్వామి, సర్వమతమహాసభయందు ప్రవేశించి నప్పుడు, ఆసభ యున్నవిధమును గుఱించి వర్ణించి, ఈక్రింద సూచించినట్లు, చెన్నపురిలోని తమనెయ్యున కొకనికి వ్రాసిరి

"సర్వమతమహాసభ ప్రారంభించిన దినము ప్రాతఃకాల మున మేమందఱము (Art Palace) కలాభవనము ప్రవేశించి తిమి ఆభవనరాజమున విశాలరమణీయ మయిన కూట మొకటి యుండెను. దానిదాపున మఱికొన్నికూటములునైత ముండి నవి. వివిధదేశముల జనులు, అచ్చో గుమిగూడి యుండిరి. హిందూదేశమునుండి బ్రహ్మసమాజము వారయిన మజుందారు గారును, బొంబాయినివాసి యగు నాగర్కరుగారును, జైన మతప్రతినిధియగు వీరచంద్ర కాంతిగారును, దివ్యజ్ఞానసంఘ పక్షమున Mrs. అనిబీసెంటుగారితో Mr. చక్రవర్తిగారును విచ్చేసియుండిరి. వీరిలో మజుందారు నాకుఁ బ్రాచీనస్నేహి తుఁడు; చక్రవర్తిగారికి నాపేరుమాత్రము దెలియును అప్పుడు ప్రసంగము చేయుటకై నియమింపఁబడిన మేమందఱమును మిగుల వైభవముతో నుపన్యాస నైపథ్యమును జేరి, వరుసలు దీరి మామాయాసనములపైఁ గూర్చుంటిమి ఆహా అప్పటి యద్భుతప్రదర్శనముయొక్క వైభవమును నే నేమని వర్ణిం తును! క్రిందివైపుగా నొక విశాలమైన కూటముండుటయు,

దానికి మీఁదుగా, విద్యయందును శ్రవణమునందును నాగరకమునందును బ్రసిద్ధిని వహించి, ఆఱేడువేలవఱకు నాదేశీయ స్త్రీపురుషులతోఁ గూడిన గొప్పచంద్రశాల (Gallery) యుండుటయు, ప్రసంగ నైపథ్యమున భూమండలమునందలి సమస్తప్రదేశములనుండియు విచ్చేసి యున్న విద్వన్నికరము లుండుటయు నెక్కడ! నాజన్మమునం దంతకు మున్నెన్నఁడును బహిరంగముగా మాటలాడి యెఱుఁగని నేను, ఇట్టి వైభవోపేతమయివిద్వన్నికరముతోఁడి సభకెదుట నిలచి ప్రసంగించుట యెక్కడ! ఇవన్నియు మీ రాలోచించి చూచితిరేని మీహృదయచక్షువునకు గోచరింపఁగలదు ఆసభ మిక్కిలి వైభవముతోను మంగళవాద్యఘోషముతోను పీఠికారూపములయిన ప్రసంగములతోను బ్రారంభించెను ప్రతినిధులందఱును, ఒకరివెంబడి నొకరుగా సభ్యులకుఁ బరిచయముగావింపఁబడిన పిదప, సభ్యులకు మ్రోల ప్రసంగింప నారంభించిరి

ఈతరుణమునందు, సర్వమత ప్రతినిధులకు సభవారు చేసిన స్వాగతోపచారమును స్వాములు స్వీకరించి, బదులుకుఁ జేసినప్రసంగమును, ఆసభావేదనపత్రమున (Report) నీక్రింద సూచించినట్లు వర్ణింపఁబడుచున్నది —

'కార్డినల్ గిబ్బను' అనెడు క్రైస్తవమత పరమాచార్యునియొక్క యిరువైపులను దూర్పుదేశముల మతప్రతినిధులు దమతమ కుచితములయిన యాసనముల నలంకరించుచుండిరి. వారు ధరించియున్న వివిధవర్ణములతోఁడి యుడుపు

లాండొంటిని మీాటి ప్రకాశించుచుఁ గన్నులకు విందొన గూర్చుచుండెను అక్కడ చేరియుండిన బ్రహ్మసమాజము వారు, బౌద్ధులు, మహమ్మదీయులు మొదలగువాండ్రలో భరత ఖండమునుండి విచ్చేసియుండిన మహావాగ్మియగు వివేకా నందస్వామి యను పరివ్రాజకస్వామి, కావియంగితో వెలయు నట్టి దివ్యశరీరముగలిగి గాంభీర్యమే మూర్తీకరించినట్లు గనుపట్టు చుండిరి. వారిశిర మలంకరించిన పసుపువన్నెపాగ వారిముఖ ముయొక్క సొబగు నినుమడించుచుండెను మతప్రతినిధు లందఱయొక్క ప్రసంగములు ముగియఁగానే, సభ్యుల యె దుటఁ బ్రసంగించునట్లు వివేకానందస్వాముల వేఁడుకొనిరి. వారిప్రార్థనల నంగీకరించి, సభ్యులంజూచి, "అమెరికాఖండ వాసులగు సహోదరీ సహోదరులారా!" అని సంబోధించు నప్పుడే పెల్లురేఁగిన సంతోషమును వెల్లడిపఱచు కరతాళ ధ్వనులు, ఆభవనమంతయు నిండి పెక్కునిముసములదనుక మ్రోగుచుండెను పిదప స్వాములు దిగువఁ దెలిపినట్లు ఉపన్య సింప నారంభించిరి.

మీారలు మాకు మనఃపూర్వకముగా సత్కరించి యుప చరించుటంజేసి మేము కృతార్థుల మయితిమని చెప్పభాగ్యము నాకు లభించుటచే ననిర్వాచ్యమయిన సంతోషము గలిగి యొడలు పూరించెడిని లోకములోని సన్న్యాసిసంఘముల కంతెయు మిగులఁ బురాతనస్థితిని వహించిన మాయత్యా శ్రమము వారి పేర మీాకు వందనములు చెల్లించెదను సర్వ మతములకును జననియై గొనబు గాంచు మతము పక్షమాని

మీాకు వందనము లర్పించెదను. సకలజాతిమతములఁ దేజరిల్లు హిందూమహాజనుల పక్షమవలంబించి మీాకు వందనములు సమర్పించెదను. Universal tolerance

చాల దూరదేశములనుండి యిచటికి విచ్చేసియున్న పలుజాతులవారు, ఇచ్చట వెల్లడియగునట్టి సమరసభావమును దమతమ దేశములకుఁ గొంపోవు బాధ్యతను వహించుటకు న్యాయము గలదని యీా నైపథ్య మెక్కి ప్రసంగించిన ఘనుల కును వందనము లర్పించెదను ఏమతము సర్వసమయసామ్రస్యమును, సర్వసమ్మతసిద్ధాంతమును లోకమున కుపదేశించినదో, ఆయుత్కృష్టమతమును జేరినవాఁడను నే నను గౌరవమును వహించెదను మేము, అన్య మతానుసారులను విరోధింపక సమరసదృష్టితోఁ జూచుటయే గాక సర్వమతములు సత్యములయినవే యనియును నమ్ముచున్నాము ఏమతముయొక్క పరిశుద్ధభాషయైన సంస్కృతమునందు (సామరస్య పదమునకు విరుద్ధపదమయిన (Exclusion) అను మాటయే లేదో, (అనఁగా, ఏమతముయొక్క సంస్కృతమను పరిశుద్ధ భాష యేమతమునుగాని హీనమైనదని లాఘవపఱచి నిరాకరింపదో) అట్టిమతమును జేరినవాఁడను నేనని, మిగుల గొప్పతనము వహించి నుడువుచున్నాను. ఇహమునందలి సకలమతములనుండియు జాతులనుండియు భయోపద్రవముల ననుభవించి పాఱివచ్చి శరణుచొచ్చినవారికెల్లను నభయ మొసఁగి రక్షించు మహామతమువారిని జేరినవాఁడను నేనను గొప్పగౌరవమును పాటించెదను. రోమకుల క్రౌర్యవశమున యూధుల

కోవెలలు ధ్వంసముచేయఁబడినకాలమున, యుత్తమవంశమునఁ జేరిన కొందఱు యూధులు దక్షిణహిందూదేశమున శరణుఁ జొచ్చినకాలమందు, మనఃపూర్వకముగా వారిని మేము కట్టి కౌఁగిలించుకొని సంరక్షించితిమి. జరదష్టిముని (Zoraster) శిష్యులయి వెలయునట్టి పారసీకులలోనివారికి వసింప స్థల మొసఁగి, వాంద్ర నిదివఱకు నారయుచున్న మత మేదిగలదో దాని ననుసరించినవాఁడను నేను మిత్రులారా! కోట్లకొలఁది జను లేస్తుతిపాఠము ననుదినమూ పఠింతురో, దేనిని నాబాల్యము నుండి పఠించుచుందునో, అట్టి శ్లోకమునందలి రెండుచరణ ములను జెప్పెదను వినుఁడు.

"రుచీనాం వైచిత్ర్యా దృజు కుటిల నానాపథజుషామ్,
నృణాం ఏకో గమ్య స్త్వమసి పయసాం అర్ణవ ఇవ"

"ఓ ప్రభూ! వేర్వేఱు చోట్లయందు, ఉత్పత్తియగు చున్న వేర్వేఱునదులకన్నియు సాగరమే సంగమస్థానమయి వెలయుటవలె, రుచిభేదమువలన జను లనుసరించుమార్గములు సూటిగాను, వంకరగాను భిన్నవిధములఁ గన్పట్టినను, వాని కన్నిటికిని నీ వొక్కరుఁడవే గమ్యస్థానమవై ప్రకాశిం చెదవు."

భగవద్గీతయందు శ్రీకృష్ణులు వాక్రుచ్చినది —

శ్లో. "యేయథామాంప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః"

"అర్జునా! నన్నెవ్వ రెట్లు భజింతురో, వారి నట్లే నేను పొందెదను. మనుష్యులందఱు నామార్గమునే యనుసరింపఁ గలరు"

అనెడి యత్యుత్తమమయిన సిద్ధాంతమునే, సర్వవిధముల నుత్కృష్టతను జెందిన యీసభయు లోకమువారి కెదుట వేవిధంబుల నొక్క వక్కాణించుచున్నది. మతముల కక్షభేదములును, మూఢతమములయిన మతపుఁబట్టుదలలును క్రౌర్యమయిన మతపు వీరావేశములును ఈసుందరతమమయిన భూమినిజేరి చాలకాలము పీడించుచుండెను. అవి, తమకు సహజమయిన క్రౌర్యముచే నీభూమండలమునందలి యొప్పిదమును రూపుమాపి, మానవరక్తపంకమున దానిని ముంచి, నాగరకమును నాశపఱచి, దేశీయుల నెందఱనో హతముచేసి వైచెను ఈమహాభయంకరభూతము లుప్పతిల్ల కుండెనేని, మనయిప్పటిస్థితికంటె నెన్నిమడంగులో మిన్నయగు నుత్తమస్థితి నుండఁదగి యుందుము అయినను దాని కంతకాలము డాసెను.

ఇఁక మనస్సార నేను గోరున దేమనఁగా, ఈమహాసభయొక్క గౌరవసూచనముగా నాడు నలుదెసలను మ్రోఁగినఘంటాధ్వనియే, సర్వవిధమతభేద వీరావేశములకును ఖడ్గధారలను కుతర్కములను గలుగు సమస్తఘోరకృత్యములకును, ఒక్క గమ్యస్థానమును గోరి యేగుమానవులలోని ద్వేషమువలని క్రౌర్యములకును విలయధ్వాన మగునుగాత!

## సర్వసహోదరత్వము.

[సెప్టెంబరునెల 15 వ తేది శుక్రవారము, అపరాహ్ణమున సర్వమత మహాసభయొక్క యైదవదినము సభచేరినప్పుడు, ఆయామతానుసారులు తమతమ మతముల యున్నతిని స్థాపించునిమిత్తము ప్రసంగించిరి కడపట శ్రీవివేకానందస్వాము లీక్రిందసూచించుకథను సూచించి యందఱ యుల్లములనానందరసవార్ధి ముంచిరి]

నేను మీకొక చిన్నకథను జెప్పఁబోయెదను. ఇంతకుమున్ను ప్రసంగించిన వాగ్మిలు "మనమొండొరుల లాఘవపఱచుటలను వదలిపెట్టుదముగాక!" అని నుడివి యుండుటను మీరందఱును వినియున్నారు మనలో నింతమతభేదము గలిగియుండుటనుగూర్చి వారు చాల చింతిల్లిరి

అయినను, నేను జెప్పఁబోవుకథ యీమతభేదముల కారణములను వ్యక్తీకరింపఁగలదని నమ్మెదను ఒకకప్ప యొక కూపమునందు వసించుచుండెను అది చిరకాల మందే వసించుచుండినది. అది యచ్చటనే పుట్టి యచ్చటనే పెరుగుచుండినను దానిరూపము మిగుల చిన్నదిగానే యుండెను అప్పుడీ కాలపు నవీన పరిణామవాదు (Evolutionists) లెవ్వరును లేకపోవుటచే నంధకారబంధురమగు నాకూపమునందు వాసముచేయుచున్న కప్పకు దృష్టియున్నదా లేదా యనుటనుగూర్చి చెప్పుటకు నెవ్వరును లేరు అయినను మనకథకొఱకు దానికి దృష్టిగలదనియే భావింతము. అది యనుదిన మెంతయుత్సా

హాముతో నాబావిలోని పురువుల నన్నిఁటిని బట్టి తిని జల మెట్లు పరిశుభ్రతకుఁ దెచ్చుచుండెనో యావిషయమును ప్రకృతపు కీటతత్త్వజ్ఞులు (Bacteriologists) కొనియాడకమానరు. అదియిట్లు చేయుచుండఁగా దానియొడలించుక యుబ్బెను. అట్టియదనున సముద్రవాసిగానున్న మఱియొకకప్ప యాబావిని జేరఁ గలిగెను

"నీ వెచ్చటనుండి విచ్చేసితివి!" అని కూపమండూక మడుగఁగా, "నేను సముద్రమునుండి వచ్చితిని." అని సాగర మండూకము బదులు పలికెను

"సముద్రమా? అది యెంతయుండును? అది మాబావి యంతపెద్దదిగా నుండునా?" అని, ఆబావికప్ప యొకమూల నుండి మఱియొకమూలకుఁ దుల్లిపడెను

ఆమాటలకు సాగర మండూకము "నాయనా! నీ చిన్నకూపమును సముద్రముతో నెట్లుపమింపఁ దగును?" అని నుడువఁగా బావికప్ప మఱియొక తడవకుఁ దుల్లిపడి మీసాగర మింతపెద్దదియా? అని ప్రశ్నించెను

అందులకు మఱియొక మండూకము, "ఓరీ, నీవేమి మూఢునివలె బావిని సాగరమునకుఁ బోల్చి పలికెదవు" అనెను ఆమాటలను విన్న కూపమండూకము, "సరి, సరి, మాబావికంటెను పెద్దది మఱియొకటి గలదా? దీనికంటెఁ బెద్దదిగా నేదియునుండదు? వీడొకఁ యసత్యవాది; వీనిని దన్ని వెలుపు కొట్టవలయును" అని వీరావేశముతోఁ బలికెను.

సహోదరులార! ఇదియే యిన్నిదివసములుగాఁ బొదలుచుండిన కష్టము

నేను హిందువగుటచే, నాకు స్వంతమయిన చిన్నకూపమునందుఁ గూర్చుండి యాకూపమే మహాప్రపంచ మని భావించెదను క్రైస్తవుఁడును దనచిన్నబావిని గూర్చుండి లోకమంతయు నాచిన్నకూపమునందే యుండునట్లు భావించుచున్నాఁడు మహమ్మదీయుఁడును దన చిన్నకూపమునఁ గూర్చుండి యదియే జగమంతయు నని తలపోయుచున్నాఁడు కావున నో యమెరికనులారా! మనయొక్క యీ చిన్నలోకము వలనఁ గలుగు నాటంకములను దొలఁగించు నిమిత్తము, చేయునట్టి మహాప్రయత్నమునకయి మిమ్ముఁ బొగడెదను. మీసదుద్దేశములు నెఱవేరుటకయి సర్వేశ్వరునియొక్క దివ్య కారుణ్యమును బ్రార్థించెదను.

1893 వ సంవత్సరము సెప్టెంబరు నెల 14 వ తేది చేరిన తొమ్మిదవనాటి సభయందు వివేకానందస్వామి లొసఁగిన హిందూమతమును గూర్చిన ప్రసంగము.

చరిత్రములయందుఁ జెప్పఁబడిన కాలమునకుఁ బూర్వము నాదిచేసి యిదివఱకు లోకమున మూఁడుమతములు నెల కొని యున్నవి అవియేవియనిన—'హిందూమతము', పారసీకులమతమయిన 'జరదష్టమతము', 'యూథమతము'. ఈముమ్మతములకు నెన్నోకష్టములు దటస్థించియుండినను, అన్నియాపదలకుఁ జలింపక సుదృఢముగా నేఁటివఱకుఁ గొనసాఁగి వచ్చి

యుండుటయే వీని బలిష్ఠతను దెలుపునవి యగును. అయినను యూదమతము క్రైస్తవమతమును దనలో నమర్చికొనలేక పోవుటయే గాక, సర్వమును జయించుచు వచ్చుచుండిన మతమగు తన పుత్రికచేఁ దనజన్మస్థానమునుండి దరుముఁ గొట్టఁబడునది యయ్యెను. ఒకలక్ష పారసీకులు మాత్రమే తమజరదష్టమతోత్కృష్టతను దెలుపుటకు సాక్షిరూపముగ నిప్పటికి నుండువారు. భరతఖండమునం దనిననో పలువిధములగు మతభేదములు, ఒకటివెంబడి నొకటిగా నుప్పతిల్లి వైదికమతమును నిర్మూలపఱచుటకుఁ గదలించి చూచినవి. అత్యంతభయావహంబగు భూకంపమున కడలి నీరించుక వెనుదీసి, పిదపఁ దొంటికంటెఁ బెక్కువేల మడంగులు, ఉత్తుంగ తరంగ నికరములతో, వేళంబ ముందుకుఁ బ్రవహించి భూమండల మావరించికొనునట్లు, వైదికమతము మధ్య కొంతకాలము వెనుదీసి యుండినను రాను రాను నభివృద్ధిని జెంది మతాంతరములు జనాక్రాంతినుండి యించుక విరమింపఁగానే, మాతృమతమయిన తాను తన పెద్దయొడలిలో వానినన్నింటి నైక్యపఱచికొనెను.

ఐరోపీయ విజ్ఞానశాస్త్రమునందు, ఈ కాలమునఁ గ్రొత్తగాఁ గనిపెట్టఁబడిన వన్నియు నే జ్ఞానవిచారముయొక్క ప్రతిధ్వనులుగాఁ బరిఢవిల్లుచున్నవో, అట్టి వేదాంత తత్త్వజ్ఞానియొక్క యుత్కృష్టమయిన జ్ఞానవిచారమునకును బౌద్ధుల యజ్ఞేయవాదమునకును, జైనుల నాస్తికవాదము మొదలు విగ్రహారాధన పర్యంతము గలవాని కంతటికిని, పలువగల పౌరాణిక గాథలకును హిందూమతము చోటిచ్చుచున్నది.

అట్లయినచో పరస్పరము సమన్వయ మొందక విపులముగా విభేద మొంది తమంత వెలయుచుండు నీమతవిభేదములన్నియు నే సామాన్య ప్రదేశమును ప్రస్థానముగాఁ గలిగియున్నవో, చూపునకుఁ బరస్పరవిరుద్ధముగాఁ గానవచ్చు వీని కిన్నిటి కాధారస్థలమేదియో యను ప్రశ్నలు పొడ చూపక దక్కవు వీనికి సమ్మతి పలుకుటకే యత్నించెదను.

## వేదమును సంబంధించినది.

హిందువులు వేదానుగ్రహము వహించిన మతము నవలంబించినవారు. వేదమాద్యంతరహితమనుట వారియభిమతము. ఒకగ్రంథ మాద్యంత రహితముగా నున్నదనుట యిందలి సభ్యులకుఁ బరిహాసాస్పదంబుగ నుండవచ్చును అయినను వేదమనునది యేగ్రంథమును బోలినదిగాదు పెక్కండ్రు వెవ్వేఱు కాలములయందుఁ గన్పెట్టిన యాత్మజ్ఞానవిధులు నిండుగఁగలిగిననిధి యనుటయే దీనియభిప్రాయము; అభిప్రాయాకర్షణ శక్తికి విలక్షణమయిన నిత్యసంబంధమయినవిధి మానవులచేఁ గనుఁగొనుటకుఁ బూర్వమునందే యుండుటతోడ, వారిచే మఱపుఁ జెందినప్పటికిని తొంటిరీతినే తా నెట్లుండఁగలదో యట్లే యాత్మజ్ఞానమును సంబంధించినవిధులు నైతముండునవి యగును. జీవాత్మలలో నొండొంటికిని, వాని పరమపితృయగు పరమాత్మకును గల నీతిధర్మ జ్ఞానసంబంధములును మనము గనుఁగొనుటకుఁ బూర్వమునందే యుండినవి, మనము మఱచినప్పటికి నవి యెప్పటి యట్లుండునవియే.

ఈవిధులను గని పెట్టినవారిని ఋషులందుము; వారిని పరిపూర్ణజ్ఞానసిద్ధినిబొందిన ఘనులని గౌరవబుద్ధితో భావింతుము. ఆయుత్తములలో మిక్కిలి కొనియాడఁదగిన కొందఱు స్త్రీలును గలరని యీసభవారల నత్యంతసంతోషపూరితమనస్కుఁడనై పలుకుచున్నాను

తొల్లి చెప్పిన విధులకు, అవి నిత్యసంబంధమును గాన్పించు విధులు, అను కారణముచే నంతములేక పోవచ్చునుగాని వాని కాది యుండవలయుట యావశ్యకమని కొందఱు చెప్పనగును. సృష్టి యాద్యంతరహితంబని మాకు వేద ముపదేశించుచున్నది ఐరోపీయ విజ్ఞానశాస్త్ర మనిననో ప్రపంచమునంగల శక్తి విశేషము, ఎచ్చుతక్కువలులేక యేకాలమునందును నొక్కటేరీతిని వహించినదని నిరూపించుచున్నది. కావున నేదియు లేని కాలమొకటి యుండియున్న నిట్టి భేదవిధానముల తోడి శక్తియంతయు నెచ్చట నుండినది కొందఱు, అవ్యక్త పరబ్రహ్మస్వరూపంబుగ నుండె నందురు అట్లే యున్నదను కొందము; అట్టియెడ పరబ్రహ్మమునకుఁ గొంత కాలము, అవ్యక్తతయు, కొంతకాలము వ్యక్తతనొంది గానఁబడుటయు స్వాభావికమని యేర్పడెను అట్లేర్పడిన మాఱుటలు పరబ్రహ్మముయొక్క లక్షణమని యేర్పడును అయినను మాఱునట్టి స్థితిని గలవన్నియు మిశ్రవస్తువు లగును. ప్రతిమిశ్రవస్తువును నాశమని చెప్పఁదగిన వేఱుపాటును బొందవలయును. అప్పుడు పరబ్రహ్మమునకు నైతము నాశ మున్నట్లు చెప్పవలసివచ్చును. కావున సృష్టిలేని కాలమేలేదు

దీనిని దృష్టాంతపూర్వకముగా వివరింప ననుమతి యొసఁ
గదరేని సృష్టి, సృష్టికర్తయను నీరెంటిని సమదూర (Parallel)
రేఖలతోఁ బోల్పవచ్చును సృష్టికర్తయగు దేవుఁడు నిత్యతను
బొందిన మహాశక్తిరూపిగాను, సర్వనియంతగాను బ్రకాశించె
డును. ఆతఁడు, తనశక్తిచే ప్రళయసాగరమునుండి పెక్కుకోట్ల
బ్రహ్మాండములను గాన్పించి, కొంతకాలము పరిపాలించి మరల
నాశముచేసెడిని. ఇవ్విధముగానే నిత్యకాలము సైతము వెల
యుచున్నయది. దీనినే ప్రతిహైందవ బాలుఁడును అనుదినము
దనగురువు నాశ్రయించి చదువుచున్నాఁడు. ఎట్లనఁగా—

"సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్ప
యత్" సూర్యునిని చందురుని దేవుఁడు తొల్లిఁటివలెనే కల్పిం
చెను. ఐరోపీయ విజ్ఞానశాస్త్రము సైతము, ఈయభిమతమునే
నిర్వహించుచున్నది.

## నిత్యవస్తులక్షణము

నే నిచట నిలుచుచున్నాను; నాకన్నుల మూసికొని,
'నేను, నేను' అని తలఁచుటకుఁ బ్రయత్నింతునేని, నాయొ
డుటనిలుచు భావనయేది? శరీరభావనయే అట్లయినచో నేను
కేవల మచేతనములగు జడపదార్థముల చేరికయేగాక యితర
మునుగానా? వేదము నన్ను జడపదార్థముల చేరికయని నుడువు
చున్నది నేను ఈశరీరమునందున్న యాత్మను. శరీరమును
గాను. శరీరము నశించునది; నేను నాశరహితుఁడను, ఇప్పుడీ
శరీరమునందున్నాను; ఇది నశించినను ఉండుచునే యుందును.
ఇంతకుఁ బూర్వముకూడ నేనుంటిని. ఈయాత్మ శుద్ధశూన్యము

నుండి క్రొత్తగాఁ గల్పింపఁబడినదిగాదు కల్పించుట యనిన మిశ్రమని యేర్పడును; కావున, పిదప నొకప్పు డట్టిదానికి విలయ మేనియు వియోగ మేనియుఁ గలుగఁ గలదను నభిప్రాయ మేర్పడును ఆత్మ సృష్టింపఁబడినదే యైనయెడల దానికి నాశమే కలుగును. కాఁబట్టి, ఆత్మ సృష్టింపఁబడినది గాదు కొందఱు, సౌందర్యయుతమగు శరీరముతోను, ఉత్సాహశక్తితోడి మనస్సుతోను, ఏకొఱఁతయు లేక సుఖమునే యనుభవించు భాగ్యముతోను బుట్టెదరు. మఱికొందఱు దౌర్భాగ్యులుగా జన్మమెత్తెదరు కొందఱకు, చేతులు లేవు, కాళ్లు లేవు; కొందఱు జ్ఞానహీనులయి దుఃఖమయమయిన కష్టజీవితమున దురపిల్లెదరు. వారందఱును సృష్టింపఁబడినవారే యైనయెడల న్యాయవంతుఁడుగను, కరుణానిధిగను వెలయునీశ్వరుఁ డొక్కరుని భాగ్యవంతునిఁగాను, మఱియొకని నభాగ్యవంతునిఁగను సృజింప నేమి కారణము? ఆతఁ డేల యింతపక్షపాతము వహింపవలయును? ఈజన్మమున దుఃఖమనుభవించువారు మఱి రాఁబోవు జన్మమున నేలోపము లేక సుఖమునే యనుభవింపఁగల రనుట దీని కెంతమాత్రము తగిన సమ్మతి కాఁజాలదు న్యాయమూర్తియుఁ గరుణానిధియు నైన తేజరిలు సర్వేశుని పరిపాలనమున నేల యొకఁడీభవమునందైనను దౌర్భాగ్య మనుభవింపవలయును?

ఇది యిట్లుండఁగా, ఈయభిప్రాయము, సర్వశక్తియుక్తుఁడగు పురుషు నొకని క్రౌర్యము నుగ్గడించునేగాని యేకారణమును దెలుపఁజాలదు. కావున నది శాస్త్రసమ్మతముగాదు

కావున నొకని సుఖగానో దుఃఖగానో చేయుటకు వాని జన్మమునకుమున్నే తగినకారణము లేర్పడియుండవలయును. ఆకారణములు వాఁడు తొల్లి చేసిన కర్మలే యగును. మానవుల యొక్క పలువిధముల మనోదౌర్బల్యములకును, శరీరస్థితులకును, మాతాపితలనుండి పరంపరగాఁ బొందఁబడిన వాసనయే కారణముగాఁ జెప్పరాదా? అనిన, ఇచ్చోట రెండువిధముల స్థితులు గలవు ఒకటి చేతనవస్తువుల స్థితి, మఱియొకటి యచేతనవస్తువుల స్థితి.

## చేతనవస్తువుల పారంపర్యవాసన

మనయొద్దనుండు వానికెల్లను జడపదార్థములను వాని వికారములను గాని తగినసమ్మతులు చెప్పనగునేని, ఆత్మయను నది యొకటి గలదనుటను గ్రహియింపవలసిన యావశ్యకమే యుండదు అయినను చేతనము జడమునుండి గానవచ్చియున్నది యని నిరూపించుటకే శక్యము కాదు కావున నొక ప్రత్యేకజడపదార్థమునుండి సకలసృష్టియుఁ బరిణామరూపముగాఁ దోఁచియున్నదను భౌతికత్వమును నొప్పుకొనుట న్యాయమైనచో నొక్క-టేమూల చైతన్యమునందుఁ బ్రపంచమంతయు నధ్యాసముగాఁ దోఁచుచున్నదను అద్వైతసిద్ధాంతము యుక్తి కెక్కిన మతముగాఁగదా పరిణమించును. అయినను ప్రకృత మీవిషయమును గూర్చి విమర్శింపవలసిన యావశ్యకము లేదు శరీరము, కొన్నివిధముల పారంపర్య వాసనలతోఁ గూడిన దనుటను మనము త్రోసివేయుటకును గాదు. శరీరవాసన యన నొకవిధమయిన శరీరముయొక్క యమరిక

యనుటయే యర్థము. ఆయమరిక, ఒకవిధమయిన యాత్మకు మాత్రము, దానిస్వభావమునకుఁ దగినయొకమార్గమున వృత్తి ననుసరించుటకుఁ దగిన దగును ఆత్మయొక్క ప్రత్యేకవాసనకు దాని పూర్వకర్మలే కారణము లగుచున్నవి ఒకవిధమైన వాసనను వహించిన యాత్మ, ఆవాసనను బహిర్గతము గావించుటకుఁ దగిన పరికరముగా నమరియున్న శరీరమునందు *'యోగ్యం యోగ్యేన యుజ్యతే' అను జాతిసంబంధముచే, తన జన్మమును బొందుచున్నది ఇది యత్యంతము శాస్త్రీయమయినదే ఏలనఁగా—శాస్త్రము, అన్నిఁటికి నలవాటే కారణమని నుడువుచున్నది అలవా టనునది, ఒకతేపకుఁ జేయఁబడినది పలుతడవలకుఁ జేయుచుండుట చేతఁ గలుగునట్టిది. కాఁబట్టి, క్రొత్తఁగాఁబుట్టిన బిడ్డయొక్క స్వాభావికమయిన యలవాటుగూడ అది పలుమాఱు చేయుచుండిన కర్మయొక్క ప్రయోజనమే యగును ఆ యలవా టీజన్మమునఁ గలిగినది గాదు గావున, తొలిజన్మములనుండియె వచ్చియుండవలయును.

ఇంత దనుక నేను జెప్పుచుండిన వానినన్నిఁటి నొప్పుకొన్నప్పటికిని, గొందఱు మఱియొకవిధమయిన యాక్షేపమును జేసెదరు అదేమనఁగా పూర్వజన్మమునుగూర్చి మన కేమాత్రము జ్ఞాపకము లేకపోవుటకుఁ గారణ మేమనుటయే. దీనికి సమాధానము సులభముగాఁ జెప్పవచ్చును నేనిప్పు డాంగ్లేయభాషను మాటలాడుచున్నాను ఇది నాకు మాతృభాష

* తెగ తెగతోఁజేరును అనఁగా నొకవిధమయిన గుణముగల వస్తువు ఆగుణముగల వస్తువుతోడనే చేరుచున్నది.

గాదు; యథార్థముగానే నామాతృభాషలోని యొకపదము కూడ నాజ్ఞాపకమునందు లేదు అయినను, దానియందలి పదములను దలంపఁ దలఁకొంటినేని, అవి నాజ్ఞాపకమునకు భీతిల్లి దలచూపుచున్నవి ప్రయత్నించిపాటుపడినచో నడుగునఁ బడునవియుఁ బైకిరాఁగలవు అట్లే తొలిజన్మము యొక్క యనుభవములు సైతము ఇప్పుడు జ్ఞాపకమునకు వచ్చును.

## జరిగినవానిని జ్ఞప్తికిఁ దెచ్చుకొనుట

ఇది చూటిగా నిరూపింపఁదగిన సాక్ష్యము ప్రత్యక్షానుభవమే యొట్టిదానికిని బ్రబలమైన ప్రమాణ మగును కాఁబట్టి యింతకన్న మాఋషులు లోకు లెల్లరు దెలియునట్లు చెప్పునట్టి వానిని వినుఁడు. 'జ్ఞానమను మహాసాగరమును క్రిందినుండి కలియఁబెట్టుటకు వలసియున్న రహస్యములను కనిపెట్టి యున్నాము ఈరహస్యముల ననుసరించి నడుచుకొంటి రేని మీకుఁ దొలి జన్మపు సంపూర్ణ జ్ఞాపకము గలుగును' అనుటయే

కాఁబట్టియే హిందువుఁడు, తన్ను ఆత్మయనియే నమ్ముచున్నాఁడు. ఆత్మస్వరూపి యగువాని నేయాయుధమును భేదింపలేదు వాని నగ్ని కాల్పఁజాలదు; నీరు కరఁగింపదు; గాలి యార్పలేదు.

"నైనం ఛిన్దంతి శస్త్రాణి నైనం దహతి పావకః,
న చైనం క్లేదయ న్త్యాపో న శోషయతి మారుతః"

హిందూమతాభిప్రాయానుసారము ఒక్కొక్క యాత్మయు నొక వట్రువ ఆ వట్రువను జుట్టుకొని యీచోట నున్న దని చెప్పుటకుఁ గాదు దాని మధ్య ప్రదేశమో, ఆత్మవసింపఁ దగియున్న స్థలమని చెప్పఁ దగిన శరీరమగును ఈ మధ్యప్రదేశాంతరము ఒక దేహమునుండి మఱియొక దేహమునకు మాఱుటయే మరణ మనఁ దగియున్నది ఆత్మ జడపదార్థముల యొక్క స్థితులకుఁ గట్టువడినది గాదు; అది సహజముగా పాశబంధము లేని పారిశుద్ధ్యమును, స్వాతంత్ర్యమును, నైర్మల్యమును, బరిపూర్ణతను వహించినవస్తువు ఎవ్విధముగానో యయ్యది జడపదార్థముతోఁ జేర్పఁబడి కట్టువడిపోయినది తన్నుసైతము జడవస్తువుగానే తలపోయుచున్నది

స్వతంత్ర పరిపూర్ణ పరిశుద్ధవస్తు విట్లు జడపదార్థమునకు లొంగుటకుఁ గారణమేమి? పరిపూర్ణాత్మ తన్ను అపరిపూర్ణమయినదని నమ్మునట్లు ఎవ్విధముగా మోసపుచ్చవచ్చును. హిందువు లీప్రశ్నకుఁ బ్రతి పలుకలేక తంత్రముగాఁ దప్పించుకొని, ఇట్టిప్రశ్న వేయుట కెంతమాత్రము చోటు లేదనెదరనుటను ఇతరులు చెప్పఁగా విని యున్నాము తత్త్వవిచారపరులలోఁ గొందఱు, ఈలోకమునందు సగము పరిపూర్ణతను జెందిన సత్పురుషు లున్నారని చెప్పుటచేత నీప్రశ్నకుఁ దగిన సమాధాన మేర్పడఁగలదని దలఁచి, పైని జెప్పినట్లు సగము పరిపూర్ణతను జెందిన సత్పురుషు లనుటవలెనే కఠినములయిన పరిభాషాపదములచే పూర్ణాపూర్ణవస్తువుల మధ్యనున్న చోటని బూరింప సమకట్టెదరు. వ్యర్థపు పారిభాషికపదములు విషయ

మును జూపలేవు పైని బ్రశ్నించిన ప్రశ్న కిది సమ్మతిగాను గన్పట్టదు శుద్ధపరిపూర్ణవస్తువు సగము పరిపూర్ణవస్తువుగా నెట్లు కాఁజాలును? పరిశుద్ధాఖండవస్తువు తన స్వభావమునం దణుపరిమాణమయినను నెట్లు మార్పును జెందఁగలదు. హిందూమతస్థుఁడు యథార్థవాది; వాఁడు కుత్సితవాదములకుఁ దలపెట్టఁ బనిలేదు ఎట్టివిషయములనుగాని పౌరుషముదీపింప నెదిరి నిలిచి విమర్శించు స్వభావగుణముగలవాఁడు, పైని దెలిపిన ప్రశ్నకు వాఁడొసఁగు సమాధానమేమనిన 'నాకుఁ దెలియదు' అనుటయే పరిపూర్ణమయిన యాత్మ తన్ను నపరిపూర్ణవస్తువనియును, జడవస్తువుతోఁ జేరి, దానివలన నిర్బంధమునకుఁ జిక్కిన వస్తువనియును దలఁచుట కెట్లు తటస్థించెనో నాకుఁ దెలియదు నాకుఁ దెలియక పోయినను, ఉన్నది యుండునదే గదా; ఒక్కరొక్కరును దమతము జ్ఞాపకమునందు తాము శరీరమనుటనే తెలియఁ గలిగెదరు నేను లేక నాయాత్మ యీశరీరము నేల యాశ్రయించినది యనుటకుఁ గారణములు పలుకుటకు మేము ప్రయత్నింపలేదు అది దేవుని సంకల్పము అని చెప్పుటయుఁ దగిన సమాధానము కాదు 'మాకుఁ దెలియదు' అని చెప్పుటకంటె మిన్నయగు సమాధాన మొకటియు నేర్పడలేదు.

## ఆత్మ నిత్యము.

కాఁబట్టియే, ఆత్మ నిత్యమయినది; మరణములేనిది; పరిపూర్ణతను జెందినది; ఎల్లలేనిది; ఎక్కడనుఁ జూచుటకుఁ గాని

వ్యాసరేఖగల వట్రువయొక్క యంతరమయినది; మధ్యాంతరమన్నది యొకశరీరమునుండి మఱియొకశరీరమునకు మాఱుటయే మరణమనఁబడును మనవర్తమానకాలస్థితి మనము తొల్లి చేసియున్న కర్మలచేతను, మనభావికాలస్థితి యిప్పుడు మనమాచరించు కర్మలచేతను నిర్ణయింపఁబడుచున్నది కావున, ఆత్మ, ఒకజన్మము మొదలు మరొకజన్మమువఱకును ఒకతేపకుఁ జనిపోయినది మొదలు మఱుచటితేపకు చనిపోవునంతకు పైపైని వృద్ధినొందిరో లేక రాను రాను క్షీణించిరో పోవుచున్నది. ఝంఝామారుతమునకుఁ జిక్కిన యొకచిన్న యోడ పొంగి పొరలు తరంగములచే నెత్తునకెత్తఁబడి యుత్తరక్షణముననే క్రిందికిఁ గొంపోవఁబడునట్లు, ఆత్మయును పుణ్యపాపములను రెండుకర్మలకు వశమయి యిచటికి నచటికి దొల్లాడుచు దేనికిని లోఁబడక ఎప్పటికిని ప్రవహించుచుండు కారణకార్యప్రవాహమునకుఁ జిక్కి తొట్రుపడుచు నగతికమై మార్గముఁ దప్పి, రూపుసెడిన యోడయో యన నొప్పుచున్నది తనత్రోవను గన్పట్టినట్టి వాని నన్నిటిని హతముసేయుచు; భర్త, కాలగతి నొందఁగాఁ బరితాపకరముగాఁ బ్రలాపించుభార్య ప్రలాపములకును, తండ్రి తెగిన బిడ్డలయొక్క పరిదేవనములకును కనికరించి నిలువక పొర్లి పరుగులిడుచునే యుండుకారణ చక్రమునకు నిగుడ దొరకిన పురుగనియు నా యాత్మను జెప్పనొప్పును

ఈఘోరస్థితిని గాంచి గుండియ లవియుచున్నవి అయినను ఏమిసేయుట! లోకస్థితి యట్లున్నది దీని కుపశాంతి

యేదియు లేదా? వీనినుండి విముక్తిఁ బొందుట కేమియు మార్గము లేదా? అని పరితపించునట్టి మానసము, నీరుగా కరఁగి ప్రలాపించు సవ్వడి కరుణానిధియొక్క సింహాపీఠికను డగ్గఱింపఁగా, దాని పరితాపము బోకార్చి, తేరుగడ నొందించు మృదుమధురమా దివ్యమైన యభయవాక్కుచేత నొక వేదర్షికి జ్ఞానోదయమయ్యెను అంత నాఋషి ఈలోకము వా రందఱును దెలిసికొనునట్లు గంభీరస్వానముతోఁ జెప్పిన సంతోష వర్తమానమేమనఁగా:—

"శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రా
ఆయేధామాని దివ్యానితస్థుః
వేదాహమేతమ్ పురుషమ్ మహాన్తమ్
ఆదిత్యవర్ణమ్ తమసఃపరస్తాత్
తమేవ విదిత్వాతి మృత్యుమేతి
నాన్యఃపన్థా విద్యతేఽయనాయ".

ఓ అమృతస్వరూపపు నబ్బురపుబిడ్డలార, వినుఁడు! దివ్యస్థానములయందు వెలయువారలారా! వినుండు. పరగతిని బొందుటకు మార్గమును గనుఁగొంటిని. చీఁకటికావల సూర్యుని వలె, స్వయంప్రకాశముగా వెలుఁగొందు మాయాతీతపురాణవస్తువగు మహాపురుషునిఁ గాంచితిని వానిని గనుఁగొనుట వలననే మీరు మరణమునుండి దొలఁగఁ గలరు. పరగతికి మఱియొక మార్గము లేదు.

అమృతస్వరూపపు టబ్బురపుబిడ్డలారా; ఆహా! ఏమి దివ్యమయిన మృదుమధురాభయ దివ్యనామము! సహోదరు

లార! అమృతస్వరూపపు నిత్యానందమునకు యోగ్యులగువార లార ! అను నింపయిన యీ పేరిచే మిమ్ము సంబోధించుటకు నాకనుమతి యొసఁగుదురుగాక! హిందూమతస్థుఁ డెవ్వఁడును మిమ్ము పాపులని చెప్పుటకు సాహసింపలేఁడు.

" అహం దేవో న చాన్యోఽస్మి
బ్రహ్మైవాహమ్ న శోకభాక్,
సచ్చిదానందరూపోహమ్
నిత్యముక్తస్వభావవాన్".

ఈశ్వరునిసంతానము.

మీరీశ్వరుని బిడ్డలరు నిత్యానంద సౌభాగ్యమునకు హక్కుగల పరిశుద్ధ పరిపూర్ణవస్తువులరు ఈ యిహమున వెలయుచుండునట్టి మీరలా పాపులు? అట్లు, ఒకరినిగూర్చి పలుకుటయే పాపమగును మానవస్వభావమునకుఁ గొప్ప కలంకమునగును ఓ సింహములార ! మీరలు మేఁకలను భ్రాంతిని వదలి యాత్మోత్కృష్టతను దెలియుదురుగాక. మీరలు నిత్యాత్మలరు దివ్యానుగ్రహము పొందిన నిత్యానందస్వతంత్రవస్తువులరు జడపదార్థములరు గారు. శరీరములరుగారు. జడపదార్థములు మీకు బానిసలు; మీరలు వానికి బానిసలరు గారు

కావుననే వేదము, లోకస్వభావము యొక్క కరుణ మాలిన కారణ కార్యసంబంధవిధులు భయంకరముగా నేకీ

భవించినమాత్రము చెప్పుటకుఁ గాదు ఆకారణ కార్యముల వలన ద్యోతకమగు నిర్బంధస్థితికి నంతమే లేదనియును జెప్పుట కాదు. లోకానుగుణ్యములగు విధులకన్నిఁటుఁ దలగా ప్రత్యణువునను శక్తికిని అంతరమునందును బాహ్యమందును నెచ్చటను వ్యాపించియున్న యొక్కరుఁడు గలఁడనియును,

"భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః
భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః"

"వాని యాజ్ఞా వశంబుననే గాలి వీచుచున్నది; నిప్పుమండుచున్నది; మేఘము వర్షమును వర్షించుచున్నది; యముఁడు లోకమును సంహరించెడును" అనియు మొఱయిడునది యగును అట్టి యొకని యొక్క స్వరూప మేది?

వాఁడెచ్చట నుండువాఁడు; వాఁడురూపములేని ప్రత్యేకమయిన పరిశుద్ధవస్తువు; సర్వశక్తులను గలవాఁడు మహాకారుణ్యఖని "మా జనకుఁడవు నీవే; మా జననియును నీవే; మా ప్రియుఁడైన మిత్రుఁడవు నీవే; సర్వశక్తులకును మూలకారణమవు నీవే; ఈజీవదశయొక్క యత్యల్పభారమును వహింప మాకుఁ దోడ్పడుదువుగాక."

"పితాత్వంమాతాత్వందయితతనయస్త్వంప్రియసుహృత్
త్వమేవ త్వం మిత్రం గురురసి గతిశ్చాసి జగతాం,
త్వదీయస్త్వద్భృత్యస్తవపరిజనస్త్వద్గతి రహం
ప్రపన్నశ్చైవం సత్యహమపి తథైవాస్మి హిభరః".

అని వేదర్షులు గానముచేసియున్నారు వానినిబొందుట యెట్లు? భక్తిచేతనే; సుఖసంతోషప్రదములగు సమస్త వస్తువులయందును గొప్పవస్తువు వాఁడేయని భావించి, భక్తిచే తరింపవలయును

వేదమిట్టి భక్తిమార్గమును బోధించుచున్నది. హిందువులు ఈభూలోకమున నవతారపురుషునిఁగాఁ గొనియాడు శ్రీకృష్ణమూర్తి ఈభక్తిమార్గమును పూర్ణముగా వివరించి బోధించిన విధమును బరిశీలింతము

## "శ్రీకృష్ణమూర్తి యుపదేశము"

శ్రీకృష్ణుఁ డుపదేశించుట యేమనఁగా—ఈలోకమునందు మానవుఁడు తామరాకువలె నుండవలయును అది నీటియందు వర్ధిల్లియు దానికి నీరంటుటలేదు. అవ్విధముగానే మనుజుఁడు దేవునియందు జ్ఞానకమును కర్మలయందు శరీరమును గలిగి మెలఁగవలయును అనుటయే

ఇహలోకసుఖమునందుఁ గాని పరలోకసుఖమునందుఁ గాని ప్రీతియుంచి యుండుట యుక్తమే ఇట్టిసుఖంబులయందిచ్ఛనుంపక భగవద్విషయమున భక్తిచెల్లించుటయనునది దానికంటె నుత్కృష్టమయినది

నధనం నజనం నసుందరీమ్ కవితాం వా జగదీశ కామయే,
మమజన్మని జన్మనీశ్వరే భవతాత్ భక్తిరహైతుకీ త్వయి.

'స్వామీ; నాకు భాగ్యముతోఁ బనిలేదు; భార్యపుత్రులను నొల్లను; విద్యల నొల్లను; నీయిచ్ఛకువచ్చునేని నరకశతంబులయందైనను బ్రవేశింపఁగలను ఫలాపేక్ష లేనిభక్తి నీయంద

నవరతముండునట్లు మాత్ర మనుగ్రహింతువు గాక! ప్రీతి కొఱకే ప్రీతియుత్పత్తిల్లునట్లు కరుణింతువుగాక' అనునది యొక ప్రార్థన; శ్రీకృష్ణమూర్తియొక్క శిష్యులలో నాకాలమున భగత ఖండమునందుఁ జక్రవర్తిగా నుండినయొకరు, తమవిరోధుల వలన రాజ్యమునుండి తరుమఁగొట్టఁబడి హిమవద్గిరి సానువుల యందలి యడవులకుఁ బోయి తనభార్యతో వసించుచుండిరి అచ్చట నొకనాఁడు రాణిగారు పెనిమిటిని జూచి, 'మానవుల లోనెల్ల పుణ్యపూరుషులగు మీరు ఇంతకష్ట మనుభవించుట కేమి కారణము?' అని యడుగఁగా నందులకు యుధిష్ఠిరుఁడను నామహాపురుషుఁడు,—

నాహం ధర్మఫలాకాంక్షీ రాజపుత్రి చరామ్యుత
దదామి దేయమిత్యేవ యజే యష్టవ్యమిత్యుత
ధర్మఏవ మనః కృష్ణే స్వభావాచ్చైవ మే ధృతమ్
ధర్మవాణిజ్యకో హీనో జఘన్యో ధర్మవాదినామ్

మహాభారతము, వనపర్వము, 31 వ అధ్యాయము.

'నా రాణీ! ఈపర్వతపంక్తిని జూడుము అది యెంత గంభీరముగాను అందముగాను నున్నది దానియెడల ప్రీతిగలవాఁడను నేను అదినాకేదియు నొసఁగకపోయినను గాంభీర్యమును గౌరవమును గల్గినచోటులందు నేను ప్రేమయుంచుట గలదు. కావున నవ్విధముగానే శత్రువునందును బ్రీతిగలిగి యున్నాను. నేను దీనినిగోరికొని ప్రార్థింపను; నాకేదియునుదీనివలనఁ గావల సినది లేదు; వాఁడు, తనయిష్టానుసారము నన్నేస్థానమునందుంచిన నుంపవచ్చును నేను వానిప్రీతికొఱకే ప్రీతిని జెల్లింప

వలసిన వాఁడ నైతిని. వర్తకము చేయుట వలె లాభముకొఱకై ప్రేమను జెల్లించుట నాయిష్టము గాదు' అని నుడివిరి

"ఆత్మ దేవత్వముగలది"

ఆత్మ దేవత్వము గలదనియును, అయినను, ఇచ్చట నది జడపదార్థపు బంధమునకుఁ జిక్కి తొట్రుపడుచున్న దనియును, ఈబంధము తొలఁగుకాలమే యది పరిపూర్ణతను జెందుకాలమనియును వేదముపదేశించుచున్నది. ఈపరిపూర్తినే 'ముక్తి, నివృత్తి, అపరిపూర్ణబంధవిముక్తి, జననమరణనివృత్తి' అను పేళ్లచే వ్యవహరించెదరు

ఈబంధము, ఈశ్వరుని దివ్య కారుణ్యాతిశయమునచే నివృత్తిఁ జెందవలయు ననియును, ఈశ్వర కారుణ్యము పరిశుద్ధహృదయుల విషయముననే ప్రవర్తిల్లుననియును వేద ముద్ఘోషించెడిని. కాఁబట్టియే పరిశుద్ధుఁడయిన యీశ్వరుని దివ్య కారుణ్యమును వహించుటకుఁ బారిశుద్ధ్యము విషయ మగుచున్నది. ఆహా! ఆదివ్యానుగ్రహము, ఎవ్విధమునఁ బ్రవర్తిల్లుచున్నది! చిత్తశుద్ధి గలవారలకు నీశ్వరుఁడు తానుగాఁ బ్రత్యక్షమగుచున్నాఁడు నిర్మల పరిశుద్ధాంతఃకరణముగలవాఁడీజన్మముననే యీశ్వరసందర్శనము చేయుచున్నాఁడు అట్టి సందర్భముననే—

భిద్యతే హృదయగ్రన్థిః ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే

"వాని మనస్సుయొక్క వంకలన్నియు సరిపడి ఋజుత్వ మొందుచున్నది సందేహములన్నియుఁ దొలఁగి నెమ్మది గలుగు

చున్నది అది మొదలు వాఁడు ప్రపంచసంబంధియగు భయంకర కారణకార్య రూపమయిన కర్మపాశమునకుఁ జిక్కి వ్యథ నొందుట లేదు" ఇదియే హిందూమతమునకుఁ బ్రాణాధారమయిన ప్రధానసారాంశము. హిందూమతస్థుఁడు వ్యర్థపు మాటలచేతను, శాస్త్రవాదములచేతను తృప్తినొందలేఁడు; ఇంద్రియములకు గోచరించునట్టి సామాన్యవస్తువులకు భిన్నముగా నేదయిన నొకటియుండునేని దానిని వాఁడు సాక్షాత్తుగ ననుభవింపఁ గోరును జడపదార్థముకంటె విశిష్టమయిన యాత్మ యొకటి తనయందుండునేని, పరమ కారుణ్యమూర్తియు సర్వవ్యాపియు నగు పరమాత్మయొకఁ డుండునేని, ఆతనియొద్దకే తిన్నఁగాఁ జేరవలయునను నభిప్రాయమును గలవాఁ డగును. వాఁడాపరమపురుషుని ప్రత్యక్షముగ దర్శించుటకుఁ బ్రయత్నించును అట్టి దర్శనమే వానికిఁ బొడసూపిన సందేహసంచయముల నన్నిఁటిని దొలఁగించుటకు సమగ్రమయినది అయినను, ఆత్మను గూర్చియును ఈశ్వరుని గుఱించియును ఋషిశ్రేష్ఠులు వాక్రుచ్చు మహాప్రమాణము లెవ్వియనఁగా—'మేమాత్మను బ్రత్యక్షముగ దర్శించియున్నాము' 'ఈశ్వరుని కట్టెదుటఁ గనుఁగొని యున్నాము' (వేదాహమేతమ్ పురుషమ్ మహాన్తమ్) అనుటయే.

ఇదియే సంపూర్ణస్థితియొక్క భావము వివిధమయిన యుద్దేశమునకుఁ గాని యనుష్ఠానమునకుఁగాని కట్టువడియుఁ గష్టపడియు మెలఁగుట హిందూమతస్థుని స్వభావధర్మము కాఁజాలదు. వ్యర్థపు నమ్మకముచేఁ దృప్తిచెందక, ప్రత్యక్షాను

భవమును గోరుటయును, తానున్నస్థితియందుండియే మెట్టుమెట్టుగాఁ బరిపక్వదశను గాంచి, పరమాత్మస్వరూపియై ప్రకాశించుటయే దాని లక్షణమగును

### " హిందువుల మతము."

కావుననే హిందువుల మతాభిప్రాయములఁగల సర్వప్రయత్నములును, తాము పరిపూర్ణస్థితి నొందుటకును, దేవత్వము వహించుటకును, ఈశ్వరునిఁ బొందుటకును సందర్శించుటకును నై చేయఁబడు నెడవిడువని ప్రయత్నములే యగును.

పరిపూర్ణతఁ జెందిన పిదప మనుష్యునిస్థితి యెట్లుండును? అపారమయిన యానందసాగరమున మగ్నమగుటయే వానిస్థితి యగును వాఁ డేవస్తువునందు మాత్రమే సౌఖ్యానుభూతిని గోరవలయునో యట్టి ప్రత్యేకవస్తువగు భగవంతునిఁ బొంది యఖండ పరిపూర్ణానందము ననుభవించుచున్నాఁడు; ఈశ్వరునితోడ నిత్యానందసాగరమున నోలలాడుచున్నాఁడు.

ఇదివఱకుఁ జెప్పఁబడిన వన్నియు, హిందువులందఱును సర్వ సంప్రతిపన్నముగా నొప్పుకొన్నవి ఇది హిందూదేశములో సర్వమత విభాగములకును సామాన్యముగా నమరియున్న మతోద్దేశమగును దీనిని గూర్చికలిగిన యాశంకయేమనిన 'పరిపూర్ణత్వము అఖండ మయినది' అనఁగాఁ బ్రత్యేకస్థితిని వహించినది. కాఁబట్టియే యట్టి ప్రత్యేక స్థితి రెండు మూఁడు విధములుగా నుండఁ గల్గునా' అది, గుణాతీతముగాను, అవ్యక్తము గాను ప్రకాశించునది గాదా? అనుటయగును కాఁబట్టి, ఆత్మ యఖండపరిపూర్ణస్వరూపముగా

నగు నప్పుడు, అది బ్రహ్మమునందు నద్వితీయముగఁ గలిసి బ్రహ్మమే కావలయును 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అట్టి యాత్మయే యఖండసచ్చిదానందరూపి యైన యీశ్వరుని దన యునికికిని నున్నతికిని సత్యమగు పరిపూర్ణ స్థానమని యనుభవ పూర్వకముగఁ దెలిసికొనును. దీనిని గొందఱు, జీవాత్మ తన ప్రత్యేకస్థితి నుండి తొలఁగి బ్రహ్మము, ఆయి లోనగు వాని యవస్థను బోలుకట్టి యాత్మ నాశమని లాఘవపఱచి పలుకుదురు ఈ యభిప్రాయమును బుస్తకములయందు మనము పెక్కు తడవలకుఁ జదివియున్నాము. దానివలన వారి తెలివిలేమి వ్యక్తమగునే గాని మఱియొండు గాదు. రణరంగమును దర్శింపని వీరభటుఁడు, పోరునఁ దగిలిన యొకని గాయపుమచ్చలను గాంచి పరిహాసించుట సహజమే కదా।

ఆ స్థితియట్టిది గాదని మీకు నిశ్చయముగాఁ జెప్పఁ గలను. ఈచిన్న శరీరమునకుఁ గల తెలివిని అనుభవించుటయే యానందమయినచో, రెండు, మూఁడు, నాలుగు, అయిదు శరీరములకుఁ గల తెలివిని అనుభవించుట యంతకంటె నెన్నిరెట్లో మడంగులు విశేషించిన యానందము గావలయును గదా! ఈ యానందానుభవము సర్వవ్యాపకమయిన తెలివి యొక్క యనుభవ మగునప్పుడు సర్వోత్కృష్టనిరతిశయానందమే కదా ప్రాప్తింప వలయును!

"అఖండస్వరూపము"

కాఁబట్టియే యట్టియంతములేని సర్వవ్యాపకస్వరూపమును బొందవలసియున్నచో, నల్పదర్శనముల కలవడినయల్ప

మయిన ప్రత్యేకస్వరూపము నశింపవలయును. నేను ప్రాణమయు మగు నప్పుడే మరణము నన్నువదలి తొలఁగును నేనానందమయుమగు నప్పుడే నన్ననుసరించిన దుఃఖము నివర్తియగును. నేను జ్ఞానమయుమగునప్పుడే సర్వవిధములయిన యజ్ఞానజన్యాపరాధములు దొలఁగును ఇదియే శాస్త్రానుసార మేర్పడునట్టి యావశ్యకమయినపరిణామ మగును ప్రత్యేకములయిన శరీరరూపములుగాఁ గానవచ్చునట్టి జడపదార్థములయొక్క రూపభేదములు శాశ్వతములుగాని మిథ్యాకృతులనియు, వాస్తవముగా నాయొక్క యీశరీరము, అఖండమయిన జడసముద్రమునందు నెడవిడువక మారుచుండునట్టి తరంగమునుబోలిన యొక సూక్ష్మాకృతియనియుఁ, ద[illegible] ప్రకృతిశాస్త్రము నిరూపించియున్నది ఎట్లు జడప్రపంచమునందు వేర్వేఱుగాఁ గానవచ్చు జడశరీరములు సత్యములుగాక మిథ్యలుగాఁ బరిణమించి, అఖండమయిన జడసముద్రమునందు నైక్యమగుటచేత జడసంబంధమయిన యద్వైతము సిద్ధించునో, అట్లే మనప్రత్యేకాంశమయిన యధ్యాత్మవిషయమునందును అద్వైతమే యావశ్యకమయినదియు యుక్తికిఁ దగినదియు నగు సత్యమయిన పరిణామముగా సిద్ధించుచున్నది

శాస్త్రము, తాను ప్రతిపాదించు నన్నివిషయములకును మూలముగా నమరఁదగిన యైక్యమును గాంచుటయేగాక మఱియొండుగాదు కాఁబట్టియే యేశాస్త్రమును అట్టిపూర్ణమైన యైక్యమునుండి తొలఁగినయెడల, ఆస్థితి కావల పోవుటకుఁ గాక నిలిచిపోవవలయును. ఏలనఁగా, అప్పుడుమాత్రమే దాని

ముఖోద్దేశము నెఱవేరిన దగును. ఎట్లనిన, రసాయనశాస్త్రము, మూలవస్తు వొకటినుండియే యన్నివస్తువులను గలిగింప వచ్చును అని గనుఁగొన్నచో దానికిమీఁదుగా నది వ్యాపించుటకుఁ ద్రోవలేదు. జడశక్తిశాస్త్రము సైతము, సర్వశక్తులును మూలశక్తి యొకదానియొక్క వికారములేయని కనుఁగొనిన వెంటనే ముగింపునకు రావలసియుండును.

ఆరీతిగానే మతశాస్త్రము సైతము నాశమొందు స్వభావముగల ప్రపంచమున నాశరహితమయిన నిత్యవస్తువుగా నుండు వారెవరో, ఎప్పటికిని మాఱుచున్న లోకమునకు నిరంతరాధారమయిన వారెవరో, ఆత్మలన్నియు నేపరమాత్మయొకటియొక్క ప్రతిబింబములో, అట్టి, పరమపురుషు నొకని చూచి తెలిసికొనఁగానే సంపూర్ణతను పొందుచున్నది. ఇట్లే వస్తుబాహుళ్యము గలదనుట నుద్దేశముగు యనేకత్వవాదమునుండి కలిగిన వస్తుద్వయమును దెలుపునట్టి ద్వైతము నుండి, ఏకవస్తువును నిరూపించునట్టి యద్వైతము సిద్ధించెను. దానిని మీఱుట కేమతమునకును శక్యముగాదు ఇదియే శాస్త్రములన్నియును పొందవలసియున్న సిద్ధాంతమగును.

“సర్వ మేకవస్తుస్వరూపమేగాని నూత్నకల్పితము గాదు.”

అన్ని శాస్త్రములును తుద కీసిద్ధాంతమునకే వచ్చి తీరవలయును మన కెదుటఁ గానవచ్చు వస్తువులన్నియును, ఒక్క మూలవస్తువుయొక్క భేదమయిన రూపములే గాని క్రొత్తగాఁ గల్పింపఁబడినవి గావనుటయే ప్రకృత (యిరోపీయ)

శాస్త్రపు సునిశ్చితసిద్ధాంతము కాఁబట్టి, హిందువులు, తాము పెక్కు కాలములుగా తమహృదయమున గౌరవించి పరిపోషించుచు వచ్చిన తత్త్వమే యాకాలపుశాస్త్రముయొక్క యున్నతోన్నత సిద్ధాంతముల తోడ్పాటుతోడను బ్రబలప్రమాణముల తోడను తొంటికంటె నెక్కువయైన వాగ్శక్తితోడను నుపదేశింపఁబడుటలను గూర్చి మిక్కిలి సంతసిల్లెదరు.

ఇంక వేదాంతజ్ఞానముయొక్క యున్నతశిఖరములనుండి దిగి పామరజనులయొక్క మతమును బర్యాలోచింతము. భరతఖండమునఁ బెక్కు దేవతల నారాధించుటయనునదియే లేదని ప్రారంభమునందే నేను మీకుఁ జెప్పివేయవచ్చును ప్రతి దేవాలయమునందును అర్చకులును స్వామిదర్శనార్థమువచ్చువారును దేవునకుఁగల సర్వవ్యాపకత్వము మొదలగు సర్వలక్షణములను నచటనున్న దేవవిగ్రహముల విషయమున నారోపించి ధ్యానముసేయుట సమీపమునందు నిలచి చూచునట్టి వారికందఱకును దాని సత్యమునుగూర్చి విశదమగును ఇది పెక్కు దేవతల నారాధించుట యగునా ? గులాబిపుష్పనకు వేఱు పేర్లెన్ని పెట్టినప్పటికిని దానిఁరిమళమునకు మాఱుదలఁ గలుగఁజాలదుగదా? పేర్లు ప్రత్యేకములుగ నెన్నియుండినను నీఁటున విషయవ్యత్యాసమెనగూడునా? (అనఁగా, ఈదేశమునందు పలువిధముల దివ్యమూర్తులమూలమున నెఱవేరుచుండు నీశ్వరారాధనమును, దాని సత్యము దెలియక, పెక్కు దేవతలయారాధనమని చెప్పివేయుటచేతనే దానిని స్థాపించుటకుఁ దగిన కారణమును జెప్పినట్లు కాదనుట)

నేను బాలుఁడుగానుండినప్పుడు భరతఖండమున నొక క్రైస్తవుఁడు గుమిగూడియున్న జనులయెదుటఁ బ్రసంగించుచుండినది యిప్పుడు జ్ఞాపకమునకు వచ్చెడును. వాఁడు జనులను జూచి, వినోదములయిన పలువిషయములమగూర్చి ప్రశ్నించుచునే వచ్చి, మధ్యన "నా చేతికఱ్ఱతో మీవిగ్రహమును నేను గొట్టితినేని యదియేమి చేయును?" అని యడిగెను. అందులకు వినుచుండిన జనులలోఁ నొకఁడు వెంటనే "మీదేవుని నేను దిట్టినయెడల నాతఁ డేమి చేయును?" అని మనస్సునాటు నట్లు అడుగఁగా, క్రైస్తవప్రసంగి "నీవు కాలగతినొందిన పిదప శిక్షింపఁ బడుదువు" అనెను. ఆమాటలకు వాఁడును "అట్లే మావిగ్రహము నైతము నీవు చావఁగానే దండింపఁ గలదు" అని బదులుపలికెను.

వృక్షముయొక్క గుణావగుణంబులను దాని ఫలముల వలనఁ దెలిసికొనవచ్చును. విగ్రహారాధకు లని చెప్పఁబడు వారిలో, సదాచారమునను, ఆత్మజ్ఞానమునను, దైవభక్తియందును, అనమాన్యధీమంతులగు పెద్దలను గాంచియుండునప్పుడు 'పాపమునుండి పారిశుద్ధ్యము జన్మించునా' అను నాశంక సహజముగానే నాకెట్లు గలుగనేర్చును?

"మూఢమతభక్తిఖండనము"

మూఢమతభక్తి యనునది మానవావళికి గొప్పశత్రు వగును. ఒక్కమతమునందే యుక్తిసంయుక్తముగాని మూర్ఖపుఁ బట్టుదల దానికింటను దీక్షయయినచో క్రైస్తవు డేల 'చర్చి'కిఁ బోవలయును? చిలువను ఏల పరిశుద్ధ పరికరముగా భావింప

వలయును? ప్రార్థనావసరముల మోమాకసమువంక కేల త్రిప్పికొనవలయును? రోమను కేతలిక్ దేవాలయమునందలి యన్ని ప్రతిమలుండుట కేమి కారణము? ప్రొటస్టాంటు క్రైస్తవుల ప్రార్థనవేళల, హృదయములకన్ని మూర్తిభావనలేల పొడకట్టవలయును? సోదరులారా! మన మూపిరివదలకయేయుండుట యెటులశక్యమో, యటులే మనము చింతించునప్పుడును జడవస్తువుయొక్క రూపభావనముదప్ప మఱి దేనినిగూర్చియును జింతింపశక్యముగాదు తలంపును బ్రేరేచునట్టి భావనాసంయోగనియమమును సంయోగపద్ధతిచే జడవస్తువుయొక్క రూపవిశేషములని జ్ఞాపకమును గలుగుచున్నది 'సర్వవ్యాపకత్వము' అనునది, సాధారణముగా లోకులలోఁ బెక్కుఱకు నిరర్థకమయిన పదముగాఁ గన్పట్టుచు దేవున కుపరి భాగమను నియమముగలదా? లేకున్నచో 'సర్వవ్యాపకత్వము' అనుపదమును మనము చెప్పునప్పుడు, వైశాల్యమయిన యీభూమండలములనుగూర్చిన జ్ఞాపకముదప్ప మఱేదియు మన హృదయములకుఁ బొడకట్టుటలేదు

శరీరమును మనస్సును మనసు నమరియుండునట్టి స్వభావధర్మము ననుసరించి, ఏవిధము చేతనో యఖండస్థితియొక్క భావన మనమనస్సునఁ గలుగునిమిత్తము, నీలవర్ణమైన యాకసమును గాని, విరివియైన సముద్రమునుగాని దలంచుకొనవలసి యున్నది పరిశుద్ధమనుటనుగుఱించి, కొందఱు ప్రార్థనాలయము, మసీదు, చిలువ అనువానితోడఁ జేర్చి తలంపవలసి యుండుట సహజమగుచున్నది. అట్లే హిందువులును, తమలో పారి

శుద్ధ్యము, నైర్మల్యము, సత్యము, సర్వవ్యాపకత్వము లోనగు నుద్దేశములు, పలువిధములగు విగ్రహములవలనను, రూపవిశేషములవలనను భావనసుఁ దెచ్చుకొనుచున్నారు అయినను, వారికిని తదితరులకును గల తారతమ్యమేమనఁగా.—ఇతర మతస్థులు, తమకభిమతములగు నాలయములు లోనగువాని యందే తమజీవితకాలమంతయుఁ గడపెదరేగాని యంతకు మీఁదుగా నభివృద్ధిచెందుట యొంతమాత్రము లేదు ఏలనఁగా, వారికి మతమనునది కొన్ని యుద్దేశములు సత్యములని నమ్మఁజేయుటకును బరోపకారము చేయుటకునేగాని మఱియొండు గాదు అయినను, హిందూమతము సంపూర్ణముగా బ్రహ్మసాక్షాత్కారమునే కోరి నిలుచుచున్నది. మానవుఁడు ప్రత్యక్షముగ బ్రహ్మానందము ననుభవించిననేగాని బ్రహ్మస్వరూపిగాఁ బ్రకాశింపలేఁడు కాఁబట్టి, దేవతావిగ్రహంబులును, ఆలయములును, వేదశాస్త్రంబులును మానవులకు జ్ఞానారంభకాలమున మాఁతకోలలుగా నమరి తోడ్పడునట్టి సాధనమాత్రములే యగును అయినను హిందూమతస్థుఁ డుద్దేశించు నుత్తమస్థానములవి గావు హిందూమతాభిప్రాయానుసారము, ఒక్కఁడొక్కఁడును గ్రమక్రమముగా నున్నతినిగోరి పోవలసినవాఁడేయగును

"ఎక్కడను నిలుకడ లేక యుండుట."

వాఁడెక్కడను నిలుకడగా నిలచియుండ రాదు బాహ్యపూజయు విగ్రహారాధనయును నుత్తమస్థితినిఁబొందఁ బ్రయత్నించువానికిఁ గ్రిందిమెట్టనియును, ఆంతరంగికపూజ వానికిఁ

జేరిన పై మెట్టనియును, ఈశ్వరసాక్షాత్కారము సర్వోత్తమ మయిన మెట్టనియు వేదములు ఘోషించెడిని.

శ్లో॥ ఉత్తమో బ్రహ్మసద్భావో ధ్యానభావస్తు మధ్యమః,
స్తుతిర్జపోఽధమో భావో బహిఃపూజాఽధమాధమా

మహానిర్వాణతంత్రము - చతుర్థోల్లాసము.

మఱియొకవిశేషమును జూడుఁడు త్రికరణశుద్ధిగాఁ దేవతావిగ్రహముపైఁ బ్రేమ సాష్టాంగ మెఱఁగునట్టివాఁడే భక్తుఁడు. "వానిని, సూర్యుఁడు ప్రకాశింపఁజేయఁలేఁడు, చంద్రుఁడు ప్రకాశింపఁజేయలేఁడు, నక్షత్రములు ప్రకాశింపఁజేయలేవు, మెఱుపులు ప్రకాశింపఁజేయలేవు; అగ్ని ప్రకాశింపఁజేయఁజాలఁడు, వానివలననే సూర్యాదులు ప్రకాశించెదరు"

శ్లో॥ న తత్ర సూర్యో భాతి, న చంద్రతారకమ్
నేమా విద్యుతో భాంతి, కుతోఽయమగ్నిః?
తమేవ భాన్తమ్ అనుభాతి సర్వమ్
తస్య భాసా సర్వమిదమ్ విభాతి.—(కఠోపనిషత్తు)

అని స్తుతించుటలను మనము గాంచునప్పుడు, వాఁడా విగ్రహమును దూషించుచున్నాఁడనికాని యాపూజను పాపకర్మగా భావించుచున్నాఁడనిగాని తలపోయుట యుక్తమగునా? తనజీవితమునందలి యొకవయఃక్రమమున నవశ్యముగాఁ గావలసియున్న యొకమెట్టుగానే వాఁడు దలపోయుచున్నాఁడు. ఒకఁడు, మొదట బాలుఁడుగానుండియేకదా రానురాను క్రమక్రమముగాఁ బెరిగి పెద్దవాఁడగుచున్నాఁడు. అట్లుండఁగా

నొకవృద్ధుఁడు శైశవదశను గాని బాల్యదశను గాని పాపాకరములుగఁ దలఁపోయుట న్యాయమగునా? ఇంతకును విగ్రహారాధనమే యవశ్య కర్తవ్యముగ హిందూమతము నిర్బంధించుటయును లేదు

ఒకఁడు విగ్రహారాధనమును దోడుచేసికొని మిక్కిలి సులభముగాఁ దన దేవత్వమును ననుభవింపఁజాలినచో, దానిని పాపకార్యమని నిరాకరించుటయు క్షమగునా? హిందూమతము ప్రకారము ప్రతిమానవుఁడును పలువిధముల మెట్లను దాటి పరగతిని బొందును అనుటకభిప్రాయము—వాఁడు తప్పుత్రోవల నుండి తొలఁగి సత్యమార్గము ననుసరించుచున్నాఁడనుట గాదు; సత్యమునుండియే సత్యము నాశ్రయించుచున్నాఁడు. అనఁగా సత్యముయొక్క దిగువనుండి పైస్థానమును జేరుచున్నాఁడనుటయే

అన్నింటియందును గల్గియున్న జడపదార్థముల పూజ మొదలు, సర్వోత్కృష్ట వేదాన్తప్రతిపాదితమయిన యఖండ తోపాసనాశక్తిగల సద్వృత్తులును, అనాదియు ననంతమునునైన నిత్యవస్తువును బొందుటకును, దని సాక్షాత్కారము ననుభవించుటకును ప్రతిజీవాత్మయు, తనజన్మము సహవాసము లోనగువానికిఁ దగినట్లుగాఁ జేయుచున్నట్టి పలువిధముల ప్రయత్నములే యని హిందువులు విశ్వసించుచున్నారు కాఁబట్టియే యీమతము ననుసరించు జీవాత్మయొక్క జ్ఞానాభివృద్ధికొఱకు నొక మెట్టుగానే యేర్పడుచున్న ప్రతిజీవాత్మను జ్యోతిస్స్వరూపమయి ప్రకాశించు సూర్యుని బోలి యాకాశ

మార్గమున నెగిరి, క్రమక్రమముగా నెక్కువబలమును వహించి, యారవిబింబమును జేర నుద్యమించు నట్టి బాలగరుత్మంతుఁ డనవచ్చును

## "మతసమయములును వానిచిహ్నములును"

వివిధంబులుగఁ బ్రత్యేకించి కానవచ్చు వస్తువుల కాధారమయియుండు ప్రకృతియొక్క యైక్యమయిన సత్యమే లోకస్వభావముయొక్క రీతియగును దీనిని జక్కఁగా హిందువులు గనుఁగొని యున్నారు. ఇతరమతములు ప్రకృష్టములయిన కొన్ని విధుల నేర్పఱచి, వానినే యందఱు గ్రహింపవలయునని నిర్బంధించుచున్నవి. అవి యొకయంగీని జేతఁబట్టుకొని చూపి, దేవవ్రతుఁడు, యజ్ఞదత్తుఁడు, ఇంద్రసేనుఁడులోనగు వారికందఱికిని అది తగియుండవలయునని చెప్పుచున్నవి. అవి కోరినట్లే యాయంగి యందఱికిని దగియుండవలసియున్నచో వారు పుట్టినప్పుడున్న తీరుననే యుండవలయును అఖండవస్తువును బ్రత్యక్షముగా ననుభవించుటకుగాని, తలఁపోయుటకుఁగాని, చెప్పుటకుఁగాని మనమనస్సునకు విషయముగాఁ గలిగిన ఖండవస్తువుయొక్క సాయము లేకయే సాధ్యముగాదని హిందువులు దెలిసికొని యున్నారు. విగ్రహములను, చిలువయును, చంద్రకలయు నధ్యాత్మభావనలు మనకుఁ జక్కఁగాఁ గుదురుటకునై, తగిలించియుండు సాధనరూపములయిన చెలలవంటి వగును ఇష్ట సాధనములతో నందఱును నావశ్యకము లేకపోయినప్పటికిని, లోకమునందుఁ జెక్కుజనులకుఁ గావలసియుండుటచే, తమకావశ్యకము లేదను కారణమున, వానిననుసరించువారిని జూచి తప్పు

మార్గములఁ బ్రవర్తిల్లుచున్నారని దూషించుట యొంత మాత్రము న్యాయము గాదు.

నేను మీకుఁ జెప్పవలసిన సంగతియొకటి గలదు ఇండియాలో నున్న విగ్రహారాధనము, ఎట్టిఘోర కృత్యమును గాదు; అపరిపక్వదశయందుండు జనులను సర్వోత్కృష్టమయిన యాత్మజ్ఞానతత్త్వము ననుసరించుటకుఁ జేయునట్టి ప్రయత్నమనియే తలపోయవలయును హిందువులయందుఁ బొరపాటు లుండినప్పటికిని, వా రెప్పుడును దమ శరీరముల దండించి కృశింపఁ జేసికొందురే గాని యితరుల కంఠనాళములఁ గత్తిరించుట కెన్నఁటికిని గడఁగువారు గారు హిందువులలోని మతావేశపరవశులు, తామే యగ్నిని బ్రవేశించి శరీరయాత్రకు ముగింపుఁ గలిగించుకొందురుగాని, దమమతమునఁ బ్రవేశింపని యన్యులను దహించుట కగ్ని దరికొల్పరు అగ్నిప్రవేశము చేసి యాత్మహత్య కొడిగట్టుట యనునది మతముయొక్క నేరము గాఁజాలదు. పూర్వకాలమున క్రైస్తవ సనుయజ్ఞులు, శూన్యగాంద్రను అగ్నికుండమునఁ ద్రోసి కాల్చివేసినది క్రైస్తవ మతముయొక్క దోషమని చెప్పుట కెవరు సాహసింతురు?

కాఁబట్టి, లోకమునందలి యన్నిమతములును, నానావిధరుచులతోడి స్త్రీ పురుషులను నిరుతెగలవారును దమతమ పరిపాకభేదమునకును కర్మవిశేషమునకును దగినట్లు పయనమయి, యొకపరిణామమునే యుద్దేశించి పైపైకి మేలొందుటకుఁ జేయునట్టి యుపాయము లనుటయే హిందువుల యభిప్రాయము. ఒక్కొక్కమతము, అవిద్యాబంధమునకు లోఁ

లోఁబడియుండునట్టి యీమానవ శరీరమునుండి యీశ్వర స్వరూపముయొక్క సత్యమును దెలియఁజేయునది యగును. ఆ యీశ్వరుఁడే యందఱకును జ్ఞానమను గ్రహించి తనదివ్యాను గ్రహముచేత మతములనన్నిటిని బ్రకాశింపఁజేయుచున్నాఁడు అట్లయినచో మతములలో నిన్ని వ్యత్యాసము లుండుట కేమి కారణము? అనిన, అవి పైకిఁ జూచుటకు మాత్రమే భేద మగపడునని హిందువులు చెప్పెదరు ఒక్కవిధమయిన సత్యమే, స్వభావభేదము గల వెవ్వేఱు మానవులయొక్క నానావిధ పరిపక్వ స్థితులకుఁ దగినట్లు అమరి వెలయుచుండుటం బట్టి యీభేదములు పొడకట్టుచున్నవి.

"మతములన్నిటియందు నీశ్వరుఁడు ప్రకాశించుట."

ఒక్కప్రకాశమే పలువిధముల వన్నెలగుండా పలువిధములుగాఁ గానవచ్చెడిని నానావిధ మానవస్వభావములకును నమరవలసి వచ్చుటచేత నీస్వల్ప భేదములు నత్యావశ్యకములగుచున్నవి. అయినను, ఈయన్నిఁటియందును బ్రకాశించునది యొక సత్యమేయగును సర్వేశ్వరుఁడు శ్రీకృష్ణస్వామియై యవతరించినప్పుడు మౌక్తిక మణిమాలయందలి సూత్రమువలె నేనన్ని మతములయందు మున్నాను మానవకోటి నున్నతపదవికిఁ దెచ్చి యుజ్జీవింపఁజేయుటకుఁ బరిశుద్ధతయును, అత్యంతశక్తియు నెచ్చట గానవచ్చునో యచ్చట నే నున్నానని యెఱుఁగుము.

"మయి సర్వమిదం ప్రోతమ్ సూత్రే మణిగణా ఇవ
యద్యద్విభూతిమత్సత్త్వమ్ శ్రీమదూర్జితమేవ వా
తత్తదేవావ గచ్ఛ త్వమ్ మమ తేజోఽంశసంభవమ్"

అని హిందువులకునై యనుగ్రహించియున్నారు అట్టి యుత్కృష్టోపదేశమునకుఁ బ్రయోజనమేమి? హిందువులకు మాత్రమే ముక్తిగలదు తక్కినవారికి లేదు, అని సంస్కృత జ్ఞానశాస్త్రములలో నెచ్చటనైన నున్నదని నిరూపింప సాహసించి యెవరైనను ముందునకు రాఁగలరో? శ్రీవ్యాసులు రచించిన వేదాంతసూత్రములలో 'అన్తరా చాపి తద్దృష్టేః' అని దెలిపియున్నారు అనఁగా 'మనజాతిమతముల కావల నున్న వారిలో సైతము పరిశుద్ధాత్మలను గాంచుచున్నాము' అని దెలిపియున్నారు అట్లయినచో, తమయిచ్ఛ నంతటని భగవద్విషయముననే వినియోగించు హిందువులు ఈశ్వరుని యెడల సందేహభావము వహించిన యజ్ఞేయ (Agnostic) వాదమగు బౌద్ధమతమును, నిరీశ్వరవాదమగు జైనమతమును ఎట్లు నమ్ముచున్నారని మీరు నన్నుఁ బ్రశ్నింపవచ్చును

మానవస్వరూపమునుండి దేవత్వము వెల్లడియై వెలయవలసిన విశేషమునే, సర్వమతములు ననుసరింపవలసిన ముఖ్యతత్త్వమగుటచే ఆవిషయముసందే బౌద్ధులును జైనులును దమశక్తినంతటని వినియోగించుచున్నారు. వారు జగజ్జనకుఁడైన యీశ్వరునిఁ గానక పోయినను, ఆతని పుత్త్రస్వరూపియైన బుద్ధదేవుఁడు తీర్థంకరులను బుణ్యపూరుషులను గాంచియున్నవాఁడు. కావుననే * ఇట్లు పుత్త్రునిఁ గాంచినవారు పితను కూడ గాంచినవారే యగుదురు.

* వివేకానందస్వామి క్రైస్తవులు నిండియున్న మహాసభకెదుట ప్రసంగించువారు గావున, వారి యవతారపూరుషుఁడయిన క్రీస్తుదేవుఁడు పలికియున్న వాక్యక్రమమునే యనుసరించి యుపదేశించువారైరి. క్రీస్తు

సోదరులార! ఇదియే హిందూమతముయొక్క సారసంగ్రహము హిందువులు దమయుద్దేశముల నన్నిటిని నిర్వహించుటయందుఁ బొరపాటు పడియుండవచ్చును అయినను, ఎప్పటికైన నొకప్పుడు సర్వజనసమ్మతమగు మతమొండు గలుగఁబోవునది యయ్యెనేని యది యొక దేశమునకని గాని యొక తెగజనమునకనిగాని, యొక కాలమునకనిగాని నిర్దేశింపఁబడునది గాదు అది, ఆశ్రయింపఁబోవు నీశ్వరునివలెనే తానును మేరలేనిదిగానే యొప్పఁగవలయును దాని జ్ఞానభాస్కరుఁడు, శ్రీకృష్ణస్వామిమీఁదను, క్రీస్తుదేవునిమీఁదను, పాతకులమీఁదను, దుల్యముగాఁ బ్రకాశింపవలయును మఱియు నది కేవలము బ్రాహ్మణులకుఁగాని, కేవలము బౌద్ధులకుఁగాని, కేవలము క్రైస్తవులకుఁగాని కేవలము మహమ్మదీయులకుఁగాని ప్రత్యేకముగా ననుభవింపఁ దగిన మతముగా నుండక యామతములన్నిటియొక్క సారాంశముల మొత్తమును దనయం దవహించి పొలుపారునది గావలయును ఇంతేగాక

---

దేవుఁ డీశ్వరపుత్రుఁడనుట క్రైస్తవుల సిద్ధాంతము. అతఁడు, (I and my father are one) నేనును నాజనకుఁడును నేకస్వరూపులము.

(He that hath seen the son hath seen the father) 'పుత్రుఁడనైన నన్నుఁ గాంచినవారు, పిత్రయిన నాజనకునినైతము గాంచిన వారే,' అనియును నుపదేశించెను. దాని నిచ్చట బోల్చిచూడఁగాఁ బుత్రస్థానము నందుండు బుద్ధదేవుని దీర్థంకరులను ననుసరించు బౌద్ధజనులును జగజ్జనకుఁడగు సర్వేశ్వరుని ననుసరించు వారలేయని క్రీస్తుదేవుని మహావాక్యముల చేతనే సిద్ధించుచున్న దనుట శ్రీవివేకానందస్వాముల యభిప్రాయము

పలుమార్గముల నభివృద్ధిఁ జెంది యున్న తివహించుటకు నైన విరివియగు సుపకత్తుల నను గ్రహించునదిగా వెలయవలయును. అది తన సర్వసమతచేత పలు దెసలను దనకేలుసాచి లోకము నందలి యందఱను బ్రీతి మెయి కౌఁగిలించుకొను పటిమను వహించియుండవలయును (మృగప్రాయులై ప్రపంచమున శరీర యాత్రసలుపు మూఢుల నాదిచేసి, జ్ఞానవిశేషమున లోక ప్రఖ్యాతమహానీయులయి ప్రకాశించు పుణ్యపూరుషుల వఱకును గల జనుల కందఱ కది శరణ్యమయి స్థలమొసఁగ వలయును.

'సర్వసమ్మతసమయము'

అట్లున్న నేగాని యది యన్యమతము వారిని బీడింపనిది గాను, వారియెడలఁ జూపోఁ మి వహింపనిదిగాను వెలయునట్టి యుత్కృష్టమత మగును అందఱయందును దైవాంశము గలదని దెలిసికొనును దానికిఁ గల శక్తియంతయు మాన వులకుఁ దమ సత్యమయిన దేవత్వమును ననుభవించుటకు వలయు మహోపకృతిని జేయుటకుఁ బ్రయోజనపడును

అట్టి మతమును అనుగ్రహించితిరేని దాని నంద ఱనుభవింపఁ గలరు తొల్లి యశోకచక్రవర్తి చేర్చిన పరిషత్తు నందు బౌద్ధులు మాత్రమే నిండియుండిరి. దానికిఁ బెక్కు శతాబ్దములకుఁ బిదప అక్బరు చక్రవర్తి చేర్చిన మతసభయందు పలుమతములవాం డ్రుండియు గొప్పప్రయోజనము గలిగినట్లు గానరాదు. మతములన్నియు సర్వేశ్వరుఁడు గలఁడనుటను గూర్చి యుద్ఘోషించుచున్నవి యను సత్యమును లోకు

లకు వెల్లడి పఱచునట్టి యధికారము అమెరికాకు మాత్రమే యొసఁగఁబడెను గాఁబోలు

"ఆశీస్సు."

హిందువులు 'బ్రహ్మ' మనియును, పారసీకులు 'అహూరమజ్దా' యనియును, బౌద్ధులు 'బుద్ధుఁ' డనియును, యూధులు 'ఎహోవా' యనియును క్రైస్తవులు 'పరలోకపిత' యనియు నేపురుషోత్తముని సంభావింతురో యాజగజ్జనకుఁడు, మీయుత్కృష్టాభీష్టములు గొనసాగుటకైన మహాశక్తి మీ కనుగ్రహించునుగాక! నామరస్యమును నక్షత్రము, మొట్టమొదటఁ బ్రాచీదిశయం దుదయించి యపరదిక్కును గూర్చి చూటిగాఁ బయనమయి కొన్ని వేళల మసకగాను గొన్ని వేళలఁ దేజోవంతమయి కాంతిపూరముల వెద చల్లునదిగాను బ్రపంచ ప్రదక్షిణము చేయుచు మరలఁ బూర్వదిశాగ్రభాగమ్మునఁ దొంటికంటెఁ బెక్కుమడంగు లెక్కువ కాంతిమంత మయి దోఁచి యున్నది

స్వాతంత్ర్యమునకు జన్మగృహంబగు నో * కొలంబియా! నీవు చిరకాలము సుఖోన్నతి వహింతువు గాక! నీ వెన్నఁటికి నితరుల రక్తపంకమున నీచేతులు దడిపికొన్నదానవు గావు నీ వెప్పటికి నైశ్వర్యమును గోరి యితరుల సొమ్ము నపహరించినదానవు గావు కాఁబట్టి, శాంతి యనుధ్వజమును గేలగీలించి యగ్రేసరవై నాగరకజనులకు ముందుండు నధికారమునకుఁ బాత్రవైతివి

* కొలంబసువలన కనిపెట్టఁబడిన కారణంబున 'అమెరికా'కు 'కొలంబియా' యను పేరు గలిగి యున్నది.

సెప్టెంబరు నెల 20 వ-తేది. పదియవదినమున చేసిన ప్రసంగము.

## "బీదలగు నజ్ఞానులు"

ఇతర మతస్థులు క్రైస్తవమతమును న్యాయపూర్వకముగ సవరించి పరిశోధింపవచ్చు నదనున, క్రైస్తవులగువారు, దాని కామోదించుట కొప్పటకిని స్వతస్సిద్ధులుగ నుండవలయును కాంబట్టియే యీ మతవిషయమయి యించుక నేరము దెలుపం బ్రయత్నించితినేని, దానివలన మీకుం జిత్తవికార మొనగూడం గలుగునని నేను దలంపలేదు. ఓ క్రైస్తవులార! మీరు, అజ్ఞానులని చెప్పంబడు మా మతమువారి యాత్మల రక్షించు నిమిత్తము ప్రీతితో ఫాదరులను బంపుచున్నారే! ఆంకలిచే మలమల మాడు ప్రాణుల నభిరక్షించు నిమిత్త మేప్రయత్నమును జేయకుండుట కేమి కారణము? ఇండియాదేశమునందు భయావహమయిన కాటకకాలములయందు పెక్కువేల జనులు పొట్టకూటికి మార్గములేక కాలగతి నొందరే! వాండ్రను బరిపోషింపం గ్రైస్తవులగు మీర లేమి చేసితిరి! ఏమియును లేదుగదా? ఇండియాలో మీరన్నిచోటులందును గ్రైస్తవాలయములం గట్టుచున్నారు అయినను దూర్పుదెసవారిని శ్రమపఱచునట్టి కష్టము మతలోపము గాంజాలదు; వారికి మతము యథేష్టముగా నున్నది త్రాంగుటకు గంజిలేక పోవుటయే వారనుభవించు కష్టము. తూర్పుదెసయందు భూమ్యాకాశములు రెండును ధగద్ధగాయమానంబుగ మండుచుండ నోటం దడిలేక నాలుక యెండ నాంకలిచేం బొట్ట ముడుతలువడుచుండ, గంజియో! గంజియో యని పరితపించుచున్న ప్రాణులు పెక్కులు లేరే! వారు గంజిని

ఘోరంగా మనము కల్లుబోయవచ్చునా? పొట్ట కన్నములేక పరితపించువారి యెదుట మతప్రసంగము చేయుట వారి నవమానించుట యగును గదా! హిందూదేశమునందు ధనముకొఱకు జ్ఞానోపదేశము చేయువాని నందఱును జాతిభ్రష్టునిఁ జేసి వాని మోముపై నుమియుదురు మాదేశపు బీదజనులకుఁ దోడుపడునిమిత్తము మార్గము వెదకువాఁడనై నేనిచటికి విచ్చేసితిని వచ్చుటచేత, క్రైస్తవ రాజ్యమునందు క్రైస్తవుల వలన 'అజ్ఞానులకు' సహాయసంపద సంభవించుట యెంత దుర్ఘటమో తెలియఁ గలిగితిని.

పండ్రెండవదినము - సెప్టెంబరునెల 22వ- తేది.

సర్వమతసభ ననుసరించిన శాస్త్ర పరిశోధనాంశమున వివేకానందస్వాములు, వైదిక హిందూమతమును గూర్చి ప్రసంగించిరి 6వ నెంబరు హాలునందు, నువ్వులు చల్లిన రాలని వడువున జనులు నిండియుండిరి కేతలిక్ మతాచార్యులును, ప్రొటస్టాంటు మత గురువులును, థియసాఫికల్ సంఘము వారును, యుక్తివాదమునఁ బ్రవీణులును లోనగు పలుమతముల నవలంబించిన స్త్రీలును బురుషులును నత్యుత్కర్షతో వారి ప్రసంగమును విని, మతవైషయిక ప్రశ్నలను బెక్కింటిని వారి నడిగిరి వా రట్టిప్రశ్నలనుఁ జమత్కార బంధురముగాను విపులముగాను సుబోధకముగను సమ్మతులు వలికిరి వారి యుత్తరముల కందలి జనుల హృదయములు హర్షసముద్రనిమగ్నములయినవి ఆ దినము వారు వాండ్రహృదయమున వారు వెలిఁగించిన హిందూమత దీపకళిక ప్రకాశవంత

ముగ వెలుఁగ నారంభింపఁగానే, వారంద ఱాతనియొద్దకు వచ్చి మఱియొక స్థలమునందు హిందూమతమును గూర్చివిశదముగాఁ బ్రసంగింపవలయునని ప్రార్థించిరి శ్రీవివేకానందస్వామి వారి వేఁడుకోలునకు సమ్మతించిరి

(పదునారవదినము; సెప్టంబరునెల 26 వ తేది)

### హిందూబౌద్ధములకుఁ గల సంబంధము

సభాధిపతీ! సహోదరులారా! నన్నుఁ బ్రీతిమెయి నుపచరించి పోషించు ప్రభువులారా! నేను బౌద్ధుఁడనుగాననుటను గూర్చి మీకుఁ దెలిసియున్నది అయినను, నేనొక్కవగను బౌద్ధుఁడనే యగుచున్నాను చీనాసామ్రాజ్యము,జపాను దేశము, లంకాద్వీపము నాలోకగురువైన బుద్ధదేవునియొక్క యుపదేశముల ననుసరించి వెలయుచుండఁగా హిందూదేశమాతని నీశ్వరావతారముగ భావించి పూజించెడిని నేను బౌద్ధమతమును బరిశోధింపఁ బోయెదనని మీరలింతకుఁ గొంతముందే వినియుండువారు నే నామతమునందలి పొరపాటుల నెత్తి నేరములను స్థాపింపఁ బోయెదనని సందేహింపకుఁడు ఏమహానుభావుని నీశ్వరావతారముగఁ దలఁచి యనుక్షణము భక్తిసేయుచుందునో యట్టి బుద్ధదేవునియందు దోషారోపణము చేయు నపచారము నాకు వలదు అయినను, బౌద్ధమతమును గూర్చిన మాయభిప్రాయ మేమనిన, బుద్ధదేవునియభిమతమును వారి శిష్యులు చక్కఁగాఁ గనుఁగొనలేదనుటయే. వైదికమతమునకును బౌద్ధమతమునకును నీకాలమునందుఁగలసంబధ మెట్టులున్నదనఁగాఁ క్రైస్తవమతమునకును బౌద్ధమతమునకును

గలసంబంధమును దాదాపుగా బోలుచున్నది ఏసు క్రీస్తు యూధులను జేరినవారు శాక్యముని హిందువులను జేరినవారు. అయినను వారిలోని పరస్పరభేద మేమనఁగా—యూధులు క్రీస్తుమతము నొప్పుకొనక యాతనిఁ జిలువమ్రాఁకునఁ గొట్టిరి. హిందువులు శాక్యముని నీశ్వరపీఠము నలంకరింపఁజేసి యారాధించుచున్నారు అయినను దాత్కాలిక హిందూమతమునకు, బుద్ధదేవుఁ డుపదేశించినట్లు హిందువులమయిన మేము అభిప్రాయపడునట్టి యుపదేశములకును గల యథార్థమైన వ్యత్యాసమును గూర్చి హిందువులు చెప్పఁ బ్రయత్నించునది యేమనిన—శాక్యముని దేనినిగాని క్రొత్తగా నుపదేశించుటకు రాలేదు; క్రీస్తుదేవునివలెనే యున్నదానిని బరిపూర్తి చేయ వచ్చిరిగాని నాశముచేయుటకు విచ్చేసినవారుగారు యూధులు ప్రాఁతనిబంధనము (Old Testament) అను గ్రంథము చొప్పుననే, క్రొత్తనిబంధనమును (New Testament) వాసిగాంచు క్రైస్తవమతశాస్త్రమును గౌరవింపవలయునని యును, క్రైస్తవులు దమక్రొత్తనిబంధనము చొప్పుననే ప్రాతనిబంధనమునునైతము సంభావింపవలయు ననియును, క్రీస్తుదేవుఁడు బోధించెను క్రొత్తనిబంధనము, ప్రాఁత నిబంధనము యొక్క పరిపూర్తియని యూధులెట్లు కనుఁగొనలేక పోయిరో యట్లు బౌద్ధులును హిందూమత సిద్ధాంతముల యొక్క పరిపూర్తిని దెలియలేరైరి కాఁబట్టి, శాక్యముని పరిపూర్తిచేయవచ్చిరేగాని నాశముచేయ రారని మరల నుద్ఘోషించిఁ లిఖితను. వారొకరే, హిందూమతసిద్ధాంతములను దమ జీవితకాలమునందుఁ బరిపూర్ణముగాఁ బ్రకాశపఱచినవారు

హిందూమతము నీతిమార్గము, జ్ఞానమార్గము, అని ద్వివిధముగలది జ్ఞానమార్గమునే ముఖ్యముగా ననుసరించు వారు సన్న్యాసు లగుదురు.

ఆ జ్ఞానమార్గమునందు జాతిభేదము లేదు. హిందూదేశమునం దున్నతకులసంజాతుఁడును జ్ఞాని కావచ్చును హీన వంశమువాఁడును మోక్షకామి కావచ్చును సన్న్యాసము నందు రెండుజాతు లొకటియగుచున్నది. వేదాంతమున జాతి వ్యత్యాసము గోచరింపదు జాతులనుట జనస్తోమను నందలి కట్టుదిట్టములు శాక్యమునియు, సన్న్యాసియయి, వేదముల యందుఁ బ్రచ్ఛన్నముగ నుండిన రహస్యమును లోకవాసి జనులకందఱకును భేదజ్ఞాన మించుకంతయు లేక బాహాటముగాఁ దెలియపఱచి, తన్మూలమున వారియెడలఁ దాను వహించి యుండిన యప్రతిమాన కారుణ్యమును వెల్లడి చేసెను అదియే శ్లాఘాపాత్రమైన యాతని యుత్కృష్టతను వేనోళ్ల నుగ్గడించు చున్నది. బోధకాచార్యులనుకొని యెల్లరకును మత ధర్మములను బోధించు ప్రశంసనీయాచారమును బ్రప్రథమమున నలవాటునకుఁ దెచ్చినవారు వారే! ఇంతే కాదు; ఇతర మతస్థులను దనమతము నాశ్రయింపఁ జేయుటకు మార్గప్రదర్శకులుగా నిలిచినవారును వారే

బీదల విషయమునందును,అజ్ఞానపంకమున బ్రుంగియున్న వారియందును వారికి నుండినశ్లాఘాపాత్రమయిన యనుకంపమే వారియత్యుత్తమ మహిమకుఁ గారణము వారిశిష్య లోకమున బ్రాహ్మణులుగూడ కొందఱుండిరి బుద్ధదేవుఁడు

బోధింపఁదొడఁగినకాలముననే హిందూదేశమునందు సంస్కృతభాషకుఁ బ్రాభవము తగ్గుచువచ్చెను రానురాను సంస్కృతము పుస్తకావశిష్టముగా వెలయఁదొడఁగెను బుద్ధదేవుని బ్రాహ్మణశిష్యులు గొందఱు, అతని యుపదేశంబులను సంస్కృతభాషను రచియింప మొదలుపెట్టిరి. ఆసంగతి తెలియఁగానే బుద్ధదేవుఁడు వాండ్రను జూచి, "నేను బీదలకనియే యవతరించినాఁడను; పామరులగు సాధారణ జనుల కొఱకే వచ్చియున్నాఁడను; కాఁబట్టి జనవ్యావహారిక భాషయందే మాటలాడుట నాయభిమతము" అనెను కావున చాలభాగము వారియుపదేశములు, ఆకాలమున హిందూదేశమునం దలవాటులోనుండిన * పాలీభాషయందే వ్రాయఁబడియున్నది

"శాస్త్రవిచారమును వేదాంతమును, ఎంతయున్నతిని పంచి యుండినప్పటికిని, మరణ మనునది యీలోకమునం దుండునంతవఱకు, దౌర్బల్య మనునది హృదయమునందుండునంతవఱకును, ఆదౌర్బల్య విశేషము చేతనే మానవుఁడు మనస్సుకరఁగి దేవునిఁగూర్చి మొఱయిడునంతవఱకును దైవనిశ్చయమనునది యుండియే తీరును

ఒకవిధముగాఁ బర్యాలోచించితిమేని; బుద్ధదేవుని శిష్యులు, తత్త్వజ్ఞాన వైషయికముగా, వేదమునెడు దుర్భేద్య

* పాలీభాష సంస్కృతి వికారములైన ప్రాకృతభాషలలో నొకటి. సంస్కృత నాటకములయం దుపయోగింపఁబడియున్న మాగధీయను ప్రాకృతమునకును పాలీభాషకును హెచ్చుభేదము గానరాదు సంస్కృతమునందలి—ధర్మము, సూత్రము ఇత్యాది పదములు క్రమముగాఁ బాలీభాషయందు దమ్మము సుత్తము అను నుచ్చారణలను గలిగియుండును.

మగు వాఙ్మయము పైఁబడి యెంతమోఁది కొనినప్పటికిని, పెనఁగులాడినప్పటికిని గదలింప శక్యముగాకపోయెను వతి యొకవగను బర్యాలోచింపఁగా, ఒకరొకరును దమప్రాణాభ్యధికునిఁగాఁ బాటించునట్టి పరమపురుషుని బౌద్ధులు జనుల హృదయములనుండి యపహరించిరి వాండ్రు, అట్లు చేయుట కుపక్రమింపఁగానే బౌద్ధమతము హిందూదేశమున నిర్మూలమగుటకు హేతువుగలిగెను. కావుననే దానికి జన్మప్రదేశమగు హిందూదేశమునందుఁ దమ్ము బౌద్ధులని చెప్పికొనఁ జాలు స్త్రీలుగాని పురుషులుగాని యొకరైనను నేఁటికిఁ గానరారు

ఇంకొక తీరునఁ బర్యాలోచించితిమేని, బ్రాహ్మణమతమునైతము గొన్ని కొన్ని యంశములయందు నష్టమొందఁ జొచ్చెను దిద్దుపాటునకుఁ దేవలయునను బౌద్ధమతపు వైరాగ్యమును, సర్వప్రాణులయందును గనఁబఱచు నాశ్చర్యకరమగు ననుకంపయు ధర్మగుణమును బ్రాహ్మణమతమున కొక భంగిసష్టము గలిగింపఁ జొచ్చినవి యనవచ్చును బౌద్ధమతము తనయుత్కృష్ట చర్యచే హిందూదేశమువారి నెంతయున్నత పదవికిఁ దెచ్చిన దనఁగా, ఆకాలమున నిండియా చరిత్రమును వ్రాసిన గ్రీకువిద్వాంసుఁ డొకఁడు—"హిందువులలో నెవ్వఁడు నసత్యము పలుకుట లేదు;" అనియు, "హైందవస్త్రీ, యెవ్వతెయు పాతివ్రత్యము తప్పుటలేదు" అనియు వ్రాసి యుండు వ్రాఁతవలనఁ దెలిసికొనవచ్చును.

[పిదప, ఆసభనలంకరించియున్న బౌద్ధులను చూచి]

ఓబౌద్ధ సోదరులార! మిమ్మెడఁబాసి మేము తొలఁగి యుండలేము మమ్మెడఁబాసి యుండుటకు మీకును శక్యము

గాదు మన మిరువురం మెడంబొసిలినిగాని, బ్రాహ్మణులశ్లాఘా పాత్రమగు నుత్తను బుద్ధియుం దత్త్వ విమర్శయు లేక మీ రున్నతిని జెందలేరనుటయు, జీవకారుణ్యమున కాలవాల మయిన మీహృదయము లేకయే మేము సుస్థిరతను జెందుటకుం గాదనుటయును బ్రకృతము మనము దెలిసికొంటిమి బౌద్ధులును హిందువులును బరస్పర భేదమొందుటచేతనే హిందూదేశము క్షీణస్థితికి వచ్చెను హిందూదేశమున ౩౧ కోట్ల బీదలు నిండియుండుటకుం గారణమిదియే; కడచిన వేయిసంవ త్సరములుగా నన్యదేశములవారు దండయాత్ర వెడలి హిందూ దేశమునం బ్రవేశింపంగా, వారి కిండియా దేశలక్ష్మి బానిస కావలసివచ్చెను కాంబట్టి, బ్రాహ్మణుని మహాద్భుత బుద్ధియు లోకగురువైన బుద్ధదేవుని కరుణా విశిష్టమయిన యుదార హృదయమును నొకటి చేరంగా మనము కలసి మెలసి ప్రవ ర్తింతము గాక!

"ఉపసంహారము"

లోకమత మహాసభ మిగుల శ్లాఘనీయముగ ముగిసెను. దయామయుఁడగు మాపరలోక జనకుఁడు, ఈకార్యము నెఱవేరు నిమిత్తము పాటు పడిన మహనీయులకుం దోడుపడి, వాండ్రు స్వాతిశయాభిలాష యించుకంతయు లేక పడిన శ్రమకుం దగిన కార్యసిద్ధి యొసంగూడునట్లనుగ్రహించును గాక!

తనయొక్క యుత్కృష్టమైన ప్రేమచేతను, గారుణ్యము చేతను దానిట్టి యుత్తమకర్మను జేసి తీరవలయునని స్వప్నము గాంచి, పిదప దానిని జేసి ముగింపవలయునని తీర్మానించుకొన్న

యుత్తమసచ్ఛీలునకు బుద్ధదేవునకుఁ బెక్కువేల నమస్కారములు ఈసభా నైపథ్యమునుండి వర్ణింపఁబడిన సర్వమతసమ్మత సామరస్యాభిప్రాయామృతవృష్టికిని వందనములు. విద్దెయందును వినికిలియందును బ్రగల్భతను వహించినఘనులు నాయకుఁగాన్పించిన కారుణ్యమునకును, మతముల కన్నిఁటికిని గలిగి యున్న పరస్పర వైషమ్యముల నడఁచి వేయునిమిత్తము పనికివచ్చు నొక్కొక్క సదభిప్రాయమును గార్యసిద్ధికిఁ దెచ్చిన యున్నత క్రియకును బెక్కువందనముల సమర్పించెదను. ఇట్లు సంపూర్ణ స్వరోదయముచే శ్రోత్రేంద్రియములకుఁ దృప్తి కలుగునదనునఁ గొన్ని యపస్వరములును బలుకఁబడి కర్ణకటువు లయినవి. అట్టియపస్వరదోషము దొలఁగించుటచే నిప్పుడు సంతోషప్రదముగఁ దొల్లిటిసుస్వరములవడెను అది కారణముగ నెల్లగహృదయముల నానందరసము నిండి పొంగి పొరలు చుండుటకు వీలుగలిగెను వీనినుద్దేశించియు నేను బెక్కువేల నమస్కారములఁ జెల్లించెదను

మతైక్యమునకు సామాన్యముగ నలసి యున్న యంశములను గూర్చి మిక్కుటముగాఁ బ్రస్తావనలు జరిగెను

"దీనినిగూర్చి నాసొంతమయిన యభిప్రాయమును జెప్పలేను అయినను, ఈమతైక్యము ఈమతములయందంతట నొకమతము మాత్రము జయమొంది తక్కినమతములు నాశమొందుటచేత లభింపఁగలదను నాశయమెవరికేని యుండినచో నట్టివారినిజూచి, 'నాయనా! నీయాశ కొనసాగదు' అందును, క్రైస్తవులు హిందువులుగా మాఱవలయునని నాకాశ గలిగె

నేని నాయీశ్వరుఁడు దాని నాటంకపఱచును గాక! అట్లుగాక బౌద్ధులును హిందువులును క్రైస్తవులుగా మాఱవలయు నని నేను గోరినప్పటికిని దాని నీశ్వరుఁడే యాటంక పఱుప వలయును

"పొలమున బీజములు వెదచల్లియాయెను ఇంక దానికిఁ బ్రణాళికలేర్పఱచి నీరుపాఱించి గాలిసోకనిచ్చి దాని పెంపునకు మార్గము వెదకెదము అంత నావిత్తనములు, మన్నుగాఁగాని, నీరుగాఁగాని, గాలిగాఁ గాని, మాఱుచున్నదా? లేదు. అది యంకురించి స్థావరవృత్తియొక్క విధుల ప్రకారము వర్ధిల్లి, మంటిని, నీటిని, గాలిని తనలోఁ జేర్చికొని, వానిని దనకుఁ గావలసియున్న స్థావరపుసత్తుగా మార్చికొని దానివలన వృక్షము తనరారుచున్నది

అన్విధముననే మతవిషయమును బోలుపారును క్రైస్తవుఁడు, హిందువుగాఁగాని, బౌద్ధుఁడుగఁగాని మాఱవలసిన యావశ్యకము లేదు. ఆతీరుననే హిందువులును బౌద్ధులును క్రైస్తవులుగా మాఱవలసిన యావశ్యకమును లేదు అయినను, ఒక్కొక్కమతము, ఇతరమతముల సారాంశమును స్వీకరించుచును, తనస్వీయస్వరూపమును బరిపోషించుకొనుచును, తనరీతికనుకూలించిన విధులను అనుసరించుచును వృద్ధిఁజెందవలయును

"లోకమతమహాసభ, లోకమునకుఁ దేనినిగాని కనఁబఱచియుండిన పక్షమున నది యిదియే యగును శరీరపారిశుద్ధ్యము, చిత్తశుద్ధి, అనుగ్రహము అనుదివ్యగుణములు

లోకమునందు వెలయు ప్రతిమతమునకును స్వీయములయిన సంపదలుగానున్న వనుటయును, ప్రతిమతమునందును సుగుణ సంపన్నులగు స్త్రీపురుషు లుద్భవిల్లి యున్నారనియును ఈసభ నిరూపించియున్నది. ఇట్టి మహానీయమయిన గొప్ప ప్రమాణ ముండునప్పుడు సైతము, ఎవ్వఁడైనను దనమతమే ప్రత్యేక ముగా జయశీలమయి లోకమున నెలియు మన్నదనియును, ఇతర మతములన్నియు నశించిపోవుననియును స్వప్నము గాంచుచుండి రేని, నేను వాండ్రనిమిత్తము చాల పరితాపపడి, ఎవరెంత యాటంకపెట్టినను విసక ప్రతిమతము ననుసరించిన ధ్వజము నందును "సహాయముగలదు గాని జగడము లేదు" అనియును, "సర్వ మంగీకారసౌభాగ్యమే గాని నిరాకరప్రకార మెందును లేదు" అనియును, "శుభమును శాంతియు నే గాని యెచ్చటను సంతాపము లేదు" అనియును, శీఘ్రమే వ్రాయఁబడునని వారికి నిరూపించి చెప్పఁగలను

సర్వమతమహాసభయందొసంగఁబడిన యుపన్యాసముల నన్నింటిని వదలక యనుదినము ప్రచురించుచువచ్చిన చికాగో వార్తాపత్రికలన్నియు, ఏకకంఠ్యముగ శ్రీవివేకానందస్వాముల యుపన్యాసమే సర్వోత్తమముగా నుండిన దని యుగ్గడించినవి అదిమొదలు స్వాములవారియశ మంతటను వ్యాపించెను "వారు హిందూమతమునుగూర్చి యుపన్యసించినప్పు డాసభా భవనమునందుఁ గ్రిక్కిరియుచు జనులుండిరి. ఎచ్చటఁ జూచి నను స్త్రీలు నిండి మెండుకొని యుండిరి వారు శ్రీవారి యుపన్యాసము వినుటయందుఁ గుతూహలము గలవారయి

నడుమఁ జెప్పఁబడుచు వచ్చిన యితరోపన్యాసముల నోపికతో వినుచుఁ గాచుకొని యుండిరి' అని యచ్చటి పత్రికలు ఘోషించినవి.

శ్రీవివేకానందస్వాములు సనాతన ధర్మమైన హిందూ మతమును ప్రవచనము చేయునదనున దిగువఁ గనఁబఱచిన విధమున నుడివిరి

"నేను, లోకమునకు సర్వమతసామరస్యమును, సర్వ సమ్మత సిద్ధాంతమును నేర్పిన మతమును సంబంధించిన వాఁడ ననుటను గూర్చిన గౌరవమును భావించెదను మేము సర్వ మతములను సమరసభావముతో దర్శించుటగలదు ఇంతేగాక సర్వమతములును సత్యములని నమ్మెదము (సమరసభావము నకు విరుద్ధమయిన) "Exclusion" పదము, ఏభాషయం దుచ్చరించుటకుఁ గాదో, అట్టి పరిశుద్ధమయిన సంస్కృత భాషను స్వభాషగా వహించిన మతము ననుసరించినవాఁడను అని నామతోత్కృష్టతాతిశయమును మీకుఁ దెలియఁ బఱచెదను"

వారు విశదీకరించిన మతియొక్క సిద్ధాంతము బ్రహ్మను భూతియగును వానినిగూర్చి వారు ప్రసంగించినది యీదిగువఁ దెలుపఁబడియున్నది

"హిందూమతస్థుఁడు, వ్యర్థాలాపములను, నిష్ప్రయో జనాచారములను గలిగి యుజ్జీవింపఁదలఁచు వాఁడు గాఁడు. వాఁడు దేవునిఁ బ్రత్యక్షముగ దర్శింపవలయును అట్టి దర్శనమే వాని సందేహముల నన్నిఁటి నిర్మూలింప సమర్థ

మయిన దగును కాఁబట్టి, ఆత్మను గూర్చియు, దేవుని గుఱించియును హిందూఋషులు నిర్వచించు ప్రఖ్యాతమగు సాక్ష్యమేమనఁగా— మేమాత్మను గాంచితిమి, దేవుని దర్శించితిమి, 'వేదాహ మేతమ్ పురుషమ్ మహాన్తమ్' అనుటయే"

" వారొనర్చు ప్రయత్నములన్నియుఁ దామూరూఢులగుటకును, దేవత్వము నొంది యీశ్వరుని జెంది యీశ్వరుని దర్శించుటకునే యగును ఈశ్వరు నిట్లు పొందుటకును దర్శించుటకును ఏల యపేక్షించెదరన, నపవర్గ లక్ష్మీకధిపతియైన యాపరమేశునివలెనే పరిపూర్ణులయి పరిఢవిల్లుటకే ఇదియే హిందువుల మతాభిప్రాయమగును."

మతమువలనఁ బరిపూర్ణతను జెందు నుపాయము ననుసరించు నిత్యకర్మలనే వేదము లుద్ఘోషించుచున్నవనియు, సర్వదేశములయందును, సర్వదిశలయందును, సర్వకాలములయందునుగల సర్వజనులకును దుఃఖనివృత్తియు, నాత్మసుఖప్రాప్తియు నావేదములయం దమర్పఁబడి యున్నదనియును, హిందువులు. ప్రతిమల నారాధించువారు గా రనియును, వారనుష్ఠించు పూజాక్రమంబును విగ్రహారాధన మనుటకుఁ దగి యుండదనియుఁ దగిన సమ్మతులతోడ శ్రీవివేకానందస్వామి యా యమెరికాఖండవాసులకు విశదీకరించి దెలిపిరి. ఏతద్విషయికముగా వారు వాక్రుచ్చిన దేమనఁగా:— హిందువులు శ్రుతిసమ్మతమగు మతమును నవలంబించినవారు వేదమాద్యంత రహితమనుట వారియాశయము ఒకగ్రంథ మాద్యంతరహితముగా నున్నదనుట యీాపథనలంకరించిన

విబుధవరేణ్యులకుఁ బరిహాసాస్పదంబుగ నుండవచ్చును అయి నను వేదమునది యే గ్రంథమును గాని బోలినదిగాదు. పెక్కు లు, భిన్న కాలములయందుఁ గనుఁగొన్న యాత్మజ్ఞాననిధియను టయే దాని యర్థము వస్తువుల యాకర్షణశక్తికిఁ దగిన నిత్య సంబంధవిధి, మానవులచేఁ గనుఁగొనుటకుఁ బూర్వమున నుం డుటతోడ, వారుత్తరోత్తరము నుఱచినను, ఎట్లు తానుండిన స్థితినే పొలుపారుచుండునో యట్లే, ఆత్మజ్ఞానమునకుఁ దగిన విధులు సైతము వెలయుచుండునవియే జీవాత్మలలో నొకటికి నుఱియొకదానితోడను, జీవాత్మలకును వానిజనకుఁడైన పర మాత్మకును గలజ్ఞాన నీతిధర్మసంబంధములు సైతము మనము గని పెట్టుటకుఁ బూర్వమునందు నుండినవి ఇంక మనకు మఱ కువ గలిగిన నుండునవియే యగును.

"ఈవిధులను గనిపెట్టినవాండ్రను ఋషులందుము. వారిని బరిపూర్ణజ్ఞానసిద్ధిని జెందినపెద్దలని యతివేలముగ గౌర వించెదము" అనియును,

"భరతఖండమునందుఁ బెక్కుదైవతములఁ బూజించు నలవాటు లేదని, నేను బ్రారంభమునందే మీకుఁ జెప్పియుండ వచ్చును ప్రతి దేవాలయమునందును అర్చకులును స్వామి దర్శనార్థము విచ్చేయువారును, ఈశ్వరునియొకల విషయభూ తంబులగు సర్వవ్యాపకత్వాది విశిష్ట లక్షణములును సర్వమును నచ్చోనున్న దేవవిగ్రహములయం దారోపించి, ధ్యానిం చుట వారిసామీప్యమున నిలచి వినువారల కంఠఱకును విస్ప ష్టముగాఁ గానదు" అనియును,

"మానవుల మానస మొక మితికి గమ్యంబయిన ఖండ వస్తు వగుటంబట్టి, నీరూపమయిన నిర్గుణవస్తువును భావించుట యామనస్సునకు శక్యముగాదు" అనియును,

'జ్ఞానముచేతనే ప్రాప్తము కాఁదగిన దుఃఖనివృత్తియు నానందప్రాప్తియుఁ దన్నాశ్రయించు పర్యంతము దానికి సాధన భూతమయిన ప్రతీకోపాస్తి నాఁబడు సగుణోపాసనయే యుత్కృష్టమార్గ' మనియు బోధించి, దాని నీ దిగువఁ జెప్పిన చొప్పున విశదీకరించిరి.

"క్రైస్తవుఁ డేల 'చర్చ్' కేఁగవలయును? 'శిలువ' నేల పరిశుద్ధమైనదని భావింపవలయును? ప్రార్థనావసరములఁ జూడ్కిని మింటి వంకకేల నిగుడ్పవలయును? రోమన్ కేతలిక్కుల మఠాలయములయం దన్ని ప్రతిమలు ప్రతిష్ఠింపఁబడుట కేమి కారణము? ప్రోటస్టెంటు క్రైస్తవులు ప్రార్థించు తరుణములయందు వారి హృదయప్రదేశమునం దన్ని మూర్తుల భావనలకుఁ గతమేమి? సోదరులార! మన ముచ్ఛ్వాస నిశ్వాసముల మాని యెట్లు జీవించియుండుటకు వలను పడదో, యట్లే మనము చింతించు వేళలయందును జడవస్తువు రూప భావన లేక దేనిని గూర్చి గాని చింతింప లేము జ్ఞాపకమును దట్టి లేపునట్టిభావన, సంయోగనియమము, అను సమ్మేళన పద్ధతికిఁ దగిలి జడవస్తువుయొక్క రూపవిశేషము, మనోభావము యొక్క జ్ఞాపకమును, మనోభావము, జడవస్తువు రూప విశేషముయొక్క జ్ఞాపకమ్మును గలిగించుచున్నవి. 'సర్వవ్యాపకత్వము' అనునది, సాధారణముగా, లోకమునఁ బెక్కుఱకు నిరర్థకపదముగానే కన్పట్టుచున్నది; దేవునకుఁ బైకప్పు, అను

నదిగలదా? లేదనుచో, సర్వవ్యాపకత్వ మనుపదమును చెప్పుచో విస్తారమగు నీభూమినిగూర్చిన స్మరణదప్ప మఱే దియు మన మదికిఁ బొడకట్టఁజాలదు కదా!'' అనియును,

"వృత్తము ననుసరించిన గుణదోషములు దానిఫలమూల మునఁ దెలిసికొనవచ్చును. విగ్రహారాధకులని లాఘవపఱచి చెప్పనగు వారిలో, సదాచారమునందును, ఆత్మజ్ఞానమునందును, దైవభక్తియందును నుత్కృష్టతనుజెందిన పెద్దలనునేనుదర్శించి యుండునప్పుడు విగ్రహారాధనము పాపకర్మయే యైనచోఁ బాపమునుండి యెట్లు పారిశుద్ధ్య ముప్పతిల్లును? అని యాలో చింపవలసియున్నది'' అనియు నుదారవాగ్వైఖరి దీపింపఁ బ్రసంగించిరి

చికాగోనగరమునందలి సర్వమతసమాసభమ్రోల శ్రీ వివేకానందస్వామి హిందూమతమును గూర్చి ప్రసంగించిన యుపన్యాసము సర్వోత్కృష్ట మయినదనుట యెల్లరకును దెల్లముగఁ దెలిసిన యంశమేయగును.

అది సర్వమతముల మ్రోల వేదాంతసిద్ధాంతముల దిగ్వి జయమును నిరాఘాటముగ నుగ్గడించెను వారు ప్రసంగిం చిన సిద్ధాంతములయొక్క గాంభీర్యమయిన సమరసభావమును, పురుషులు సైత మచ్చెరువొందఁ దగిన వారి దివ్యసౌందర్య విశేషమును నొకటిగూడి దేజరిల్లఁగానే, వారియందుఁ బ్రీతి వహింపకయు, వారిప్రసంగములయందలి సత్యమును గనుఁగొని యానందింపకయు నుండుట కాతనివిరోధులకు సైతము శక్యముగాకుండె ననుచో నింకఁ జెప్పవలసిన దేమున్నది?

న్యూయార్కుహెరాల్డు (New York Herald) అనుపత్రిక యా సమయమునందు స్వాములవారిని గూర్చి యిట్లుగ్గడించెను.

"సర్వమత మహాసభయందు నుపన్యసించినవారిలో వివేకానందస్వాములే మిగుల నిపుణు లనుటకు సందియము లేదు. వారి ప్రసంగము వినిన పిదప విద్యాభివృద్ధిగల హిందూ దేశవాసులయెదుట మతబోధ చేయు నిమిత్తమిచటినుండి పాదిరీలనంపుట యెంతమూఢ్యము అని తోఁచెడిని"

వివేకానందస్వాములు చేసిన ప్రసంగము, అమెరికాఖండ వాసులహృదయప్రదేశములఁ జక్కఁగాను లోఁతుగాను నాటి కొనెననుటకు నిదర్శనముగా నచ్చటఁ బ్రచురింపఁ బడుచుం డిన నితరవృత్తాంతపత్రికలయభిప్రాయముల నిందుఁ దెలిపెదము

మతసభకు విచ్చేసియుండిన ఘనులలో హిందూశాస్త్ర పారంగతులును, మహాపైదుష్యవిభూషితులునునగు వివేకా నందస్వాము లొకరు వారి ప్రసంగమువలన నాసభ పారవశ్య ముచెందిన దనవచ్చును ప్రతిక్రైస్తవాలయము (Church) నుండియు మతబోధకులును క్రైస్తవాచార్యులునువిచ్చేసియుం డిరి. వారందఱాతని ప్రసంగమనెడి వజ్రాయుధమున కాఁగలేక పోయిరి వారి స్వర్ణచ్ఛాయతోడి ముఖమండలమున బుద్ధి సూక్ష్మతతోడి వాగ్శక్తి నిర్గమించుచుండెను వారి యద్భుతా వహమైన యాంగ్లేయభాష యెల్లర కాహ్లాదప్రదముగ నొప్పా రుచుండినది. కావున సభ్యులహృదయప్రదేశముల నేన్నటికిని నశింపనివిధమున హిందూమతధర్మబీజములు చక్కఁగాఁ బాదు కొన్నవి.

'ఈవినింగ్ ట్రాన్స్క్రిప్టు' అనుపత్రిక 1894 వ సంవత్సరము ఏప్రిల్ నెల 5వ తేదియందు నిట్లు ప్రకటించినది.

"ఆతఁడు నిజముగానే యొకమహాత్ముఁడు. ఆతఁడు, గాంభీర్యమును, నిష్కాపట్యమును, లోనగు సత్స్వభావంబులఁ గలిగియుండుటయే గాక, మన దేశపుఁ బండితులకంటె నెన్నియో మడంగు లెక్కువగా వైదుష్యముగలిగి వెలయును." హార్వర్డు నగరపుఁ (Harvard) బండితులోకరు, సర్వమతసభాధ్యక్షులకు వ్రాసినజాబునందు, 'వివేకానందస్వామి మనముకోటివాండ్రందఱియొక్క వైదుష్యము నతిశయించిన విద్యాధిక్యము గలవారు' అని తెలిపియున్నారు

న్యూయార్కుక్రిటిక్ — (The New York Critic) అను పత్రిక యీదిగువ సూచించినట్లుగ్గడించుచున్నది —

సర్వమత మహాసభయందు మిగులమనోహారముగాఁ దేజరిల్లినవారు వివేకానందస్వాములే. ఆసభాభిప్రాయమును ఈ సన్న్యాసి యుక్తి బోధించినట్లు మఱియెవ్వరును బోధింపరైరి 'ఈశ్వరాంశమునఁ బుట్టిన యవతారవిశేషము' అని వారిని జెప్పవలయును

కలకత్తాలోని మహాబోధిసంఘముయొక్క కార్యదర్శి యగు శ్రీమత్ ధర్మపాలుఁడు అనెడు బౌద్ధుఁడు 1894 వ సంవత్సరము ఏప్రిల్ నెల 12 వ తేదిని ఇండియన్ మిఱర్ అనుపత్రిక కీదిగువ సూచించునట్లు వ్రాసెః—

చికాగోనగర రాజమార్గములయందలి శ్రీ వివేకానందస్వాముల పూర్ణాకృతిని చిత్రించిన పటములు వ్రేలఁగట్టఁబడి

యున్నవి వానిక్రింద 'వివేకానందయతి' అని విలిఖింపఁబడి యున్నది అపటములకు ప్రతితెగలోని వేనవేలుజనులు భయభక్తులతో వందనము లర్పించి పోవుచున్నారు

---

"అమెరికా ఖండమునందలి శ్రీవివేకానందస్వాముల శిష్యులు"

సర్వమత మహాసభయొక్క కార్యము లన్నియు ముగిసినపిదప మున్ను చెన్నపట్టణమున జరిగిన యనువుననే యమెరికాయందును జరిగెను పలుప్రదేశములనుండి వచ్చి యుండిన పలువిధములయిన మతముల ప్రతినిధులును సభ ముగియఁగానే తమతమదేశములకుఁ బయనమయిపోయిరి పిదప స్వామివివేకానందులను, వారిప్రసంగము విని యానందాబ్ధి నోలలాడినజనులు చుట్టికొని, మఱికొన్ని ప్రసంగములు చేసి తమహృదయముల కానందసుధ నింపఁ గోరి బ్రతిమాలిరి. వారితోడ పలుప్రాంతములకేఁగి ప్రసంగింప శ్రీ స్వాములు పయనమయిరి వారి యుపన్యాస సుధనుగ్రోలిన వారందఱును రానురాను వారికి శిష్యులయిరి అచ్చటచ్చట నున్న పండిత సభలు వారిని దమసభకు రావించి యుపన్యసింపఁ జేయుట యందుపోటీలు వేసికొని వాదులాడఁదొడఁగిరవి మహామతమును అమెరికాఖండమునం దుపన్యసించుచో శ్రీస్వాములువిరామము లేక రెండు సంవత్సరముల కాలము ప్రయాసపడువారైరి అనుదినము రెండువేళలఁ బ్రసంగించుట; లేఖాముఖమున విషయమును వ్రాసిపంపుట; తమ్ము దర్శింపవచ్చువారితో సంభాషించుట; ఏకాంతముగవచ్చి సందియముల వేఁడువారికి వేదాంత రహస్యముల విశదీకరించుట; శిష్యుల యుపయోగార్థము

వేదాంతసూక్తుల వివరణములతో విలిఖించి ప్రచురించుట లోనగుపనులకొఱకే యుదయము మొదలు రాత్రి చాలాసేపు దనుక, కాలము వ్యయమగుచుండెను జీవకోట్లపై వారువహించి యుండిన యత్యంతకారుణ్యమునకైన దృఢసంకల్ప మొకటియే వారు వహించియుండిన కఠినకార్యము గొనసాగుటకు శక్తి ననుగ్రహించినది గాని, లేకున్నచో వజ్రకాఠిన్యముగు వారిశరీరమింతకుఁ బెక్కుసంవత్సరములకు మున్నే శిథిలించి సిద్ధిఁజెందియుండవలయును వారిట్లు పాటుపడుటకుఁ బ్రారంభించి యొకసంవత్సరము పూర్తియగునంతలోనే యచ్చట బహిరంగముగా నిరువురు శిష్యులేర్పడిరి. వారిలో నొకర్తుక 'మేరీలూయిస్సా' అను ఫ్రెంచివిదుషీమణియు, లియాన్‌సాండ్సుబెర్గు(Leon Sandsberg) అను రుష్యాదేశపు యూధుఁడును వీరిలో లూయిస్సా యనునామె న్యూయార్కునగరమునందే స్థిరనివాసమేర్పఱచుకొను నిమిత్తమేతెంచి యప్పటికి యిరువదియైదు సంవత్సరములయియుండెను ఆబిడ యుపయోగకరములగు విషయములను బత్రికలకు వ్రాసియు బహిరంగముగఁ బ్రసంగము లొసంగియుఁ బ్రసిద్ధినివహించినది లియాన్‌సాండ్సు బెర్గు అనునతఁడు, మహాప్రసిద్ధమయిన యొక వార్తాపత్రికకు విషయములు రచియించి యొసఁగువాఁడు ఈయిరువురును గ్రమంబుగ అభయానందస్వామిని; కృపానందస్వామి యను నభిఖ్యలవహించి సన్న్యాసులయి స్వాములకు శిష్యులయి యుపదేశములఁ గాంచిరి

హిందూదేశవాసి జనులంద అజ్ఞానులని యమెరికనులకుఁ జెప్పి, వారివలన ధనము సేకరించి హిందూదేశస్థులను క్రైస్త

వులనుగాఁ జేయవచ్చునట్టి ఫాదిరీల జన్మదేశమయిన యమెరికాలోని క్రైస్తవాచార్యులు సైతము దమప్రసంగనైపథ్యమెక్కి యుపన్యాస మొసంగవలయునని శ్రీవివేకానందస్వాములను వేఁడికొనిరి. ఇంతేగాదు, అమెరికాఖండము నందలి ముఖ్యనగరముల యందంతటను సాపన్నులును సంపన్నురాండ్రును గుమికూడి యొక్కచక్కఁ జేరి శ్రీస్వాముల రావించి, మన హిందూమతవిశేషముల నిరాఘాటవాగ్వైఖరితో నుపన్యసింపఁజేసి హర్షసుధానిమగ్నమానసులయిరి. అట్టి సందర్భములయందు శ్రీవివేకానందస్వాములు మనహైందవ సనాతనధర్మోపదేశములనెడు దివ్యఖడ్గధారచే పరమతఖండనములఁ గావించుచు నాత్మీయమతోత్కర్షను శ్రోతల శ్రవణపాళికలమూలమున హృదయముల నింపుచుండఁగా పరమతమునందలి మక్కువ యెక్కువయై యందలి వాండ్రలోఁ బెక్కురు శిష్యులయిరి. వివేకానందస్వాములు సభకేతెంచునప్పుడును, ఉపన్యాసానంతరము సభనుండి విడిదికి నేగునప్పుడును జనులు పెల్లుఱేఁగిన యుత్సాహముపేర్మిని కరతాడనములతో ఘోషింతురు. శ్రీస్వాముల యుపన్యాససుధాస్రోతస్సునుత్కర్ష, పారవశ్య మొసఁగఁగా, సంక్షుభవించు స్త్రీలును బురుషులును దమశిరోవేష్టనములు (టోపీలు) దొలఁగిపోవుటయుఁ, గట్టుబట్టలు మలినములగుటయు సైతము గుర్తెఱుంగక తన్మయతనుభజింతురు. ఒక్కతడవకైనను స్వాముల దర్శించి, వారివాక్యామృతమును పానము చేసిననేగాని దమ జన్మ మున్నతిఁ బహింపలేదని యందలి ప్రజలయెదలలోఁ బారమార్థిక చింత పొదలెను

శ్రీ వివేకానందస్వామి లివ్విధముగా నమెరికాఖండము నందుఁ బలుప్రదేశముల వేదాంతప్రసంగము చేయుటయే గాక నిజము గనుఁగొనుట యందుత్సుకులయిన జిజ్ఞాసువుల కనువుగా న్యూయార్కుపట్టణమునందు, స్త్రీలకును బురుషులకును జ్ఞానయోగము, కర్మయోగము, భక్తియోగము, రాజయోగములను బోధించుటకై వేదాంతవిభాగముల నేర్పఱచి యచటనైతము దమయుపన్యాససుధను వెల్లి గొల్పిరి ఇంతశ్రద్ధతో నుపన్యాసము లొసఁగి, వారు పాటుపడుటకు ఫలముగాక్రైస్తవమతాభిమానుల హృదయక్షేత్రములయందు హిందూ ధర్మబీజములు పాదుకొని యంకురించి వేరూనుటకును, తన్మూలమున నమెరికాఖండవాసులకు వేదాంతవిషయములు దెలియుటకును ననువుగా న్యూయార్కునగరమునం దొక వేదాంత సంఘము స్థాపింపఁబడెను

శ్రీవివేకానందస్వాముల పొగడ్తను విన్నహిందువులు ఇండియాలో
నచ్చటచ్చట సభలుచేరి వారికి నుపచారపత్రంబులు వ్రాయుట.
స్వాములయున్నతిని గూర్చి ఫరోన్, మేరీస్నెల్ అను
నమెరికా పండితులు వ్రాసినలేఖలు.
స్వాములు చెన్నపురి పౌరులువ్రాసిన పత్రములకు
ననుగ్రహించిన ప్రత్యుత్తరము.
స్వాములు ఖేత్రిమహారాజుగారికి వ్రాసినశ్రీముఖము.

అమెరికాలో సంఘీభవించిన సర్వమతమహాసభయందు స్వాములకు సిద్ధించిన జయమును విని యానందించిన హిందువులు, ఇండియాలో ముఖ్యనగరములయందు సభలుగూడి, వారుకొనసాగించిన ఘనకార్యమునుగూర్చి మనవాండ్రకు బ్రసంగించి, తన్మూలమున శ్రీవివేకానందస్వాములను దమమనగపూర్వకప్రేమాతిశయముతోడఁ బొగడి, తమతీర్మానమును శ్రీవివేకానందస్వాములకును సర్వమతసభాధ్యక్షుఁడయిన ఫరోసునకును దెలిపిరి

అవ్విధముగా వివేకానందస్వాములను అమెరికాఖండవాసులను గౌరవపఱచునిమిత్తము కలకత్తాయందు 1894 సెప్టెంబరు 5వ తేదిని జేరినమహాసభయొక్క యగ్రాసనాధిపతిగారికి చికాగో సర్వమత మహాసభాధ్యక్షుఁడు వ్రాసిన శ్రీముఖము దిగువ సూచింప వఁగుచున్నది—

2957, ఇండియానాఅవెన్యూ,
చికాగో, 1894 వ సం॥ అక్టోబరు నెల 12వ తేది.

రాజాప్యారీ మోహనముఖర్జీ, సి, ఎస్, ఐ వారికి—

అయ్యా, కలకత్తా నగరమంటపమునఁ గూడిన మహాసభ

వలని తీర్మానములునుగల సెప్టంబరునెల 10వ తేదిని మీరు కారుణ్యముగలిగి విలిఖించిన యుత్తరము నేనిప్పుడే పొందఁ గలిగితిని. తమలేఖవలనను దీర్మానముల వలనను వెల్లడి యగు కారుణ్యము నన్నుఁ జాల గారవించుచున్నది మీమిత్రులగు శ్రీవివేకానందస్వాములు సర్వమతమహాసభయందుఁ బ్రీతి పూర్వకముగ గౌరవింపఁబడిరి శ్రీస్వాములెల్లర హృదయములను వశ్యముచేసి కొనఁజాలు వాచాలకతయు సౌందర్య విశేషమును గలవారు మతవిమర్శచేయవలయునను నక్కఱ నందఱియొక్క హృదయముల నెలకొల్పియుందురు వారు ఈదేశ మునకు వీరువచ్చుటకుఁ బ్రయోజనముగా మాముఖ్యములైన సర్వకలాశాలలందు మతవిచారమునకైన యుపన్యాసకస్థాన ములను ఉపాధ్యాయస్థానములను నేర్పఱచుకొనుటకాయెను. హిందూదేశమును గూర్చి యమెరికనుల మానసములోఁ గృతజ్ఞతాపూర్వకమైన ప్రేమ నెలకొనియున్నది మీప్రాచీనము లైన పరిశుద్ధగ్రంథములనుండి మేము పొందవలసిన యంశములు పెక్కులు గలవనియును భక్తియుక్తులమైనమ్ముచున్నాము; మీ మహాసభయందుఁ జేయఁబడిన తీర్మానములకును బ్రేరేచినవారికిని నామోదించినవారికిని బోషించినవారికిని నావందనములను జెల్లించునట్లు విన్నవించుకొనుటతోడ మీయద్భుతావహమైన దేశమును త్వరలోనే దర్శింప వలయునని కోరుచుంటి,

మీకృతజ్ఞుఁడయిన విధేయుఁడు,

(చేవ్రాలు) జాన్ హెన్రీ బరోస్.

చికాగోనగరమునందుఁ గూడిన సర్వమత మహాసభయం దేమిసిద్ధాంతీకరింపఁబడునో తెలిసికొనుటకై పలుదేశములనుండి పలువురు మిగుల శ్రద్ధాళువులై విచ్చేసియుండిరి. పెక్కు దేశములనుండియు నమ్మహాసభకు విజయముచేసి తమతము మతోత్కృష్టత నుగ్గడించి ప్రసంగించువారి యాంధ్ర సమయోద్దేశముల నన్నిఁటిని విని విమర్శించినవారును, సర్వమతమహాసభ యొక్క విజ్ఞానశాఖకు (Scientific Section) అగ్రాసనాధిపతియునగు మిస్టరు మెర్విన్ మేరి-స్నెల్ నౌరవారు అలహాబాదులోఁ బ్రచురితమగు పయొనీరుపత్రికకు వ్రాసిన కాగితమునందు నమ్మహాసభయొక్క పరిణామకాభిప్రాయము ఇట్టిదని తేటగాఁ దెలుపఁబడియుండుటచేత నాయుత్తరమును భాషాంతరీకరించి యీదిగువ సూచించుచున్నాము

"కడచిన సెప్టెంబరునెలయందు చికాగోనగరమున సంఘీభవించిన సర్వమతమహాసభ పెక్కుకారణములవలన నొకమహాసంభవముయొక్క సూచనముగా వెలయుచున్నది. దానివలనఁ గలిగిన ముఖ్యప్రయోజనములలో నొక్కటి యేమనఁగా—ఆసభ క్రైస్తవప్రపంచమున కంతటికిని ఘనవిషయమొకదానిని తెలిపెను అదియేమనఁగా—క్రైస్తవమతముకంటెను మిగులగౌరవార్హంబులయినయితరమతములు గలవనియును, అవియగాధములయినతత్త్వవిచారముల చేతను, ఆధ్యాత్మికోత్కృష్టతచేతను, స్వతంత్రచింతనాశక్తిచేతను, సత్యమైన సర్వజనానుకంపముచేతను క్రైస్తవమతముకంటె మేలిమిని జెందుచున్నదియనుటయే మఱియును, ఆచారశిష్టతోడను, ఆత్మలాభ మొనగూర్చుటతోడను దనకుఁదుల్యమగు

మతమొండు లేదని యది వెల్లడిపఱచెను. క్రైస్తవమతేతరము లయిన యష్టమహామతములను గూర్చి ప్రసంగములు జగిరినవి అవి యెవ్వియనిన—హిందూమతము, బౌద్ధమతము, యూధమతము, (చీనాసామ్రాజ్యపు) కాన్‌ఫ్యూషియమతము, జపాన్ దేశపు షింటోమతము, మహమ్మదీయమతము, పారసీకుల మతమయిన మజ్దేయమతము

"సర్వమత మహాసభయందలి సభ్యుల హృదయముల యందు హిందూమతమువలె మఱియేమతమును అంత సుదృఢముగా నెలకొన్నదిగాదు

"హిందూమతమునుగూర్చి ప్రసంగించినవారిలో శ్రీవివేకానందస్వాములే ముఖ్యులు వారు మతసభాసభ్యులందఱచేఁ గొనియాడఁబడిన వారనుటకును మిగులఁ జనుప్రగల్భియుండి యనుటకును నించుకంతయు సంశయములేదు. వారు సర్వమత సభానైపథ్యమునందును, నా యగ్రాసనాధిపత్యముక్రింద జరిగిన విజ్ఞానశాఖాసభలయందును పలుతడవల కుపన్యసించియున్నారు అట్టితఱుణములయందుఁ గ్రైస్తవులును దదితరులును నగుశ్రోతలు దక్షిణవాంద్రకంటె వివేకానందస్వాములనే యెక్కువయనురాగముతోఁ గొనియాడిరి వారు పోవునట్టి ప్రదేశములయందంతటను బ్రజలు వారిని చుట్టిముాగుచుండిరి వా రుచ్చరించు ప్రతిశబ్దమును వినుటయం దుత్సుకులుగానుండిరి.

"సర్వమతమహాసభ ముగియఁగానే, శ్రీవివేకానందస్వాములు, ఐక్యమహాగాణముల (United States) ముఖ్యనగరములలోని మహాసభలయందుఁ బ్రసంగములొనఁగుచు,

తా పోఁగినచోట్ల యందంతటను బెల్లుగ గౌరవింపఁ బడుచు వచ్చెదరు వారిని క్రైస్తవప్రసంగ సైకత్యములమీఁద నెక్కి ప్రసంగింపవలయునని పండితులు ప్రార్థించెదరు వారి యుపన్యాసములఁ జెవులార విన్నవారును, వారిసల్లాపసౌఖ్యమునకు నోచుకొన్నవారును పెక్కువిధముల వారి నుగ్గడించెదరు. క్రైస్తవమతమున మిగులదృఢభక్తిగలవారు సైతము వారిని, యథార్థముగా హిందువులలోని యుత్తమ రాజపుత్రుఁడని కొనియాడెదరు.

"అమెరికాఖండ మిప్పుడాధ్యాత్మికతృష్ణాబాధచే క్షోభిల్లుచున్నది ఇదిసంపదయందున్నతిని వహించియుండినప్పటికిని, ఈ దేశపుటుత్తమవర్గమువారు, అజ్ఞానపంకమున బ్రుంగి యితరుల క్షేమములఁ గోరక యాత్మలాభోత్కృష్టి వహించిన వారయి నప్పటికిని, ఈదేశమునందని తక్కువతరగతివారయిన దేశీయులు మృగప్రాయులుగా నుండినప్పటికిని, ఉత్తమపురుషుల ప్రాపుఁగోరునట్టి సుధీమణులీదేశమునం దచ్చటచ్చటఁ జెదరినట్లు పెక్కుఱుగలరు అధ్యాత్మవిషయములయందు నైరోపాఖండమెప్పటికిని హిందూదేశమునెడలఁ గృతజ్ఞతను వహించియున్నది. క్రైస్తవప్రపంచమునంగల యుత్తమ సిద్ధాంతములలో హిందూమతముఖమున రానివి మిగులఁ దక్కువయనియే చెప్పవలయును.

"ఆకారణమును బట్టియే యైరోపాయందును నమెరికాయందును వైదుష్యలాభ మొందిన పురుషులును స్త్రీలును జ్ఞానప్రకాశమునకు ముఖ్యహేతువైన హిందూమతము నొక్కటిని మాత్రమే తరుణము తటస్థించునప్పుడెల్ల ననుసరింపనెంచెదరు.

ఐక్యమాగాణములయందు మిక్కిలి సాగుదలగల మహాసభలన్నియు ముఖ్యముగా హిందూమతము పక్షమునే యాశ్రయించఁదొడఁగినవి విజ్ఞానశాస్త్రజ్ఞులెల్లరు విశేషముగా నద్వైతపక్షపాతు లగుటయే గాక, క్రైస్తవవిజ్ఞాన ప్రవరులుకూడ వేదాంతదర్శనమునే యవలంబముగా నాశ్రయించినవారనుటకు సందియము లేదు

“ఈ దేశమునందు, ఇదివఱకును హిందూమతము ననుసరించుచున్న యంశములన్నియు వివేకానందస్వాముల ప్రయత్నముచే బలపడుచు వచ్చుచున్నవి ఇక్కాలమున నాంగ్లేయ గ్రంథకర్తలు, హిందువులను గూర్చి తమయిచ్ఛకువచ్చినట్లు వ్రాసియుండుట యెల్లరకును దెల్లమయిన విషయమయినప్పటికిని, వివేకానందస్వాములవలెఁ బ్రమాణపూర్వకములుగ విషయములను హృద్గతములగునట్లమెరికనులకు బోధించిన యుత్తము లొక్కరును లేరు కాఁబట్టియే వివేకానందస్వామి యీదేశమువదలి తమ జన్మదేశమునకు విజయముచేసిన పదప నమెరికనులు వారి యెడఁబాటునకుఁ దాళలేక పరితపింపఁగలరనుట యతిశయోక్తిగాదు ఇంతేకాదు, అమెరికనులు, వీరు మరల నెన్నటికి దేశమునకు విచ్చేయగలరు! ఎన్నటికి వీరిదివ్యవిగ్రహము దర్శించు భాగ్యము మానేత్రముల కలవడఁగలదు? ఎన్నటికి వీరివాగ్సుధను జెవులారఁ గ్రోలఁగలము? శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యసంప్రదాయానుగులగు వీరిని బోలినమహానీయు లేకాలంబున నీభూమికివిజయము చేసి మాయాత్మల కింపుఁ గల్పింపఁగలరు?” అని పరిపరివిధముల పరితపింపఁగలరనుట యందు నించుకంతయు సందియ ముండదు

"ప్రొటస్టాంటుమతమునందు మిక్కిలి పట్టుదలగల కొందఱకు మాత్రమే శ్రీవివేకానందస్వాముల విజయమును గూర్చి యసూయ పొడకట్టెను నూపోపమికిఁ బొల్పడిన వారు, శ్రీస్వాములతోడి వాదార్భటికి లేచిరి అయినను, వారిపగయుఁ జూపోపమియు, భరతఖండమునుండి విచ్చేసిన కాషాయ వసనధారియగు యతిపుంగవుని శాంతము, వైదుష్యము, సచ్ఛీలము, చిత్తశుద్ధి, వాఙ్మాధుర్యము అను వానియెదుటఁ దలలెత్తలేక యణఁగి నశించిపోయినవి"

"ఇట్టి మహిమాన్వితుఁడయిన ఘనుని సంపుటను గూర్చి యమెరికా, యిండియా దేశమును బొగడి వినయపూర్వకముగా నీదిగువఁ గనఁబఱచినరీతిని విన్నవించుకొను చున్నది."

"కాపట్య రహితంబైన చింతనమును, సర్వసహోదరత్వమును గలుగుట కాధారమయిన జ్ఞానమును దెలిసికొనని యమెరికనులకు నుపదేశించుటకును, ఆ యుపదేశము చేత, ఇందందనక యెచ్చటను బరిపూర్ణతను జెంది ప్రకాశించు సర్వాతీతమయిన యేకతత్వమును, పరబ్రహ్మమును అనుసరించిన జ్ఞానము, వారికిఁ గలుగునట్లు చేయుటకును వీరివలెనింకను నలువురను బంపునట్లు పెక్కువిధములఁ బ్రార్థించుకొనెదము".

శ్రీ వివేకానందస్వామిని గౌరవించునిమిత్తము కలకత్తా యందు జరిగినట్లే చెన్నపట్టణమునందు పచ్చయప్పకలాశాలలో ఒక గొప్పసభ చేరెను ఆసభ కగ్రాసనమువహించిన న్యాయాధిపతియగు, ఘనతచెందిన శ్రీ సుబ్రహ్మణ్య అయ్యరు

గారు శ్రీ స్వాములనుగూర్చి పొగడి పలికిరి. తదనంతరము, అచ్చటికివిచ్చేసియున్న మ-రా-రా-శ్రీ, వి. కృష్ణస్వామిఅయ్యరు గారు, గోపాలకృష్ణ మొదలారిగారు, మన్మథనాథ భట్టాచార్యులు లోనగు ఘనులును స్వాముల యున్నతినిగూర్చి పెక్కువిధముల నుగ్గడించిరి. పిదప నాసభలో జరిగిన తీర్మానమును స్వాములకుఁబంపిరి. దానికి శ్రీవివేకానందస్వాము లనుగ్రహించి యీ దిగువఁ గనబఱచిన చొప్పునఁ బ్రత్యుత్తర మొసఁగిరి.

"మన మతముకై యేను చేసిన స్వల్ప కైంకర్యము మీయంగీకార యోగ్యమగుటకు నెంతో యానందించెదను. అట్టి నాయానందమునకు పెక్కువందలక్రోశముల కావలనున్న నేను పొగడఁబడితినే యనుట హేతువు గాఁజాలదు; ఏదనఁగా-పరదేశీయులు, హిందూదేశముపైఁ బలుతడవలకుదండయాత్ర వెడలి సుడిగాలివలె దానిఁ జూఱవెట్టినప్పటికిని, పెక్కుశతాబ్దములుగా మనము వహించియుండిన యశ్రద్ధయును, అన్యదేశీయులు ఘటించిన యవమతియును, ప్రాచీనార్యావర్తము యొక్క ప్రతాప భాస్కరుని తేజస్సును మసకపఱచి వైచినవి. అయినను వానిని వహించియుండిన యనేకోన్నత స్తంభములును, రమణీయములయిన మంటపములును, ఉత్తములయిన హర్మ్యరాజములును, పెక్కువందల సంవత్సరములనుండి యీ భరతవర్షమును అన్యదేశవాహినులు పైఁబడి కొట్టికొనిపోయి నప్పటికిని, దానిమధ్యప్రదేశముమాత్ర మించుకంత యామహా విప్లవమునుండి తప్పినదై యీశ్వరునిమహిమలను జీవకారుణ్యమును బ్రతిపాదించు సిద్ధాంతమయిన మహాద్భుతజ్ఞాపక స్తంభమునకుఁ బునాదియగు నాధ్యాత్మికతత్త్వము, దొల్లిటివలెనే

బలిష్ఠముగాను నిశ్చలముగాను నున్నదనుటను దెలుపుటకు మీరనుగ్రహించి పంపిన యుపచారపత్రిక దార్ష్టాంతికమగు చుండుటయే నా యానందమునకుఁ గారణమగుచున్నది శ్రీ రామకృష్ణ పరమహంస స్వాములయానతిని హిందూదేశమున కును, ఇదితప్పఁ దక్కిన భూమండలమునకును బహిరంగపఱచు నట్టిభాగ్యము, వారిసేవకులలో మిగుల నల్పుఁడనైన నాకు లభించుటచేత నన్ను మీరలు శ్లాఘించుటయంతయు వారిని శ్లాఘించుటయే యగును

మిక్కిలి వేగవంతమయి సమగ్రమైన శక్తితో ముమ్మర ముగా మోది, బలహీనముగానున్న యన్నింటిని తన గొప్ప ప్రవాహమునందు గొట్టికొని,హిందువులు పెక్కుసంవత్సరము లుగా నెట్టిలోపమును దెలుపక యోర్పుమెయి ననుభవించుచు వచ్చునట్టి హింసలకు విమోచనము గలిగింపఁ దలఁచి, పూర్వ కాలమునందు నైతము వా రనుభవించి యుండనిదియు, న్యాయపూర్వకముగ వారి ననుసరించినదియు నైన యున్నత పదవియందు, నీశ్వరా దేశముచొప్పున వారిని నెలకొల్ప సమర్థ మయిన యాధ్యాత్మిక తరంగధ్వని, వారియందును వారి యాజ్ఞయందును వినవచ్చుట, మీ పరిశుద్ధాంతఃకరణముల యందలి దివ్యోద్బోధయే కదా!

హిందూదేశమునం దిప్పుడు వెలయుచున్న సర్వమతో ద్దేశములకును దక్షిణాపథమే ముఖ్యస్థానం బగుటంబట్టి,ఉత్తర హిందూస్థానమునందలి ప్రజలందఱును, మీరయ్యెడలఁ గృతజ్ఞు లగుచున్నారు ఆయా కాలముల కనువుగా నవతరించి సిద్ధాంత స్థాపనము జేసిన మహాభాష్యకర్తలును సత్సంప్రదాయ

ప్రవర్తకాచార్యులును నైన శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారును శ్రీమద్రామానుజాచార్యులవారును శ్రీమన్మధ్వాచార్యులవారును జన్మించిన మహాపవిత్రస్థలము దక్షిణాపథమేకదా! మహాప్రపంచ నివాసియగు ప్రత్యద్వైతవాదియు శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యుల పాదయుగళిని శిరసా వహించెడి ననెడిచో, వారిమాహాత్మ్యము మాటల కలవియగునా? అందఱిచేతను బ్రహ్మణము నికృష్టులుగ భావింపఁబడుచున్నట్టి పంచములను సైతము తమ పవిత్రకారుణ్యవిశేషమున నాళ్వారులుగాఁ జేసిన శ్రీమద్రామానుజాచార్యుల దివ్యాద్భుత మహిమాతిశయమును బొగడుట కెవనికి శక్యము? ఉత్తర హిందూస్థానము నంతంతటను మహా ప్రఖ్యాతిని వహించి మించిన శ్రీకృష్ణచైతన్యుల శిష్యవర్గమువారు సైతము శ్రీమధ్వాచార్యులవారిని దమకు గురువుఁగా జేసికొని రనుచో వారి మహామహిమల నుగ్గడింప నావంటివాని కెట్లు సాధ్యమగును! నేఁటికిని గాశిలో మహామహిమాన్వితులయి యొప్పెసఁగు మహనీయులు దక్షిణాపథమువారే. మీ ప్రదేశముల నున్న ముముక్షువులే హిమాచలాత్యున్నతాధిత్యకలయందలి పవిత్రస్థలంబులఁ బరిపాలించు పాటవముగల మహాత్ములు. కాఁబట్టి, అట్టియాచార్యుల యనుగ్రహలాభమునను నోచుకొనిన మీరలు శ్రీరామకృష్ణ పరమహంసస్వాముల దివ్యమహిమలను కొనియాడుటయుఁ దదీయదివ్యాజ్ఞల ననుసరించుటయు నాశ్చర్యప్రదములు గాఁ జాలవు.

**దక్షిణాపథము వేదాధ్యయనమునకు జన్మగృహము.**

అప్పట నివసించు ప్రజలలోఁ జెక్కుఱకు వేదస్వరూపమే దెలి

యదని చెప్పినప్పటికిని, శ్రీశంకర రామానుజీయ మాధ్వమతముల యంతర్భాగముల కన్నిఁటికిని ముఖ్య ప్రమాణములు శ్రుతులే యని దృఢోక్తులఁ జెప్పఁగలను.

వేదసంహితయును బ్రాహ్మణంబులును మానవతత్త్వశాస్త్రజ్ఞులకు, భాషాతత్త్వవిదులకును నెంతో ముఖ్యపరికరములుగా నుండినప్పటికిని, 'అగ్నిమీాడే' 'ఇషేత్వోర్జేత్వా' 'శన్నోదేవీ రభీష్టయే' అను నిత్యాదిమంత్రంబులును, దక్షిన వేదభాగంబులును, యాగంబులును, బలులును గలిగించునట్టి ఫలములు కొంత గామణీయ్యకము లయినను, అవి భోగముల నిమిత్తమంగీకృతములేగాని మోక్షప్రదములని యెవ్వరు నెక్కాలంబునను వాదింపలేదు యథార్థముగా జ్ఞానకాండయు ఆరణ్యకములును, మోక్షమార్గ ప్రతిపాదకములయిన వేద సూక్తులనే హిందూదేశమునం దెన్నటికిని ప్రమాణములుగా నంగీకరించుచున్నవి

సనాతన ధర్మమార్గంబయిన హిందూమతముయొక్క యంతర్భాగమునుగాంచి కలఁతనొంది మార్గముదప్పియును, దాను బ్రతిపాదించునట్టి 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అగుసర్వేశ్వరునియొక్క ప్రతిఫలనము నొక్కటినే నిరీక్షించు యోగ్యతగల యొక్క మతముయొక్కరహస్యమును గ్రహింప శక్తిచాలక పోయియును, మిక్కిలి ముమ్మరముగా విజృంభించి యున్ననాస్తికముదప్ప మఱిదేనినైనను స్వప్నమునందైనను గని యెఱుఁగనిజనులవలన నెరవుగాఁ గొన్నిపర్యాయమత సాహాయ్యవశంబున నంధకారంబున మార్గముఁ దెలిసి కొనలేక పరిభ్రమించు సధునాతన హైందవయువుఁడు, తన

పూర్వికుల మతమును దెలియఁగోరి వ్యర్థముగా బ్రయత్నించి, త్వరలోనే యా ప్రయత్నమును బొత్తిగ వదలఁగలిపి పరమ నాస్తికుఁ డగుచున్నాఁడు లేక, తనకు సహజమగుధర్మము, స్వభావప్రేరణచేతఁ జిరకాలము నాస్తికమున సుదృఢముగా నిలువలేక, భారతీయ శాస్త్రవాసనల వహించిన పలువిధంబు లగు పాశ్చాత్యగ్రంథకషాయంబులను గొంచెమేనియు ముందు వెన్కల నాలోచింపక త్రాఁగి,ద్రాఁగి యాదిగువ సూచించిన శ్రుతి సూక్తిని సార్థకపఱచెడును

"పర్యట న్నిమూఢా అన్ధేనైవ నీయమానా యథాన్ధాః"

"గ్రుడ్డివాని వెంబడినిబోవు గ్రుడ్డివానివలె మూఢుఁ డగుచున్నాఁడు".

ప్రాణప్రతిష్ఠా పటిమనువహించిన సద్గురుమూర్తి కర కమల సంస్పర్శనవశమున నుజ్జీవితులగు నాత్మజ్ఞాన నిధులు మాత్రమే తప్పిబ్రదికెదరు.

"దుర్లభం త్రయమేవైత ద్దైవానుగ్రహ హేతుకమ్

మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః"

మానవజన్మమును, అందు ముక్తి నొందవలయునను దలంపును, అందు మహాత్ములయొక్క యాశ్రయమును అను నీమువ్విధముల భాగ్యములును, ఈశ్వరానుగ్రహము లేక యే యలఁతి లభించునవి గావు అని పూజ్యులగు భాష్యకర్తలు వాక్రుచ్చినది పొంకముగానే యున్నది

పరమాణువులు, ద్వ్యణువులు, త్ర్యణువులు లోనగు వానిని గూర్చిన మహాద్భుత సిద్ధాంతములను స్థాపించు నట్టి

ఋషులయొక్క యతినిశితంబగు వస్తుపరిశీలనా విశేషంబేమి; జాతి, ద్రవ్యము, గుణము, సమవాయము మొదలగుపదార్థములను గూర్చి నైయాయికులుచేసియుండు నత్యద్భుత వస్తువినుగ్నా విచారమేమి; ఇంతకంటెను, బరమాణుతత్త్వ నిర్ణయముల వెలయఁజేసిన సాంఖ్యులయొక్క ధిషణాధిక్యమేమి; ఇవి మొదలుచేసి ప్రశాంతవిచారక్రమము దనుక విజృంభించి వర్ధిల్లినపిదప, నీవిచారంబు లన్నిఁటియొక్క ముఖ్యపరిణామముగ పరిపక్వదశఁబొంది పఱలునట్టి వ్యాససూత్రముల యున్నతి యేమి; అందు ఆత్మతత్త్వరహస్యములయొక్క పలువగల సమష్టివ్యష్టిరూపము లయిన సిద్ధాంతములవికాస విశేషము లేమి; ఈ యన్ని విధముల మతభేదములకును ఆధారభూత ప్రమాణములు శ్రుతులే బౌద్ధులు, జైనులు లోనగు పరమతములవారి తత్త్వశాస్త్రములయందు సైతము శ్రుతుల తోడ్పాటు ధిక్కరింపఁ బడలేదు

బ్రాహ్మణులచే పిదప చేర్పఁబడిన వనునట్టి "హింసక శ్రుతులు" తప్ప, తక్కిన వేదభాగముల నన్నిఁటిని బౌద్ధ మత వర్గము వారిలోఁ గొందఱును, జైనవర్గము వారిలో బెక్కుఱును, ఒకరీతి గాఁ బ్రమాణములని యంగీకరించియే యున్నారు.

ఇటీవల నిట్టియభిప్రాయము, సిద్ధిచెందిన దయానందసరస్వతులచే నాదరింపఁబడి యున్నది

ప్రాచీనులయిన హిందువులయొక్కయు, నీ కాలపు హిందువులయొక్కయు నభిప్రాయసమష్టికి మాధ్యమికస్థితి యేది? "పరివిగా విభజింపఁబడి యున్న మతబోధలతోడి హిందూ మతముయొక్క యదార్థమయిన యాధారమేమి?"

అని ప్రశ్నించినచో వ్యాససూత్రములే యట్టియాధారములుగా నమరియున్నవని నిరూపింపఁబడును

హృదయమును స్తంభింపఁజేయు హిమాలయవనప్రదేశములయందలి యేకాంతస్థలములలో దివ్యనదియగు మందాకిని వలని గంభీరధ్వానముతోఁ గలిసి, 'అస్తి, భాతి, ప్రియమ్' అని యద్వైతకేసరి గర్జించుటలను విన్నను (అస్తి=సత్, భాతి=చిత్, ప్రియమ్=ఆనందము, అనఁగా 'బ్రహ్మముయొక్క లక్షణమగు సచ్చిదానందము' అగుచున్నది ఈ ప్రయోగమును పంచదశియందు చూడనగును); బృందావనమునందలి రమణీయ వనాంతరములయందలి లతాగృహంబుల 'పియాపీతమ్' అని పంచమస్వరముతోఁ గర్ణరసాయనముగఁ గోకిలాయమానములు పలుకు పక్షుల కూజితముల విన్నను (పియా అనిన ప్రియ, అనఁగా శ్రీకృష్ణదేవుని ప్రియురాలగు రాధిక, పీతమ్ అనఁగా, పీతాంబరధారియగు శ్రీకృష్ణస్వామి, శ్రీరాధాకృష్ణులనుట); కాశికాపురమునందలి మఠములలో శాంతస్వాంతముతోడి ధ్యానములను, నవద్వీపమునందు, అవతరించిన శ్రీచైతన్యస్వాములయొక్క శిష్యులు పరవశులై సలుపు నానంద తాండవములను దర్శించినను; వడగలై, తెంగలై యంతర్భాగముల విశిష్టాద్వైతాచార్యుల ప్రసంగముగాని, మధ్వమతాచార్యుల యుపన్యాసములనుగాని విన్నను; వీరరసము చిప్పిలునట్లుగా లౌకిక ధర్మానుష్ఠాతలగు సిక్కులు పలుకునట్టి 'వాహ గురుకీ ఫతే' (వాగురుస్వామికి జయము) అనుటనుగాని, ఉదాసిజనులలోని నిర్మలాచార్యులు, తమ మతశాస్త్రములను గూర్చి

యుపన్యసించుటను గాని వినినను ; కబీరుదాసులు, సన్న్యాసి శిష్యులను గూర్చి సత్సాహేబు, అను వచనముతో వందనము లర్పించి వా రనుగ్రహించి సెలవిచ్చు 'సాకీలను' గర్ణరసాయనముగ విన్నను, లేక రాజపుతానాయందలి యాచార్యుల యొక్క యద్భుతావహ గ్రంథముల నైనను, వారి రాజ శిష్యులగు సుందరదాసుయొక్క తువకీనిగాని, కడచినమూఁడు వందల సంవత్సరములలో హిందూ దేశ భాషల యందంతటను వ్రాయఁబడిన గ్రంథముల యందత్యుత్తమమైన విచారసాగరమును నిశ్చలదాస కృత గ్రంథమును గాని గాంచినను, ఉత్తర హిందూస్థానమునందలి బంకీమేతాగారిని గూర్చుండఁబెట్టుకొని వారి గురువగు లాల్ గారి యుపదేశములను జెప్పఁడని విన్నను; ఇట్టి గొప్ప తారతమ్యముగల యాచార్యులకును, వాండ్రనుసరించి యున్న మతభేదములకును అధారభూతమయిన ప్రస్థానమేదనఁగా — శ్రుతులే ! గీతయే వానికి దైవిక వ్యాఖ్యానముగాను, శారీరకసూత్రములే వానికి సాంగములయిన తత్త్వములుగాను పరమహంసపరివ్రాజకాచార్యులు మొదలుకొని నికృష్టులనఁ దగినవారివఱకును గల పలువిధముల మతభేదముల వారే వాని యనంతరూపములుగాను నమరియున్న సనాతన ధర్మమే యా శ్రుతి యనుటయు సులభముగాఁ గనుఁగొనవచ్చును.

కాఁబట్టియే, 'ప్రస్థానత్రయము' అను నీమూఁడు గ్రంథములే (ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మ సూత్రములు అను నీ మూఁడు గ్రంథములకును ప్రస్థానత్రయము అని పేరు)

ద్వైతాద్వైత విశిష్టాద్వైత వ్యాఖ్యానములతోడను, మఱియుఁ గొన్ని ముఖ్యాభిప్రాయములనుగల్గిన వ్యాఖ్యలతోడనుగూడి హిందూమతమునకుఁ బ్రమాణ గ్రంథములగుచున్నవి పూర్వ ముండిన నారశంసులకు బదులుగా పురాణములును, బ్రాహ్మణములకు మాఱుగా తంత్రములును నిక్కాలమునం దుపయోగింపఁ బడుచున్నవి.

ఇంక హిందూ మతాంతర్భాగముల వారిచేఁ బ్రస్థానత్రయము ప్రమాణముగా నంగీకరింపఁబడియున్నది అయినను, పురాణములును తంత్రములును ఒక్కొక్క విభాగము వారికిఁ బ్రత్యేక ప్రత్యేకంబుగా నేర్పడియున్నవి

పైని జెప్పఁబడిన తంత్రములు వైదిక కర్మలనే కొన్ని భేదములతోఁ బ్రతిపాదించుచున్నవి వీని ననుసరించి యాభాసములగు సిద్ధాంతముల నెవరుగాని యేర్పఱచుకొనుటకు మున్నే, వారాతంత్రములను, ముఖ్యముగా నధ్వర్యు సంబంధమయిన బ్రాహ్మణములతోడ సంప్రతించి చదివిరేని, తంత్రములయందుఁ జెప్పఁబడిన మంత్రములలో ననేకములు బ్రాహ్మణముల నుండియే పదపదముగా గ్రహింపఁబడి యుండుటను గనుఁగొనఁ గలరు శ్రౌతస్మార్తవిహిత కర్మలను వినాయించి హిమవద్గిరి నాదిచేసి కన్యాకుమారి దనుక ననుష్ఠింపఁబడుచున్న యన్ని విధముల యాచారములను తంత్రముల నుండి గ్రహింపఁ బడిన వనుటయేగాక శైవవైష్ణవశాక్తాదిమతస్థుల యాచారములన్నియును తంత్రములనే యాశ్రయించి వెలయుచున్నవి

పైని జెప్పిన తమ మతములయొక్క ప్రమాణములన్నిఁటిని హిందువులందఱును సంపూర్ణముగాఁ దెలిసికొనియున్నారని నే నిచ్చట సూచింపఁ బ్రయత్నింపను

ముఖ్యముగా తూర్పు బంగాళము నందలి యనేకు లీ గొప్ప మతభేదములను యభిప్రాయభేదములను గూర్చి విని యే యుండరు అయినను, తెలిసియో తెలియకయో వారందఱును అనుసరించియున్న పద్ధతులు ప్రస్థానత్రయమును సంబంధించి నవియే యగును

అయినను, హిందీభాష యేయేస్థలమునందు సంభాషింపఁ బడుచున్నదో, ఆ యా ప్రదేశములయందు వసించుచున్న తక్కువవారు సైతము, తూర్పు బంగాళమున వసించునట్టి యుత్తమములనఁ బఱఁగిన యనేకులకంటెను మిగుల శ్లాఘాపాత్రముగ వేదాంతమతమును దెలిసికొని యున్నారు దానికిఁ గారణమేమి ?

మిథిలనుండి నవద్వీపమునకుఁ దేఁబడి, మహామేధావులగు శిరోమణి, గదాధర, జగదీశాదులవలన, తర్క అలంకారాదులచేఁ బోషింపఁ బడియును, వృత్తి గలిగింపఁబడియును, కొన్ని విషయములయందు లోకమునందున్న తర్కముకంటెను, ఉత్కృష్టతను, దిద్దుబాటును జెంది యాశ్చర్యప్రదములగు పలుకుల కిక్కయై వెలయు నట్టి తర్కశాస్త్ర పద్ధతులను వహించిన వంగదేశపు న్యాయశాస్త్రమును మిగుల శ్రద్ధాళు

వులయి హిందూస్థానమునందలి ప్రజలు పఠించెదరు వేదాధ్యయనమును గూర్చి చెప్పవలసినచో, అక్కటా! అందఱును విని వ్యథనొందఁ దగిన దుర్దశకు వచ్చివేసినది కడచిన కొన్ని సంవత్సరముల దనుకను పతంజలి మహాభాష్యమును నేర్పుట కొకరు దొరకుట మిగుల దుర్లభముగానుండెను ఒక్క పద్ధతియే, అని ముగింపులేని, అవచ్ఛిన్న అవచ్ఛేదకము లను తర్కవాదములకుఁ బైఁగా, మహాత్ములగు శ్రీకృష్ణ చైతన్యస్వాము లవతరించిరి వెంటనే బంగాళా దేశము, అజ్ఞాననిద్రనుండి మేల్కని హిందూదేశమునందలి యితర ప్రాంతములనున్న జ్ఞాన మార్గమునం దించుక చేఁగలిగెను

శ్రీ చైతన్యస్వాములు దమసన్న్యాసాశ్రమము నొక భారతి వారివలనఁ గ్రహింపుటంజేసి వారు స్వైతమొక భారతియే కావలసియుండెడివారు, మాధవేంద్రపురి యనువారి వలన జ్ఞాన సిద్ధిని జెందిరనుట చోద్యముగానే యున్నది

బంగాళా దేశమువారిని అజ్ఞాన నిద్రనుండి మేల్కొలిపి వారికి జ్ఞానోపదేశము చేయఁజాలు నొకవిశేష మహిమ యీ పురి అను వారికిఁ గలదని తోఁచెడిని భగవానులు శ్రీరామకృష్ణ పరమహంసస్వాములుకూడ పురి యను వారి వలన సన్న్యాసాశ్రమము స్వీకరించిరి.

వ్యాస రచిత బ్రహ్మసూత్రములకు శ్రీ చైతన్య స్వాములు వ్రాసినభాష్యము నష్టమయి పోయెను ఒకవేళ నష్టముగాకయే యుండిన దనుకొందము; అట్లుండిన నిదివఱ

కును వెలికి రాక యుండునా? వారి శిష్యులు దాక్షిణాత్యులగు మాధ్వులలోఁ గలిసి పోయిరి మహాత్ములగు రూప, సనాతన, జీవ గోస్వాములు లోనగువారివలన వృత్తిని గలిగింపఁబడిన శ్రీకృష్ణ చైతన్యుల మతము క్రమక్రమముగా బావాజీల చేతికిఁ జిక్కి యతిదీనదశను జెంది యిటీవలనే కొంత కాలముగా మంచిస్థితికి వచ్చుచున్నది అది తనతొల్లిఁటి తన యున్నతిని మరలఁ బొందఁగలుగునని నమ్మెదను

శ్రీ చైతన్యులయొక్క మహిమ హిందూదేశమునందంతటను వ్యాపించియే యున్నది భక్తిమార్గ మేయే ప్రదేశములఁ గానవచ్చుచున్నదో నాయా ప్రదేశములయందంతయు వారి ప్రశంస గలుగుటయు, వారి చరితమును బఠించుటయు వారిపటమును బూజించుటయుఁ దటస్థించుచున్నది వల్లభాచార్యులవా రేర్పఱచినదానిని శ్రీచైతన్య స్వాముల మతము యొక్క యొకభాగమనియే నమ్ముటకు నా కనేక కారణములు గలవు బంగాళమున మాట వాసికి వారికి శిష్యులగుని యని పించుకొన్న వారిలో, బెక్కుఱకు,హిందూస్థానమునందంతటను వ్యాపించియున్న పేరును గల వారిచరిత మింకను దెలియదు అక్కటా! వారి కది యెట్లు దెలియును ? వల్లభాచార్యులు, పాదచారులయి హిందూదేశమంతయు సంచరించి, ఇల్లిల్లు దిరిగి, ఆ చండాలము భగవద్భక్తి చేయునట్లు ఱరిఁ రవిధముల హితోక్తుల బోధించిరి, వారి పరంపరను వెలయు నట్టివారో, తమ మతమునుండి కాలు గదల్పక సుఖభోగులయి కాలము పుచ్చెదరు.

ముఖ్యముగా బంగాళమునందే యలవాటులోనికి వచ్చియున్న హితమైనదియు నవైదికమగు నదియు నగు పారంపర్యగురుత్వపద్ధతియే, ఆ దేశము హిందూస్థానములోని యితర ప్రదేశములతో మతవిషయమున నైకమత్యము వహింపక పోవుటకు కారణాంతర మగుచున్నది

బంగాళము నేఁటికిని ప్రశస్తమయిన జ్ఞానాధిక్యమునకుఁ బ్రతినిధులును ప్రజ్ఞాననిధులును నగు సన్న్యాసుల యుపదేశమును బొందలేక యుండుటయే యన్నిఁటికిని మించిన కారణ మగుచున్నది

బంగాళమున గొప్ప స్థితియందుండువారికి ముముక్షుత్వమునం దపేక్ష లేదు వారు సర్వదా భోగములయందు మాత్రమే యిచ్ఛగలిగి కాలము గడపెదరు. వారికిఁ బరమాత్మ వైపుయొక్క సునిశిత విచార మెట్లు గలుగఁ గలదు? "త్యాగేనైకే అమృతత్వమానశుః" "సర్వసంగపరిత్యాగియయ్యు నొక సాధనమాత్రమునసే అమృతత్వమును (చావులేమిని) పొందుచున్నాఁడు" అని వేదములు ఘోషించుచున్నవి అది పఠితియొక విధానమును జెంగునో?

అయినను, హిందీభాషను సంభాషించునట్టి ప్రదేశముల యందంతటను జాలదూరము యశోవ్యాపకముగల తేజస్వులగు సన్న్యాసులు గ్రామము గ్రామముగాఁ దిరిగి ప్రతికుటీరమునకును బోయి వేదాంతరహస్యముల నుపదేశించెదరు ఈ యతీశ్వరులు పంజాబుదేశమును బరిపాలించిన రంజిత

సింగుని పరిపాలనమువలనఁ బొందిన చనువుచేత, వేదాంత దర్శనముయొక్క మిగుల సూక్ష్మరహస్యములనుగూడను దెలిసికొను విధమునఁ జేసియుంచిరి. పంజాబునందలి దరిద్రులైన పల్లెటూరి పడుచుకూడ తన మగ్గము సైతము 'సోహమ్ సోహ'మ్మని శబ్దించుచున్నదని గర్వించి పలుకఁగలదు. హృషీకేశవనమునందలి 'మహాత్ము'లు సన్న్యాసుల యుడుపుల ధరించి వేదాంత మభ్యసించుట నా కన్నులార గాంచియున్నాను. ఉన్నత పదవియందుండువారు, వారి పాదచ్ఛాయల మెలఁగుచు వేదాంత మభ్యసింపవచ్చును. ఏల యట్లు చేయఁదగదు? 'అన్యాదపి పరం ధర్మమ్' 'ఉత్కృష్టధర్మమును నీచునివలనను దెలిసికొనవచ్చునుగదా!'

కావుననే, బంగాళమునందును బొంబాయియందును, చెన్నరాజధానియందును ఉండుటకంటెను ఎక్కువ వేదాంతవిచారము, పశ్చిమోత్తర పరగణాలయందును పాంచాలమునందును గలదనుట పొరపాటు గాఁజాలదు. సర్వదా సంచారముచేయు వెవ్వేలువిభాగముల సన్న్యాసులగు * దశనాములు, బైరాగులు లోనగువారు, ఒక్కొక్కనికిని మతబోధచేసెదరు. దానికై యాగృహస్థునకు వ్యయమగునది యొకకబళపుటన్నమే యైనను, వారిలో ననేకులు, ఎంతోగౌరవముగలవారుగాను, ఆత్మసుఖము చింతింపనివారుగా నున్నారు.

---

* దశనాములు — పదివిధములు పేళ్లను గల్గి శంకరాచార్యుల సంప్రదాయము ననుసరించిన సన్న్యాసులు, ఆ పేళ్లెవ్వియనిన — సరస్వతి, పురి, భారతి, పద్మ, తీర్థ, ఆశ్రమ, వన, అరణ్య, పర్వత, సాగర.

"కాచ్చుపంథి" అను నొకప్రత్యేకమతస్థులు గలరు. వీరందఱును సన్న్యాసులు (వీరెప్పుడును ఇతరమతస్థులతోఁ జేరువారుకారు) ఈమతస్థులు రాజపుత్రస్థానమునందు వందల కొలఁదిపాఠశాలలను ధర్మశాలలను స్థాపించియున్నారు ఇంతియు గాక, అడవులయందు సైతము వైద్యశాలలను స్థాపించి యున్నారు. హిమాలయము మార్గములోని లోవలలో నుఱ్ఱు వంతెనలను నిర్మించియున్నారు వీరొకప్పుడును తమచేతులతో ధనమును తాకుటలేదు వీరికి కంబళిస్వాము లనిపేరు. ఏలనః— వీరికి కంబళితప్ప వేఱేవియు లేదు వీరు తమకు వలయు భోజనమును బిచ్చమెత్తి భుజింతురు. వీరెవ్వరిని కష్టముపెట్టి యాచింపరు వీరు భోజనముకూడ ఒక్కయింటియందుండి యెప్పుడును గ్రహింపరు ఇట్టివారింకను పలువురుగలరు ఈభూలోకములో దేవతలవలె నుండు వీరు పెట్టనికోటవలె తమధర్మశీలముచే సనాతనధర్మమును సంరక్షించుచుండునంతదాఁక మనప్రాచీనమతము నశించునని మీరు తలంచెదరా?

ఈదేశమునందు పాదిరీలు సంవత్సరములో నాలునెలలు మాత్రము ఆదివారములయందు రెండుగంటలసేపు ప్రసంగము చేయుటకై 30,000; 40,000; 50,000; 60,000; రూపాయలు జీతముపుచ్చుకొనుచున్నారు. తమ మతసంరక్షణముకొఱకు, వారు లక్షలకొలఁది ధనమును వ్యయము చేయుచున్నారు లోక మిట్లుండ, బంగాళదేశపు యువకులు, ఎంతమాత్రమును స్వప్రయోజనమును గోరనట్టి కంబళిస్వాములను సోమరిపోతులని తూలనాడుట యాశ్చర్యమేకదా?

"మద్భక్తానాం చ యే భక్తాస్తే మే భక్తతమా మతాః" "నాభక్తుల కెవ్వరు భక్తులో, వారే నాహృదయసమ్మతమైన భక్తులు" శుద్ధమూర్ఖుఁడైన యొకబైరాగి తాను పోయెడి గ్రామమునందుఁ దనకుఁ దెలిసిన 'తులసీదాసు రామాయణము' లేక 'చైతన్యచరితామృతము' లేక 'దేవహారము' లేక 'పురందరదాసుకీర్తనలు' మొదలగు వానినుండి నీతిభక్తిపై రాగ్యములను బోధించుచున్నాఁడు ఇట్టి కార్యము ప్రజలకు మేలుకదా ? ఈ మేలునకు బదులుగా మనము వారికిచ్చునది, ఒక్కకబళము అన్నమును, ఒకగంతయు నేకదా సోదరులారా! మీరు వారిని దయలేక తూలనాడుటకుముందు, మీరుజన్మించిన దేశములోనే పుట్టినట్టియు మీబీదలగు సోదరులయొక్క ధనముచేతనే విద్యనభ్యసించినట్టియు మీయుపాధ్యాయులలోఁ గొందఱు బైరాగులు సోమరిపోతులని బోధించుట న్యాయమేనా యని యాలోచింపుఁడు

బంగాళాదేశస్థులలోఁ గొందఱు,హిందూమతము వర్ధిల్లుటను జూచి, ఇది హిందూమతనూతనప్రదర్శనమని ఖండించుచున్నారు. ఏలన:—వీరంతవఱకును ఆహారవిహారాదులయందే తమ కాలమునంతయు వ్యయము చేయుచుండినవారు ప్రకృతము, హిందూమతము బంగాళాదేశములోఁ బ్రవృద్ధినొందుటనుగాంచి ఖండింపక వేఱేమిచేయుదురు? ఇది విశృంఖలవృత్తియందు మనస్సును పోనిచ్చినవారికి సహజమే.

శ్రీరామకృష్ణపరమహంసశిష్యులు ఇండియాయంతటఁ బ్రవేశించి ప్రసంగము చేయుచున్నారు కదా. ఆ ప్రసంగము

షట్ఛాస్త్రములకు సంబంధించినదియా కాదా? యను విషయ మును చర్చించుట కీపత్త్రికయందు స్థలములేదు అయిన, మా ప్రతిపక్షులకు మాయభిప్రాయములను గొన్నిటిని దెలుప వలయునని తలంచి వ్రాయుచున్నాఁడను.

* కాళీదాస్, † కృత్తివాస్ మొదలగువారి కావ్యములు అమృతతుల్యములు వానిని జదువువారును వినువారును పుణ్యాత్ములనుటయందు సందియములేదు అయినను, వారి గ్రంథ ములనుండియే హిందూమతయథార్థతత్త్వములను గ్రహింప నగునని నేను వాదించువాఁడను కాను. అయినను వేదములను, దర్శనములను, సిద్ధాంతస్థాపకులగు ఆచార్యులను, హిందూదేశ మునం దంతటఁ గలవారిశిష్యులను ప్రమాణముగాఁ గైకొన వలయునని నాయభిమతము

సహోదరులారా! మీరు ప్ర ప్రథమమున గౌతమ సూత్రములను పఠించి, అప్పులనుగూర్చి వారు బోధించిన విషయమును వాత్స్యాయనభాష్యానుసారముగాఁ దెలిసికొని, అనంతరము శబరుఁడు మొదలగువారి భాష్యములతో మీమాంసాశాస్త్రమును జదువం గోరకొంటిరేని, "అలౌకిక ప్రత్య క్షము"ను గూర్చి వారి యభిప్రాయ మెట్టిదనియును, అప్తులను వారెట్టివారనియును, ఒక్కొక్కరును అప్తులు కానగునా?

* కాళీదాస్ — ఇతఁడు మహాభారతమును బంగాళాభాషయందు రస వంతమైన పద్యకావ్యముగా రచియించెను.

† కృత్తివాస్ — ఇతఁడు రామాయణమును మృదుమధురముగా బంగా ళాభాషలో పద్యకావ్యముగా నిర్మించెను.

కాఁగూడదా! యనియును, వేదములు అట్టి ఆప్తవాక్యములై యుండుటంబట్టియే ప్రమాణముగా నంగీకరింపఁబడియున్నవని యును దెలియఁగలరు

యజుర్వేదమునకు శ్రీమహీధరులు వ్రాసిన భాష్యటీకను జదువుటకు వీరా కవకాశముండు నేని, అందు వేదములు ఆత్మోజ్జీవనమార్గమునే బోధించుచున్న వనియును, అవి నిత్యమని యును స్పష్టముగాఁ జెప్పఁబడియుండుటను దెలిసికొనవచ్చును

సృష్టియొక్క నిత్యస్థితిని గూర్చినవిషయము, హిందూ మతమునకు మాత్రమే గాక, బౌద్ధమతమునకును జైనమతము నకును సామాన్యమైనదిగా నున్నది.

ఇప్పుడు ఇండియాలో నుండు సకల మతస్థులను, సాధారణముగా జ్ఞానమార్గము, లేక భక్తిమార్గము ననుసరించిన వారైయున్నారని చెప్పఁదగును శ్రీ శంకరాచార్యులు రచియించిన శారీరకభాష్యముయొక్క ఉపోద్ఘాతమునందు, జ్ఞాననిరపేక్షత్వము చక్కఁగా విమర్శింపఁబడి యుండుటను; బ్రహ్మానుభవమునకును మోక్షప్రాప్తికిని కర్మము జాతి వర్ణము మొదలగునవి యవశ్యము లేదనియును, సాధనచతుష్టయ సంపన్నులగువా రందఱును దానిని పొందవచ్చు ననియును జెప్పఁబడి యున్నది.

ఇట్లే భక్తిమార్గమునందు ప్రవృత్తిగలవా రెల్లరును, మోక్షప్రాప్తి నొందుటకు జాతిమతకులగోత్రాదు లక్కఱ లేదనియే చెప్పియున్నారు. ఈ విషయమును బంగాళీ వారంద

తెలింగియే యున్నారు. కాఁబట్టి భక్తియొక్కటే ముఖ్యముగా నుండవలసినది.

జ్ఞానమునకును భక్తికిని నిబంధనమేదియు లేనని సకల స్థలములందు చాటింపఁబడియుండుటయే గాక, మోక్షప్రాప్తికి జాత్యాదినిబంధనము లావశ్యకములని యే ప్రమాణమునందును జెప్పలేదు "అన్తరాచాఽపితు తద్దృష్టేః" అనెడివ్యాససూత్రమునకు శంకర, రామానుజ, మధ్వాచార్యులు వ్రాసియుండు భాష్యమును జూడుఁడు

ఉపనిషత్తులను పఠింపుఁడు ; సంహితలను జదువుఁడు. వానియందు ఇతర మతస్థులు కొందఱు చప్పిన నిబంధనములు కనఁబడవు అయినను, అన్నిటికిని ఆధారముగ నుండెడి అథర్వవేదసంహితయొక్క నలువదియవయధ్యాయము నొక్కమాఱు చూడఁదగును నాజ్ఞప్తి సరిగానుండునేని, మూఁడవ, లేక నాలవశ్లోకము "న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్" అని ప్రారంభించుచున్నది ఈ యభిప్రాయము సకల స్థలములందును జెప్పఁబడి యున్నది ఇండియాయందు ఒకఁడు తన యిష్టదైవమును గొలుచు చున్నందులకుఁగాని, నాస్తికుఁడు లేక లోకాయతమతస్థుఁడైనందులకుఁ గాని, వాఁడు కులాచారపద్ధతులను మీఱక యుండినంతవఱకును వాని నెవ్వరును దూషింప లేదుకదా ? ఒకఁడు కులాచారపద్ధతులను మీఱి వర్తించినందులకు శిక్షింపఁ బడి యుండినప్పటికిని, మోక్ష ప్రాప్తికొఱకు కట్టి నిబంధన మేదియు లేదు. ఎంతఁటి నీచుఁడైన వాఁడును ఆస్థానమునుండి తొలఁగింపఁబడఁడు.

కాఁబట్టి కులాచారములను మతమును మిశ్రముచేసి భ్రమింప రాదు. దృష్టాంతముగా మలయాళదేశమునందు అగ్రహార ములో చండాలుఁడు ప్రవేశింపఁ గూడదు. అయినప్పటికిని, వాఁడు క్రీస్తుమతములోఁగాని, లేక మహమ్మదు మతములోఁ గాని ప్రవేశించినేని వాఁ డగ్రహారమున నిర్భయముగా ప్రవే శింపవచ్చును. ఈ యాచారము చాలకాలముగా హిందూ రాజుల దేశములందు ప్రచారమునం దున్నది ఇది పలువురకు విచిత్రముగాఁ గానంబడును అయినను, ఇట్టిపద్ధతి సమ్మతము గాని స్థలములందు సైతము, మనహిందూమతము ఇతరమత స్థుల యెడఁ గనఁబఱచెడి సర్వసాధారణపద్ధతిని (సమత్వబుద్ధిని) సూచించుచున్నది.

ప్రపంచమందలి సకలమతములకంటెను, ఏవిలక్షణపద్ధతి హిందూమతమునందు మాత్రమే కానంబడుచున్నదో, దానిని బోధించుటకొఱకే మహర్షులు సంస్కృతభాషయందుఁ గలశబ్ద జాలమునంతయు ప్రయోగించియున్నారు ఆవిలక్షణపద్ధతి యేదియనఁగా:— మనుష్యుఁడు ఈజన్మమునందే బ్రహ్మాను భవము నొందవలయు ననుటయే. ఈయభిప్రాయము ననువర్తిం చియే "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అనునీమొదలగు అద్వైత వాక్యము లుద్ఘోషించుచున్నవి

ఇట్టి ఉత్తమసాధనములందుఁ బ్రవేశించిన ముముక్షువు లకు భగవంతునియనుగ్రహము తప్పక గల్గును ఈయభిప్రాయ మును బోధించినవారు ఋషులును విదురుఁడును ధర్మవ్యా

ధుఁడు మాత్రమే యని తలంపకుఁడు. బాదూమతస్థుఁడైన నిశ్చలదాసనెడి సన్న్యాసి, తాను రచియించిన విచారసాగరము నందు "బ్రహ్మమును దెలిసికొన్నవాఁడు బ్రహ్మమే యగుచున్నాఁడు; వాని వాక్యములన్నియు వేదములు; అవి సంస్కృతమునందును వేఱే యేదేశభాషలోనున్నను అజ్ఞానాంధకారమును బోఁగొట్టును" అని కొంతకాలమునకు ముందుధైర్యముగాఁ జెప్పియున్నాఁడు.

కాఁబట్టి, ద్వైతులు చెప్పెడిచొప్పున బ్రహ్మమును అనుభవించుటయును లేక, అద్వైతులు చెప్పెడివొప్పున బ్రహ్మస్వరూప మగుటను గూర్చియే వేదములన్నియు బోధించుచున్నవి వానిలోని యితరోపదేశములన్నియు నా ముఖ్యోద్దేశ్యమును బొందుటకొఱకు సాధనములై యున్నవి. శ్రీశంకరాచార్యులయొక్క శ్రేష్ఠమైనమహిమ యేదనఁగా:—వారి సూక్ష్మబుద్ధియే మొట్టమొదట వ్యాససూత్రములయొక్క అభిప్రాయమునంతయు సకలజనులు గాంచి యాశ్చర్యమొందునట్లు భాష్యమును రచియించుటయే యగును

ఎట్లు శుద్ధబ్రహ్మమొక్కటిమాత్రమే సత్యమైనవస్తువో అట్లే, వివిధమతస్థులును, ఆబ్రహ్మముయొక్కఖండమైన విషయములనే ఆధారముగానుంచుకొని ప్రవర్తించుచున్నారు కావున, ఇట్టివా రేదేశమున నున్నప్పటికిని, వారియభిప్రాయమంతయు ఆసత్యమైన బ్రహ్మవిషయమునకే సాధనమైయున్నదని తెలియఁదగును.

ఒకఁడు సూర్యుని కభిముఖముగాఁ బోవుచున్నాఁడని యెంచికొనుఁడు. వాఁడు తన ప్రయాణములోని యొక్కొక

యెదుగునందును సూర్యునియొక్క ప్రత్యేక ప్రత్యేక స్థితులను గనుంగొనును సూర్యుని ఆకారమును, దర్శనమును, ప్రకాశ మును వాఁడు సూర్యుని కడకుఁబోయి చేరువఱకును వానికి ప్రతినిమిషములోను నూతనముగాఁ గనఁబడుచుండును వానికి సూర్యుఁడు మొదట నొక పెద్దబంతివలె కనఁబడును పిమ్మట క్రమక్రమముగా సూర్యబింబము గొప్పగాఁ గనంబడును. వాస్తవమునందు సూర్యబింబము పెద్దబంతివలెఁ గాని, లేక క్రమముగా గొప్పదియగుటయుఁగాని లేదు అయినను మన యాత్రికుఁడు చూచినది సూర్యునితప్ప వేఱే దేనినికాదనునది సత్యమేకదా ! ఇట్లే సకలమతభేదములు సత్యములే, అయి నప్పటికిని, కొన్ని మతసిద్ధాంతములు 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' అనునీసత్యము సూర్యునికిసమీపముగను, కొన్ని దూరముగను నున్నవి

ఇట్టి శుద్ధబ్రహ్మలక్షణమును ఉపదేశించు మతగ్రంథము లన్నియు వేదములేయగుటచేతను, ఇతర దైవభావనలన్నియు దీనికంటె తక్కువయు సూక్ష్మమునై యుండుటచేతను, సర్వ లోకహితైషియగు వేదము ముముక్షువును బ్రహ్మమును బొందునట్లు చేయుతలంపుచే క్రమక్రమముగా విశ్వాసము తోడ చేయిఁబట్టి తోడ్కొనిపోవుచుండుటచేతను, లోకము లోని మతములన్నియు సనాతనమైన వైదికమతములో నంత ర్భూతమైయున్నవని యెఱుంగనగు.

మీరు వేలకొలఁది సంవత్సరములు జీవించిమీ కాలము నంతయు పరబ్రహ్మము నెఱుంగుటకే యుపయోగింపుఁడు. అప్పటికిఁగూడ బ్రహ్మజ్ఞానమునకు సాధనమైనదియు అపారమైన

దియు నగు వేదమునందు ఇదివఱకుఁ గనిపెట్టని విషయము నేదియుఁ గనిపెట్టలేరు.

హిందువు లనుష్ఠించు విగ్రహారాధనమును గూర్చి విమర్శించుటకు మునుపు, వారిపూజాక్రమమును ముందుగా నాలోచింపుఁడు. వారు నిశ్చయముగా దేవుని ఎచ్చటఁ బూజించెదరు? ఆలయమునందా? విగ్రహమునందా? లేక, తమ శరీరమనెడి యాలయమునందా? మొట్టమొదట వారేమిచేసెదరని నిశ్చయముగాఁ దెలిసికొనుఁడు విగ్రహారాధనమును దూషించువారిలో నూటికి తొంబదితొమ్మిదిమందికి ఈవిషయమును గుఱించిన జ్ఞానమే లేదు అయినను, ఆకర్మలన్నియు అత్యావశ్యకములు గావు ఒకొ్కకఁడును వార్ధకదశయందు సన్న్యసింపవలయుననియును, అట్లు వారవలంబించినను అవలంబింపక పోయినను సర్వకర్మలను త్యజింపవలయుననియును మనువు చెప్పియున్నాఁడు సకలకర్మలును జ్ఞానమునందే యడఁగియున్నవని పలుచోటులందుఁ జెప్పఁబడి యున్నది "సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే"

మతమునుగూర్చి చెప్పందొడంగినప్పుడు, అన్యదేశములందు అనేక శ్రేష్ఠజాతిలోఁ బుట్టినవారికంటె, హిందూదేశమునందు జన్మించిన హీనజాతివారికిఁ గలమతజ్ఞానము అధికమని చెప్పవలెను. నామిత్రు లొకరు నాయుపన్యాసములందు మతము, తత్త్వశాస్త్రము మొదలగు వానిలోని పారిభాషిక పదములను దెలుపుటకై ఆంగ్లేయపదముల నుపయోగింపఁగా, వారట్లుపయోగింపవలదని నన్ను ఖండించిరి అయినను నాయుప

న్యాసమును వినువారు ఆంగ్లేయు లనుటను వారు మఱచిరి. ఒకహిందూ క్రీస్తుపాదిరి, హిందువులుసంస్కృతగ్రంథములందలి విషయములను మఱచిపోయి రనియును, పాదిరీలు ఆవిషయములను వెల్లడించి రనియును నాతోఁ జెప్పినాఁడుగాని, నేను ఉపన్యసించినప్పుడు ఆమహాసభయందున్న పాదిరీసమూహములో నొకనికేని యొక్కసంస్కృతపదమైనను దెలియలేదు అయినను, వారు హిందువుల వేదములను శాస్త్రములను, మత గ్రంథములను ఖండించుచు ఉపన్యాసములను వ్రాసికొనివచ్చి చదివిరి నేను ఏమతస్థునకును విరోధికాను. అట్లే ఇండియా యందుండు పాదరీలకును విరోధికాను అయినను వారు అమెరికాలో ధనమును సంపాదించెడి యుపాయములను గూర్చి మాత్రము ఆక్షేపించెదను

బాలురు చదవెడి పాఠపుస్తకములలో హిందూదేశమునందుఁ బుట్టిన హిందూబిడ్డలను వారితల్లులు దయలేక తమ బిడ్డలను గంగానదిలోని మొసళ్ళకు ఆహారముగాఁ బడవేయుచున్నారనెడి భావముగలపటములను ముద్రించుటకుఁ గారణమేమి? మఱియు నట్టిపటమునందు తల్లిని నల్లవర్ణముతోను, బిడ్డను తెల్లవర్ణముతోను చిత్రించుటకు హేతువేమి? దానిని చదువువారికి కనికరము పుట్టుననియును, అందువలన వారు ధన మిత్తురనియేకదా? ఒకఁడు తనభార్యనుచంపఁగా, అదియొక దయ్యమై, వేఱొక్కతె తనపతికి వశురాలు కాఁగలదని యెంచి దానిని చంపి నిప్పులోఁబడవైచునట్టి చిత్రములను లిఖంచుటకుఁ గతంబెయ్యది? గొప్ప రథములచక్రముల క్రింద తమ బిడ్డలను

పడ వేయునట్టి భావముగల పటములను ప్రకటించు నుద్దేశ్య మేమి? కొన్నాళ్లకు ముందీయూరిలో ముద్రింపఁబడినగ్రంథము నందు, గ్రంథకర్త కలకత్తాకుఁ బోయినప్పుడు మహావేశముగల వారిపై రథము పోయినట్లు వ్రాసియున్నారు ఇతనివంటి ఘనుఁ డొకఁడు ఇండియాలో నొక్కొక గ్రామములోను శిశువుల శల్యములు నిండియుండు పడియగలదని "మెంబిస్" నగరములో ప్రసంగింపఁగా విన్నాఁడను

క్రీస్తువునకు శిష్యులైన వారు, హిందువు లందఱును మహాపాపులనియును, ఘోరపిశాచములనియు, ఒక్కొక్క క్రీస్తుబాలునకును బోధించుట కేమి కారణము? హిందువులు వీరికేమి కీడుచేసిరి?

క్రీస్తువులు, ఆదివారములందు, వారి బాల బాలికలకు మతబోధ చేయునప్పుడు, క్రీస్తువులు కానివా రెల్లరును పాపులనియు అందు ముఖ్యముగా హిందువులనియు నేర్పెదరు. ఇందులకుఁ గారణము ముఖ్యముగా, ఆ బాలురకు, బాల్యము నుండియే వారి ధనమును మిషనుల కిప్పించ వలసినదని బోధించుటయేకదా?

సత్యమునకు భయపడక పోయినప్పటికిని, తమ బాలుర యభివృద్ధి కొఱకైనను, క్రీస్తుపాదిరీలు ఇట్టికీడును తొలఁగించుటకుఁ బ్రయత్నింపవలయును బాల్యమునుండి యిట్టి దుర్మార్గమునందు బుద్ధి ప్రవర్తించినచో, వారు పెద్దవారైనప్పుడు మహాపాతకమునకు వెఱవని దుర్మార్గులగుట కాటంకముండునా?

ఏపాదిరి నిత్యము నగరమునందు జరగు చిత్రవధలను, అచ్చట మండుచుండు అగ్నిని, గంధకమును గూర్చి వర్ణించి ప్రసంగించునో, అట్టివాఁ డధిక భక్తిగల పాదిరి యని వారి సమూహామునందు గౌరవింపఁబడును.

నా మిత్రునియింట పనిచేయు దాసియొక్కతె యిట్టి నరకవర్ణనమును విని, అభయముచేత పిచ్చి పట్టినదాయెను. పిమ్మట, దానిని పిచ్చి కుదిర్చెడి వైద్యశాలకుఁ బంపిరి ఇందు లకుఁ గారణమేమి? క్రీస్తుపాదిరి యుపదేశించిన నరకాగ్నియు, గంధకము కలిపిన క్రీస్తుబోధయను ఔషధప్రభావమేకదా?

చెన్నపురియందు క్రీస్తువులు ప్రకటించు ప్రతి గ్రంథము నందును హిందువులకు విరోధమైన విషయములును, క్రీస్తువులు కానివారికి నిత్యనరకమును నిత్యదండనమును గల్గునని వ్రాయు టయేగాక, అచ్చటచ్చట నీవిషయమునే బోధించుచుండెదరు.

నేనిచ్చటికివచ్చి సంవత్సరమున కధికమైనది. క్రీస్తువుల నడవడికలను చాల సూక్ష్మదృష్టితోఁ బరిశీలించుచున్నాఁడను. ఈదేశమందలి జనులతోఁ గలసిమెలసియు నున్నాఁడ ప్రకృ తము నాకు సత్యమని తోఁచిన దేమనఁగా: పాదిరీలు మనలను చెప్పినట్లు మనము పిశాచులము కాము వారు చెప్పుకొనునట్లు వారు దేవతలును కారు పాదిరీలు గౌరవముగా కాలముగడపుట కును, వారి యక్రమములు వెలువడనీకయుండుటకును గోరుదు రేని, హిందువుల శిశుహత్యలు, వివాహపద్ధతులు మొదలగు వానినిగూర్చి ప్రస్తావింపక యుండవలయును పాదిరీలు హిందు వులను వారిమతమును గూర్చి కల్పించెడి యబద్ధమైన విషయ

ములను, అట్లే అన్యదేశములందలి వాస్తవమైనవిషయములను ప్రత్యేక ప్రత్యేకముగా పటములందు లిఖించి చూచినచో, హిందువుల విషయమైన పటము అణుమాత్రమును, అన్యదేశ విషయమైన పటము మహామేరుమాత్రము నై కానంబడును

అయినను ఈవిధముగా పరులను దూషించుటకై నన్నె వ్వరును జీతమిచ్చి నియమింపలేదు. తత్కాలములో హిందువు లాచరించునవియెల్ల నుత్తమ మనియుఁ జెప్పువాఁడను కాను నేను హిందువులయాచారక్రమమునంతయుఁ జక్కఁగా నెఱింగినవాఁడను ఓ అన్యదేశ సోదరులారా, మీరు నాకు చెడుగుచేయకుండవలయునని వేఁడుచున్నాఁడను చాలకాల ముగా కష్టముల ననుభవించుచుండు హిందువులను నిరంతర మును నోటికివచ్చినట్లు తిట్టక, సన్మార్గులు మీరేయనెడి ప్రతి ష్ఠను బొందఁ గోరుదురేని, లోకములోని సకల జాతులకంటెను హిందువులు సన్మార్గమునందు ప్రసిద్ధులని సిద్ధాంతము చేయఁ గలను

హిందూదేశము నందలి మతము ఏ కాలములోను నిర్బం ధమునకు లోనుగానిది ఒకఁడు తనయిష్టదైవమును గొల్చు టకుఁగాని, తన కిష్టమైన మతమును అవలంబించుటకుఁ గాని, తనకు సమ్మతమైన గురువు నాశ్రయించుటకుఁ గాని, ఆక్షేపిం చుటలేదు కాఁబట్టి మతము వేఱే యేదేశములోను వృద్ధి కానంతటి యభివృద్ధి హిందూదేశమునందు కల్గియున్నది మతము మిక్కిలి యభివృద్ధి నొందుచుండి నందున, దానికి వలయు కట్టుదిట్టములు చేయవలసి వచ్చినది దీని ప్రయోజన

మేమనఁగా: ఆచారములు క్రమక్రమముగా మంచిస్థితికి రాక, పూర్వస్థితియందే నిలిచిపోయినవి అభివృద్ధికి మూలాధారము నిర్బంధరాహిత్యమే కదా? అయినను, పశ్చిమదేశమందు మతము నిర్బంధమునకు లోనైయున్నది లౌకికనాగరకమునందు మాత్రము నిర్బంధము లేదు ఐరోపాదేశీయులందు మతనిర్బంధ మతికఠినముగా నుండుటంబట్టి, దానిని మీఱి వర్తించువాఁడు దూషింపఁబడుచున్నాఁడు దీనిసారాంశ మేమనఁగా, అద్భుతమైన లౌకికనాగరికములం దాసక్తియు, నాస్తికభావమును తలకెక్కియున్నవేగాని, ఇంతకంటె శ్రేష్ఠమును కనుఁగొనుటకు వలనుగాక యుండుటయే యగును

ప్రకృతము పశ్చిమదేశము మేల్కాని తనదుర్బలస్థితినిఁ దెలిసికొనినది కాఁబట్టియే ఆదేశములోని మతప్రవర్తకులలో శ్రేష్ఠులైనవారు ఆత్మస్థితినిఁ దెలిసికొనుటకై, వేదాంతవిచారము చేయుచున్నారు సంస్కృతభాష నెఱింగిన పశ్చిమదేశీయులెల్లరును ఈమహోపదేశము సత్యమనియు సర్వవ్యాపకమైన దనియు నెఱుంగుదురు

హిందూదేశము దినదినమునకు మార్పునొందుచుండుట వలన, మనయాచారములన్నియు కాలానుసారముగా సంస్కరింపఁబడవలయునని యేర్పడుచున్నది హిందూదేశమునందు సుమారు డెబ్బదిసంవత్సరములనుండి సంఘసంస్కారస్థాపకులును సంఘసంస్కారబోధకులును సముద్రతరంగములవలె బయలుదేఱుచున్నారు అకటా! వారొక్కరును అపజయమునే పొందుచున్నారు. పాపము, వారేమి చేయఁగలరు. రహస్య

మును సత్యమునైనవిషయములను ఎఱుంగనివారు ఒక్కొక్క రును దెలిసికొనవలసిన రహస్య విషయములను వారు తెలిసి కొనలేదు మనలోని ప్రతి దోషమును మతముపై మోపి, తన స్నేహితుని తలపైని యీఁగను చంపుటకుఁ బ్రయత్నించిన వాని కథవలె, అనఁగా ఈఁగను కొట్టిన దెబ్బచేత స్నేహితుని తల పగిలిన విధమున, మతనాశముకొఱకు పాటుపడు చున్నారు వీరు మంచికాలమునకుఁ గాఁబోలు తాము బండ ఱాతిపై తమ తలను మోఁదికొన్నందున, వారి ప్రయత్నము లన్నియు వ్యర్థములయ్యెను. వారు కుమార్గమందుఁ బ్రవేశించి నప్పటికిని, వారి యభిప్రాయము మాత్రము దేశక్షేమమును గూర్చినదిగా నుండుటవలనను వారికి మనము కృతజ్ఞులమై యుండవలయును ఏలన, చాలకాలముగా గాఢ నిద్రఁజెంది యున్న మనవారిని లేపుటకై వారి మంచి మాటలు మనకు కావలసియుండినవి. అయినను, వారు కైకొన్న సాధనము లన్నియు క్రైస్తవమునంగలి యాచారములను నిర్మూలించుటకు శక్తికలిగియుండినవేగాని, ఆ మహాపాశ్చాత్యస్థానములందు వేఱొక నూతనసదాచారమును నెలకొల్పుటకు శక్తిలేనివై పోయి నందున, వారి సాధనములు నిష్ఫలములైనవి

మనము వారిని దీవింపవలయును ఏలన, వారు "మేము చేసినట్లు ఆభాససంస్కారములు చేయవలదు; అట్లు చేసితిరేని, మావలె మీరును అపజయము నొందుదురు" అని మనకు తమ యనుభవమును దెల్పెడివారివలె నున్నారు ఒక్కొక్క సంస్కారమును లోపలఁ బ్రారంభించి బయటికిఁ దేవలయునని

యును, ఒక్కొక సృష్టియు గడచిపోయిన లయమునుండియే కలుగ వలయుననియును వారెఱుంగరైరి విత్తనము చుట్టు పట్లగల పదార్థములను తన వశముచేసి కొన్న తర్వాతనే తాను నా జాతి చెట్టగుచున్నదనెడి యాలోచనమును వారు మఱచి పోయిరి ఒకవేళ హిందూజన మంతయు నశించి వేత్తేమతస్థులు హిందూదేశములోఁ బ్రవేశించినప్పుడు, వారు తలంచి యుండునట్లు జరుగునేమోగాని, అంతకు లోపల వారు తలంచినట్లు జరగదు హిందూదేశమే ప్రయత్నించినప్పటి కిని, ఐరోపాదేశమే ప్రయత్నించి నప్పటికిని, హిందూదేశము జీవించి యుండునంత దాఁక యీ దేశము ఐరోపాదేశము కానేరదు

అయినను మన హిందూమాత చచ్చునా? ప్రాచీన కాలమునుండి ధర్మార్థకామమోక్షము లనెడి చతుర్విధపురు షార్థములకు జన్మస్థానమును, మహార్షులవతరించిన పరిశుద్ధ ప్రదేశమును, నేఁటిదాఁక పుణ్యాత్ములను కలుగఁజేసినదియు నగు ఆర్యావర్తము నశించునా? మహాప్రకాశముగల దీప మును జేతఁబట్టికొని ప్రపంచమందలి సకలస్థలములందును మీరాతోఁ గూడవచ్చదను హిందూదేశమునందువలె వేఱేయే దేశములోనైనను మహాత్ములనుగాని పుణ్యాత్ములనుగాని మీకు సాధ్యమగునేని చూపఁగలరా? "చెట్టుస్వభావమును పండు వలనఁ దెలియఁదగు" ననెడి యార్యోక్తి సత్యమేకదా! ఇండి యాలో నుండు ఒక్కొక మామిడిచెట్టునకుగల రాలియుండు పురుగులతోఁ గూడిన దోరకాయలనుగూర్చి యెంత వ్రాసి

నప్పటికిని ఒక్క మంచిజాతి మామిడిపండు ప్రభావమును గూర్చి వ్రాసినట్లగునా ? అట్టిమధురమైన మామిడిపండును మీరు గ్రహించి పరీక్షించి యుండురేని, మీరు మామిడిపండ్ల గుణమును గ్రహించినవారని చెప్పఁగలను

ఇట్లే ఇండియాలోని జ్ఞానులు తమయనుష్ఠానముచేత హిందూమతప్రభావ మిట్టిదని పరిదీకరించెదరు ఏ ఉత్తమ మతము తన్ననుసరించినవారికి శ్రేష్ఠమగు ఇహలోకసౌఖ్యమును పరలోకసౌఖ్యమును అనుగ్రహించుచున్నదో, వేల కొలఁది సంవత్సరములనుండి యెన్నికష్టములు సంభవించినప్పటికిని, నూర్పుచెందక తన దృఢమగు యావనదశతో ప్రకాశించుచున్నదో, అట్టి హిందూమతస్థితిని, శక్తిని, దాని ననుసరించువారు పొందెడిఫలమును పైన చెప్పిన జ్ఞానులు కన పఱచెదరు

ఇండియా నాశమగునా ? అది నశించునేని ప్రపంచములోని ప్రీతి, భక్తి, జ్ఞానము, వైరాగ్యము, ఇవి యన్నియు నాశమగును నశించినమీఁదవాని స్థానమునందు కామమును భోగమును దేవతలుగను; సంపదయే గురువుగను; వంచనము, జూదము, అక్రమము ఇవియే పుణ్యకర్మములుగను; కడపట మనుష్యుఁడే వీనికి బలిగను సిద్ధించు ననుటయం దెంతయు సంశయముండదు అయినను ఇట్టి వైపరీత్య మెన్నఁటికినిఁ గలుగదు కావున ఇండియా నాశముకాదు

ఇండియా ఇన్నిదినములు కష్టమొంది సుఖ మనుభవింపక యుండునా ? కష్టముల నోర్చినవారు తప్పక సుఖ

మొందుదురు. ఈ విషయము అందఱెఱింగినదే కదా? ద్వేషించుటకంటె విశ్వాసముంచుట శ్రేష్ఠమైనది కదా ? కాఁబట్టి, ప్రకృతము హిందూమత వృద్ధినిఁగాంచి యిది ఉత్త ఆరంభశూరత్వమని పల్కువారు మతిలేనివారే యగుదురు

ఇట్లు తత్కాలమునందు హిందూమతము అభివృద్ధి నొందుటకు కారణమేమో దానిని విమర్శింతము.

ప్రకృతము పశ్చిమదేశ మతములు విజ్ఞాన (సైన్సు) పరిజ్ఞానముచే నిరుపయోగములై యున్నవి; మూఢవిశ్వాసముతో మిషనరి సభలయందు ఎన్నికచేత సిద్ధాంతీకరింపఁబడినవియే ప్రమాణములై యున్నవి; కావున, శాస్త్రవిచారమనెడి సమ్మెటపెట్టుచే నా మతములు నిర్మూలింపఁబడినవి; ఇట్టి సమయమున, వారి మతగ్రంథములకు నూతనవ్యాఖ్యానములు చేయుచున్నారు; అయిననేమి ? ఆవ్యాఖ్యానములును పొసఁగక పోయినవి; ఇందువలన వారి మతగ్రంథములన్నియు గృహాలంకారములై పరిణమించియున్నవి, కాఁబట్టి, పశ్చిమదేశీయులు మతసత్యము నెఱుంగుటకై ప్రయత్నించుచున్నారు; ఇట్టి సమయమునందు వాస్తవముగా జీవించియుండు మతములు, అమృతకలశము లనెడి వేదము లందలిజ్ఞానామృతమును పానముచేసినట్టి హిందూమతమును బౌద్ధమతమును నీరెండని తెలియుట యాశ్చర్యమేకదా?

పశ్చిమ దేశమునందు మతసత్యములను కనుఁగొనుటకుఁ బ్రయత్నించువారందఱును భగవద్గీతయు, ధర్మపదమను బౌద్ధగ్రంథము ననునవియే సత్యములైనవని చాటించుచున్నారు.

ఇంతవఱకును హిందూమతమునుగూర్చి పరదేశస్థులు దూషించు చుండినప్పటికిని, ప్రకృతము శాస్త్రవిచారముచే హిందూమత మొక్కటి మాత్రమే శ్రేష్ఠమైనదని కనుఁగొనిరి. మఱియు హిందూమతమును ఎదిర్చిన మతములలోఁ గొన్ని నాశమొందినవి మఱికొన్ని మతములు హిందూమతము ననుసరించి సంస్కరించు కొనుచున్నవి ఇంతకాలము తన దేశస్థితినిగూర్చి దుఃఖించుచు రోదించుచున్నను హిందువైనవాఁడు కన్నీటినిఁ దుడిచికొని చూడఁదొడంగినంత, "ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్" అని ప్రశంసింపఁబడిన సనాతనధర్మవృక్షమును ఛేదింప నెంచి ఖడ్గమును దాల్చి వచ్చినవాఁడు, తనకత్తిని ప్రణమును ఛేదించు కత్తిగామార్చుకొన్నాఁడు.

ఇప్పుడు తనమతమును నెలకొల్పుటకై వేదవాక్యములకు విపరీతార్థములు చేయుట మొదలగు యుక్తులన్నియు వ్యర్థములని తెలిసికొన్నాఁడు. ఇక్లేల చేయవలయును? తనమతమునందలి దుర్బలవాక్యములన్నియు దుర్బలుఁడగు మందాధికారికొఱకు చెప్పఁబడినవని చెప్పవచ్చునుగదా! ఇట్లు చెప్పుటకే "అరుంధతీదర్శనన్యాయము" అని పేరు ఈన్యాయమును మనపూర్వమహార్షులు అవలంబించియున్నారు ఇదివఱకుఁగనిపెట్టఁబడినసత్యమును, ఇఁకముందుఁ గనిపెట్టఁబడనున్న సత్యమును తనలో నిమిడ్చుకొనునంతటి వైశాల్యముగలదియును, ఏకాలమునందును నిరోధించుటకు సాధ్యముకానిదియు నగు సర్వోత్కృష్టమైన మతమును స్థాపించిన ప్రాచీనమహార్షులను

మనము నమస్కరించి పూజింపవలయును. మఱియు అన్య మతములు నశించుటకుఁ గారణములై యున్న తత్కాలపు యూరోపుశాస్త్రముల పరిశోధనములన్నియును ఇదివఱకే అనేక యుగములకు మునుపే మనపూర్వులు కనిపెట్టి యున్నారనియు నిప్పుడు తెలిసికొన్నాఁడు

కావున, మనము మతసత్యములు వేనినిగాని నష్టకత్యజింపవలసినది లేదు మఱియు సత్యవిషయమును గనుఁగొనుటకై ఎచ్చోటికిని పోవలసినదియును లేదు అయినను మనము చేయవలసిన దేమనః మన పూర్వులు దాచిపెట్టిన సత్యములలో మనకుఁగావలసిన యంతమాత్రమును గైకొనవలయును అనునది యొక్కటియే. ఆపనిని చేయుట కిప్పుడే మన మారంభించి యున్నారము ఇదికదా హిందూమతము మరల నభివృద్ధి నొందుటకు నిశ్చయమైన కారణము

బంగాళాదేశబాలకులారా! ముఖ్యముగా నేను మీతో మనవి చేయుచున్నాఁడను

సోదరులారా! పరదేశీయులు మన హిందూమతమును దూషించుటకుఁ దగిన కారణములన్నియు మనవలననే వచ్చినవని మనమే యొప్పుకొనవలసినవారమై యున్నాము హిందూదేశమునం దితర భాగములయందుఁ గలవారిపై మోపఁబడి యుండు నీతిబాహ్యమైనదోషములకెల్ల మనమే కారణభూతుల మైయున్నారము అయినను, భగవదనుగ్రహముచేత నీరీతిదోషములకెల్ల కారణభూతులమైయున్న మనమే మనస్థితినిఁ దెలిసికొ

న్నారము కాన, ఇఁక మనము దేవుని సహాయముచేత మనలను మాత్రము రక్షించుకొనుటతోఁగూడ,హిందువులందఱును మన సనాతనమతసత్యములను దెలిసికొని యుజ్జీవించునట్లు చేయుదము

మొట్టమొదట కామాద్యరిషడ్వర్గములను జయించి 'అసహన'మను మచ్చను మనము మాపుకొనవలయును. ఎవ్వరిని జూచియు నోర్వలేమి యుండఁగూడదు పుణ్యకార్యములు చేయుప్రతివానికిని జేయిచ్చి తోడుపడ సిద్ధముగా నుండవలయును. ముల్లోకములందుఁ బ్రతివానిని గూర్చియు మేలుఁ దలఁపవలయును.

మన కందఱకును, అనఁగా: హిందూబౌద్ధజైనుల కందఱకును, సమానాధికరణము గలిగినపూర్వార్జితమైన మతమందలి ప్రధానపదార్థ మగునట్టియు, వేదములకు నైతము వర్ణింపనశక్యమైన ప్రభావము కలిగినట్టియు సూర్యచంద్ర నక్షత్రమండలములతోఁ గూడిన సర్వప్రపంచమును దనప్రభావముముందఱ నణుప్రాయములుగా నొనర్చునట్టియు, జననమరణరహితమును సర్వవ్యాపియు నగునది పరమాత్మయొక్కటియే ప్రతిస్త్రీపురుషులును, దేవతలు మొదలు మన కాలిక్రిందఁ బ్రాకుచుండెడు పురుగువఱకుఁ బ్రతిజీవము నట్టియాత్మయొక్క పరిణామవికారముగాని వేఱుకాదు తరగతియందు భేదముగాని వస్తుతత్త్వమునందు భేదము లేదు

ఈయాత్మయొక్క యనంతశక్తిని జడపదార్థమందుఁ బ్రవేశపెట్టితిమేని భాగ్యాభివృద్ధికిని, బుద్ధియందుఁజొరనిచ్చి

నచో బుద్ధిబలమునకును మనయందే యుపయోగించినయెడల మనిము భగవంతుల మగుటకును వినియోగించును.

మొదట మనము ఆత్మస్వరూపము నెఱింగినవాఁడటఁ గదా యితరు లట్లగుటకుఁ దోడుపడవలయును "అగుము. చేయుము" అనునది మనకభిమానవాక్యముగా నుండవలయును. మనుష్యుఁడు పాపాత్ముఁ డని యనకుము. అతఁడు పరమాత్మ స్వరూపమని తెల్పుము. ఎక్కడ నేస్వరూపమున్నను భగవంతునిజ్ఞాపకముఁ జేయుటయే మన ధర్మము

గది చీఁకటిగానున్నయెడలఁ "చీఁకటి" యని యెంత మొఱపెట్టినను ఎంతవ్యసనపడినను ప్రయోజనముః లేదు వెలుతురును దీసికొని రావలయును అప్పుడు చీఁకటిపోవును. అట్లే వ్యతిరేకమైనదియు, నాశనకరమైనదియుఁ, గేవల దోషవిమర్శనమైనదియు, నశించు నని తెలిసికొనును అనుగుణమైనదియు, నుపయోగకరమైనదియు మాత్రమే నిత్యమై నాశనరహితమై యుండును. భగవంతుఁడు కలఁడనియు మనకును భగవంతునికి నభేదమునియు నెఱిఁగి "శివోఽహం, శివోఽహ" మ్మనుచు ధైర్యముగా వర్తింపవలయును. "ఆత్మా సత్యం, జగన్మిథ్యా" అని యెఱుంగుము. నామరూపసహితమైనది నామరూపరహితమైన దానికి లోఁబడినది. శ్రుతులు బోధించెడు పరమార్థమిదియే కాఁబట్టి వెలుతురుఁదెచ్చి చీఁకటిని నశింపఁజేయుఁడు. వేదాంత సింహగర్జనమునకు గుంటనక్కలు కలుగులం దూఱకుండునే? సిద్ధాంతముల నంతట వ్యాపింపఁజేసిన పిమ్మట, ఫలితముజోలి మనకక్కఱలేదు. కావలసినరసపదార్థములను గలిపియుంచిన

దానినుండి కలుగునట్టి పదార్థములరూపములు వానివానిధర్మముల ననుసరించి యేర్పడును. ఆత్మశక్తిని దెచ్చి దేశమంతట వ్యాపింపఁజేసినమీఁదట నందుకుఁ గావలసిన వన్నియుఁ దమంతట వచ్చిచేరును

నీయందలి ఆత్మశక్తిని గనఁబఱచితివేని దాని కనుగుణముగాఁ గావలసిన పరివారమంతయు వెంటనే సమకూరును. వేదమందలి యింద్రవిరోచనుల కథను దలఁచుకొనుము ఇద్దఱకును బ్రహ్మవిద్య యుపదేశింపఁబడినను నసురుఁడగువిరోచనుఁడు తనశరీరమునే బ్రహ్మముగా భావించెను. ఇంద్రుఁడు దేవత కనుక పరబ్రహ్మమని గ్రహించెను మీరింద్రునిసంతతివారు. మీరు దేవతల వంశమువారు మీకు నశ్వర మగుభౌతికపదార్థమెన్నండును ఆత్మగాదు శరీర మెన్నఁడును మీకు ఆత్మ కానేరదు.

హిందూదేశమున నుద్ధారణ మాత్మప్రభావముచేతఁ గాని శరీరబలప్రభావముచేతఁ గలుగదు సన్న్యాసిచిహ్నములైన శాంత్యనురాగకేతనముతోడఁ గాని నాశనధ్వజముతోడఁగాదు భిక్షాపాత్రముయొక్క శక్తిమూలమునఁ గలుగును గాని భాగ్యప్రభావముచేతఁ గాదు. ఆత్మ సర్వశక్తిమంతము శ్రీరామకృష్ణపరమహంసయొక్క పాదస్పర్శచేత బయలుదేఱిన కొద్దిమంది పసివాండ్రను జూడుఁడు వారాతని వార్తను ఆస్సాం మొదలు సింధుపర్యంతము ఆసేతుహిమాచలము వ్యాపింపఁజేసిరి. పాదచారులై 20 వేల యడుగులయెత్తుగల హిమాచలమును మంచుమీఁద నడచి యెక్కిదాఁటి, టిబెట్టుయొక్క యెఱుఁగరానిభాగములందుఁ బ్రవేశించిరి వేలికలు

కప్పుకొని బిచ్చమెత్తి పొట్టపోసికొనిరి వారి నక్కడఁ బలుబాములఁబెట్టి రక్షకభటుల (పోలీసువారి) కప్పగించి చెఱఁబెట్టి తుట్టతుదకు దొరతనమువారు మీరు నిర్దోషులని విడిచిపెట్టిరి.

వారిప్పు డిరువదిమంగి యున్నారు. తేపు వారిసంఖ్యను 20000 లగునట్లు చేయుఁడు మీదేశమున కది యవసరము. ప్రపంచమునకే యవసరము మీయందలి దివ్యప్రభావమును లేవఁదీసితిరేని క్షుత్తృష్ణలును, శీతోష్ణములును, మీరోర్వఁగలరు. సర్వసౌఖ్యములతో నిండియున్న భోగభవనములయందుఁ గూర్చుండి యించుక హితముతో వినోదము సలుపుచుండుట యితరదేశములకుఁ దగును గాని, హిందూదేశమునకుఁ దగదు. మీరు మీసర్వసౌఖ్యములను దొలఁగించుకొనవలయును స్వప్రయోజనపరులు కాఁగూడదు స్వప్రయోజనత్వమునందు దృష్టినుంచిన ఘనకార్యములు నెఱవేఱవు ఈ ప్రపంచమును సృష్టించుటకై విరాట్పురుషుఁడు తన్నుదానే బలిగా నొసంగినాఁడు. మీసుఖమును, మీభోగములను, మీపేరుప్రతిష్ఠలను, గౌరవములను మాత్రమే గాక మీప్రాణములను సైతము దూరముగనుంచి, కోట్లకొలఁది జనులు సంసారసాగరమును దాఁటుటకై యొకవంతెనను నిర్మింపుఁడు మేలొనగూర్పు మీశక్తులనన్నిటిని ఏకము చేయుఁడు ఏధ్వజముక్రిందఁ బోవుచున్నామని యాలోచింపకుఁడు మనరంగు నలుపా తెలుపా ఎఱుపా యని యెన్నవలదు అన్నిరంగులను ఏకము చేసి ప్రేమను ప్రకాశింపఁ జేయు తెల్లనిరంగును కలుగఁజేయుఁడు పనిచేయవలసినది మనపని ఫలము తనంతట కల్గును మీరు పరమాత్మస్థితిని బొందఁ

గోరుదురేని మీకడ్డముగవచ్చు నే మతముగాని ఏజనసమూహముగాని నిల్వదు. ఇఁక రాఁగల కాలమెట్లుండునో యది నాకుఁ దెలియదు దానిని తెలిసికొనుటకును నాకిష్టము లేదు. అయినను ఒకటిమాత్రము నాకుఁ బ్రత్యక్షముగాఁ దోఁచుచున్నది అదియేదనఁగా, మనపూర్వమతజనని మేల్కాంచి నూత్నయౌవనమునొంది సౌందర్యములో మహాప్రకాశమునొంది దివ్యసింహాసనాసీనయై దర్శనమొసంగుచున్నది. ఆతల్లియొక్క ప్రభావమును లోకమంతట శాంత్యాశీర్వచనముల తోడను, బహిరంగముగను ప్రకటింపుఁడు

ఇట్లు

ప్రేమయందును సేవయందును నిరంతరము మీవాఁడనగు,

వివేకానందుఁడు

---

## ఖేత్రిమహారాజాగారికి ప్రత్యుత్తరము

[రాజపుత్రస్థానమండలి ఖేత్రి (खेडिल्) మహారాజాగారు దర్బారు గావించి శ్రీస్వామివివేకానందులవారి ప్రభావమును గొనియాడి యొక శ్రీముఖమును బంపఁగా, దానికి శ్రీవివేకానందులవారు ప్రత్యుత్తర మొసంగిరి. అందలి యభిప్రాయ మిచ్చట వ్రాయఁబడుచున్నది ]

గాంభీర్యగుణనిధి యగు రాజకుమారా!

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్."

"ఎచ్చటెచ్చట ధర్మముచెడి అధర్మము వృద్ధియగుచున్నదో, అచ్చటచ్చట ధర్మమును స్థాపించుటకై నేను అవతరించెదను" అని భగవంతుఁ డానతిచ్చియున్నాఁడుకదా!

ఈవాక్యము అప్పుడప్పుడు ప్రపంచమునందు మతసంబంధమైన యొకవిధమైనశక్తిని సూచింపించునట్టిదిగా నున్నది. ఈమాఱుపాట్లు స్వభావసిద్ధముగా జరుగుచున్నవి; సకలవిషయములందును గలుగు గొప్ప మాఱుపాట్లవలెనే యిదియు జరిగినప్పటికిని,ఆశక్తికి లోఁబడినవి మాత్రమే మాఱుచుండును సృష్ట్యాదియందు గుణములనెడి శక్తులన్నియు నొక్కటిగాఁ జేరియే ప్రపంచమైనది అట్లే లోకమునందు వస్తువులు వేర్వేరై యుండుటయును, దానికి స్వభావమైన ప్రతిధర్మమగు ఏకత్వస్థితియును, అగునీరెండును ఎంతకాలము ప్రజలు ప్రత్యేకప్రత్యేక గుణములను కల్పించికొని జాతియనియు, కులమనియు, పలుభేదముల నేర్పఱచికొనియుందురో, అంతకాలము దనుక అట్లె యుండవలయును

కాఁబట్టి నిష్పాక్షికముగను, మధ్యస్థముగను భేదమైయుండునట్టి యీలోకములో నొక్కొకజాతివారును శ్రేష్ఠమైన యొక్కొకశక్తిని సంగ్రహించుటకును, దానిని వ్యాపింపఁజేయుటకును, దగినట్టి యొక ఆశ్చర్యమైన "శక్తిజన్యచలన" యంత్రమువంటి దొకటి కల్గును ఆజాతియందు ఆశక్తియే ముఖ్యగుణముగా వెలుఁగును మనుజస్వభావమునందు ఆజాతివారిని నితరజాతులవారు బాధించినప్పుడు, వారిని పాతాళముదాఁక నణఁగఁద్రొక్కుటకు వెనుదీయరు ఆజాతిని అది (ఆశక్తి)

మధ్యస్థానముగాఁ జేసికొని మీఁదికివచ్చును. అట్లే లోకము నందు మతసంబంధవిషయములయందు కళవళమేర్పడిన కాలము నందు అది హిందూదేశమునందు అనేకములగు మాఱుపాటు లను కలిగించుట నిశ్చయము. ఇండియాదేశము అప్పుడప్పు డుద్భ వించు మతోద్రేకమునకు మధ్యస్థానమైయున్నది ఏలనః— హిందూదేశము సకలదేశములకంటెను మతవిశ్వాసమునందు ప్రఖ్యాతి నొందినది.

ఒక్కొ్కఁడును వానివాని యభిప్రాయమును నెఱవేర్చు కొనుట కనుకూలమేదియో దానినే సత్యమని చెప్పుచున్నాఁడు. ఇహమునందే బుద్ధిగలవానికి ధనముగా మార్పునొందఁ దగిన వన్నియు సత్యములు; అట్లు కానిదంతయు అసత్యము. అధికార ప్రియునకు తాను పరులనేలుటకుఁ దగినకోరిక కనుకూలము లగునవియన్నియు సత్యములు తక్కినవి అసత్యములు. మనుష్యుఁడు దేనిని కోరియున్నాఁడో, అది లభింపనియెడల, అందేమియు లేదనుచున్నాఁడు ధనమునకును ప్రఖ్యాతికిని ఇంకను కొన్ని ఇహభోగములకును తమశక్తిని మాఱుబేర ముగా వినియోగించుటయందే లక్ష్యమునుంచి యుండువారల కును, వ్యూహములుగా పన్నినసేనతోఁగూడ ప్రయాణము చేయుటయందే తమశక్తినిఁ గనఁబఱుప నెంచినవారలకును, ఇంద్రియభోగములే అనుభవింపఁదగినవని తలంచువారికిని, హిందూదేశము తమకోరికకు ప్రతిబంధకమై మృత్యువువంటి గాలివీచునట్టి యెడారితో సమముగా నుండును

ఇంద్రియచాపల మనెడి లోకమునకు చాలదూరమునఁ బ్రవహించుచుండు నిత్యత్వమనెడి నదీజలమును గ్రోలుటచే, జన్మమువలయు ననెడి వారిదాహము (దప్పి) తీఱినదో, పాము తనకుబుసమును వదలునట్లు ఎవరియొక్క ఆత్మ, కామము కాంచనము కీర్తి అను నీకోరికలు తొలఁగిపోయినవో, పాశబద్ధులైన వారిచే ప్రియమనితలంపఁబడినట్టివియు అంపఁబుపెట్టుచేఁ జేయఁబడి మిూఁదికి బంగారురేకుపట్టించినబంతులవంటి వస్తువుల కొఱకు జగడము మొదలగు దుష్క్రియలను ఎవ్వరు నిశ్చల మనెడి శ్రేష్ఠస్థానమునుండి విశ్వాసముతో వీక్షించుచున్నారో, ఎవరియొక్క సంచితసత్కర్మములు వారిదృష్టియందుండి అజ్ఞానమును తొలఁగించి వ్యర్థమైన నామరూపభేదనముల మూలముగా సత్యమును వీక్షించునట్లు చేయుచున్నవో, అట్టివారిచోఁ ప్రేటనున్నను, వారి జ్ఞానమునకు మాతృస్థానమైన హిందూదేశము, మృగతృష్ణవంటి యీలోకమునందు, కేవలము సత్తామాత్రమై యుండువస్తువును గనుఁగొనుటకై ప్రయత్నించువారికి ఆశ్రయమైయున్నది

ఇంద్రియములకు గోచరించునట్లు విషయములఁ గనఁబఱచిననేగాని, లోకములో ననేకులు తెలిసికొనలేరు అట్టివారికి యుద్ధమనెడి దుష్కృత్యమును, ఉత్సాహమును, అందువలనఁ గల్గు సామగ్ర్యమును, కొల్లబెట్టుటయును' అను నివి మాత్రమే సత్యమైనవి ఏజీవితము, తనముందుండు సకలపదార్థములును సుడిగాలిచే నెగుఁగొట్టఁబడునట్లు ఎగురఁగొట్టఁబడకయుండునో, అది 'వారికి మృత్యువుతో సమానము దేశాభిమాన మను

నది కొంచెమేని లేకయు, రక్షించుకొనవలయు ననెడి యభిప్రాయమును నమ్మకమును లేకయు, విజయవంతులగు పరదేశీయులకు పెక్కేండ్లుగా పాదాక్రాంతమైయుండు హిందూదేశము, అట్టివారికి క్రుళ్లిన యెముకలతో నిండిన దేశముగను, జీవము లేక క్రుళ్లి కంపెత్తిన యొకరుప్పవలెను గానంబడవలయును.

యోగ్యతగలవారే నెలకొని యుందురని యొక ప్రతీతి కలదు అటులైన, సకలజాతి వారికంటెను నికృష్టులని లోకులెల్లరచే పేర్కొనంబడిన యీజాతివారికి ఎప్పుడును సంభవింపని మహాకష్టముల ననుభవించియు, వారు నాశమగు చిహ్నముల నేల కనంబడకయున్నారు? శౌర్యమును చుఱుకుందనమును గలవారనితలంపంబడు జాతివారియొక్క అభివృద్ధి క్రతిదినమును క్షీణించుచుండఁగా, నశింపనిహిందువు వారిని అతిక్రమించి వృద్ధియగు సామర్థ్యమును గనంబఱచుచున్నాఁడు ఒకక్షణములో ప్రపంచమును రక్తప్రళయముగాఁ జేయుశక్తిగలవారికి నిస్సంశయముగా కీర్తికలుగఁదగిన దే కొన్నిలక్షలజనులుశాశ్వత సంపన్నులై యుండఁగలందులకై ప్రపంచములోని సగముజనులను ఉపవాసముంచుట ప్రతాపమగునా? అయినను, ఇతరుల నోటియన్నమును గైకొనక కోట్లకొలఁదిజనులను శాంతముగను సంతుష్టులనుగ నుంచికొనియుండువారికి కీర్తిలేదా? పరులకెంతమాత్రమును చెడుగు చేయక వందలకొలఁది యేండ్లుగా లక్షలకొలఁది జనులను అభివృద్ధి కావించినది సామర్థ్యము కాదా? పూర్వకాలములోని సకలజాతులవారి మతధర్మములను వీరపురుషుల చరిత్రములను చదివిన బోధమగును ఒక్కొక్క దేశ

మునకును ప్రాణము ఒక్కొకవిధముగా నుండినది ఆదేశీయులు దానిని సమీపించువఱకును వారు అవధ్యులై యుండిరి హిందూదేశమునకు ప్రాణము మతమందు నెలకొని యున్నది. హిందువులు తమపూర్వులు సేకరించియుంచిన పిత్రార్జితమును మఱవక యుండునంతవఱకును వారిని నశింపఁజేయు శక్తి ప్రపంచమునం దెచ్చట నేదియు లేదు పూర్వకాలవృత్తాంతములను జ్ఞప్తికిఁ దెచ్చువారల నందఱను ఈ కాలమువారు దూషించుచున్నారు పూర్వకాలచరిత్రమును దెలిసికొనుటంబట్టియే హిందూదేశముః చంచలత్వమొందుటకుఁ గారణమైనదని చెప్పెదరు. ఇట్లు చెప్పెడివారలవలననే హిందూదేశము చంచలత్వమొంది యున్నదని నా యభిప్రాయము పూర్వకాలమును మఱచియున్నంతకాలమువఱకును హిందువులు భ్రమనొంది యుండిరి. దానిని తెలిసికొనుటకు యత్నించినది మొదలు,ఎల్లచోటులందు నొకవిధమగునూతనోజ్జీవనశక్తి వ్యాపించి దినదిన ప్రవర్ధమానమగుచున్నది. గతకాలముచేతనే రాఁగలకాలస్థితిని కనుఁగొనఁదగును గతకాలమే రాఁగలకాల మగును

కావున, హిందువులు గతకాలమును గూర్చి యెంతపరిశీలింతురో,అంతకీర్తిప్రతాపములుగల రాఁగలకాలము వచ్చును. ఎవఁడు గతకాలవృత్తాంతములను జనులకు బోధించునో, వాఁడే అజాతివారికి మహోపకారము చేసినవాఁడు హిందూదేశము హీనస్థితినొందినందులకుఁ గారణమేమనఁగా:—పూర్వుల ఆచారవ్యవహారములు బాగుగ లేవందునఁగాదు.మతేమన, వానిననుసరింపకపోయినందుననే యిట్లయినది. హిందూ దేశపుసంఘు

విధులు కాలమునకుఁ దగినట్లు మారుచుండిన వని యొక్కొక్క బుద్ధిమంతునకును దెలిసినవే ఈవిధులు మొట్టమొదట ఏర్పడి నప్పుడు ఒకానొకమహోద్దేశమునకే యేర్పడినవి. ఆయుద్దేశము క్రమక్రమముగా వ్యాప్తమగునట్టి పద్ధతితో నేర్పఱుపఁబడినవి ఆదికాలమందు మహర్షులు భవిష్యత్కాలవృత్తాంతముల నెఱింగినవారై యుండిరి అయినను వారియుద్దేశములను లోకు లెఱుంగుటకు పెక్కేండ్లగునుకదా? ఈలోపల వారి విచిత్రమైన యభిప్రాయములను దెలిసికొనుటకు శక్తిలేనివారైనందుననే హిందూదేశము హీనస్థితికివచ్చినది ఆదికాలమునందు హిందూదేశప్రజలు బ్రాహ్మణులయొక్కయు క్షత్రియులయొక్కయు అధికారమునకు లోఁబడి నడుచుకొనుటకుఁ గోరి యుండిరి. ధర్మశాస్త్రములకు విరుద్ధముగాఁ బ్రవర్తించు నప్పుడు క్షత్రియులను బ్రాహ్మణులు వారిక్రూరకృత్యములనుండి నిరాకరించు శక్తిగలవారై యుండిరి బ్రాహ్మణులిట్లు ప్రజల నేలవలయు ననెడి తలంపుతో ననేకవిధములగు మతధర్మములను కల్పించి ప్రజలను బాధింప ప్రయత్నించినపుడు క్షత్రియులు వారి యుద్ధేశములను కొనసాగనీయక చేసిరి ఆకాలమునందు బ్రాహ్మణులు కేవలము కర్మిష్ఠులుగను, క్షత్రియులు కేవలము జ్ఞానులుగను నుండిరి ఈకాలమునందే యీయిరుతెగలవారికిని కలహములు సంభవించెను ఈవిషయమును శ్రుతులయందు స్పష్టముగా నున్నది శ్రీకృష్ణమూర్తి క్షత్రియధర్మమును జ్ఞానమును గైకొన్నవారలకు గురువైనపుడు దేశము కొంచెము శాంతముగ నుండెను అతఁడు బోధించిన తత్త్వసారమే సమరససిద్ధాంత

ముగు గీతాశాస్త్రము. అయినను ఆయిరుతెగలవారికిని గల కలహకారణములే యిప్పటికిని నశింపక యున్నందువలన, దాని కార్యము ప్రకటము కాఁజొచ్చినది

బీదలయందును అజ్ఞానులయందును అధికారముచేయ వలయు ననెడి తలంపు ఆయిరుతెగలవారికిని యున్నందువలన మరల జగడమారంభ మైనది ఆకాలపు గ్రంథములు చాల తక్కువయైనందున ఆవిషయములను వివరముగాఁ దెలిసికొనుట కవకాశము లేకున్నది; అయినను కడకట క్షత్రియులకును జ్ఞానమునకును స్వాతంత్ర్యమునకును జయముగల్గెను పలుతెఱఁగులగు ఐతిహ్యములు తగ్గెను వానిలోఁగొన్ని సంపూర్ణముగా నశించినవి ఈనాశమే బౌద్ధసంస్కరణ మనఁబడుచున్నది అదియే మతవిషయమునందు కర్మసంస్కరణమును, రాజులవలన బ్రాహ్మణ పురోహితుల కృత్యములకు అపజయమును కలిగించినది అది కాలమునందు హిందూదేశమునం దవతరించిన శ్రీకృష్ణమూర్తి యును, బుద్ధదేవుఁడును స్త్రీపురుషభేదమును జన్మాంతరమ్యము మును పాటింపక జ్ఞానమందఱకును సమానమని బోధించిన విషయము నాలోచింపఁదగినది. బుద్ధమతమునందు అద్భుతమైన నీతి యిమిడియున్నప్పటికిని, దేవునివిషయమునందు చింత లేనందువలనను, ఆమతశక్తి యంతయు కేవలము నివృత్తియందే చెల్లింపఁబడినందువలనను ఆమతము తనజన్మస్థానమునందు నశించినది అంతియగాక, శేషించిన మతభాగము గుడ్డిపద్ధతిని బోధించుచుండినదేగాక, తాను దేనిని తొలఁగింప పుట్టినదో, దానికంటె నెక్కుడు అనాగరకపద్ధతుల నేర్పఱచుకొనినది అది

వేదోక్తమగు పశుహింస మొదలగువానిని నిగ్రహించినప్పటికిని, ఈదేశమును గుళ్లతోను, విగ్రహములతోను, చిహ్నములతోను,గురువుల ఎముకలు మొదలగువానితోనునిండించినవి.

ఆర్యులును, మంగోలియనులును, మతికొందఱు మోటు మనుష్యులును ఆమతమునందుఁ జేరినందున, అతిభయంకరమగు నానాచారము ఆమతమునం దుత్పత్తి యయ్యెను. కాఁబట్టియే శ్రీశంకరాచార్యులు మొదలగు మహాత్ములు, ఆ మతము నీదేశమునం దుండనీక చేసినారు మహానుభావుఁడైన బుద్ధభగవానుని చేఁ బ్రవహింపఁజేయఁబడిన అమృతజలము విషపూరితమైనయొకవంకలోఁ బడి చెడిపోయెను హిందూదేశము నందున్ననో, శ్రీశంకరాచార్యులును, వారికిఁ దర్వాత శీఘ్రకాలమునం దవతరించిన శ్రీరామానుజాచార్యులును, శ్రీమధ్వాచార్యులును అవతరించునంతవఱకును జ్ఞానాభివృద్ధి లేక యుండెను ఈలోపల దేశమునం దనేకములైన మాఱుపాట్లు కలిగెను ఆదికాలపు బ్రాహ్మణులును క్షత్రియులును నశించిరి. రాజఋషులకును బ్రహ్మఋషులకును జన్మస్థానమును, ఆర్యావర్తమును, శ్రీకృష్ణమూర్తికిని బుద్ధదేవునకును జన్మభూమియును, అగువింధ్యహిమాలయమధ్యప్రదేశము మూఁకీభావము వహించినది పిమ్మట హిందూదేశపు దక్షిణభాగమున, మాఱుపాటొందిన యాచారవ్యవహారములుగలజాతులలోనుండియు, పూర్వపుబ్రాహ్మణవంశపరంపరలోఁ జేరినవారును అగు మహాత్ములు, హీనస్థితియందున్న బౌద్ధులకు ప్రతివాదులుగా నవత

రించిరి ఆగ్యావర్తమునందున్న బ్రాహ్మణులును క్షత్రియులును ఏమైరి? అచ్చటచ్చట కొందఱు జనులు మేము బ్రాహ్మణుల మనియు, మేము క్షత్రియులమనియుఁ బేర్కొనఁబడుచున్నారు. తక్కినవా రెల్లరును, నశించిరి ఈ బ్రాహ్మణులు

శ్లో. "ఏతద్దేశప్రసూతానాం
సకాశా దగ్రజన్మనామ్,
స్వం స్వం చరిత్రం శిక్షేరన్
పృథివ్యాం సర్వమానవాః" మనుస్మృతి ౨-౨౦

అనునట్లు, లోకమంతయు మాయొద్దనే నేర్చుకొన వలయుననెడి సర్వోత్కర్షమును ప్రకటించువారై యున్నప్పటి కిని, దక్షిణదేశమునందు జన్మించిన మహాత్ముల పాదసేవచేయుచు ప్రాయశ్చిత్తవేషధారులై నేర్చుకొనవలసినవారైరి ఈ దక్షిణ దేశబ్రాహ్మణులవలననే ఉరల వేదవేదాంతములు నేర్చుకొనిరి గృహస్థులు ఆరణ్యకములను తిరఁబోడఁగిరి. బుద్ధమతవ్యాప్తి సమయమునందు నిజముగా క్షత్రియులొక్కరే చదివినవారై యుండిరి వారిలో పెక్కండ్రు బౌద్ధమతస్థులైరి కావున, వారు మతాభిమానముచే ప్రజలకెల్ల తమమతము దేశభాషలలో సంప్రదాయములను బోధింపఁదలపెట్టినందున, సంస్కృతమును వేదమును అభ్యసించువారు అరుదైరి పిమ్మట, దక్షిణదేశము లోనుండి వచ్చిన సదాచారములు బ్రాహ్మణులకుమాత్రమే ప్రయోజనకారులైనవి తక్కిన హిందూమహాజనులకు వారెప్పుడు నెఱుఁగని బంధనములకు లోనైరి

క్షత్రియులు హిందూదేశమునకు వెన్నెముకవంటివారు. వారు శాస్త్రాభివృద్ధికిని, స్వేచ్ఛకును ఆధారభూతులు. దేశమునందలి మాధ్యమును దొలగించుటకు వారొక్కరే ప్రయత్నించినవారు. బ్రాహ్మణుల క్రూరకృత్యములను వృద్ధికాకుండ చేసినవారును వారే వారిలో చనేకులు అజ్ఞానాంధకారమగ్నులైనందువలనను, తక్కినవారు మధ్య వీషాయొక్క మోటు జాతివారితో వివాహసంబంధనులు చేసికొని బ్రాహ్మణులయొక్క పాలనమును స్థాపించుటకు తామే ఖడ్గమును చేబూనినందువలనను, భరతఖండము పాడయ్యెను మరల క్షత్రియుడు పూర్వమువలె లేచి, యితరులబంధనములను త్రెంచివేయునంతదాక, భరతఖండము తల యెత్తుటకుఁ గాకుండెను పురోహితులే హిందూదేశమునకొక శాపముగా నేర్పడిరి ఒకానొకఁడు తన తమ్ముని బ్రష్టునిగాఁ జేసి, తాను మాత్రము ఆగతినుండి తప్పించుకొనుటకు సాధ్యమగునా?

మహారాజా! మీపూర్వులు కనిపెట్టిన శ్రేష్ఠమైన సత్యమేది? లోక మొక్కటేయని కదా! దానిని తెలిసికొనుఁడు. ఒకఁడు వేఱొకనికి చెడుగు చేయుట యనఁగా తనకే చేసికొన్నట్లు కదా? బ్రాహ్మణులును క్షత్రియులును చేసిన కీడు వడ్డితోఁగూడ వారి తలమీఁదనే పడినది వారికర్మము వెయ్యేండ్లుగా వారిని హీనస్థితియందుంచి బానిసలను జేసినది

"ఇహైవ తైర్జితః స్వర్గో యేషాం సామ్యే స్థితం మనః"

"సమత్వమునందు మనస్సు నుంచినవారు ఈజన్మము

నందే ముక్తినొందుచున్నారు" అని మీపూర్వ లోకరు చెప్పియున్నారు వారిని భగవదవతార మనెదరు మన మందఱము నాలాగే నమ్ముచున్నారము వారి వాక్యమునం దర్థములేదా? అది వ్యర్థముగునా? అది వ్యర్థమే కాదు కావున జన్మము, జాతి, అను నీ మొదలగు భేదములను పాటింపక సృష్టియైన సమస్త వ్యక్తులయందును సమత్వదృష్టి నుంపవలయును అట్లుంచని వారు ముక్తినిఁ బొందరు

రాజపుత్రా! వేదాంతవిచారణ చేసి, యీరీతి వర్తింపుఁడు. మీరు పలువురు రచియించిన భాష్యములను జదువఁబనిలేదు మీ అంతరాత్మ బోధించునట్లు అర్థము చేసికొనుఁడు ముఖ్యముగా అన్నిఁటియందును భగవంతుఁ డున్నాఁడు సమస్తమును పరమాత్మస్వరూపమని భావించికొనుఁడు

సమత్వదృష్టితోఁ జూడక అసమత్వదృష్టితోఁ జూచుట బంధహేతు వగును ఏమనుష్యునైనను, ఏజాతి నైనను భేదబుద్ధితోఁ జూడఁదగదు సకలశరీరములు నొక్కటేయని భావింపవలయును అందఱ హృదయములు నొక్కటే యని తలంపవలయును అతె, అజ్ఞానము, అసమదృష్టి ఇవి మూఁడును దుఃఖహేతువులు ఒకమనుష్యుఁడు ఇతరులను, లేక మృగములను తనకంటె తక్కువయని తలంపవలసిన కారణమేమి? తుదకంతయు నొకటే.

"త్వం స్త్రీ త్వం పుమానసి త్వం కుమార ఉతవా కుమారీ!" "నీవు మనుష్యుఁడవు, నీవు స్త్రీవి, నీవు బాలుఁడవు, నీవు కన్యవు"

"ఇవి సన్న్యాసులకుఁ దగిన మాటలు. మేము గృహస్థులము" అని పలువురు చెప్పెదరు గృహస్థుఁ డాచరింపవలసిన కృత్యము లనేకము లుండుటవలన, సకలవిషయములయందును సమదృష్టి నుంచుట యసాధ్య మనుటయందు సంశయము లేదు అయినను, ఇది వారి లక్ష్యమునందు మాత్ర ముండవలయును. ఏలన: సకలమనుష్యజన్మములును, మృగములును, ఇతరవస్తువులును, ఈసమత్వమును బొందుటకే ప్రయత్నించుచున్నవి కట్టా! మనుష్యులు అసమత్వదృష్టితోఁ జూచుటయే సమత్వదృష్టికి మార్గ మనుచున్నారు కదా? చెడుగు చేసి మంచి దాని నెట్లు పొందనగును? ఈ అసమత్వదృష్టియే మనుష్యుల శోకతాపముగ నున్నది. ఇదే దుఃఖమునకుఁ గారణము ఇదే మానసిక, కాయిక, పారమార్థికపాశములకు ఆధారము?

"సమం పశ్యన్ హి సర్వత్ర తం సమస్థితమీశ్వరం,
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాంగతిమ్"

"శరీరము లన్నిఁటియందు నుండుపరమాత్మను ఏకరూపముగాఁ జూడవలయును. ఇట్లు చూచువాఁడు తన యాత్మను హింసింపఁడు మఱియు ఉత్తమగతినిఁ బొందఁగలఁడు?"

ఈయొక వాక్యమునందు సంగ్రహముగా సకలజనులకును ముక్తిమార్గము నుపదేశింపఁబడి యున్నది?

పూర్వపు రాజపుత్రు లందఱును మిక్కిలి కీర్తిని బొంది యుండిరి ఇప్పుడు రాజపుత్రులు హీనస్థితి నొంది యున్నారు కాఁబట్టియే ప్రజలును హీనస్థితి నొందిరి ప్రజలపై అధికారము

చెల్లించుట కంటె, వారికి క్షేమము కలుగునట్లును, వారి యజ్ఞానము తొలఁగునట్లును బ్రాహ్మణులును క్షత్రియులును ఏకమై ప్రయత్నింపవలయును ఇట్లు కావించితిరేని హిందూదేశము అభివృద్ధి నొందును.

ఇది మంచి కాలము గాదని యెవరు చెప్పుదురు? చక్రము మఱియొక మాఱు తిరుగుచున్నది ప్రపంచములో నలువైపులను వ్యాపించునట్టి శక్తి మఱియొక తేప కలిగియున్నది ఇంతకు మున్ను అనుగ్రహింపఁబడిన వాక్యములన్నియుఁ జేరి మహాత్త్వమొందిన యేకవాక్యముగా ననుగ్రహింపఁబడియున్నది ఒరస్వతీనదీతీరములోని ఋషుల కుపదేశింపఁబడి, పర్వతరాజంబైన హిమాలయశిఖరంబున ధ్వనించి, పిమ్మట పరిసరప్రాంతములందు వ్యాపించి శ్రీకృష్ణ బౌద్ధ చైతన్యుల మూలముగా ప్రవహించుచున్న వాగమృతము మరల ఘోషించుచున్నది మఱియొకమాఱు కవాటము తెఱవఁబడియున్నది ఆ ప్రకాశమును కనుఁగొనుటకుఁ బ్రవేశింపుఁడు

నా ప్రియమైన రాజపుత్రా! మతమునకు ఆధారమును సహాయము చేయుచున్న రాజవంశతిలకా! రామకృష్ణుల సంతతియం దుద్భవించిన ప్రభువర్యా? మీరు దూరముగ తొలఁగి పోనేరరు! అట్లు చేయరని నాకుఁ దెలియును. మతమును అభివృద్ధి చేయుటకు మీరొక్కరే ముందంజవేయఁ గలరని నానమ్మకము మఱియు వంశపారంపర్యముగా శాస్త్రాభ్యాసమునందుఁ బ్రసిద్ధివహించినవారును, విశేష పాండిత్యము గలవారును,

జ్ఞానులచే గ్రహింపఁబడిన యాచారమును గైకొన్న వారును భూతదయ గలవారును, అగు మీవలన సనాతనధర్మము మరల నభివృద్ధి నొందునని నాయభిప్రాయము

"రాజా అజితసింగు" అను పేరుగల మీరు మీనామము సార్థక మగునట్లు మతమును వృద్ధిచేయుటకు సంసిద్ధులై యున్నారనియే నేను దృఢముగా నమ్ముచున్నాను

శ్రీ రామకృష్ణపరమహంసలవారి మంగళాశాసనము మీకు శాశ్వతముగ నుండునుగాత మీరు పలువురకేరుము గొలుకు, సత్యము గొలుకును సంపూర్ణాయుష్మంతులై వర్ధిల్లుదురు గాక

ఇట్లు,
నిరంతరము ప్రార్థించు,
వివేకానంద.

---

{ వివేకానందులవారు ఇంగ్లండునకుఁ బయనమగుట మొదలగు విషయములు }

ఇట్లు వివేకానందులవారు అమెరికాయం దనేక మతోపన్యాసములు గావించి, 1895 సం. మధ్యకాలమున ఇంగ్లండునకుఁ బోయిరి అచ్చట వివేకానందులను దర్శింప నువ్విళ్లూరుచున్న మిస్టర్ స్టర్డి (Mr. Sturdy) అను ఆంగ్లేయవేదాంతి వివేకానందులనుఁ జూచినంతనే మహానంద మొందెను. వేదాంత శాస్త్రమునకు బ్రహ్మసూత్రము లెట్లు ముఖ్యమో, అట్లు భక్తి

శాస్త్రమునకు నారదసూత్రములు ముఖ్యము ఈస్టర్డిదొర, నారదసూత్రములకు వ్యాఖ్యానముతో వివేకానందులవారి సహాయముచేత ఆంగ్లేయభాషయందు పరివర్తనము కావించి వివేకానందులవారికే అంకిత మొనర్చిరి మఱియు, ఆసూత్రముల యందు శ్రీకృష్ణపరమాత్మకును గోపికలకును గల ప్రేమవిష యమై పలువురు పలు తెఱఁగులుగా వివరించిన దుర్మార్గ వ్యాఖ్యానములవలెఁ గాక, స్టర్డిదొర ఆంగ్లేయానువాదమునందు బ్రహ్మానందప్రేమమును మిక్కిలి విమర్శనముగాఁ దెలియఁజేసి యున్నారు వివేకానందులు స్టర్డిదొర సహాయముచేత ఇంగ్లండులో ననేక ప్రసంగము లొనర్చిరి వివేకానందుల ప్రసంగములను వినిన పెక్కండ్రాంగిలేయులు వీరియొద్ద వేదాంతశ్రవణము చేయం దొడంగినంత, అందఱకును తా మొక్కరే పాఠము చెప్పుటకు సాధ్యము గాక, బేలూరు మఠములోనుండి శ్రీశారదానందు లను సన్న్యాసిని రావించి యింగ్లండులో నుండ నియమించి వివేకానందులు మరల 1895 సం. డిసంబరు నెలలో అమెరికాకుఁ బోయిరి

అమెరికాదేశీయులు వివేకానందులవారి వేదాంతోపన్యాసములను వినుటకు పెక్కండ్రు వచ్చుచుండిరి ప్రతిభానువారమును ఉపన్యాసములను వినుటకు వచ్చువారిసంఖ్య మితిమీఱినందున ప్రసంగ మండపమునందు చోటు చాలకుండెను 1896సం. జనవరినెలలో వివేకానందులవారికి ఒక్కొక తరగతి యందును నూటికంటె నెక్కుడు జనులు శిష్యులైరి ఈసంవత్సరము ఫిబ్రవరినెలలో స్టర్డిదొర శిష్యుఁడై "యోగానంద"

అను పేరొందెను తర్వాత, వివేకానందులు అమెరికాలోని పండితసభలందును, "యూనివర్సిటి" అను సర్వశాస్త్రకలాశాల యందును ప్రసంగములు గావించి, మరల ఇంగ్లండును జేరిరి

వివేకానందులు ఇంగ్లండునకు వచ్చిన మీఁదట శారదానందులను అమెరికాకుఁ బంపి, ప్రొఫెసర్ మాక్సుముల్లర్ వాసస్థానమైన గోక్షీరపురి (Oxford) (ఆక్సుఫోర్డు) కేగి వారిని సందర్శించి చాలసేపు ముచ్చటలాడుచుండిరి. ఆవిషయమును గూర్చి వివేకానందులు చెన్నపురిలో ప్రకటింపఁ బడుచున్న "బ్రహ్మవాది" యను పత్త్రికాధిపతికి దిగువ నుదహరించిన రీతిగా వ్రాసి పంపియున్నారు?

బ్రహ్మవాది పత్త్రికాధిపా !

"కర్మణ్యేవాఽధికార స్తే మాఫలేషు కదాచన" "కర్మము చేయుటకు నీకధికారమేగాని, దాని ఫలముఁబొందుట కొఱకు స్వాడును నీవు కోరఁదగదు" అను గీతావిషయము బ్రహ్మవాదికి నిరంతరము లక్ష్యభూతమై యుండవలసినది శ్రద్ధతో కర్మము చేయువాఁడు తన్ను ప్రసిద్ధునిగాఁ జేసికొనుటకు ప్రయత్నము చేయకయు, తాను చేసిన కార్యముయొక్క ఫలోదయసూచకమైన కిరణమాత్రమేనియుఁ గోరకయు నుండవలయును.

మన కార్యారంభము వైభవముగా నున్నది ఆవిషయమునందు మనమిత్రులుకినఁబఱచిన శ్రద్ధనుగూర్చి వ్రాయుటకు అవకాశము లేదు నిశ్చయమైన శ్రద్ధయు నిర్మలచింతయు కార్యకారి కావున, ఎట్టివాఁడును తనకు సంభవించిన ఆపదల నుండి విముక్తుఁడై జయ మొందఁగలఁడు ?

అపరోక్షజ్ఞానోదయము తమకుఁ గలిగిన దని లోకులను భ్రమింపఁ జేయు మోసగాండ్రకు లోఁబడకుఁడు. అట్టి జ్ఞానోదయము అసాధ్యమని నా యభిప్రాయము కాదు గాని, అట్టి వేషధారులలో నూటికి తొంబదుగురియొక్క హృదయమునందు స్త్రీలను, ధనమును, కీర్తిని, ఆర్జింపవలయు ననియే గాని వేఱుకాదు తక్కిన పదుగురిలో తొమ్మండ్రుగురు ఆయుర్వేద వైద్యుల అనుగ్రహమునకు పాత్రులే గాని, భవరోగవైద్యుల యనుగ్రహమునకు పాత్రులు కారు.

యోగ్యత సంపాదించుటయే ప్రథమ కర్తవ్యము ఇది ప్రత్యేకముగా నొక్కొక్కఁడు నెట్లు సంపాదించు చున్నాఁడో, అట్లే జనసమూహమును సంపాదింప వలయును మనవేదాంత గ్రంథములందుఁ జెప్పఁబడియుండు "ప్రతిష్ఠితా ప్రజ్ఞ" ను బొందవలయును నూతనమతము లెంత ప్రబలునో, అంతయు వాస్తవమైన మతముల మహత్త్వమును వ్యాపింపఁజేయుటకే వచ్చినవని తలంపవలయును అయినను, ఇక్కాలమునందు కొందఱు మతవ్యాజములవలన లౌకిక సంబంధమైన కోర్కెలనో, లేక రాజ్యతంత్ర సంబంధమైన కోర్కెలనో నెఱవేర్చుకొనెడి స్థితియందు ప్రబలి యున్నారు ఈవిషయమునందు మీరు జాగ్రత్తతో నుండవలయును మతమునకు సాధనము మతమేగాని, వేఱొక్కటియు సాధనము కానేరదు.

ఏమతమైనను సరియే—కేవలము లౌకిక సంబంధమైన భోగములకు సాధనమై యుండునో అది మతమె కాదు సత్యము,

శౌచము, నిస్పృహత్వము అను నీగుణము లెవనికి ఉండునో, వానిని నశింపఁజేయుశక్తి యీ ప్రపంచములో నెచ్చోటను లేదు. అట్టివానిని లోకమంతయు నిరోధింపఁ దలపెట్టినను, వాఁ డందఱను ధీరతతో నెదిర్చి జయింపఁగలఁడు.

అన్నిఁటికంటె ముఖ్యమైన విషయ మేదియనఁగా, ఇతరులతో "సమాధానము" చేసికొనకుండుట ఇందువలన, మీరు ఇతరులను ద్వేషింపుఁ డనుట కాదు. లాభము వచ్చినను నష్టమువచ్చినను జయము కల్గినను అపజయము కల్గినను సంపద గలిగినను ఆపద సంభవించినను మీరు మీ వ్రతమునుండి మరలఁగూడదు పరులవలన లాభము గల్గుననెడి పేరాసతో వారి నీచమైన వినోదములను గోరవలదు మీ సత్యసిద్ధాంతముల నుండి మరలకుఁడు మీ 'ఆత్మ' లోకమున కంతయు నాధారమై యుండఁగా మీ రేల యితరుల నాశ్రయింపవలయును! ఓర్పియుండుఁడు మీకు సహాయము చేయువారిపుడు రాకున్నను, కాలక్రమమున రాఁగలరు మనమేల తొందరపడవలయును? సకల మహాప్రయత్నముల యొక్క కార్యసాధకబీజమగు శక్తియందు దాని యంకుర మెవరికంటికిని గోచరింపక పోయినను, ఆబీజమునం దిమిడి యుండును కదా?

బంగాళదేశములో నొక పల్లెయం దొక బీదబ్రాహ్మణ కుటుంబములో జన్మించినబాలుఁ డొకఁడు ప్రపంచ మంతట కీర్తి నొందఁగలఁడని యెవ్వరేని తలంచినది కలదా? ఆబాలుఁడే కదా భగవాన్ శ్రీరామకృష్ణపరమహంసులవారు

ఇంగ్లండు దేశములో నా మహానుభావుఁడైన శ్రీ రామకృష్ణ పరమహంసులవారినిఁ గూర్చి, నేను ఇంగ్లండుకుఁ బోయి మోక్షమూలరు (మాక్సుముల్లరు) ను జూచుటకు మునుపే, వారు "నైంటీన్తు సెంచరి" యను పత్రికయందు ప్రశంసించి యున్నారు నేను వారిని సందర్శించిన మీఁద, వారు, నాతో, "శ్రీరామకృష్ణపరమహంసుల జీవిత మంతయు వ్రాయనెంచి యున్నట్లు తెలియఁజేసిరి వారు శ్రీరామకృష్ణ పరమహంసులవారి యెడ చాల ప్రీతిగలవారు

మోక్షమూలరు నన్నుఁ జూచిన వెంటనే కాలధర్మ మొందిన కేశవచంద్రసేనులవారికి హఠాత్తుగాఁ గల్గిన శక్తినిఁ గూర్చి విచారింపఁ దొడంగిరి కేశవచంద్రసేనులు పరమహంసులవారి ప్రభావముచేత నపూర్వమొందిన కాలమునుండియే, మోక్షమూలరుగారు శ్రీరామకృష్ణ పరమహంసులవారి ఉపదేశామృతమును గ్రోలుచు మిక్కిలి భక్తిగలవారై యుండిరి "ప్రకృతము రామకృష్ణపరమహంసులవారిని కోట్లకొలఁది జనులు పూజించుచున్నారు" అని నేను చెప్పఁగా, మోక్షమూలరుగారు, "అట్టి మహాత్ముని పూజింపక వేతెవ్వరిని పూజించుట?" అని ప్రత్యుత్తర మొసంగిరి?

పిమ్మట నన్ను ను ప్టర్డిచౌరను తనతోఁగూడ ఫలాహారము చేయుటకుఁ గోరిరి అనంతరము గోలీర్ధపురిలోని కలాశాలలకును పుస్తకభాండాగారములకును మమ్ముఁ దోడ్కొనిచనిరి. మఱియు నన్ను వీడ్కొల్పుటకు రైలుస్టేషనుకు వచ్చిరి.

అపుడు నేను, "మీరు నాకొఱకు మిక్కిలి శ్రమ వహించితి" రని చెప్పఁగా, వారు, "ప్రతిదినమును శ్రీరామకృష్ణపరమహంసులవారి శిష్యసందర్శనము లభించునా?" యనిరి అహా! ఏమి ప్రేమ ! ఎంతవినయము! ఆశ్చర్యమాశ్చర్యము!

ఆశ్రమమువలె నుండు చిన్న మేడయిల్లును దానిచుట్టు నున్న ఆరామమును, అందు మిక్కిలి దేదీప్యమానమై ప్రకాశించు ఆఋషిని (మోక్షమూలరును), శాంతమును కరుణయు తొణఁకుచుండు ఆముఖమండలమును, డెబ్బదేండ్ల వయస్సు కల్గియు పసిపాప ముఖమువలెఁ గన్పట్టు ఫాలభాగంబును, అందు జ్ఞానోదయమును వెలివఱచు చున్నదో యనునట్లుండు తెలిసి తెలియకయుండు రేఖలును, వారెన్నో శాస్త్రములకు లోనై అపూర్వ విషయములను లోకుల కెఱుక చేసి, వారితో వాదింపఁ దొడంగినవారి వాదముల నెల్ల ఖండించి, తుదకు మనప్రాచీన భారతవర్ష మహాఋషుల సిద్ధాంతములను పశ్చిమదేశీయులకు బోధింపఁ దొడంగిన మహానుభావునకు సహాయము చేయుచున్నట్టి యాయన ధర్మపత్నినిఁ జూచినపుడు పూర్వకాలము నందు మన దేశమునందు కీర్తిగాంచిన బ్రహ్మఋషులును, రాజఋషులును, వానప్రస్థులును, తపోధనులగు అరుంధతీ వసిష్ఠులును వసించిన పుణ్యదినములు నాకు ప్రత్యక్షమైన ట్లుండెను.

నేనచ్చటనుండిన దినములలో కేవలము భాషాతత్త్వ పండితులను, విద్వాంసులను, మాత్రమే కాదు. ప్రతిదినమును బ్రహ్మైక్యము ననుభవించు చున్న ఆత్మను, అఖిలాత్మలతో నేక

తత్త్వముగుటకై ప్రతిదినమును విశాలము చేసికొనుచుండు హృదయమును జూచితిని. సారములేని యెడారియందు, అతఁడు సారతత్త్వమైన మంచినీళ్ల బావిని త్రవ్వినవాఁడుగ నున్నారు "తమేవైకం జానథ ఆత్మానం; అన్యా వాచో విముఞ్చథ" అని మొఱలిడు ఉపనిషత్తుల యొక్క మధుర నాదమును వాస్తవముగా నెఱింగిన వారి హృదయనాళములన్నియు నాలాగే శబ్దించుచున్నవి

ప్రపంచము నంతయు భ్రమింపఁజేయు విద్యయు శాస్త్రజ్ఞానమును వారికి కలిగియుండియు, ఆవిద్యయును అజ్ఞానమును వారిని క్రమ క్రమముగా ఆత్మలాభమును బొందునట్లు చేసినవి ఇదియే వాస్తవమైన విస్మయమంబడును వారికి హిందూదేశమునందుఁ గల స్త్రీలలో నూటిలో నొకభాగ మైనను నాకుఁ గలుగదా యని కోరెదరు వారు ఏఁబది సంవత్సరములు తదేకదీక్షతో గీర్వాణభాషా సాహిత్యముల నంతయుఁ బరిశీలించి, అవి తనకు సుబోధ మగునట్లు పరిశ్రమము చేసియున్నారు

మోక్షమూలాలకు వేదాంతులలోపల మహావేదాంతి యని చెప్పఁదగియున్నాఁడు వారు, లోకములోని సకల మతములయొక్క సార మేదియో, ఆమతముల తత్త్వమేదియో అట్టి వేదాంతమును నిజముగాఁ దెలిసికొని యున్నారు.

ఇఁక శ్రీరామకృష్ణ పరమహంసయొక్క మహిమ యేమనఁగా, అతఁడే పై చెప్పిన ఉత్తమ ప్రాచీన తత్త్వ ప్రత్యక్ష నిరూపణము అతఁడే ప్రాచీన భారతవర్ష పరిపూర్ణస్వరూపము అతఁడే రాఁగల భారతవర్ష పూర్వరూపము అతడే సకల జను

లను జ్ఞానప్రకాశము నొసంగు భాను స్వరూపము "రత్నముల లక్షణములు రత్నపరీక్షకులకే గదా తెలియును" అను లోకోక్తికి దగినట్లు, హిందూ తత్త్వవిచారణ యను ఆకాశమునం దుదయమగు ఒకానొక నక్షత్రమును గూర్చి హిందువులు తెలిసికొనుటకు ముందే యీ పాశ్చిమదేశ మునిపుంగవుఁడు తెలిసికొని యున్నాఁడు ఇది ఆశ్చర్యము కాదా?

నేను, మాక్సుముల్లరు గారినిఁ జూచి, "మీరెప్పుడు మా దేశమునకు వచ్చెదరు? తమ పూర్వుల జ్ఞానమును నిశ్చయముగా వివేకించుటకై మిక్కిలి ప్రయాస మొందిన మహాపురుషులగు మిమ్ము హిందువు లెల్లరును మహానందముతో నెదుర్కొని యుపచరింతురు" అని చెప్పఁగా, వారు ప్రసన్నముఖులై బాష్పపూర్ణలోచనులై "నేను మీ దేశమునకు వచ్చితినేని కాని లేదు నన్నిప్పటికే సహాయము చేయవలసినదే" అనిరి [illegible]

"తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాన్తరసౌహృదాని"

"హృదయమునందు స్థిరముగా నెలకొని యుండు పూర్వజన్మస్నేహములను మనస్సుచే జ్ఞప్తికిఁ దెచ్చుచున్నాఁడు" అని మహాకవి కాళిదాసు చెప్పినట్లు, వారికి పూర్వజన్మ జ్ఞాపకము వచ్చినట్లు తోఁచినది. ఆ మహానుభావుని జన్మము లోకోపకారమైనది. వారు తమ యంత్యకాలమందు ఉత్తమగతి నొందలయు నని ప్రార్థించుచున్నాను.

## ఇంగ్లండులో వేదాంతప్రసంగము

[వివేకానందులు ఇంగ్లండులోని మహాసభలయందు వేదాంతప్రసంగములను విమర్శముగను క్రమముగను అనేకోపన్యాసముల నొసంగిరి. వారి ప్రసంగములను వినినవారిలో ననేకులు వేదాంత సిద్ధాంత బోధముకొఱకనేక సమాజములను కూడ స్థాపించిరి. వివేకానందులవారి ప్రసంగములలోని ముఖ్యవిషయములలోఁ గొన్నింటి నిట నుదహరించెదము ]

"ప్రేమ పూరితమైన హృదయకమలమునందు మాత్రమే భగవంతుని జూడవచ్చునే గాని, జ్ఞానమును గుణముగాఁగల అంతఃకరణమునఁజూచుటకు వలనుగాదు జ్ఞానమునునదివీథిని పరిశుద్ధముచేయు సేవకునితోఁ దుల్యమైనది ఎట్లన, మార్గమును మన ప్రయోజనముకొఱకు క్రమముగా నుంచుట పోలీసువాని కార్యము. అయినను జనులైకమత్యముతో నుండుటకు పోలీసువాఁ డుండవలయు ననెడి యావశ్యకము లేదు కలహములను మాన్పుటకును, అన్యాయములను ఖండించుటకును మాత్రమే వాఁడు కావలయును అంతటి కార్యమే జ్ఞానముచేతను కావలయును అనఁగా, అంతఃకరణము శుద్ధిస్వభావముకలది దానికి స్వాభావికమైన చలనశక్తి లేదు చలించు శక్తిగలది ప్రేమ యొక్కటే విద్యుచ్ఛక్తి కంటెను అనంతకోట్ల మహా వేగముతో చలించుశక్తి గలది ప్రేమ మీకు ప్రేమ యుండునేని, దాని మూలముగా భగవంతుఁడు ప్రత్యక్ష మగును నేఁటికి మీకుఁ గల ప్రేమమే క్రమము క్రమముగా వృద్ధిఁబొంది సమస్తవస్తువులును తదాకారమై తోఁచును అదియే ప్రేమయు పరమాత్మయు నేకమగుస్థితి. ఈ కార్యము కేవల జ్ఞానముచేతనే కలుగదు.

"వాగ్వైఖరీ శబ్దఝరీ బుద్ధిభ్రమణకారణం,
వైదుష్యం విదుషాం తద్వద్భుక్తయే న తు ముక్తయే."

"బుద్ధిని భ్రమింపఁజేయునట్టి అనేక వాక్ప్రయోగము లను పలుతెఱఁగు లగు వ్యాఖ్యానములను జేయు సామర్థ్యమును, పండితులయొక్క కూటికొఱకే గాని, ఆత్మయొక్క ముక్తికొఱకుఁ గాదు"

"థామస్ కెంపిస్" అను భక్తుఁడు రచియించిన క్రీస్తు కర్ణామృతమును జదివినవారు, అందు చెప్పఁబడియుండు ప్రతి విషయమును, ప్రతిదేశములో జన్మించిన యొక్కొక్క మహాత్ముఁడును దానినే చెప్పియున్నాఁడని తెలిసి కొందురు జ్ఞానము అవశ్యముగా కావలసినదే అది లేనిచో ప్రమాదము లైన కార్యములను జేయుదుము కావున ప్రమాదములను నిరోధించుటకు జ్ఞానము ముఖ్యసాధనముగ నున్నది దానినాధారముగా గొని దేనిని చేయుటకును ప్రయత్నింపవలదు అది చలనరహిత మైనది దానివలనఁ గలుగు సహాయము మధ్యమపక్షము. వాస్తవమైన సహాయము ప్రేమయే యగును

"మీకు పరులయెడ ప్రేమయున్నదా! ఉండునేని ఐక్యతత్త్వమునందు వృద్ధి నొందుదురు ప్రేమ మీకు లేనిచో మీరెంతటి యుత్తమోత్తమ జ్ఞానులై యున్నప్పటికిని నిష్ప్రయోజకు లగుదురు. మీరిప్పుడు కష్టజ్ఞానులై యున్నారు.అట్లేయుంకను నుందురు అయినను ప్రేమ మాత్రము మీకుఁ గల దేని, వేశాస్త్రమును గాని ఏభాషను గాని తెలియనివారైనను,

మీరు సన్మార్గమునందు ప్రవేశించినవా రగుదురు. అప్పుడు దేవుఁడు మీకు ప్రత్యక్షుఁడై యుండును"

"ఈలోకమునందు మహాయోగుల కున్నశక్తి యిట్టిదని మీకుఁ దెలియదా? అది యెట్లు కలిగినది? జ్ఞానము చేతనా? కాదు వారెవ్వరేని తర్కశాస్త్రములురచియించిరా? ఎవ్వరును వ్రాయలేదు వారు కొన్ని మాటలలోనే తత్త్వబోధ మొనర్చిరి. క్రీస్తువవలె ప్రేమ గలవా రగుదురేని, మీరును క్రీస్తువంటి వారగుదురు బుద్ధునివలె ప్రేమగలవారై యుందురేని, మీరును బుద్ధునివంటివా రగుదురు కాఁబట్టిప్రేమయే ప్రాణము ప్రేమయే బలము ప్రేమలేని జ్ఞానముచే దేవుని పొందుటకుఁ గాదు జ్ఞానము చలనశక్తిలేని అంగములతో సమానము ప్రేమయనెడి చలనశక్తి యాయంగములందుఁ జొచ్చి చలించునట్లు చేయుచున్నది ఇది లోకానుభవము, మీరీవిషయమును జ్ఞప్తియం దుంచికొన వలయును ఇది వేదాంతానుభవ సిద్ధమైనది ఏలన మీరందఱును యోగులని వేదాంతోపదేశము. కాఁబట్టి మీరందఱును యోగులు కావలయును మీ యనుష్ఠానములకు గ్రంథములు ప్రమాణములుకావు మీరు గ్రంథములకుఁ బ్రమాణభూతులు కావలయును. గ్రంథము తత్త్వము నుపదేశించు చున్నదని మీకెట్లు తెలియును? దానిని మీరు తెలిసికొని అనుష్ఠించు చుండుట కదా ప్రమాణము. ఇదే వేదాంతోపదేశము"

## పత్త్రికాభిప్రాయములు

1896 సం జనవరినెల 18 తేది ఇండియన్ మిఱ్ఱర్ పత్త్రికయందీన్ని ప్రకటింపఁబడినది.

"వివేకానందులు లండనులో స్త్రీలును పురుషులును క్రిక్కిరిసి యున్నసభలలో నుపన్యసించు చున్నారని విని సంతసించెదము హిందూ వేదాంత శాస్త్రవిషయముగను, యోగశాస్త్రవిషయముగను తరగతుల నేర్పఱచి బోధించు చున్నారనియు, అనేకులు శ్రద్ధతోను భక్తితోను శ్రవణము చేయుటయే గాక, లండన్ నగరములో మిక్కిలి నాగరికత గల దొరసానులు హిందూ స్త్రీలవలె నేలపైఁ గూరుచుండి (కుర్చీలు లేక గాదు) మిగుల భక్తితో వినుచున్నారనియుఁ దెలియుచున్నది ఇది ఆశ్చర్యమే ఇంతియ గాక, ఉవిల్ పర్ పోర్సు, హేయస్ మొదలగు ప్రసిద్ధ క్రీస్తుమతాచార్యులు వివేకానందులను చాల గౌరవించుచున్నారని తెలిసినది. మఱియు ఉవిల్ పర్ పోర్సుదొరగారు తమ వాసస్థానమునందు వివేకానందులను రావించి సత్కరించినట్లును, అప్పుడు లెక్క లేని స్త్రీపురుషులు వచ్చిరనియును వింటిమి ఆంగ్లేయులకు హిందూ దేశవిషయమై సద్భావములు కలుగఁజేసియుండు ప్రేమమును అనుతాపమును హిందూదేశాభివృద్ధి కాధారముగ నుండునని తోఁచుచున్నది."

1896 సం. జూన్. 13 తేది. లండన్ అమెరికన్ పత్రికయం దిట్లు ప్రకటనమైనది.

"హిందూమతము కేవలము పనికిరాని బొమ్మలను గొల్చుమతమని పరదేశీయులు తలంచియుండిరి వివేకానందులు వారితలంపును మార్చినదేగాక, ఎల్లవారును ఆమతమును గౌరవింపఁదగినస్థితికిఁ దెచ్చినారు"

---

1896 సం. అక్టోబరు. 22 తేది లండన్‌లోని స్టాండర్డు పత్రికయం దిట్లు వ్రాయంబడి యున్నది.

"రాజకుమారమండపము(ప్రిన్సెస్ హాల్)నందు రామమోహనరాయ్, ఆయనకుఁ దర్వాత కేశవచంద్రసేన్ వీరిర్వురే ఆంగ్లేయ ప్రసంగవేదికపై నిల్చి యుపన్యసించిరి. అనంతరము బహుకాలమునకు మీఁద వివేకానందులు మిక్కిలి మనోహరమైన స్వరూపముతో ఏవేదాంత సిద్ధాంతమును వ్యాపింపఁజేయుటకై తమకాలము నంతయు వినియోగించు చున్నారో ఆవేదాంతమును ఒకటియుంబాతికిగంటసేపు నిర్దుష్టమైన ఆంగ్లభాషలో నుపన్యసించిరి."

## ఆంగ్లేయ శిష్య సత్కారము

వివేకానందులు భరతఖండమునకుఁ బ్రయాణ మగుటకు మున్ను లండనులో నుండి స్వీడ్ జర్లండులో నిజారిక్ నగరమునకేగి, అచ్చటి ధర్మసభను దర్శించి, అచ్చోట నుండి జర్మనిలోని కీల్ నగరమునకుఁ బోయి, అచ్చట తమరాక నెదురు

చూచుచున్న లాయ్‌సెణ్ అను మహాపండితునిఁ జూచుటకుఁ జనిరి. లాయ్‌సెణ్ వివేకానందులను జూచినది మొదలు మిక్కిలి స్నేహితుఁడాయెను. మఱియు నతని ఆనందమునకు పారమే లేదు పిమ్మట తన లాయ్‌సెణ్ అనుపేరును సంస్కృతభాష యందు దేవసేనపండితుఁ డని పేర్కొనవలయు నని వివేకానందులను గోరిరి. పిమ్మట నాతఁడు వివేకానందులను లండణ్ నగరమునకుఁ దోడ్కొనివచ్చి విడిచిపెట్టి మరలిచనిరి.

ఇంగ్లాండు దేశములో మహాపండితసభలలో వివేకానందు లుపన్యసించుటను వినినవా రందఱును, వారు భరతఖండ మునకు వచ్చునప్పుడు గౌరవించినవిషయములను వారికొసం గిన వందనోపచారములచే నెఱుంగఁదగు

"దేవరవారు బోధించిన వేదాంత సిద్ధాంతములను లండణ్ నగరములో శ్రవణము చేసిన తమ శిష్యులగు మేము— దేవరవారు ఫలాపేక్షలేక లోకోపకారము చేయుటకై ముం దంజవేసిన యుత్తమవిషయమూలముగను, దాని మూలముగా దేవరవారి శిష్యులకుఁ గలిగిన సహాయమువిషయముగను, మాకుఁగల మనసూర్తియైన సంతోషముతో నీసమయము నందు బహిరంగముగా ప్రకటనము చేయనిచో, మేము చేయ వలసిన కార్యమునందుండి తప్పిపోయినవార మగుదుము

దేవరవా రింతత్వరగా ఇంగ్లండును వదలిపెట్టి పోవుటం బట్టి మేము చాల చింతించుచున్నారము అయినను హిందూ దేశములోఁ గల మాసోదరీసోదరులును దేవరవారి ఉత్తమ కైంకర్యఫలమును బొందవలయునని మే మంగీకరింపక పోవుదు

మేని, దేవరవారు మాకు బోధించిన శ్రేష్ఠమైన వేదాంతమును మేము క్రమముగా గ్రహించిన శిష్యులము కానివార మగు దుము కాఁబట్టి, దేవరవారి కైంకర్యము వృద్ధినొంది విజయము కావలయునని కోరుచున్నారము

మే మెల్లరమును దేవరవారి ప్రభావమును కల్యాణ గుణములను గాంచి సంతసించినవారమై యిచ్చటఁ జేరితిమి మమ్ము భగవంతుని భక్తులముగా నుండున ట్లనుగ్రహించినది తమ శ్రేష్ఠమైన వేదాంతలక్ష్యమై యుండు సద్గుణమహిమయే యని నమ్ముచున్నారము.

దేవరవారు మాదేశమునకు అతి శీఘ్రకాలముననే విజయంచేయుదురని యెదురు చూచుచున్నారము. మేము తమ బోధనలను విన్నదిమొదలు ఆదేశమునందు మాకు అభినవమైన ప్రేమ జనించినది తమ ఉత్తమ ధర్మకైంకర్య ఫలమును మావలెనే ఆదేశీయులును అనుభవింపఁ బోవుచున్నారు గదా యని సంతుష్టినొందెదము

మా అనురాగమును హిందూదేశీయులకుఁ దెలియ పఱచవలయు ననియును, తమ యుపదేశము ప్రకారము మన మందఱను నొకే బ్రహ్మస్వరూపమనియు, వారి సుఖదుఃఖము లను మాసుఖదుఃఖములని భావించుచున్నామని తమదాసుల మగు మేము భావించియున్నా మనుటను దేవరవా రంగీకరింప వలయుననియు మిక్కిలి ప్రార్థించుచున్నారము"

ఇట్లు ఆంగ్లేయులచే వివేకానందులు సత్కరింపఁబడి భరతఖండమునకుఁ బయనంబైరి

## వివేకానందులు భరతఖండమునకు వచ్చుట.

1897 సం ప్రారంభమునందు వివేకానందులు భరతఖండమునకుఁ బ్రయాణంబు కాఁగా, వారి విశ్లేషమున కోర్వక, సెవియర్ దొరయు, అతనిధర్మపత్నియును, గుడ్విన్ దొరయు వెంట నంటి రాఁదొడంగిరి ఇట్లు వివేకానందులు మువ్వురుశిష్యులతోఁగూడి ఇంగ్లండునుండి బయలుదేఱి, ఓడనెక్కి కొలంబో నగరమునకుఁ బయనంబైరి ఈమువ్వురలో గుడ్విన్ దొర ఇంతకుముందు ఇండియాదేశమునకు రాలేదు గాని, తక్కిన యిర్వురును మున్నొకతేప ఇండియాకు వచ్చి చాలదినము లుండి పోయినవారు. ఈదంపతులు వృద్ధులు వీరికి సంతతిలేదు. వీరు వివేకానందుల వేదాంతోపన్యాసంబులను విని అద్వైతమతము నందు పట్టుదలఁగల్గి వారికి శిష్యులైరి ఇంతియగాక, తమజీవితకాలమును ఇండియాయందే గడపవలయుననియును, తమధనమును అద్వైతమతప్రచారమునకు వినియోగింపవలయుననియును దలంచి యుండిరి ఆతలంపు నెఱవేఱినది హిమాలయము సమీపమునందుండు మాయావతియందు రామకృష్ణపరమహంసయొక్క సంఘములోఁ జేరిన ఆశ్రమమును వీరే నిర్మించిరి సెవియర్ దొర ఆస్తైక్యమొందిరి వీరిధర్మపత్నియు అమెరికాదేశపు అమృతానందులను బ్రహ్మచారియొకరును, ఈదేశపు బ్రహ్మచారులు కొందఱును మాయావతి యందలి మఠమునందే వసించుచున్నారు.

గుడ్విన్ దొరగారు నిష్కపటముగల యౌవనపురుషుఁడు పరోపకారి. వీరు సాంకేతిక లేఖన నిపుణులని ప్రఖ్యాతి నొందినవారు అమెరికాలో వివేకానందుల ఉపన్యాసములను లిఖించు సమర్థు లొకరు కావలయునని ప్రకటింపఁబడఁగా, నా యుద్యోగమునకు వీరు సమ్మతించిరి కొన్ని దినంబులకు వివేకానందులకు శిష్యులైరి. వీరు లేనిచో, మహాప్రవాహమువంటి వివేకానందుల వాగ్మిత్వము నెవ్వరు వ్రాసియుందురు మనము చదువుభాగ్యమును కలిగియుండము ఈమహాపురుషుఁడైన గుడ్విన్ దొరగారు శీఘ్రకాలముననే ఉదకమండలమునందు పరంధామమున కేఁగిరి

వివేకానందస్వాములు 1897 సం. జనవరినెల 15 తేది పగలు కొలంబో రేవు చేరిరి కొలంబోనగరమునందలి ప్రముఖులు స్వాములవారికి స్వాగతమొసంగిరి మహావైభవముతో స్వాములవారు శకటారూఢులై పోవునపుడు ప్రజలందఱును జయజయ శబ్దంబులతో చప్పట్లు చఱచిరి. పుష్పంబులు చల్లిరి. ఎచ్చోటఁ జూచినను పచ్చతోరణంబులను "సుస్వాగతము" అను అక్షరములు గల పటములును కనులకుఁ గన్పట్టుచుండినవి ఇట్లు స్వాములవారు కొలంబో ప్రజలచే నాహూయమానులై హిందూ బౌద్ధప్రముఖులు వెంటనంటిరా దివ్యమైన బంగళాకు శకటారూఢులై చనిరి

---

## కొలంబో ప్రజలు స్వాగత మొసంగుట.

"మహాత్మా!

కొలంబో నగరమున వసించు హిందూమహాజనులు నిశ్చయించిన ప్రకారము దేవరవారికి స్వాగత మర్పించెదము దేవరవారు పశ్చిమఖండమందు మహావ్రత మొనర్చి జన్మదేశమునకు వచ్చునపుడు, ముందుగా తమకు వందనోపచారము చేయు భాగ్యము మాకు గలిగినదని మిక్కిలి సంతసించెదము

తాము పూనిన మహావ్రతము భగవంతుని కృపచేత సిద్ధించినందులకు మహానంద మొందుచున్నారము సకల మత సంప్రదాయములను సమన్వయము చేసి, ప్రతిజీవుడును పరమాత్మైక్యము నొందునట్టిదగు హిందూమతమును పశ్చిమఖండ వాసులకు బోధించితిరి ఎవరిపదము లీభరతఖండమును పరిశుద్ధము చేసినవో, ఏమహాపురుషులచే బ్రహ్మతేజస్సు గోచరించినదో, ఎవ్వరివలన పరంపరగా తత్త్వముపదేశింపబడుచున్నదో, అట్టిమహాత్ముల మార్గముననే దేవరవారు సంచరించి ప్రసంగ మొనర్చితిరి

మహాత్ములగు శ్రీరామకృష్ణ పరమహంసగారి అనుగ్రహముచేతను, పరోపకార దీక్ష వహించిన దేవరవారి మహావైరాగ్యము చేతను, విదేశస్థులు భరతఖండ వేదాంతమునందు పట్టుదలగలవారై పరమాత్మ జ్ఞానమునకు పాత్రులైరి మఱియు నీహిందూదేశస్థులలో ననేకులు విదేశనాగరకభ్రమయం దుండి గట్టెక్కి మనపూర్వులార్జించిన జ్ఞాననిధిని బొందినవారైరి

దేవరవారి పరమ సత్కైంకర్యము చేతను, సదనుష్ఠానము చేతను, జన్మదేశమగు హిందూదేశమునకు మహాకీర్తిని సంపాదించి యొసంగితిరి. దేవరవారును, దేవరవారి సత్కైంకర్యమును నిరంతరాభివృద్ధి యగునట్లు భగవంతుని ప్రార్థించు చున్నారము

ఇట్లు,

శమభక్తులగు హిందూమహాజనులపక్షమున

పా కుమారస్వామి

సింహళ సామ్రాజ్య సభా ప్రతినిధియు,

హిందూమహాజన సభాధిపతియు,

ఏ కులవీరసింహాం

కార్యదర్శి"

కొలంబో 1897 జనవరి 15 తేది.

అపుడు సాయంకాలమైనందున స్వాములు ప్రజ లొసంగిన స్వాగతపత్రమునకు ప్రత్యుత్తరము సంగ్రహముగఁ జెప్పిరి

"మహాజనులారా! మీరు నన్ను చాల గౌరవించితిరి మహారాజతంత్ర నిపుణులకును, మహావీరులకును కూడ నిట్టి గౌరవముగలుగదనితలంచెదను ఇట్టిగౌరవమును భిక్షుకుఁడనగు సన్యాసికిఁ గావించితిరి ఈగౌరవము నాకుఁ గాదు దీనివలన మీకుఁగల హిందూమతాభిమానము వెల్లడియగుచున్నది మీ మతాభిమానమును జూచి మిక్కిలి సంతసించుచున్నాఁడను"

అని పల్కఁగా, ప్రజలెల్లరు జయజయశబ్దంబు లొనర్చిరి స్వాములు అందఱను ఆశీర్వదించి వీడ్కొలిపిరి ఆదినము

మొదలు వారు విడిసిన బంగళా "వివేకానందాశ్రమము" అని పేర్కొనంబడియె అచ్చటనే స్వాములు నివసించియుండిరి

---

## కొలంబో ప్రసంగము

మఱుచటి శనివారము కొలంబోనగర మహోద్యానమునందు శ్రీవివేకానందు లుపన్యసించిరి వచ్చిన జనులను లెక్కింపనలవిగదు ఇండియాయందిదియె మొదటి ప్రసంగము

"సభాధిపా! ఘనులారా!

నేనొనర్చిన కైంకర్యము నాసామర్థ్యాతిశయమువలనఁ గాదు నేను పుణ్యభూమి యగు భరతఖండమునం దుండి బయలు వెడలినపుడు, మహాజను లొనర్చిన మంగళాశీర్వచన ప్రభావము చేతనేగాని వేఱుకాదు నే గావించిన కైంకర్యము కొంతవఱకు ఫలకారియైనను నేను ఇండియాలోనుండి బయలు దేరుటకు ముందు, ప్రజాహితకార్యములు కొన్ని చేయఁ దలంచి యుంటిని అవి కొంతవఱకు ఫలించినందున ఇండియా దేశము పుణ్యభూమి యనియును, కర్మభూమి యనియును పూర్వులు వచియించినది ప్రత్యక్షమైనది

పుణ్యభూమి యని చెప్పఁదగిన దేశమును, లోకమందలి సకలాత్మలును కర్మఫలము ననుభవించుటకు జన్మింపఁదగిన దేశమును, ఈశ్వరాభిముఖులైన జీవులు కోరెడిమోక్షపదమును సాధించుటకై జన్మమెత్త వలసిన దేశమును, శాంతము దయ పారిశుద్ధ్యము వినయము మొదలగు సుగుణములు గల

మనుజులు వసించుదేశమును, వీనికన్నిటికంటె శ్రేష్ఠమైన ఆత్మ దర్శనమును భక్తియును గల దేశమును ప్రపంచములోఁ గలదని చెప్పుదురేని అది హిందూదేశ మనున దొక్కటియే.

ఆదేశమునందే మతాచార్యు లవతరించి సుజ్ఞాననదీ జలప్రవాహము చేభూమినంతయు నప్పుడప్పుడు తడుపుచుండిరి అచ్చటనుండియే శాస్త్రతత్త్వము లనెడి యలలు ఇతరదేశము లందు మోదుచుండెను ప్రస్తుతను లోకమందు వ్యాపించి యుండు లోకాయతనాగరకవృద్ధిని నివృత్తిచేసి, ఆస్థానమందు సుజ్ఞానమును నెలకొల్పఁబోవు తత్వశాస్త్రతరంగము లా దేశమునుండియే వ్యాపంచును అన్యదేశమందుఁగల కోటాను కోట్ల జీవుల హృదయకోశములను దహించుచుండు లోకాయత నాగరకాభివృద్ధి యనెడి మహాగ్నిని చల్లార్పఁదగిన జీవామృత జ్ఞానతటాకము హిందూదేశమందే యున్నది ఇట్లే జరుగు ననుట ముమ్మాటికిని సత్యము

ఇవ్విధముగా జరుగునని నాకు నమ్మకముగలదు. ఈవిష యము లోకచరిత్ర మెఱుంగినవారికిఁ దెలిసిన విషయమే మన మాతృభూమి యగు హిందూదేశమునకు లోకమంతయు ఋణ పడియున్నది. ఏదేశమును జూచినప్పటికిని శాంతగుణమే రూప ముదాల్చినట్లు ప్రకాశించు సాధువులగు హిందువులకు ఋణ పడనిజాతియే లేదు. "సాధువైన హిందువు" అను వాక్యమును కొందఱు నీచముగా భావించినప్పటికిని, నీచవాక్యమునందును మహాత్త్యము మఱగి యుండుననుటకు ఈశ్వరానుగ్రహముకొం దిన "సాధువైన హిందువు" అను వాక్యమే సాక్షిగానున్నది.

అనేకవిధములగు గాఢములైన నాగరకితలు విదేశమందుఁ బుట్టినవి పూర్వకాలమునందును తత్కాలము నందును గొప్ప జాతులందు విశేషాభిప్రాయములు జనించినవి పూర్వకాలము నందును తత్కాలమునందును ఒకజాతివారియందుఁ గలిగిన ఆశ్చర్యకరమైన యభిప్రాయమును ఇతరజాతులవారు గ్రహించిరి పూర్వకాలమునందును తత్కాలమునందును తత్త్వజ్ఞానమును వ్యాపింపఁజేయఁగోరినవారు తమతమ అధికారాడంబరములతో పలుచోటులకేఁగి ప్రసంగించుచున్నారు జాగ్రత్తతో వినుఁడు. తమకుఁ దెలిసిన స్వల్పజ్ఞానమును పరదేశస్థుల కుపదేశింపఁబోయినవారు రణభేరీధ్వనులతోడను సేనాసమూహముతోడనుబోయిరి వారిమతాభిప్రాయములు రక్తప్రవాహముచేఁ దడిసి వ్యాపించినవి వారికోర్కె లొక్కొకటిగను నొకలక్ష జనుల రక్తప్రవాహమును దీసికొని చనిపోవలసివచ్చెను ఆ యుద్ధవీరుల వాక్కునుండి వెలువడు వీరసోద్రేకమైనఘోషము లొక్కొక్కదానిచే నొక్కొకలక్షజనులు రోదించిప్రాణములను గోల్పోయిరి శిశువులు తమ తల్లిదండ్రులను గోల్పోయి ప్రలపించిరి సతులు తమ పతులను గోల్పోయి కన్నీరు మున్నీరుగాఁ గార్చి కలఁతనొందిరి ఇవ్విధముగా పరదేశస్థులు తమమతమును వ్యాపింపఁజేసిరి. హిందూదేశము నిరంతరమును తనస్థితిని మార్చుకొనక నేటివఱకు నేకరీతిగానే యున్నది. గ్రీసు దేశము కలుగకపూర్వమును,రోము దేశము పుట్టకపూర్వమును,తత్కాలములోని ఆంగ్లేయులు నీలవర్ణమును పూసికొని గాఢమైన జర్మనీదేశపుఅడవులలో పశుప్రాయులై సంచరించుచున్న పూర్వ

కాలమునందును, భరతఖండములో సత్ప్రవర్తన వ్యాప్తమై యుండెను లోకచరిత్రమునకు అతీతమైన కాలమునకు ముందుండియు నేటిదనుక భరతఖండములో నెన్నియో యభిప్రాయములు ఒకదానికి వెనుక మఱొకటి బయలుదేఱెనవి

ఇట్లు బయలుదేఱిన అభిప్రాయము లొక్కొకటియు ముందుగా ఉపశాంతియు వెనుక అనుగ్రహమును నిండిన దివ్యవాచకములై యుండినందు చేతనే, హిందువు లగు మనవారు మాత్రమే నరులనుజయించి ప్రజాపాలనము చేయవలయునను తలంపు లేనివారలై యున్నారు కాబట్టియే మనము ఈశ్వరానుగ్రహమునుతలదాల్చి నేటిదాంక క్షేమముగనున్నారము

గ్రీసుదేశస్థులు దండెత్తి వచ్చినప్పుడు లోకమంతయు వడవడ వడంకుచున్న కాల మొక్కట యుండినదికదా? ఇప్పుడు వారి ప్రాభవము వార్ధిలోం గలిసి పోయినది వారి మహాబల పరాక్రమాదులను దెల్పునట్టియొక్క కథయైనను లేకపోయినది గ్రీసులరాజ్య మంతయును నశించినది కదా! రోముదేశస్థులు ప్రవేశించిన స్థలములం దెల్ల తమయధికారమును చెల్లించుచుండినదే గాక, వారియొక్క గృధ్రధ్వజము నెగురుచుండినది మఱియు రోము అను పేరును విన్నంతనే భూమండలమంతయు వడంకుచుండినది ఇప్పుడన్ననో రోముదేశస్థుల దివ్యాలంకార మందిరములతో నిండిన 'కాపిటలైన్' పర్వతము సంపూర్ణముగా నాశమైనది రోము రాజులగు సీజరులు ప్రభుత్వ మొనర్చిన రాజ సభాభవనములం దిప్పుడు సాలెపురుగులు గూండ్లు కట్టుకొని వసించుచున్నవి ఇట్లే అనేక దేశస్థులు మహాప్రఖ్యాతి

పొందినవారై యుండి నిమిషమాత్రమున నీటిబుగ్గవలె నున్న చోటు తెలియకపోయిరి.

పైని పేర్కొనఁబడిన జనులు భూమిలో పుట్టినందులకు ఫల మంతయే **హిందువులుమాత్రము** ఆకాలము మొదలు నేఁటిదాక స్థిరముగ నున్నారు ధర్మశాస్త్ర కర్తయగు మనువే మరలవచ్చి హిందూదేశమును జూచినచో, నతనికి తానున్న కాలములో నున్నట్లే యిప్పటికి నున్నదని తోఁచునుగాని వేఱుగాఁ దోఁపదు వారున్నప్పు డున్న ఆచారానుష్ఠానములకు విరుద్ధముగా నేదియు జరుగకున్న దని తెలియును ఈమధ్యకాలమునం దెన్నియో విపరీతములు సంభవించినప్పటికిని పూర్వ ధర్మాచరణములు మాత్రము స్థిరముగా వృద్ధియగుచున్నవి ఇట్టి ధర్మానుష్ఠానములకు ఆజన్మస్థాన మగు హృదయ మేదియని విచారించినచో, ఆస్థానము భరతఖండమునందే యున్నది?

లోకములోని యితరజాతులవారి కందఱకును, వారి వ్యావహారికస్థితులలో మతము నొక్కటిగా నున్నది వారలకు రాజ్యతంత్రము కలదు సంసారసుఖము కలదు, సంపదచే సాధింపఁదగిన దంతయుఁ గలదు ప్రభుత్వముచేఁ బొందఁదగిన దంతయుఁ గలదు. వీని కన్నిఁటికంటె నింకను ఏదేని యింద్రియ సుఖభోగము లుండునేని వానినిగూడఁ బొందవలయు ననెడి కోరిక వారికిఁ గలదు ఇంతటి భోగభాగ్యములతోఁ గూడ వారికిఁ గొంచెము మతాచారమును గావలసి యున్నది. **హిందూదేశమునందు మతానుష్ఠానమొక్కటే జనులయొక్క ముఖ్యప్రవృత్తిగా నున్నది**

కొన్నాళ్లకు ముందు చీనా జపాను యుద్ధము జరగిన విషయము మీకుఁ దెలిసినదే కదా? పశ్చిమఖండమునందు రాజ్యపరివర్తనముకొఱకు ప్రజలు చెలరేఁగు చుండుటయు మీకుఁ దెలియును అయినను అమెరికాఖండములో జరిగిన మతసభకు హిందూదేశములో నుండి యొక హిందూసన్న్యాసి, ఆసభకు పోయినాఁ డనువిషయము సామాన్యమగు కూలివానికిఁ గూడ దెలిసియున్న ట్లెఱింగినాఁడను ఇందువలన మనదేశస్థులకుఁ గల మనఃస్థితి యిట్టిదని స్పష్టమగుచున్నదికదా? లోకమందలి సకల దేశస్థుల గుణావగుణములను దెలిసికొనుటకై ప్రయాణము చేసిన యాంగ్లేయులు వ్రాసిన పుస్తకముల వలనను, ఇతర ద్వీపాంతరవాసులు చెప్పెడి సమాచారముల వలనను, మన హిందువులు అజ్ఞానాంధకారమగ్నులై యున్నారని తెలిసికొని యున్నాఁడను. ఇట్లు వారుచెప్పుట యొకవిధమున నిజము ను వేఱొకవిధమున అబద్ధమునై యున్నదనియు తెలిసికొంటిని.

పశ్చిమఖండమునందలి ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్సు, జర్మని, మొదలగు దేశములలోని ప్రజలలోనొకనిఁజూచి, నీవు ఏపక్షమునఁ జేరినవాఁడవని యడిగినచో, వాఁడు, నేను ప్రజానుకూలపక్షములోఁ జేరినవాఁడను, లేక రాజానుకూల పక్షములోఁ జేరినవాఁడను అనియు, నేను ఈపక్షము వారికొఱకు నాయభిప్రాయము నీయఁదలఁచి యున్నాఁడననియు స్పష్టముగాఁ జెప్పును అమెరికా దేశములోని యొకనిఁజూచి యడిగినచో, నేను పబ్లిక్ పక్షములోఁ జేరినవాఁడను, లేక, డెమొక్రసి పక్షములోఁ జేరినవాఁడ ననియును జెప్పుటయే గాక, వెండినాణెముల

యొక్క మారకమును గూర్చియుఁ గొంచెము వివరించి చెప్పెను.

రిపబ్లిక్ అనఁగా, ఆయా దేశీయులచే నెన్నుకొనఁబడిన ప్రతినిధులవలన నాయాదేశము పాలింపఁబడుట యీపక్షమునఁ జేరినవారికి 'రిపబ్లిక్' అని పేరు.

డెమొక్రసి అనఁగా, ఆయా దేశీయులందఱిచేతను పాలింపఁబడుట యీపద్ధతి యీ కాలములో లేదు పూర్వపు రోము, అథెన్సు, ఈవిధముగా నుండినది దీనియందుఁ జేరినవానికి 'డెమొక్రాట్' అని పేరు

పైని పేర్కొనఁబడిన రిపబ్లిక్, డెమొక్రాట్ అనునిద్దరలో నెవ్వనిఁ జూచికాని, 'నీమతమేమి?' అని యడిగినయెడల, వాఁడు—"నేను గుడికి పోయి వచ్చుచున్నాను; ఆగుడికే నాతండ్రి పోవుచుండినాఁడు కాఁబట్టి నేనును ఆగుడికిఁ బోయెదను! ఇంతియ నాకుఁ దెలియును" అని చెప్పును.

హిందూదేశమునందలి ప్రజలలో నొక్కనిఁ జూచి "రాజకీయవ్యవహార మేదేని నీకుఁ దెలియునా?" యని యడిగినచో, వాఁడు—"అట్లనఁగా నేమి? అదేమో నాకుఁ దెలియదు" అని చెప్పును.

ఇఁక, సోషియలి (సంఘసంస్కారము) అను జనసమూహ విషయమును గూర్చియు, మూలధనమునుగూర్చు విషయమును గుఱించియు, కర్మాగారస్థాపనమును గూర్చియుఁ, మఱియు నిట్టి నవీనవిషయములను గూర్చియు, వాఁడు జన్మమునుండి విని

రెుఱుంగఁడు. వాఁడు కష్టపడి పనిచేసి దొరకినదానితోఁ దృప్తినొంది యుండును. అయినను, వానింజూచి, "నీమత మేమి?" అని యడిగిన, వాఁడు "అయ్యా! నాముఖమునందలి చిహ్నమే నామత మిట్టిదని తెలియఁజేయుచున్నది కదా?" యని చెప్పును ఇంతియగాక, తన మతమందలి విషయములు గూడఁ గొన్నింటిని చెప్పఁగలఁడు ఇది నాస్వానుభవముచే నెఱుంగఁబడినది. ఇదియే హిందూదేశప్రజలస్వాభావికము

ఒక్కొకఁడును వేర్వేఱు గుణములతోఁగూడి యుండుట వలన, ఒక్కొకఁడును వానివాని గుణములకుఁ దగిన కర్మములు జేయుచున్నాఁడు వాఁడు చేసినట్టి కర్మలకుఁ దగినట్లే జన్మములును గల్గుచున్నవి పూర్వజన్మకర్మలకుఁదగినట్లే యీజన్మమందు ఫలానుభవము కల్గుచున్నది వాఁడువాఁడు చేయు కర్మమును బట్టియే రాఁగల జన్మమందలి స్థితిగతులను దెలిసికొనవచ్చును లోకములోఁ బుట్టిన ప్రతి మనుష్యుఁడును దా నభివృద్ధినొందఁ దగు విధమునఁ బ్రవర్తించుచున్నాఁడు

ఈస్థితి ప్రత్యేకముగా నొక్క మనుష్యునితో సంబంధించినది. ఇటులే ఒక గొప్ప జాతియొక్క సమష్టికిని సంబంధము కలదు కావున, ఒక్కొకజాతివారును ఒక్కొకవిధమగు మనోస్థితి కలవారుగను, ఆస్థితికిఁ దగిన కర్మములను జేసి ముగించుట యందే దృష్టిగలవారుగను నున్నారు రాజ్యతంత్రమునందును, సైన్యమును సేకరించుటయందును, గొప్పతనమును వహించుట యందును మనవా రెప్పుడును తమబుద్ధిని వినియోగించుట లేదు. ఇఁక ముందును మనవారు తమబుద్ధిని వినియోగింపరు.

ఇది నిశ్చయము మనజాతివారి యభిప్రాయమే వేలు మనవారు తత్త్వజ్ఞానశక్తుల నంతయుఁ గాపాడియుంచికొని యుండి దానిని సమయము వచ్చినప్పుడు లోకమునందు వ్యాపింపఁజేయుటకే వేచియుందురు ఇది యొక్కటే మనవారి కైంకర్యము పారసీకులు, గ్రీకులు, రోమకులు, అరేబియా వారు, ఆంగిలేయులు, వీరిలో నెవ్వరైనప్పటికిని తమసేనాబలముచేత లోకమును జయించి సకలజాతులవారిని ఒక్కటిగాఁ జేసినప్పటికిని, భరతఖండముయొక్క తత్త్వజ్ఞానమును మహాచారమును వారు నూతనముగా నిర్మించు కాలువమూలముగాఁ బ్రవహించి లోకములోని పలుజాతులవారినాడులలోఁజొచ్చి వ్యాపించుటకు స్థిరముగానున్నవి లోకములోని మానవజాతి శ్రేష్ఠత్వము నొందవలసినయెడల, శాంతగుణసంపన్నులైన హిందువు లొక్కకరును తమతమజ్ఞానభాగములోఁ గొంతకొంత నొసంగవలయును భరతఖండము, లోకమున కొసంగఁదగినది జ్ఞానప్రకాశ మొక్కటే

పరదేశస్థులు భరతఖండమునకు వచ్చి మనలను జయించి మనవారిని తమజాతివారితోఁ గూడఁ జేర్చినపుడు, మహత్త్వజ్ఞానవిషయములు పరదేశములందు వ్యాపించినవిషయము చరిత్రశోధకుల కందఱకును దెలిసినదే కదా?

ఆదిలో మనవేదములను గూఢముగా పారసీకభాషలో పరివర్తనము చేయఁబడెను. దాని నొక ఫ్రెంచిదొర లాటిన్ భాషలో భాషాంతరీకరించెను ఈశతాబ్దమాదియందు షోపెనహా

అర్ అనుజర్మని మహాపండితుఁడు ఆలాటిభాషాంతరీకరణము నాధారముగ నుంచికొని తాను స్వయముగా వేదములను ఉపనిషత్తులను సంస్కృతమూలములలో నున్న ట్లర్థము చేసికొని యొక గ్రంథమును రచియించినదే గాక, "ఉపనిషద్విచారము వలె విశేషజ్ఞానము నొసంగు గ్రంథము లోకములో వేఱేది యును లేదు దానిని మూలభాషలోఁ జదువుటయే శ్రేష్ఠము. నాజీవితకాలమునందు ఆయుపనిషత్తులు శాంతము నొసంగు నవిగా నుండినవి నానిర్యాణకాలము నందును అవియే నాకు విశ్రాంతి నొసంగఁ గలవు" అని చెప్పియున్నాఁడు. మఱియు నతఁడు రచియించిన భవిష్యత్కాలస్థితిని గూర్చి వ్రాసిన గ్రంథమునందు, "గ్రీకు విద్యాభివృద్ధిచేఁ గల్గిన మతమునకంటెను మిక్కిలి శ్రేష్ఠమైన మతమొక్కటి శీఘ్ర కాలములో వ్యాపించుటను చూడఁగలము" అనిచెప్పినాఁడు అతఁడు చెప్పినది యిప్పుడు నిశ్చయమైనది కదా? లోకాభివృద్ధినిగూర్చి మేల్కని చూచు వారును, పశ్చిమఖండవాసులైన పలు తెగలవారి మనోవృత్తుల నెఱుంగుటకుఅభిలషించు వారును మనుజులతలంపులను దెలియఁ గోరెడి ప్రజ్ఞావిశేషము గలవారును, ప్రతిష్ఠలము లందును వారిగుణము నడవడిక క్రమము విద్య మొ॥ కలగునవి కొంచెము కొంచెముగా వ్యాపించుచుండు భరతఖండము యొక్క జ్ఞానము వలనఁ గల్గిన మాఱుబాటులను జూడఁగలరు నేను మిూఁదఁ జెప్పినట్లు వేఱొక విశేషమును గలదు. ఏమన: సేనాబలము చేతను అగ్ని ప్రజ్వలనము చేతను మన మేకాలమునందును మన మతమును వ్యాపింపఁజేయలేదు. లోకమునకు భరతఖండము

చేయునట్టి దానమును, లోకులు భరతఖండముయొక్క శాస్త్రజ్ఞానమువలనఁ జెందెడి ప్రయోజనమును జెప్పెడి ఆంగ్లేయ పదమొక్కటి యుండునేని, అది వశీకరణము అనెడి యర్థ మిచ్చు పాసినేషన్ అనెడి పద మొండే యగును వశీకరణ మనునది మంత్రశక్తివలె మనుష్యులను జూచినంతనే తటాలున భ్రమింపఁ జేయు స్వభావముగలది ఆర్యావర్తముయొక్క మతమును, ఆచారములును, సంప్రదాయములును, జ్ఞానశాస్త్రములును, కావ్యాలంకారవిద్యలును, పలువురను ప్రథమమున వెగటుగాఁ దోఁచినప్పటికిని, క్రమముగా నభ్యసించుచుండినచో నెల్లవారును వానికి వశులగుదురు ఉదయకాలమున కన్నులకుఁ దెలియకయు, చెవులకు వినంబడకయు పడెడిమంచునీటిబిందువులెట్లు భూమినంతటిని దడిపి చల్లనఁ జేయుచున్నవో, అట్లు శాంతమును క్షమయును గలవారై సుఖదుఃఖములను సమముగా భావించెడి భరతఖండవాసులు లోకుల యభిప్రాయములనంతయుఁ దెలిసికొనుచున్నారు ”

ఇతిహాసములు బోధించురీతిగా మున్నొకప్పుడు జరిగినవన్నియు మరల జరుగఁగలవు ఏలన: యూరోపుఖండవాసుల మతాభిప్రాయము లన్నియు విజ్ఞానశాస్త్రబలముచే నశించుచున్నవి. తమతమయభిప్రాయములే సత్యములని తలంచియున్న మతవాదుల సిద్ధాంతము లన్నియు నిర్మూలము లగుచున్నవి ప్రకృత మవలంబించెడి పురాతన తత్త్వశోధన మనెడి సమ్మెటపెట్టులచే మూఢమతసంప్రదాయములన్నియు చూర్ణము లగు

చున్నవి తత్కాలమునందు పశ్చిమఖండంబున వారిమత వాదము లన్నియు నీచముగా పరిగణింపఁ బడుటవలన భరత ఖండవాసులయొక్క తత్త్వశాస్త్రము వారి నాకర్షించుచున్న యది వారు తమమతమునందు తృప్తిఁ బొందనివారై నిశ్చయ తత్త్వమెయ్యది యని విచారించునపుడు మన వేదాంతశాస్త్రము వారికి సమయసంజీవి యగుట సహజమేకదా? తత్త్వమొక్కటే యనియు, అది అఖండమై అనంతమై యున్నదనియు, ఆత్మ యనాది యనియు, ప్రపంచ మనాదియనియు క్రమముగా వారు తెలిసికొనిరి ఇట్లు వారు కొన్నాళ్లకు ముందు తెలిసికొనిరి ఈ యభిప్రాయమునకు మనవారు ఎన్నియో యుగములకు ముందు తెలిసికొని తమగ్రంథములయందు వ్రాసియున్నారు కదా? పశ్చిమఖండవాసు లిదివఱకు సత్యములని తలంచియున్న సృష్టి లయ క్రమ సిద్ధాంతములన్నియు మన వేదాంతశాస్త్రములకు లోనై దాస్యముచేయుచున్న వనుటయందు దతిశయోక్తి లేదు

హిందూదేశమున కావలనుండు అన్యదేశవాసులయందు మన మతము వ్యాపించుచున్నదని నేను చెప్పునపుడు, వారి హృదయములను మనమత మాకర్షించియున్నవనికదా యభిప్రాయము! అయినను ఆయాదేశములం దేర్పడియుండు వర్ణాశ్రమ ధర్మములు ఆయాదేశములకుఁ దగినవని చెప్పుటకు వలనుగాదు. ఈవిషయము మనశాస్త్రములందు విశదీకరింపఁబడియున్నది మనమతము జ్ఞానభాగమనియు కర్మభాగమనియు రెండువిధ ములు జ్ఞానభాగమనునది ఆత్మలక్షణము, ఈశ్వరలక్షణము

జీవేశ్వరసంబంధము, మనుష్యస్వభావము, ముక్త్యుపాయము, సృష్టిక్రమము, ప్రళయము, మొదలగువానిని గూర్చియుఁ జెప్పునట్టిది కర్మభాగ మనునది మనుష్యులకుఁ దగిన ఆచారానుష్ఠానములను, ఆహారవ్యవహారములను, వివాహాది నిబంధములను బోధించును ఇవి స్మృతులచేతను పురాణాదులచేతను ఏర్పడినవే గాని శ్రుతులచే ప్రతిపాదింపఁబడినవి కాదు కర్మభాగముచే నేర్పడినవ్యవస్థలు యుగధర్మానుసారముగా అప్పుడప్పుడు మాఱుచుండును, ఆయా కాలమునకుఁ దగినట్లు మహర్షులవతరించి మనుష్యులను యుక్తమార్గమునఁ బ్రవర్తించుటకై ధర్మములను బోధించుచుందురు అయినప్పటికిని తత్త్వమును బోధించు జ్ఞానభాగము మాత్రము ఏయుగమునందును మాఱుబా టొందుటలేదు కావుననే హిందూదేశమునందు మతకలహములు లేకయున్నవి ఒకకులదేవతలకొఱకు మహాయుద్ధము జరుగక యుండుదేశము హిందూదేశమే మీ రాఁదఁజెప్పిన పరతత్త్వము అనాది నిత్యమని యనేక యుగములనుండి భరతఖండవాసు లెఱుంగుదురు పరతత్త్వమే సకలజనులకును కర్మానుగుణములైన జన్మములెన్నియైనను తుదకు ముక్తి నిచ్చును. అదియే పరోపకారశక్తి కలదై తేజరిల్లును.

మఱియు, మన భరతఖండము లోకమునకుఁ జేయవలసిన దానమొకటి కలదు ఈలోకమునఁ గల ఒక్కొక జాతివారికిని అదియందె ఒక్కొక దేవుఁడు కలఁడు ఈజాతులవా రందఱును స్నేహముతో వర్తింతురేని, యీదేవతలకెల్ల సమష్టియం దొక్క సామాన్యనామము కలుగును దీనికి దృష్టాంతము బాబి

లోనియా దైవములకు సవస్త్రిశామము బేయల్ అనున దొక్కటియే అస్లే యూథుల కలుదైవములయొక్క సామాన్యనామము మోలోక్కు. వీరు పరస్పరము జగడము చేసికొని యొకజాతివారిని మఱొకజాతివారు జయించి యేలునప్పుడు తమదైవమునే యెల్లవారును ఆరాధింపవలయు నని శాసింతురు. బేయల్ మెరోడాక్ అనుదేవుఁడేశ్రేష్ఠుఁడనియు, తక్కిన దేవతలు కనిష్ఠులనియు బాబిలోనియావారు చెప్పిరి. మోలక్కే సకల మోలోక్కులకును శ్రేష్ఠుండని యూథులు చెప్పిరి ఇట్లాదేశము లందు వారివారి జయాపజయములను బట్టియే దేవతలకు ఉత్కృష్టనికృష్టత్వము లేర్పడినవి హిందూదేశమం దిట్టి యభిప్రాయములు పూర్వకాలంబునఁ గల్గినవిగాని, అప్పుడు "ఏకం సద్విప్రా బహుధా వద న్తి" సత్యమైనవస్తు వొక్కటే. వేద మెఱింగినవారు ఆవస్తువును (దేవుని-పరబ్రహ్మమును) అనేక నామములతో వ్యవహరింతురు అను వేదవాక్యము ఘోషింప నారంభింపఁగా నాయుద్ధము మానినది అనఁగా శివుఁడు, విష్ణువు మొదలగు సకలశబ్దములకు వాచ్యమైన వస్తువొక్కటే యని భావము నామభేదము గాని వస్తుభేదము లేదు భరతఖండము నందలి సకలగ్రంథములును ప్రతిపాదించువస్తు విది యొకటే, సకలశాస్త్రములును ఈయొక్క సత్యమును కూర్చియే విస్తరించి ప్రతిపాదించుచున్నవి ఈ సత్యము హిందూదేశ వాసులయొక్క శరీర మాంద్యంతమును బ్రవేశించియుండుటం బట్టియే సకలమతసిద్ధాంతములను ఆదరించుచున్నారు.

ఈ దేశంబున కనంబడు మతములందు పరస్పరము విరోధ

మున్నట్లు తోఁచినప్పటికిని, ఇంతటి సమత్వబుద్ధితోనుండుట కిదియే కారణము. నీవు ద్వైతివిగానుండవచ్చును. నేను అద్వైతిగానుండవచ్చును. ఒకఁడు దేవునకు దాసుఁడనై యుందు ననెడియభిప్రాయము కలవాఁడుగా నుండవచ్చును. వేఱొక్కఁడు జీవేశ్వరైక్యవాదిగా నుండవచ్చును అయినను, అందఱును శుద్ధవైదిక హిందూజనులే యగుదుము

ఎట్లనఁగా, "ఏకంసద్విప్రా బహుధావదన్తి" అను శ్రుతియే దానికి సమాధానము కాఁబట్టి, మన దేశస్థులేయీవిషయమును లోకులకు బోధింపవలయును. విజ్ఞానావిద్యాలయం దసమానులైన అన్యదేశస్థులు మనమతమునుగూర్చి "బొమ్మల నారాధించు వారు" అని పల్కుచుండిరి ఇయ్యది నాసమక్షమున జరిగినవిషయము అయినను వారికి తమమతమందలి మౌఢ్యమునుగూర్చి యాలోచించుట కవకాశము లేదని తోఁచుచున్నది. ఇట్టిమౌఢ్యము అన్యదేశములందు సామాన్యముగాఁగానఁబడుచున్నది. ఒక్కొకరికిని తమయొద్దనుండుపదార్థమే శ్రేష్ఠమైనదనిభావము వారు తమధనమునే శాశ్వతమని తలంచి పూజింపుచుందురు. వారికి ఇతరుల ధనము ఎట్లు నాశమైనప్పటికిని చింతలేదు. తా నేవోయొక మట్టివస్తువో, లేక యేదేని యంత్రమో చేసిన యెడల సకలజనులును దానినే కొనియాడవలయునని తలఁతురు. వారి కెంతవిద్య యున్నను వారి దురభిమానము మాత్రము నివృత్తియగుట లేదు అయినను లోకమునందు సత్యమైన జ్ఞానము ఇంకను నెలకొనలేదు నూటికి దెబ్బదిగురు మోటుమనుష్యులుగనే యున్నారు మనము సకలమతస్థుల గ్రంథములను

జదువుచున్నారము అందఱియెడసహనము కలిగియుండవలయు నని తెలిసికొని యున్నారము కాని, ఇట్లు కొందఱు వర్తింపక యున్నారు అయినను సకలమతస్థులతోను ద్వేషబుద్ధిలేక యుండెదము పరదేశములందు మతసహనమే లేదు ఇది నా ప్రత్యక్షానుభవము. ఆదేశమునందు నూటికి తొంబదిగురకు పూర్వపద్ధతియే సరియనియు నూతనముగా నేదియుఁ దెలిసికొనఁగూడదనియు జగడమాడుచున్నారు ఇట్లు మన దేశస్థు లెప్పుడును జెప్పరు. మఱియు వివిధ మతములవారును గలసిమెలసి వర్తించు దేశ మేదేనియొకటి యుండునని పల్కుదుమేని యది హిందూదేశమే మహమ్మదీయులకును క్రీస్తువులకును గుళ్లుకట్టి యుపకరించిన దేశము హిందూదేశ మొక్కటే పరోపకారము చేయుదేశ మెచ్చటనున్నది? మీరు పరదేశములకేఁగి మాకొక దేవాలయమును నిర్మించి యిుండని యాదేశమువారిని అడుగుదురేని అప్పుడుకదా వారుచేయఁగల యుపకారమూ తెల్లమగుట! మీకు గుడికట్టియిచ్చుట లేదు సరిగదా, మిమ్ము సమయముఁజూచి నాశముచేయుటకును బ్రయత్నింతురు సకలమతస్థులును సహనముతో వర్తించుప్రదేశము ఆర్యావర్తమే యనియు, సకల మతస్థులకును ఉపకారముచేయు ఖండము భరతఖండమే యనియు ప్రకృతము పరదేశవాసు లందఱును దెలిసికొనియున్నారు

అనేకవిధములగు పర్వతములందుఁ బుట్టిన నదులెల్లనెట్లు ఒకేసముద్రంబునం గలియుచున్నవో, అట్లు ప్రపంచంబున గల సకలమతములలోఁ బ్రతిపాదింపఁబడి పూజింపఁబడు పూజలన్నియు పరమాత్మయొక్కనికే చెందును. ఇట్టి యభిప్రాయము

గలవాఁడే జ్ఞాని. వాఁడే శివభక్తుఁడు. వాఁడే విష్ణుభక్తుఁడు. హిందువుగాని, క్రీస్తువుగాని, మహమ్మదీయుఁడుగాని, యూదుఁడుగాని, మఱి యేమతస్థుఁడుగాని, ఎవరెవరేవిధముగా భగవంతుని ధ్యానించినప్పటికిని అది పరమాత్మధ్యానమే యని ప్రతి మతస్థుఁడును భావింపవలయును లోకము దేనిని కోరుచున్నదో యది కించిద్జ్ఞుల మగు మనకంటెను భగవంతునకుఁ జక్కఁగాఁ దెలియును లోకమునందుఁ గానంబడు భేదములన్నియు నశించుట తగనికార్యమే భేదములుంటయే మంచిది. భేదములేనిచో ప్రపంచమును, ప్రకృతివికారము నుండదు భగవంతుని యభిప్రాయమునందు ఈభేదమే శాశ్వతముగా నుండవలయునని యుండునేని, మనమందులకై జగడము చేసికొనుటవలన ప్రయోజన మేమికలదు? కాఁబట్టి, మన కొఱకు ఆదియందు భరతఖండములో అనుగ్రహింపఁబడిన తత్త్వమును మనము పరదేశస్థులకు బోధింపవలయును ఆతత్త్వమే మన గ్రంథములయం దెల్ల ప్రతిపాదింపఁబడి యున్నది మన నిత్యకర్మలయం దదియే అనుష్ఠింపఁ బడుచున్నది ఇంకను అనేకరహస్యములు భరతఖండమునంగలవు అవిమహాజ్ఞానులకుఁ దెలియును,

శాంతము, సాధుత్వము, క్షమ, సమత్వము, అనుతాపము, సోదరభావము, అను నీమొదలగు సుగుణములను పురుషులు, స్త్రీలు, బాలురు, చదివినవారు, చదువనివారు, అగు వీరందఱును ఏజాతియందును గాని, ఏమతమునందుఁ గాని జన్మించినప్పటికిని గైకొని వర్తించుటయే పరమధర్మము

"ఏకం సద్విప్రా బహుధా వదన్తి" "లోకము నిన్ను పలుతెఱంగుల పేరులతోఁ బేర్కొనుచున్నది. నీవు మాత్రము ఒక్కఁడవే"

## యాప్హ్ణమునందు వేదాంత ప్రసంగము

మఱునాఁడు ఆదివారము గాన, వివేకానందులను దర్శించుట కనేకులు వచ్చిరి వచ్చినవా రందఱితోఁ డను ముచ్చటించిరి ఆసాయంకాలము దేవాలయమునకుం జనిరి దేవాలయాధికారులు మొదలగువారును స్వాగత మొసంగి సత్కరించిరి పిమ్మట పార్వతీపరమేశ్వరులను దర్శించికొని పలువురు వెన్నంటి రా విడిదిం జేరిరి మఱుచటిదినము సోమవారము నాఁడు వివిధము లగు ప్రసంగములు సల్పిరి మంగళవారము రైలుమార్గముగ ఖండికిఁ బోయిరి ఆయూరివారు గజాది చిహ్నములతోను వివిధవాద్యములతోను ఎదుర్కొని సత్కరించిరి అచ్చటనుండి బయలుదేరి సుమారు 2000 సంవత్సరములకు పూర్వము ప్రసిద్ధికొంది వెలసియున్న అనురాధపురమునకుఁ బోయి, యచ్చటఁ గల బోధివృక్షముక్రింద మూఁడువేల జనులు నిలువంబడియుండఁగా నొక ప్రసంగముచేసి శివుఁడు విష్ణువు బుద్ధుఁడు అను నీమొదలగు నామములతోఁ బూజింపఁబడు దేవుఁడు పరమాత్మ యొక్కఁడేయని నిరూపించిరి

పిమ్మట, అచ్చటనుండి రెండుదినములు ప్రయాణముచేసి యాప్హ్ణము చేరిరి చేరఁగానే యానగరవాసులు స్వాముల

కొంతకు నిర్మించిన శృంగార మండపమునకుఁ దోడ్కొని చని స్వాగత మొసంగిరి మఱునాఁడు సాయంకాలము వివేకానంద స్వాములు వేదాంతమతమును గుఱించి యుపన్యసించిరి.

**వేదాంతమతము:—**నేను ప్రసంగింపఁ దలఁచిన విషయము గొప్పది ఒక్క ప్రసంగమునం దీవిషయమును సంపూర్ణముగాఁ జెప్పుటకు సాధ్యము కాదు నాకుఁ దెలిసినంతవఱకు సంగ్రహముగాఁ జెప్పెదను మనలను సర్వసామాన్యముగా హిందువులనుచు పిలుచుచున్నారు ఈపదమునకు పూర్వమున్న యర్థము ఇప్పుడు లేదు "హిందువు" అనఁగా సింధునదీతీరవాసుఁడని యర్థము "సింధు" శబ్దమును పారసీకులు "హిందు" అని వాడిరి మహమ్మదీయులు రాజ్యపాలనము చేయుచున్నప్పుడు మనమే మనలను హిందువులని వ్యవహరింపఁ దొడఁగినారము ఈహిందూశబ్దమునకు విపరీతార్థ మేమియు లేదు ఆకాలమునం దీశబ్దము సరియైనదిగనే యుండినని అప్పుడందఱు నొక్కమతములోఁ జేరినవారై యుండిరి ఇప్పుడు మహమ్మదీయులు, క్రీస్తువులు, జైనులు మొదలగు అన్యమతస్థులందఱకును అన్వయించుచున్నది కాఁబట్టియే హిందు వను శబ్దము మనకు అన్వయించి కొనుటకు నాకిష్టము లేదు అయినచో మనకేపదము తగునవఁగా, "వైదికులు" లేక "వేదాంతులు" అను పదమును మనకు అన్వయించునట్లు వ్యవహారమునకుఁ దెచ్చుకొనుట నాకిష్టముగా నున్నది మనలో ననేకభిన్నమతము లున్నను వారవారిమత గ్రంథములు కొన్ని దేవత్వము నొందినవనియు, కొన్ని మహాపురుషులచే బోధింపఁబడినవనియు నమ్మిక గలదు హిందువుల

వేదములు చాలప్రాచీనమైనవని పశ్చిమఖండవాసులచేఁ గూడ నమ్మఁబడుచున్నవి కాఁబట్టి ఈవేదములను గూర్చి కొంచెము విచారింతము.

వేదము:—వేదమును ఏపురుషుఁడును నిర్మింపలేదు. కావుననే "అపౌరుషేయము" అనఁబడుచున్నది వేదముయొక్క కాలనిర్ణయమును దెలియలేము. ఇఁక ఏర్పడుటయును అబద్ధము వేదము నిత్యమని హిందువుల యభిప్రాయము. ఇతర మతస్థుల ప్రమాణగ్రంథము లన్నియు తమతమ సగుణమూర్తిచే ప్రజల కొసంగఁబడినవి మఱికొందఱకు అనేకమూర్తు లొసంగినవి కొందఱకు దేవదూత లొసంగినవి హిందువులకు అట్లెవ్వరు నీయలేదు అది నిత్యమైనది దానికి కాలములేదు స్వతఃప్రమాణమైనది అనఁగా దానికి అదియే ప్రమాణమైనది అది ఎప్పుడును వ్రాయఁబడలేదు సృష్టింపఁబడినదియు కాదు సర్వకాలములం దుండునది.

సృష్టి కెట్లు ఆద్యంతములు లేవో అట్లు వేదమునకును బ్రహ్మజ్ఞానమునకును ఆద్యంతములు లేవు ఈబ్రహ్మజ్ఞానమే వేదము "విద్" అను ధాతువుచే "ఎఱుఁగుము" అనెడి యర్థమును ప్రతిపాదించుచున్నది వేదాంతము లనఁగా మహర్షు లెఱింగిన జ్ఞానసంగ్రహము ఋషి యనఁగా "మంత్రద్రష్ట" యని యర్థము అనఁగా "తెలివిని తెలిసికొన్నవాఁడు" అని భావము అంతియేకాని, ఆయభిప్రాయము ఈపేరుగల ఋషిది గాదు. ఎప్పుడైనను ఈమంత్రము ఈపేరుగల ఋషివలన వచ్చినదని మీరు తెలిసికొందురేని, ఆఋషియే దానిని వ్రాసినవా

రనిగాని, లేక నిర్మించినారని గాని తలంపవచ్చును కాఁబట్టి
నిత్యమై యున్న సత్యమును తెలిసికొన్నాఁడని యర్థము

వేదము కర్మకాండమనియు జ్ఞానకాండమనియు రెండు
విధములు కర్మకాండము వివిధములగు యోగములను గూర్చి
బోధించును ఆయోగములలో ననేకము లిప్పుడవలంబించుటకు
సాధ్యము కావని త్యజింపఁబడెను కొన్నికొన్ని కర్మము లిప్పు
డాచరణములోనున్నవి కర్మకాండములోనివర్ణాశ్రమధర్మములు
నేఁటిదాఁక అనుష్ఠింపఁబడుచున్నవి అయినను వేదాంతమనియు
వేదశిరస్సనియు వేదసారమనియుఁ జెప్పఁబడు జ్ఞానకాండమైన
ఉత్తరభాగమునందు మన మతతత్త్వము లణఁగియున్నవి వేద
జ్ఞాన సారమగు ఉపనిషత్తులు మాత్రము ద్వైతులు, అద్వై
తులు, విశిష్టాద్వైతులు, శైవులు, శాక్తేయులు, సౌరులు, గాణా
పత్యులు ఇంకను గల హిందువులందఱకును ప్రమాణములై
యున్నవి వారివారిమతమున కనుకూలమగు భాషలను నిర్మించి
కొనుటయం దాక్షేపమేమియు లేదు అయినను సామాన్యముగా
వేదప్రమాణమునకు లోఁబడియే యుండవలయును కాఁబట్టి
మనము హిందువనుటకు మాఱుగా వేదాంతియను పదమును
ఉపయోగించికొనఁదగును భరతఖండము లోని వైదికదర్శనము
వారందఱును వేదాంతప్రామాణ్యమును సంగీకరించినవారలే
ఈకాలములో మనదేశములో నేర్పడియుండు నవీనమతములు
సైతము తమనుతసిద్ధాంతము లిట్టివని నిరూపించుటకు సరియగు
నాధారము లెంతమాత్రము లేకపోయినప్పటికిని, వారియుప
దేశమునందు మాత్రము ఉపనిషద్విషయములే కానంబడియెడిని.

మఱియు కేవలము నీచమైన మతములందుఁగూడ వారు పూజించు దేవతలు ఉపనిషదభిప్రాయములే రూపకస్వరూపముగాఁ గానంబడుచున్నది ఉపనిషదభిప్రాయములె తర్వాత కలిగిన పురాణములందు విగ్రహారాధనరూపముగా రూపకముదాల్చి వెలయుచున్నవి

ఉపనిషద్రహస్యము లన్నియు ప్రకృతము విగ్రహారూపముల నొంది మనగృహములందు పూజనీయములై ప్రకాశించుచున్నవి కాఁబట్టి మనకుఁ గనంబడు ప్రతిచిహ్నమును ఉపనిషత్సారమని మనము గ్రహింపవలయును ఆదికాలమునందు వేదాంతములందు లక్షణగాఁ జెప్పఁబడిన వన్నియు నిప్పుడు నిత్యకర్మలయందు విగ్రహ రూపములైనవి

స్మృతులు:—ఇవి వేదాంతమునకు తర్వాతివి వీనిని మహర్షులు రచియించిరి గాని, యివి వేదప్రామాణ్యమునకంటె తక్కువయైనవి. అన్యమతగ్రంథము లెట్లు పౌరుషేయములో అట్లు స్మృతులును పౌరుషేయములే కావున వేదవేదాంతముల కంటె తక్కువయైనవి వేదవేదాంతములకు విరుద్ధముగా స్మృతివాక్య ముండెనేని, ఆస్మృతివాక్యము త్యజింపఁదగినదే కాఁబట్టి వేదవేదాంతములకు విరుద్ధమైన స్మృతివాక్యము ప్రమాణము కాదు మఱియు స్మృతులు కాలమునకుఁ దగినట్లు మాఱుపాటొందుచున్నవి అనఁగా కృతయుగమునం దీస్మృతులు, త్రేతాయుగమునం దీస్మృతులు, ద్వాపరయుగమునందీ స్మృతులు, కలియుగమునం దీస్మృతులు, ప్రమాణములని గ్రహించుటంబట్టి ఆస్మృతులకు నిత్యత్వము లేదు వేదవేదాంతములట్లు

కాదు. అవి నిత్యమైనవి. వానికి మాఱుబాటు లేదు; ఆత్మముక్తి అను నీమొదలగు విషయములనుగూర్చి బోధించు సిద్ధాంతముల కెప్పుడును మాఱుబాటు లేదు వేదవేదాంతమునం దెట్లుండెనో అట్లే ఇప్పుడు నున్నవి. ఇంకను ఇట్లే యుండును అయినను మన యాచారములు మాత్రము కాలమునకుం దగినట్లు మాఱుచుండును. ఒక కాలమునందు సదాచారమై యుండినది వేఱొక కాలంబునందు దురాచారముగ నుండును పూర్వము మంచి దనంబడిన యాహారము వేఱొకప్పుడది శీతోష్ణ భేదము చేతను దేశభేదము చేతను పనికి రాని యాహారమగును. ఇప్పుడు ఆకాలపుస్మృతియం దాహారము నిషేధింపంబడును ఆయాకాలమునకుం దగిన మార్పులను జేయుట కొఱకు మహర్షు లవతరించి స్మృతులను నిర్మింతురు అయినను, మన సిద్ధాంతములు మాత్రము అణుప్రమాణ మైనను మాఱవు

పురాణములు:—పురాణము లనునవి పంచలక్షణముల లోఁగూడినవి అనఁగా సృష్టి, ప్రతిసృష్టి, రాజవంశము, మన్వంతరము, వంశానుచరితము ఇంతియగాక, వేదాంతతత్త్వములు గూడ కథారూపములుగాఁ జెప్పఁబడుచు అవి వైదికమును సకల జనులకును సులువుగాఁ దెలుపుట కొఱకు వ్రాయంబడినవి. వేద భాష చాల పురాతనమైనది. పండితులలోఁ గూడ కొందఱే యాభాషయర్థము నెఱుంగుదురు. పురాణము లాకాలములో ప్రజ లెఱింగిన భాషలో వ్రాయంబడినవి పురాణభాషను మనము కావ్యసంస్కృతమని వ్యవహరించెదము.

పామరుల కొఱకే పురాణములు రచియింపఁబడినవి పామరు లకు తత్త్వరహస్యములు సులువుగాఁ దెలియ నందున పురాణ ముల మూలమున మహర్షులు బోధించిరి వానియందు మహ ర్షులు శాస్త్రోక్తమైన సకల తత్త్వములును వ్యక్తమగునట్లు విశదీకరించి యున్నారు.

పురాణములుగాక తంత్రములనెడి వేఱొక తరగతి గ్రంథములు కొన్ని గలవు వానియందు పురాణములలోని విషయములేగాక పూర్వకాలంబున కర్మకాండములోఁ జెప్పఁ బడినయాగాది విషయములును జేర్పంబడియున్నవి

మీఁద జెప్పఁబడిన గ్రంథము లన్నియు హిందువుల మతగ్రంథములే ఒక్క జాతిలో నిన్ని మతగ్రంథములు ప్రమా ణములుగా నున్నప్పుడు ఎన్నియో ఉపభేదము లుండుననుట సహజమే కదా? అయినను మనయాలోచనకుఁ దగినన్ని భేద ములు లేవు ఈవిషయమును గూర్చి తర్కించుటకు అవకాశము లేదు. ప్రధాన విషయమునుమాత్రము విచారింతము

మొదటిది సృష్టి విషయము. స్వభావమనియు, ప్రకృతి యనియు, మాయయనియుఁ జెప్పబడు సృష్టి అనాది నిత్యమై నది. కొన్ని దినములకు ముందు ఈలోకము సృష్టింపఁబడిన దని యును, ఒక దేవత వచ్చి యీలోకమును సృష్టించి తర్వాత నిద్రించుటకును బోయినాఁడనియు మనయభిప్రాయము గాదు సృష్టి యనునది ప్రతిక్షణమును జరుగుచునే యున్నది ఈశ్వ రుఁడు సదా సృష్టించుచునే యున్నాఁడు. సృష్టికి అంతమే లేదు.

“నే నొకక్షణ మూరకయుందునేని ప్రపంచమంతయు నశించును” అని భగవంతుఁడు చెప్పియున్నాఁడు సృష్టినిమిషమాత్ర ముపసంహరింపఁబడునేని ప్రపంచము నిర్మూలించును ప్రపంచములో నెల్లచోటులందును సృష్టిశక్తి జరుగుచున్నది. ప్రళయకాలమందు మాత్ర మాశక్తి నిలిచియుండును సృష్టియనఁగా ఒకదానినుండి వేఱొకటి కలుగుట యని యర్థమే గాని, శూన్యమునందు వేఱొకటి కలుగుటయని యర్థముకాదు ప్రపంచమంతయు నొకప్పుడు విస్తరముగాను, వేఱొకప్పుడు సూక్ష్మముగాను కనంబడు స్వభావముగలది ఈరీతిగా ప్రపంచసృష్టిక్రమము జరుగుచునే యుండును కాలదేశ నిమిత్తము లనునవి అంతయు నీప్రకృతికి లోఁబడి యున్నవి దాని కాద్యంతములు లేవు ఆద్యంతము లనునవి ఒక కల్పముయొక్క ఆదియును అంతము నని యెఱుంగవలయును

ఈసృష్టికి ప్రథమకారణ మేది? బ్రహ్మము. ఆబ్రహ్మముయొక్క లక్షణ మేమి? అతఁడు నిత్యుఁడు, నిత్యశుద్ధుఁడు, నిత్యబుద్ధుఁడు, సర్వశక్తిగలవాఁడు, సర్వజ్ఞుఁడు, సర్వదయాపరుఁడు నిష్కలుఁడు, నిరంజనుఁడు. అతఁడే లోకమును సృష్టించి, రక్షించుచున్నాఁడని చెప్పుదుమేని రెండువిధములగు కష్టములు సంభవించును ఒకనిసుఖవంతునిగాను, వేఱొకనిదుఃఖవంతునిగా నుపుట్టింపనేల? ఇదిపక్షపాతము గాదా? ఇంతియగాక, ఈలోకములో జననమును మరణమునుగూడ నున్నవి. ఒకజంతువు వేఱొక జంతువునుహింసించుచున్నది ఇట్టి అన్యాయమును క్రూరమునగు సృష్టికిఁగారణము ఈశ్వరుఁడగునేని, ఆయీశ్వరునికంటె దుష్టుఁడు

వేఱొకఁ డుండునా? అయినను ఈవిషయమును గూర్చి వేదాంతము బోధించు నదేమనఁగా:—సృష్టికిఁ గారణము మనమే. మేఘము సకలక్షేత్రములందును సమముగా వర్షించినప్పటికిని, చక్కఁగా దున్నిన నేలయందు మాత్రము మంచి పంటపండి, దున్నని నేలయందు పండకపోవుట కెట్లు ఆ మేఘము పక్షపాతము కలది కాదో, అట్లు భగవంతుఁడును పక్షపాతము కలవాఁడు కాఁడు ఈవ్యత్యాసమునకుఁ గారణము మనమే. మనము పూర్వజన్మమునందుఁ గావించిన దోషమే యీ వ్యత్యాసమునకుఁ గారణము కాఁబట్టి భగవంతునికి పక్షపాతము లేదు

జీవుఁడు నిత్యుఁడు:—ఇఁక హిందువులకుమాత్రమే గాక, బౌద్ధులకును జైనులకును సామాన్యముగాఁగల రెండవసిద్ధాంతమును గురించి ప్రసంగింపఁబడును జీవుఁడు నిత్యుఁడని మన మెల్లరము నంగీకరించి యున్నారము ఆది శూన్యమునుండి కలిగిన ననుట పొసఁగదు ఆజీవుఁడుఒకఁడే కాదు ఆదిదేనికిఁ గలదో దానికి అంతమును గలదు. నిన్నటిదినము ప్రాణము కల్గియుండెనేని, నేఁటికిదానికి వినాశముకలదు అయినను ఇదిశాస్త్ర విరుద్ధమైనది ఈకాలములో దాని నిజము నెఱుంగుటకు శ్రమ పడ వలసినది లేదు ఏలన, ప్రకృతకాలమునందలి విజ్ఞానశాస్త్రములన్నియు భౌతికప్రపంచమును పరిశీలించి దాని ద్వారముగా మన వేదశాస్త్రసిద్ధాంతతత్త్వములను నెలకొల్పి మనకు మహోపకృతి యొనర్చుచున్నవి ఆత్మ నిత్యమను విషయము మీకు మున్నే తెలియును. క్రొత్తగా జనించు ప్రతిశిశువును అంతకు మున్ను లేకయుండి, కవులు వర్ణించునట్లు, అప్పుడే అభినవ

ముగా ప్రకృతిదేవి హస్తమునుండి తత్క్షణము కల్గినది కాదు అనాదిగా అది జనన మరణములకు లోనై పూర్వజన్మకృతదోషములకుఁ దగినట్లు జన్మము నొందుచున్నది దీనికే పునర్జన్మమని పేరు మనవిధికి మనమే కారణము మన మీజన్మమునందు ఇవ్విధముగా చేయవలయు నని పూర్వమే భగవంతుఁడు నిర్ణయించియున్నాఁడనియు, అదియే తలవ్రాఁత యనియు చెప్పెడి సిద్ధాంతమును పైని చెప్పిన పునర్జన్మసిద్ధాంతము నిర్మూలము కావించి దేవునకును మనుజునకును మధ్యస్థమై తనరారుచున్నది.

మన సుఖదుఃఖములకు మనమే కారణము కారణమును కార్యమును మనమె గాన, మనము స్వతంత్రులము నేను దుఃఖపడుదునేని యది నేనే చేసికొన్నందున, నేను సుఖపడవలయు నని కోరుదునేని యట్లు నుండవచ్చుననియు తోఁచుచున్నది. అనఁగా, సుఖదుఃఖములను తన యిష్టముచొప్పున కావించికొనవచ్చును ఇట్లన్ని విషయములయందు నూహించికొనఁదగును మనుజుని సంకల్పము సకలస్థితుల నతిక్రమించియుండును దానియెదుట ప్రకృతిశక్తులాదిగాఁగల సకలశక్తులు నిలువవు ఈ శక్తులన్నియు సంకల్పమునకును స్వతంత్రశక్తికిని లోఁబడి వానికి పరిచర్య చేయు దాసగణమువలె నుండును

ఆత్మ:—ఇఁక ఆత్మనుగూర్చి ప్రస్తావింపఁబడును మన శాస్త్రములయందు ఆత్మవిచారము లేని బ్రహ్మవిచారము లేదు. భౌతిక సంబంధమైన ప్రకృతి పదార్థములయొక్క అతీతస్వరూపమైన యొక లేశమాత్రమును దెలిసికొనుటకు హిందూదేశమునందును అన్యదేశములందును ప్రయత్నించిరి. వారిప్రయ

త్నము లన్నియు నిరర్థకములైనవనువిషయము మన మెఱుంగినదే ప్రపంచపదార్థములను పరిశీలింప మొదలిడుదుమేని అది ప్రపంచాతీత స్థితిని గనఁబఱచుటకు మాఱుగా మనలను మును పటికంటె ప్రాకృత స్వభావులగునట్లొనర్చుచున్నది తత్పూర్వమున్న రవంత ఆస్తికబుద్ధియు నాశమై పోవుచున్నది. కాఁబట్టి శ్రేష్ఠమైన తత్త్వమును దెలిసికొనుటకును, ఆత్మానుభవము నొందుటకును, భౌతికవిచారము సాధనము కానేరదు ఆత్మవిచారమే దానికి సాధనమైనది బాహ్యసంబంధమగు భౌతికశాస్త్రము ఆంతరసంబంధమైన ఆత్మతత్త్వమును దెలియఁజేయునా? కావున, ఆత్మవిచారముచేతనే బ్రహ్మజ్ఞానము సిద్ధించును. జీవాత్మవిషయమై మనలో నభిప్రాయభేదము లున్నను, మన మెల్లరమును అంగీకరించెడి విషయములు మాత్రము కొన్ని యున్నవి అవి యేవనఁగా, ఈ ఆత్మలు ఉత్పత్తినాశములు లేనివనియు, అనుగ్రహము, పారిశుద్ధ్యము, సర్వవ్యాపకత్వము, సర్వజ్ఞత్వము మొదలగు గుణములు ఒక్కొక్క ఆత్మయందును మఱుగియున్న వనియు మాత్రమే మీఁదఁజెప్పినవానిని మనము జ్ఞప్తియందుంచికొనవలయును ఎంతటిదుర్బలము గలదిగను, దుష్టస్వభావము గలదిగను, మనుజుల యందును ఇతర బంధువుల యందును మహత్తుగాను అల్పముగాను నుండునది సర్వవ్యాపకత్వమును సర్వజ్ఞత్వమునుగల పరమాత్మయే బాహ్యమునఁగనంబడుదోషము ఆత్మసంబంధమైనది కాదు. అది ఉపాధిసంబంధమైనది నాకును అత్యల్పమైన ప్రాణికిని గలభేదము ఉపాధిసంబంధమైనదే గాని వస్తుస్వరూపమును విచారించునెడ అదిల

యును నేనును ఒక్కటే; ఒకటే ఆత్మస్వరూపము. ఇదే భారతవర్షమునందు బోధింపఁబడిన శ్రేష్ఠమైన తత్త్వము. కావున, మనము భారతవర్షమునందు మనుష్యులయందు మాత్రమే సోదరభావము కనఁబఱచుట మాత్రమే గాక, సకల ప్రాణులయందును మనవంటి ఆత్మ యున్నదని భావించునట్టి జీవకారుణ్యము గలవారమై యున్నారము "ఏవం తు పండితో జ్ఞాత్వా సర్వభూతమయం హరిమ్" అనునట్లు భగవంతుఁ డొక్కఁడే సకలదేహములయందు నున్నాఁడని పండితుఁడు బ్రహ్మజ్ఞాని తెలిసికొని సమస్తమును బ్రహ్మస్వరూపమని భావించుచున్నాఁడు. కాఁబట్టియే భారతవర్షమునందలి మనుజులు జీవకారుణ్యము గలవారని ప్రసిద్ధినొందియున్నారు మనలోఁగల ఆత్మలక్షణసంబంధమైన విషయములలో నిదియు నొక్కటియై యున్నది

బ్రహ్మము:—ఇఁక బ్రహ్మమునుగూర్చి పరిశీలింపఁబడును. దీనిని పరిశీలించుటకు ముందొక విషయమును విచారింపవలసి యున్నది ఆంగ్లేయభాష నేర్చినవారు 'సోల్, మైండ్' అను రెండుపదములను ఉపయోగించుచున్నారు. మన శాస్త్రములయందుఁ జెప్పఁబడెడి ఆత్మకును ఆంగ్లేయమందలి సోలునకును భేదమున్నది మనము దేనిని మనస్సని చెప్పెదమో దానినే వారు సోల్ (ఆత్మ) అనెదరు పశ్చిమఖండమునందు ఇరువది సంవత్సరములుగా సంస్కృతశాస్త్రజ్ఞానము వ్యాపించుచున్నది. అంతకుమున్నా దేశములందు ఆత్మయనెడి యభిప్రాయమే లేదు. ఎట్లనః మొదట దేహము, తర్వాత మనస్సు, అయినను ఈమనస్సు ఆత్మ కాదు; దానిని మనము సూక్ష్మశరీరమని చెప్పుదుము.

అదే జననమరణములకు హేతువు. దీనికి వేఱుగా నుండునది యేదియో అదే ఆత్మ. ఆంగ్లమునందు ఆత్మకు ప్రతిపదముగా 'సోల్, మైండ్' అని ప్రయోగింపఁ దగదు ఆత్మ యనియే ప్రయోగింప వలయును ఇప్పు డిప్పుడు ఆంగ్లేయ తత్త్వశాస్త్రజ్ఞులు 'తాను' అను నర్థ మిచ్చునట్టి సెల్ఫ్ అను పదమును ఉపయోగించెదరు అదియు ఆత్మ యనునట్టి యర్థము నీయఁజాలదు ఆత్మ శరీరముకంటెను, మనస్సుకంటెను, వేఱైనదనియును, ఆత్మ సూక్ష్మశరీర మనఁబడు మనస్సుతోఁ జేరియే జనన మరణములను బొందుచున్న దనియును తెలియఁదగును ఈ ఆత్మ స్వస్వరూపజ్ఞానమును సంపూర్ణముగాఁ బొందినమీఁదట, అది జననమరణములకు లోఁబడదు దానికి నిష్టము కలదేని మనస్సుతోఁ జేరి జన్మముల నెత్తును, లేనిచో స్వేచ్ఛగా ముక్తిని బొందును ఆత్మకుమేలైన పురుషార్థము ముక్తి మన మతమునందు స్వర్గ నరకములు కలవు గాని అవి నిరంతర ముండెడిది కాదు అటు లుండునేని స్వభావ విరుద్ధమగును స్వర్గలోకము మనభూలోకమువంటిదే అయినను అచ్చట విశేషమైన సుఖభోగములు కలవు ఇట్టి స్వర్గము లనేకము లున్నవి భూలోకమునందు ఫలాపేక్షలో సత్కర్మములు చేసినవారు స్వర్గలోకమునందు ఇంద్రాదిదేవతలై జన్మింతురు వారికి అచ్చట వేర్వేఱు అధికారములు గలవు అందఱును మున్ను మనుష్యులై యుండి సత్కర్మములు చేసినవారే కాఁబట్టియు ఇంద్రాదిశబ్దములు ఒక్క పురుషునిగూర్చియే చెప్పఁబడుట లేదు వేగుర ఇంద్రులుందురు. మున్ను నహుషుఁడను మహారాజు భూలోకములో

గతించిన మీఁద ఇంద్రుఁ డాయెను ఇంద్రాదిదేవతల పదము శాశ్వతమైనది కాదు. పుణ్యము తీరినంతనే మరల భూలోకమున జన్మింపవలసినదే. దేవతలలోఁ గొందఱు ఉత్తమస్థితినిఁ బొంద నభిలషించియు నచ్చటిభోగములనుజూచి మోహితులై తమ సత్కర్మము నశించునంతదాఁక నుండి పిమ్మట త్రోయఁబడి మనుష్యజన్మ మెత్తుదురు. కావుననే దీనికి కర్మభూమి యని పేరు కల్గినది ముక్తినిఁ బడయఁగోరువారు భూలోకములో నుండియే పడయఁదగు ఉత్తమలోకములన్నియు బంధముతోఁ గూడినదని మన శాస్త్రము లుద్ఘోషించుచుండఁగా పది వేలేండ్లు రాజ్యపాలన చేసినను ప్రయోజన మేమి? శరీరమున్నంత కాలమును, కాలదేశములకు లోఁబడి యున్నంత కాలమును నీవు బానిసవే కదా? కావున, బాహ్యాభ్యంతరములయందు స్వతంత్రముగా నుండవలయు ననుటయే ముఖ్యాభిప్రాయము నీవు ప్రకృతిని కాలిక్రింద ద్రొక్కికొని నివృత్తితో దాని నతిక్రమించి పోవుటయే శ్రేష్ఠము ఇఁక జననము కలుగదు; మరణమును కలుగదు; సుఖమును లేదు; దుఃఖమును లేదు అన్నిటి నతిక్రమించి శాశ్వతబ్రహ్మానందము నొందుదువు ఇహము నందు సౌఖ్యమనియును, మంచిదనియును జెప్పెడి దంతయు ఆబ్రహ్మానందముయొక్క లేశమాత్రములే ఆబ్రహ్మానందమే పొందఁదగినది

ఆత్మకు స్త్రీపురుషభేదములు లేవు అవి శరీరమునకు మాత్రమే శరీరసంబంధముగా మాటలాడునపుడు స్త్రీపురుషభేదమే గాని, ఆత్మకు లేదు వయోధర్మము నట్లే. ఆత్మ,

శాశ్వతమై యేకరీతిగా స్త్రీపురుషభేదమును వయఃపరిమితియును లేనిదిగా నున్నది. ఇట్టి ఆత్మ జననమరణములకు లోఁబడవలసిన దేమి? అనఁగా దానికొక్కటె యుత్తరము అజ్ఞానముచేతనే మనము బంధమునకు లోఁబడెదము జ్ఞానమొక్కటే దానిని నివృత్తిచేసి మేలొనఁగూర్చుటకుఁ దగినది. అజ్ఞానమెట్లుకల్గును? అనఁగా ప్రేమచేతను భక్తిచేతను గల్గును. ప్రేమయనఁగా, ఈశ్వరుని ధ్యానించుటయు, జీవకోటులను ఆయీశ్వరుఁడు నివసించు ఆనియామము లనియును భావించుటయే. ఇట్లు వాస్తవమైన ప్రేమచేత జ్ఞానము కల్గును. అజ్ఞానము నివృత్తి యగును. బంధములు తెగిపోవును జీవుఁడు ముక్తినిబొందును.

సగుణ నిర్గుణములు:—మన శాస్త్రములయందు భగవంతునకు సగుణము నిర్గుణము అను రెండువిధములగు స్థితులు గలవని చెప్పఁబడి యున్నది. సగుణబ్రహ్మసిద్ధాంతమునందు భగవంతుఁడు సర్వవ్యాపియై సర్వమును సృజించి రక్షించి నాశము చేయువాఁడనియును, లోకమునకు తల్లియుఁ దండ్రియునై యున్నాఁడనియును, అయినను జీవాత్మలకంటె భిన్నుఁడై శాశ్వతుఁడై యుండువాఁడనియును, ముక్తి యనునది ఆతని సమీపమునుండి యతని వ్యాప్తికి లోఁబడి యున్నదనియును చెప్పఁబడి యున్నది. నిర్గుణబ్రహ్మసిద్ధాంతమునందు పైనిచెప్పిన విశేషణము లేవియు లేనిదనియును, సర్వత్ర వ్యాపించియుండు నిష్కళవస్తువనియును, దానిని జ్ఞాతృవనఁగూడదనియును చెప్పఁబడి యున్నది. జ్ఞానము మనస్సునకుఁ దగినందున జ్ఞాతృవనఁగూడదు మఱియు, అది చింతింపఁ దగినదని

యును జెప్పఁదగదు చింతించుట అల్పజ్ఞులకార్యము అది తర్కించుటకుఁ దగినది యనియుఁ జెప్పఁగూడదు తర్కము బలహీనమైన చిహ్నము దానిని ఉత్పత్తియగు పదార్థ మన రాదు ఉత్పత్తి బంధముచేఁ గల్గునది పరావరమునకు బంధ మెక్కడిది? ఒక్కొకరును ఇష్టాపూర్తి కొఱకే కర్మ మొనర్చె దరు? వారియిష్టమేమి? ఒకవేళ వారికోఱతలను దీర్చుకొను టకు వారు కర్మము చేయుదురు వారి కేమికొఱత? వేద ములయందు భగవంతుని గూర్చి ప్రస్తావించు చోటులం దెల్ల 'అతఁడు' అనుటలేదు 'అది' అనియే చెప్పఁబడి యున్నది, 'అతఁడు'అనిన, భగవంతుఁడు పురుషుఁ డని సిద్ధించును. స్త్రీలింగ ముల నతిక్రమించిన నిష్కళస్వరూపమును బోధించు, 'అది' యనుటయే వేదప్రతిపాద్యము ఇదే అద్వైత సిద్ధాంతము

ఈ నిష్కళవస్తువునకును మనకును సంబంధ మేమి? మన మే 'అది' యైయున్నది మనమును అదియు నొక్కటియే కలిగి యుండువాని కంతటికిని ఆధారభూతము ఆనిష్కళ స్వరూపి యొక్క ఆవిర్భావమే. ఈనిష్కళస్వరూపికంట మనముభిన్నమని తలంచుటయే దుఃఖము ఈనిష్కళస్వరూపమును మనము నొక్కటియేయని తలంచుటయే మోక్షము ఇదియే మన శాస్త్ర ములయందుఁ జెప్పఁబడియుండు ద్వివిధమగు భగవల్లక్షణము ఈనిష్కళస్వరూపాభిప్రాయముచేతనే సమస్తధర్మములు నెల కొనును 'నీవలె ఇతరు లని తలంపుము' అను సత్యమును మాత్రమే ఒక్కొకదేశమునందును పరంపరగా నుపదేశించు చున్నారు

మన భరతఖండంబునందు 'ఆత్మవత్సర్వభూతాని' అని యుపదేశింపఁ బడినది ప్రేమించుటయందు మనుష్యునకును బ్రాణులకును భేదము కనుపఱచనిదేశము మన హిందూదేశ మొక్కటియే దీనికిం గారణమేమి? అన్నిటిని తనవలెనే భావించుటకు సాధ్యమగునా? అనఁగా, నిష్కళస్వరూపియగు భగవంతుఁడు సర్వత్రవ్యాపించియుండుటంబట్టి, ప్రపంచమంతయు నేకస్వరూపముగా నున్నది కాఁబట్టి నేను దేనికైనను చెడుగుచేయుదు నేని నాకే చెడుగు చేసినవాఁడ నగుదును దేనినైన ప్రేమింతు నేని నన్నే ప్రేమించువాఁడ నగుదును ఇతరులకుఁ గీడుచేయఁ గూడదనువిషయము దీనిచే వ్యక్తమగుచున్నదికదా? కావున, ఆ నిష్కళస్వరూపాభిప్రాయముచేతనే సన్మార్గము కుదురును ఇంకను పెక్కుసద్గుణము లలవడును సగుణబ్రహ్మోపాసనముచేఁ గల్గిన అద్భుత ప్రేమామృతమును నేనుగ్రోలియున్నాఁడను. ఆయాకాలములయందు భక్తిపారవశ్యముచేఁగల్గిన మహానంద పరవశత్వమును నాకుం దెలియును అయినప్రకృతము మనదేశమునకు కావలసిన దేమనఁగా, మూఢభక్తిని దూరముగఁ ద్రోసిపుచ్చిసర్వత్రవ్యాప్తమైన నిష్కళపదార్థము'నేనే'యనెడి జ్ఞానమొక్కటియే ఈజ్ఞానము కలిగిన మీఁదట ఆనిష్కళ స్వరూపమునందు మిగుల బలపరాక్రమములు ప్రకాశించును. అప్పుడు భయము తొలఁగును నన్ను భయపఱచునది యేది? ప్రకృతి నియమములకు నేను భయపడువాఁడనుగాను మరణమునకును భయములేదు. మనుష్యుఁడు అనాదినిత్యమై అమృతస్వరూపమై యుండు ఆత్మానందమున నెలకొనియుండువాఁడు

కదా? దేనియందు ఆయుధములు ప్రయోగింపఁబడవో, ఎండకు ఎండదో, నీటిలో కరుగదో, అగ్నిచేఁ గాలదో, దేని ప్రకాశమునకు సూర్యచంద్రాది మండలముల కాంతి యణుమాత్రముగానుండునో, దేనివైభవముముందు ప్రపంచము శూన్యమై చూర్ణమగునో, కాలము కనఁబడకపోవునో, అట్టి ఆద్యంత రహితమును, జననమరణము లేనిదియును అగు ఆత్మస్వరూపమును నమ్మవలయును. అందువలననుండి సర్వశక్తియు కలుగును నీ వెట్లు తలంచెదవో అట్లగుదువు నీవు బలహీనుఁడ వని తలంతువేని బలహీనుఁడవే యగుదువు బలవంతుఁడవని భావింతువేని బలవంతుఁడ వగుదువు అపరిశుద్ధుఁడవని యెంతువేని అపరిశుద్ధుఁడ వగుదువు పరిశుద్ధుఁడ వని యెంతువేని పరిశుద్ధుఁడ వగుదువు. మిమ్ము మీరు బలహీనులమని భావించుకొనవలదు బలశాలుర మనియు సర్వశక్తిమంతుల మనియు, సర్వజ్ఞుల మనియు భావించుకొనుఁడని వేదాంతము బోధించుచున్నది ఆగుణములు ప్రత్యక్షముగఁగనఁబడకున్నను అవి మనలో నణఁగియున్నవి సర్వజ్ఞానమును, సర్వశక్తియును, సకలపారిశుద్ధ్యమును సకలబంధనివృత్తులును మనయందే యిమిడియుండుట వాస్తవమగునేని యవి కనఁబడకుండుటకు హేతువేమి? అనఁగా, ఇంకను ఆవిషయములో మనకు సంపూర్ణ విశ్వాసము కలుగలేదు నమ్మక ముండినచో, అవి ప్రత్యక్షముగా కన్పట్టును ఇదియే నిర్గుణ వాదము బోధించుసత్యము కాఁబట్టి మీరు మీబాలురను బాల్యముమొదలు దృఢగాత్రులనుగాఁ జేయుఁడు వారికి బలహీనస్వభావమును ప్రాణములేని కర్మములను బోధింపకుఁడు

వారు బలవంతులై ఇతరుల సహాయము నపేక్షింపనివారై, స్వశక్తివంతులై ధీరులై, దేనినేని సాధించు శక్తికలవారై, వృద్ధి నొందుచుండునట్లు కావింపుఁడు ఇట్లు వృద్ధినొందుటకు ప్రథమమున ఆత్మగరిమను బోధింపుఁడు అది వేదాంతము నందే యున్నది. ప్రపంచములోని సకలమతములయందును గానంబడు భక్తివైరాగ్యాదులు వేదాంతములయందు విస్తరముగా నుండినప్పటికిని, దానికి జీవస్వరూపమై యుండునది ఆత్మజ్ఞానమే జడవాదములో మునిఁగియుండు ప్రపంచమును పైకి లేల్చునట్టి భౌతికజ్ఞానమును మతధర్మముతో సమన్వయము చేయునట్టియు ఆత్మజ్ఞానముతప్ప వేఱొద్దియు కాదు

అనుభవవేదాంతము:—ఇట్లు మన మతమందలి మూలాధార తత్త్వములను సంగ్రహముగాఁ జెప్పినాఁడను ఇక వానియొక్క అనుష్ఠానక్రమమును కూర్చి యించుక వివరించెద భారతవర్షములోని స్థితుల నుద్దేశించి యిన్ని మతము లుండవలయునని తెలిసికొంటిమి ఇన్ని మతములున్నను అవి యొక దాని లోనొకటి జగడముచేయుట లేదు వైష్ణవు లందఱును నరక భాజను లని శైవులు చెప్పటలేదు శైవు లెల్లరు నరకవాసము చేయుదు రని వైష్ణవు లనుట లేదు ఈయిద్దరును జెప్పునదేమనగా:—నీ మతము ప్రకారము నీవుండుము నామతప్రకారము నేనుండెదను తుదకు మనమందఱము నొక్క-స్థానమునే చేరఁగలమనియే ఈయభిప్రాయము హిందూదేశమునందలిసకలమతములకును సామాన్యము దీనికే "ఇష్టదేవతోపాసనము" అని పేరు. భగవంతునిఁ జేరుటకనేకమార్గములుకలవనుట భరతఖండ

ములో ననాదిసిద్ధముగ నందఱిచే నంగీకరింపఁబడినది వారివారి మనోభిప్రాయములకుఁ దగినట్లు మతభేదములు వలసియున్నవి భగవంతునిఁ బొందుటకు మీ రవలంబించుమార్గము నాకు సరిపడక యుండవచ్చును ఒకవేళ దానివలన నాకుఁ గీడుకల్గినను కలుగ వచ్చును ఎల్లవారికి నొక్క మార్గమను వాదము కీడు మూడు నట్లు చేయునట్టిదిగా నుండుటం జేసి ఆ వాదమును త్యజింపవలయు ను ఎప్పు డెల్లవారు నొక్క యభిప్రాయమే గలవారై యుం దురో అప్పుడు ప్రపంచము నాశమగుననునది సత్యము అప్పుడు సకలమతాచారములును తత్త్వవిచారమును లేకపోవును కదా! మతభేదము లనేకములుగా నున్నందుననే సంసారసుఖమునందు జీవదశలో అభిరుచిని కలుగఁజేయుచున్నవి అది లేనిచో ప్రపం చమే లేదు మతభేదమును తత్త్వభేదము నున్నంతకాలము మన ముందుము కాఁబట్టి ఈభేదస్థితినిఁ గూర్చి మనము జగడ మాడవలసినది లేదు వారివారి మతపద్ధతులు వారివారికి సరి యైనవిగా నుండును గాని, ఒకరిమతపద్ధతి వేఱొకరికి సరిపడదు మన కీలోకములో నేమతము వారితోను వాదము లేదు మన మందఱమును వారివారి యిష్టదేవతలను గొల్చి ముక్తినొంద నగును ఇప్పుడు కొందఱు నూతనమతస్థులు బయలుదేఱి "ఇదియే సత్యమైనమతధర్మము" అని నాతోఁ గొందఱు చెప్ప వచ్చిరి అందులకు బదులు ఏమి చెప్పవచ్చును! వారినిఁ జూచి నవ్వుటయే దానికి బదులు గాని వేఱేమియు లేదు. అట్టివారు ప్రేమనుగూర్చి వాదించుట వ్యర్థమేయగును ఇతర మతస్థులను దూషించుటయు నొక ప్రేమయగునా! ఒకఁడు

తన కిష్టమైన దేవతను గొల్చుటను జూచి సహింపనివాఁడు ప్రేమనుగూర్చి మాటలాడుటకు ముం దడుగిడుట తగునా? ఇది ప్రేమయగునేని యిఁక విరోధ మేది? ఆహా! చిత్రము లోకములోని యేమతము వారిలోను పూకువాదము లేదు, క్రీస్తువును గొల్వనీ, మహాత్మదును ధ్యానింపనీ, బుద్ధుని పూజింపనీ, లేక ఏమహాపురుషుని స్మరియింపనీ, హిందువులు చెప్పున దేమి? "నమస్కారము స్వామీ! శుభమస్తు నాచేనైన ఉపకారము చేయఁగలను. అయినను నామతసిద్ధాంతముచొప్పున నడుచు కొనుట కనుమతి నొసంగుఁడు అదియే నాయిష్టము మీమార్గము ఉత్తమముగా నుండవచ్చును అది నాకు అనర్థకారిగా నుండును నాకిట్టి పదార్థమే భోజనమునకుఁదగినదని నాయనుభవమున నుండు నప్పుడు, దానికి విరోధముగా కోటివైద్యులు గుంపుగూడి వచ్చి బోధించినను నేను మానఁగలనా? వారైనను మాన్పలేరు కదా! కాఁబట్టి నాకు మే లొనగూర్చునది యిట్టిదని నాయనుభవమునందే యేర్పడి యున్నది" అనుటయే ఇదియే ఉత్తమ గతిగాను, ఇష్ట మార్గాచరణముగాను నుండుట వలన, ఏయాలయమో, ఏవిగ్రహమో, లేక, ఏచిహ్నమో భగవత్స్వరూప మనెడి భావముగలవారలను ఆక్షేపము చేయనేల? భగవ దనుభవము గలుగుటకొఱకై ఎవ్వరేచిహ్నములనైన నుంచికొనవచ్చును అది భగవంతునికి సమ్మతమే కాఁబట్టి ఈశ్వర సాన్నిధ్యమునకు సాధనమై యుండు దేవాలయములు కర్మానుష్ఠానము మొదలగునవి యన్నియు ఉపాదేయములు యగును. ఎప్పుడు మీరు పరులతో వాదింపఁ దొడంగుదురో

అప్పుడే మీయనుష్ఠానక్రమములు ద్వైతస్థితినుండి మరలి మృగత్వస్థితిని బొంది వెనుకకు వత్తురు

జాతి కట్టుబాటు — మన మతసిద్ధాంతముల నింతవఱకు సంగ్రహముగాఁ జెప్పినాఁడను లోకములోని సకల మతములును మన మతమునకు లోనైనవియే మనజాత్యాచారములు మతముతో సంబంధించినవిగాఁ గానంబడినప్పటికిని, వాస్తవముగా మతసంబంధము కలవి కావు మనము అనాగరకులగు పరదేశస్థులతోఁ జేరి చెడిపోక యుండుటకొఱకు దీనిని ఏర్పఱచిరేగాని వేఱుకాదు ఆకట్టుబాటు పడలునేని జాతి కట్టుబాటు తనంతట తొలఁగిపోవును అయినను నాయనుభవమునందు వయస్సు వృద్ధియగుకొలఁది జాతికట్టుబాటు అత్యంతావశ్యకమని తోఁచినది నేనును బాల్యమునందు జాతికట్టుదిట్టములు పనికిరానివనియే తలంచితిని ఇప్పుడు ఆకట్టుదిట్టములలో నెద్దానినిఁ దొలఁగించుట కేనియు దూషించుట కేనియు నాకు సమ్మతములేదు. ఏలన, ఆకట్టుబాట్లు వేలకొలఁదిసంవత్సరములనుండి అనుభవజ్ఞులచే నేర్పఱుపఁబడినవి నిన్నపుట్టి తేలుచచ్చువాఁ డొకఁడు నాయొద్దకువచ్చి నాపద్ధతుల నంతయు మార్పుచేయుటకుఁ బ్రసంగింపఁ దొడంగినచో నే నాబాలుని వాక్యములను నమ్మి నాపద్ధతులను మార్చుకొందునేని నిష్ప్రయోజకుఁడు నేనేగాని వాఁడు కాఁడు గదా? ఇట్టి ప్రసంగములే ప్రకృతము పరదేశములలోనుండి మీదేశమునకు వచ్చిదిగినవారు మన దేశస్థులకు బోధించుచున్నారు. పరదేశస్థులు మనకు బోధించునప్పుడు మీరు వారితో "మీసంస్కరణ పద్ధతులచేత మీజాతి వారుముందుగా

సంస్కారులు కానిండు. తర్వాత మీమాటలను మేము వినెదము" అని ప్రత్యుత్తర మొసంగుఁడు. మీరు ఏదేని యొక భావననుగూర్చి రెండుదినములు ధారణ చేయుటకుఁ దగినంత శక్తి లేనివారై యున్నారు వ్యర్థముగా జగడము చేసెదరు. వర్షాకాలములోఁ బుట్టు పురుగులవలెఁబుట్టి, అవియెట్లు ఐదు నిమిషములలో గిట్టుచున్నవో, అట్లు మీరు నశించెదరు మీరు జలబుద్బుదములవలె మాయమై పోయెదరు కాఁబట్టి మీరు మొదట వర్ణవ్యవస్థ (జాతిధర్మము) వలె స్థిరమైన జనసమూహమును ఏర్పఱుపవలయును ఎన్ని వేలేండ్లకైనను నశింపనివ్యవస్థలను ఏర్పఱుపవలయును ఇట్లు చేసినచో అప్పుడు మావంటి వారు మీతో కలిసి వర్తించుట కనువుగా నుండును

ఆత్మజ్ఞానదానము:—ఇంతవఱకు మతముతో సంబంధించిన విషయములనుగూర్చి ప్రసంగించినాఁడను ఇఁక అత్యావశ్యకమైన యొకవిషయమును ముచ్చటించి ప్రసంగమును విరమించెదను కలియుగములో వేదవ్యాసులు మన కనుగ్రహించిన శ్రేష్ఠమైన ధర్మ మొక్కటి కలదు ఇతరయుగములయందనుష్ఠింపఁబడుచుండిన తపస్సు మొదలుగాఁగల కఠినయోగములు ఈయుగమునందు సాధ్యములు కావు ఈయుగమునందావశ్యకమైనది దానమే దానమనఁగా ఈవి, పరోపకారము

అయినను, దానములలో ఆత్మజ్ఞాన దాన మొక్కటియే ఉత్తమమైనది ఇహలోకమున కనుకూలించు జ్ఞానదానము మధ్యమైనది దీనికి తర్వాతిది ప్రాణులను సంరక్షించుట, కడపటిది.

అన్నోదకముల నొసంగుట ఆత్మజ్ఞానదానము చేయువాఁడు అనేకజన్మములనుండి ఆత్మను రక్షించును. ఐహికజ్ఞానమునొసంగువాఁడు ఆత్మజ్ఞానము నొందఁ గోరు వాని కన్నులను దెఱచునట్లు చేయును ప్రాణిసంరక్షణము మొదలుగాఁ గల సకలదానములును ఈజ్ఞానమునకు లోఁబడినవే. కావున మీరు చేయునట్టి కర్మములన్నిటిలోను జ్ఞానదానమే శ్రేష్ఠమైనదని తెలిసికొనుఁడు. అయినను, ఆత్మజ్ఞానోపదేశ మొక్కటి మాత్రము పరమోపకారమైనది మన వేదశాస్త్రములయందు ఆత్మజ్ఞానమను ప్రవాహము నిరంతరమును ప్రవహించుచున్నది వైరాగ్యమునందు ప్రసిద్ధి నొందిన మనభరతఖండమునందు వేఱే ఖండములలోఁ గనంబడని బ్రహ్మజ్ఞానులను జూడనగును నాకును లోకానుభవము కొంతగలదు. నామాటలను నమ్ముఁడు విదేశములయందు మతసంబంధప్రసంగములు జరుగుచున్నవేగాని, మనదేశమునందువలె జ్ఞానసంపన్ను లెవ్వరును లేరు ఉత్తమాటలు జ్ఞానము కానేరదు అది వాగాడంబరము. చిలుకలుకూడ నేర్పినంత చెప్పును. ఈకాలములో యంత్రములును బలుకుచున్నవి అయినప్పటికిని వైరాగ్యము, ఉపరతి, ఆత్మజ్ఞానము సమత్వదృష్టి, ధర్మము, ప్రేమ ఇవి నెలకొనియుండు జీవితమును నాకగపడినపుడు అప్పుడు మీరు ఆత్మజ్ఞానము గలవారని నేనంగీకరింతును ఇఁక మనదేశమునం దిట్టి విశేషాభిప్రాయములను, బ్రహ్మజ్ఞానసంపన్నులను బడసియుండియు, మీరు వాని నంతయు ధనికులకును దరిద్రులకును ఎక్కువజాతి వారికిని తక్కువజాతివారికిని సమముగా నొసంగుటకుఁ దగిన ప్రయత్నములను జేయకుం

దుటన్యాయ్యమా? ఈదేశములోనివారికి మాత్రమేగాక, విదే
శీయులకును అజ్ఞానమును బోధింపవలయును ఇతరుల కెంతయు
పకారము చేయుదుమో, అంత యుపకారము మనకొఱకు చేసి
కొన్నవారమగుదుము. మీకు సత్యమైన మతభక్తియు దేశాభి
మానమును నుండెనేని, మీరు ఎట్టికష్టమునకైన నోర్చుకొని
పౌరుషము గలవారై, పుస్తకములలో దాఁచియుంచిన జ్ఞానధన
మును యోగ్యులగువారికొసంగవలయు ననెడి దృఢాభిప్రాయ
ముగలవారు కండు వీనికన్నిటికంటె వేఱొక ముఖ్యవిషయము
కలదు ఏదన, వేలకొలఁది సంవత్సరములనుండియు మనయెడ
అసూయనెలకొని యున్నది మన మెప్పుడును ఇతరులయందసూ
యకలవారమై యున్నారము వీనికిమాత్రము గౌరవమేమి?
నాకేల లేకపోవలయును? అను దురభిప్రాయము కల్గుచున్నది
స్వామిదర్శనవిషయమునందును మనకు మొదటగౌరవమువలయు
ననుచున్నాము. మొదటి తీర్థము నాదే యని యొకరు వాదిం
చెదరు అందఱును అధికారము చేయుటకు ప్రయత్నపడె
దరు అణఁగియుండుట కెవ్వరికిని సమ్మతము లేదు. అందఱును
పల్లకినెక్కిన మోయువారెవ్వరు? కావున, అణఁగియుండుటకు
మొదట నేర్చుకొనుఁడు పిమ్మట మీరు యజమానులగుటకర్హు
లగుదురు. వీని కంతటికిని ఆధారభూతమైనట్టి పూర్వకాల
బ్రహ్మచర్య మీకాలములో లేకపోవుటయే యీదేశక్షీణతకుఁ
గారణము ఈ యసూయను మూలచ్ఛేదము చేయవలయును.
ఇఁక చేయవలసిన ముఖ్యకర్మములను జేసి ముగించుటకుఁ దగిన
బలమును (శక్తిని) సంపాదింపుఁడు. మన పెద్దలు ఎన్నియో
అద్భుతకార్యములొనర్చిరి వానిని పరిశీలింతుమేని వారియందు

శక్తియు గౌరవమును కల్గును అయినను మనముకూడ ప్రయత్నించి గొప్పకార్యములు చేయఁబోవుచున్నారముగాన, మనకనంతరము జన్మించువారు మనయందును గౌరవముంచి మనలను పొగడఁగలరు కాఁబట్టి మనము పూర్వులవలె ఘనతనొందుటకుఁ దగినయనుకూలములను భగవంతుఁ డనుగ్రహించును గాకయని కోరుచున్నాఁడను

## పాంబన్ ప్రసంగము.

వివేకానందస్వాములు యాప్పాణమునందు ప్రసంగమొనర్చిన యనంతరము అచ్చటికి ఏఁబదిమైళ్లదూరమునగల పాంబనునకు దోనెమార్గముగ వచ్చిచేరిరి రామనాథపురము రాజుగారు పరివారముతో నెదుర్కొనిపోయి "నాప్రభూ" అని సంబోధించి సత్కరించి వారికై నిర్మించియున్న మంటపమునకు దోడ్కొని వచ్చిరి అచ్చటఁగూడిన ప్రజలందఱును గౌరవించిరి అప్పుడు వివేకానందులు రామనాథపురము రాజుగారైన భారతసేతుపతినిఁ జూచి "నన్ను ప్రథమమున చికాగోనగరమునకుఁ బొమ్మని మీరు ప్రేరించి సహాయమొనర్చినందున భరతఖండమునందడుగిడునప్పుడు నీవేసంధింపవలయు ననెడితలంపుతో నిచ్చటికివచ్చినాఁడను" అని సెలవిచ్చిరి అనంతరము ఆంగ్లేయభాషయందు స్వాగతోపన్యాసము చేయఁబడెను ఆప్రసంగమును స్వాములును తక్కిన ప్రజలునువిని హర్షించిరి పిమ్మట స్వాము లొక ప్రసంగముచేసిరి ఆప్రసంగముయొక్క సారాంశ మీదిగువ వ్రాయఁబడును

"నాజన్మభూమియు పుణ్యభూమియు నగు భరత ఖండము మతసిద్ధాంతములకును తత్త్వజ్ఞానమునకును పుట్టినిల్లు; బ్రహ్మజ్ఞానులకు జన్మస్థానమై వైరాగ్యమునకు వాసస్థానము అనాదిగా ఉత్తమపురుషార్థము వృద్ధియగుచుండు దేశ మిది యొక్కటేగాని వేఱుదేశము కాదు

"నేను పశ్చిమ దేశములకుఁబోయియున్నాఁడను. అచ్చటి గ్రామములకును నగరములకును బోయి పలుజాతుల మనుష్యులను జూచియున్నాఁడను నేనుజూచిన యొక్కొకజాతివారును ఒక్కొక యభిప్రాయమును మనస్సునందుంచుకొని జీవనసుఖమును బడయుచున్నారు మన దేశమునందుఁగల ప్రజలయభిప్రాయ మట్టిది కాదు విదేశములందు రాజ్యతంత్రము, సేనాబలము, వ్యాపారప్రాముఖ్యము, యంత్రనిర్మాణము మొదలగు వానియందే కాలమును గడపుచున్నారు. మనదేశములో మత మందలిఃట్టుదలతప్ప వేఱొక్కటియు లేదు ఇంకను దానినే మహాధన మని భావించి యున్నారము. తత్త్వజ్ఞాన మొక్కటియే భారత భూమియొక్క కులధనమై యున్నది.

"భుజబలపరాక్రమము గౌరవముకలదియే విజ్ఞానశాస్త్ర బలముచే యంత్రనిర్మాణశక్తియు అద్భుతమైనదే అయినను వానిలో నేదియు ఆత్మజ్ఞానముచే లోకమునకుఁ గలుగునంతటి ప్రయోజనము నొసంగ నేరదు.

"హిందువులు సూక్ష్మబుద్ధియు ఉత్సాహశక్తియు లేని వారని కొంద ఱనెదరు. దీనిని నేనంగీకరింపను. మన పూర్వచరి

త్రములను గూంచినయీవిషయము స్పష్టరుగును. సకలజాతుల వారికంటెను మనజాతివారు తక్కువవారు కారు. బుద్ధియం దును ప్రయత్నమునందును మనవారు వెనుకఁబడినవారు కారు. ఆదికాలమునుండియు ప్రఖ్యాతిఁగొందిన మనవారు నేఁటిదనుక జీవించియుండుటయే దానికిసాక్షి. మనవారి గుణవిశేషము మన జ్ఞానవిచారశాస్త్రములందు విస్తరముగాఁ గనంబడుచున్నవి.

"జ్ఞానము వలయునని కోరువారందఱును మన భరత ఖండమునే యెదురుచూచుచున్నారు. గావున, మన భరతఖండ వాసులు పరదేశస్థులకు జ్ఞానదానము చేయవలసిన సమయము సమకూఱియున్నది. మనుష్యులకు వలసిన ఉత్తమపురుషార్థము మనదేశమునందే కలదు. అది మన సంస్కృతభాషయందుండు టంబట్టి, దానిని దెలిసికొనుటకు ప్రకృతము పశ్చిమఖండ పండితులు ప్రయత్నించుచున్నారు.

"హిందూమతోద్ధారముకొఱకు కవతరించిన మహానుభావు లలో నెవ్వరు నిదివఱకు విదేశమునకుఁ జనినది లేదు. ప్రకృత మునఁ కాలమార్పు చెందుచున్నది. "ధర్మముకొఱవడి అధర్మము ప్రబలినపుడు ధర్మసంరక్షణార్థమై నేను అవతరింపఁ గలను" అని శ్రీకృష్ణమూర్తి ఆనతిచ్చియున్నాఁడుగదా? లోకములో నవీన ముగా నేర్పడిన ప్రతిమతములోను గానంబడెడి ఆత్మ నిత్యత్వ ము, ధర్మపద్ధతి మొదలగునవి యన్నియు మన దేశమందలియే దేని యొకశాస్త్రమునుండియే గ్రహింపఁబడినట్లుగా ప్రకృతము మన శాస్త్రములను పరిశీలించువారు తెలిసికొనుచున్నారు.

"బలహీనులను హింసించుట, దారికొట్టి దోఁచికొనుట, మొదలగు క్రూరకృత్యములు ఈపందొమ్మిదవ శతాబ్దిమధ్య

కాలములో జరిగినట్లు మరెప్పుడును జరగలేదు ఆశను వదలక గాని ముక్తి లేదనియును, ప్రకృతిబంధమునకులోఁబడి యున్నంతకాలము ఎవనికిని మోక్షము లభింపదనియును, మనవారల కందఱకును దెలిసినవిషయమే కదా? ఈరహస్యమును విదేశీయు లిప్పుడే తెలిసికొనుచున్నారు ఇట్టి అభిప్రాయము కలుగునేని తనంతట సద్గురువు ప్రత్యక్షముగ కాఁగలఁడు అపార కరుణానిధియగుభగవంతుఁడు తంబిడ్డలకు సమయ మెఱింగి సహాయము చేయును అతని కరుణకు ప్రతిబంధకము లేదు అది నిరంతరము ప్రవహించుచుండును మన భగవంతుఁడే యెప్పుడును సహాయము చేయువాఁడు సకలమతస్థులచే "నాదేవుఁడు నాదేవుఁడు" అని స్తుతింపఁబడు దేవుఁడు మన భగవంతుఁడే ఈయభిప్రాయము మనహిందూమతమునకే తగినదని నేను వీరవాదము చేయుదును ఇతరమతములం దిట్టి యభిప్రాయము కలదని యెవ్వరేని నిరూపింపఁగలరా?

"మనను దైవానుగ్రహముచే నిప్పుడు సంభవించియుండు స్థితియందు మనము చాల జాగ్రత్తతోను ఉత్తరవాదముతోను వర్తింపవలసినవారమై యున్నారము పశ్చిమఖండవాసులు అధ్యాత్మజ్ఞానమును బొందుటకై మనసహాయమును గోరుచున్నారు విదేశీయులకు ఉత్తమపురుషార్థమును బోధించుటకు సిద్ధముగా నుండఁదగినవారు హిందూదేశస్థులొక్కరే లోకములో మనమే గొప్పవారమని ప్రకటించికొనుటకుఁ దగినవారము ఎట్లనఁగా, పూర్వకాలమున పర్వత గుహలలో వసిం

చుచు అప్పుడప్పుడు బయటవచ్చి మార్గస్థులను హింసించి ధనమును గైకొనుటయే వృత్తిగాఁగలవారినే విదేశస్థు లెల్లరును తమకు మూలపురుషులని చాలగౌరవముతోఁ జెప్పుకొనుచున్నారు హిందువుల మగు మనవారు పర్వతగుహాలలో నివసించి కందమూలఫలములను భక్షించుచు భగవద్ధ్యానపరాయణులై యున్న మహర్షుల సంతతివారమని మనముగౌరవముతోఁ బల్కుచున్నారము కదా? ప్రకృతమున దీనస్థితియం దున్నారము. అయినప్పటికిని మనము మనమతమును వదలక భక్తితో పాటు పడుదుమేని, మిక్కిలి కీర్తిప్రతిష్ఠల నొందఁగలము.

మీరు విశ్వాసముతో నన్ను సత్కరించి స్వాగతమొసంగితిరి శ్రీ సేతుపతిరాజుగారు నాయందు మిక్కిలి విశ్వాసము గలవారై యున్నారు నేనుగాని, నాచేప్రేరేపింపఁబడిగాని యేదేని సత్కార్యము జరిగి యుండినచో నది యామహారాజు యొక్క ప్రేరేపణయనియు, తత్ఫలము ఆమహారాజునకే చెందు ననియు భరతఖండవాసులు నిశ్చయముగా నెన్నఁదగు వేలన, నన్ను చికాగోనగరమునకుఁ బొమ్మని ప్రేరించినవారు ఆమహారాజుగారే ఇప్పుడును వారునా ప్రక్కనుండి ఘనకార్యములు చేయు నట్లు ప్రోత్సహించుచున్నారు వీరికలెనే తక్కిన ప్రభువులును ఘనకార్యము లొనర్చి మాతృభూమికి పరమార్థక్షేమమును కలుగఁజేయుదురని కోరెదను ”

## రామేశ్వరాలయ ప్రసంగము.

ఈ ప్రసంగము జరిగిన మఱునాఁడు వివేకానందులు రాజపరివారముతో రామేశ్వరాలయమునకుఁ జని యచ్చట స్వామిదర్శనము చేసినతర్వాత, అచ్చట కొందఱొక ప్రసంగము చేయువలయునని ప్రార్థించిరి ఆ ప్రసంగ సారాంశ మేమనఁగా —

"మతసంప్రదాయ మనునది అంతరంగ విశ్వాసముతో భగవంతుని చరణకమలములయందు చేయఁబడునిర్మలభక్తియే గాని వేఱుకాదు. ఎవఁడైనప్పటికిని మనోవాక్కాయములందు పరిశుద్ధిలేక దేవాలయమునకుఁ జనిన ప్రయోజనము లేదు. త్రికరణశుద్ధి లేనివాని ప్రార్థనమును భగవంతుఁ డంగీకరింపఁడు. మనశ్శుద్ధిలేక తత్త్వోపదేశము చేయువారి గతి దుర్గతియే బహిర్ముఖోపాసనము అంతర్ముఖోపాసనమునకు అంగమై యున్నది. అంతర్ముఖోపాసనమును చిత్తశుద్ధియు మాత్రమే ఫలమొసంగునవి. ఇవిలేని బాహ్యపూజ నిష్ఫలమైనది ఈవిషయమును మీరు జ్ఞప్తియం దుంచికొనవలయును తత్కాలమున మన వారు ఏనీచకార్యము నైన చేయఁదగు ననెడి హీనస్థితియం దున్నారు. పుణ్యక్షేత్రములకుఁ జన నమ్మహాపాపము లన్నియు నివృత్తిమగునని తలంచుచున్నారు ఒకఁడు అపరిశుద్ధుఁడై సన్నిధికిఁ బోవునేని, వాఁడు అచ్చటఁగల పాపములను నైతము మూటగట్టుకొని యింటికిఁ బోఁగలఁడు గాని వానిపాపము తక్కువ కానేరదు తీర్థమనగా పరిశుద్ధపదార్థములును పుణ్యపురుషులును నెలకొనియుండు ప్రదేశము పుణ్యపురుషులుండు

చోట దేవాలయములు లేకున్నను అది తీర్థమే. అపరిశుద్ధులుండుచోట వేయి దేవాలయములున్నను అచ్చట తీర్థమహిమ యుండదు. మఱియు తీర్థమహిమ గలస్థలమున వసించుట మిక్కిలి కష్టము ఏలన, సామాన్య స్థలములయందు చేయునట్టి పాపము సులభముగా నివృత్తియగును తీర్థమహిమ గలస్థలములోఁ జేయఁబడు పాపము. శీఘ్రముగ నివృత్తికానేరదు కావున, చిత్తశుద్ధి, పరోపకారము అనునవిమాత్రమే సకలోపాసనలయొక్క సారాంశమై యున్నది పేదలయందును ధనికులయందును, శక్తిలేని వారియందును, శక్తిగల వారియందును, వ్యాధిపీడితులయందును ఎవఁడు శివునిఁ జూచుచున్నాఁడో వాఁడే శివభక్తుఁడు వాఁడు విగ్రహములయందు మాత్రమే శివుని జూచునేని వానిపూజ ఆరంభదశలోనిదే గాని పరిపక్వమైనది కాదు ఎవఁడు జాతిమతభేదములేక యొక దీనుని యెడ శివస్వరూపమును గాంచి సహాయముచేయునో వానియందు శివుఁడనుగ్రహముంచును గాని దేవాలయమునకు బోవుటవలన నుంపఁడు

"ఒక ధనికుని తోఁటలో నిద్దరు పని వాండ్రుండిరి వారిలో నొకఁడు చాల కష్టించి వ్యవసాయముచేసి కందమూలఫలములను యజమానునకిచ్చుచుండును వేఱొకఁడుయజమానుఁడు తోఁటకు రాఁగని ముందుగాఁబోయి నమస్కరించి "మీరు మంచివారు మీరే, కాపాడఁదగినవారు" అనిముఖస్తుతిచేయు చుండును ఈయిద్దరిలో నెవనియెడ యజమానునకు ప్రేమ యుండును? కష్టించు వానియందే కదా ప్రేమయుండును అట్లేఈ ప్రపంచమే తోఁట శివుఁడే యజమానుఁడు ఈశ్వర ప్రీతిగా

నేదియుం జేయక శివుని స్తుతించినచో ఫలము గలుగదు ప్రపంచములోని వారందఱును పరమేశ్వరుని సంతానమని తెలిసికొని వారివారి శక్త్యనుసారముగా ఉపకారముం జేయువారికి శివుఁడు ఫలము నొసంగును అనఁగా లోకోపకారమును ముఖ్యముగాఁ జేయవలయును శ్రీకృష్ణమూర్తి "నాదాసులకు దాస్యముం జేయువారే నాకుభక్తులు" అని ఆనతిచ్చియున్నాఁడు గాన మీరు దీనిని జ్ఞప్తియందిడవలయును

"మీరు పరిశుద్ధమనస్కులై "దేహి"యను వారినిరక్షించుటయే పుణ్యకృత్యము దీనివలనచిత్తశుద్ధి కల్గును చిత్తశుద్ధికల్గిన వారికి పరమశివుఁడు ప్రత్యక్షమై యుండును, అతఁడు అందఱి హృదయములందు నున్నాఁడు. అద్దములో మైల నుండిన మొగము కనఁబడదు కదా? అట్లే మనహృదయమనెడి అద్దమునందు అజ్ఞానమనెడి మైల చేరియున్నది ఎట్లన, "లోకములో నేనే ప్రసిద్ధిఁబొందవలయును నేనే అందఱికంటెను ధనికుఁడై యుండవలయును, నేనే స్వర్గమునకుఁ బోవలయును, నేనేముక్తిఁబొందవలయును" అను నిష్టకోర్కులుగలవారిహృదయము అపరిశుద్ధమైనది గాకమరేమి? మీఁదఁజెప్పినవి నాకు అక్కఱలేదు అవి కలుగకపోయినను నేను పరోపకారమునుమాత్రము చేయుచుందును; అనెడి గుణము గలవాని హృదయము పరిశుద్ధమైనది ఇట్టి స్వసుఖమునుగోరనివానికి క్రమముగా శివజ్ఞానమును శివానుగ్రహమును వృద్ధియగుచుండును ఇట్టివాఁడు చదివినవాఁడైనను, చదువనివాఁడైనను, వాఁడు తెలిసిచేసినను, తెలియక చేసినను వాఁడు శివసామీప్యమునం దుండును స్వసుఖమును గోరిన

వాఁడు ఎన్ని పుణ్యస్థలములకుఁ బోయినప్పటికిని, ఎంతభూతిని ధరించి నప్పటికిని ప్రయోజనము లేదు ఇట్టివాఁడు శివునకు చాలదూరమునం దుండును"

ఈయుపన్యాసానంతరము సేతుపతి గారు వివేకానందుల గౌరవార్థమై బీదలకు అన్న దానమును వస్త్రదానమును జేసిరి. పిమ్మట, వివేకానందులు పాంబన్ రేవులో దిగిన జ్ఞాపకార్థమై మహా స్తంభమును ప్రతిష్ఠించిరి అందిట్లు వ్రాయంబడి యున్నది.—

"సత్యమేవ జయతి

శ్రీమత్పూజ్యపాదవివేకానందస్వాములు గుడగోళార్థము నందు వేదాంతసిద్ధాంతమును వ్యాపింపఁజేయు నిమిత్తము లోకోపకారముగా ఉత్తమకైంకర్య మొనర్చి, అచ్చట అద్వితీయ కార్యసిద్ధినొంది శాశ్వతకీర్తి నొంది జయశీలురై అచ్చట నుండి ఆంగ్లేయశిష్యులతోడ భారతభూమికి ప్రథమముచందు, 1897 సం॥ జనవరినెల 26 తేది చరణకమలము లుంచిన పుణ్యస్థలమును దెలుపుటకై ఈజ్ఞాపక స్తంభమును రామనాథపురము రాజైన శ్రీభాస్కరసేతుపతిచే ప్రతిష్ఠింపఁబడినది."

తర్వాత స్వాములు షెట్టమార్గముగా బయలుదేఱి ధర్మసత్రమును జేరి యచ్చట భోజనాదులం దీర్చికొని, దర్భశయనమును దర్శించికొని రామనాథపురము చేరిరి రాజుగారు మహాడంబరముతో నెదుర్కొని చని స్వాములను తమ సంస్థానము

నకుఁ దోడ్కొనిపోయి స్వాగతోపన్యాసము చేసంగిరి. ఆ యుపన్యాసము దిగువ నుదహరింపఁ బడుచున్నది.

"శ్రీపరమహంస యతిరాజ దిగ్విజయకోలాహల సర్వ మత సంప్రతిపన్న పరమయోగీశ్వర శ్రీమద్భగవచ్ఛ్రీ రామకృష్ణ పరమహంసకరకమలసంజాత రాజాధిరాజసేవిత శ్రీవివేకానంద స్వామి దివ్యసన్నిధియందు చేయు వినయపూర్వక విజ్ఞప్తి:—

సేతుబంధ రామేశ్వరమనెడి రామనాథపుర సంస్థానవాసులమును తనుదాసులమునగు మేము మాస్వదేశమునకు హృదయపూర్వకముగా తమకు స్వాగత మొసంగెదము. దేవరవారు ఈదేశమునకు రాఁగానే, వీరచూడామణియును మాస్వామియు నగు శ్రీ రామచంద్రమూర్తి తమదివ్యపాదకమలముల నూనిన యీపుణ్యక్షేత్రమునందు తమ్ము మొట్టమొదట సేవించుభాగ్యమును బొందినారము.

"మన మేలైనప్రాచీనమతమును దాని విశేషములను స్పష్టముగా సకలజనులును విని యానందించునట్లుగను, పశ్చిమఖండవాసులగు మహామేధావంతు లంగీకరించునట్లుగను బోధించిన తమ అద్భుతశక్తిని గూర్చి మిక్కిలి సంతసించెదము. హిందూమత మొక్కటిమాత్రమే సకలమతములకు నాధారభూతమైనదిగను, ఆయాదేశస్థుల గుణపరిణామములకుఁ దగినట్లుగా గ్రహింపననుకూలించునదిగను నున్నదని యూరోపుఖండవాసులకును, అమెరికాలోని విద్వాంసుల సభలలోను, తమ వాగ్వైఖరి వెలయున ట్లుపన్యసించితిరి. పరోపకార

మొనర్పనెంచి మిక్కిలి కష్టములకు లోఁబడి మహాసముద్రములను దాఁటి, సత్యముతోను శాంతముతోను గూడిన తమ దివ్యవాక్కును ప్రకాశింపఁజేసితిరి ఉపదేశముచేతను, అనుష్ఠానముచేతను సర్వజన సోదరత్వము సాధ్యమని నిరూపించితిరి అన్నిటికంటె విశేష మేమనఁగా, హిందూదేశములో స్వమతమందు మిక్కిలి శ్రద్ధగలవారు కూడ, దేవరవారిదివ్యవాక్కును విని మేల్కని తమ పూర్వు లనుష్ఠించిన మతసంప్రదాయ మహిమలను దెలియ నభిలషించిరి. ఆదినమునుండి తమ మహిమగల మతము లోని విషయములను పరిశీలించుటయందును, అనుష్ఠించుటయందును, వాస్తవమైన శ్రద్ధాభక్తికలవారై యున్నారు.

"ప్రాగ్దేశీయులును పశ్చిమదేశములును ఉజ్జీవించుటకై తా మొనర్చిన పరోపకార కైంకర్యమునుగూర్చి ప్రశంసించుటకు మేము శక్తిలేనివారము. దేవరవారి శిష్యకోటిలోనొక్కరైన మా రాజాగారియెడ తమకుఁగల దయకు పారమే లేదు తాము మా రాజ్యములో నడుగిడినది మొదలు మా రాజాగారికి విశేషకీర్తియు గౌరవమును గల్గియున్నది తాము ప్రయత్నించిన సత్కైంకర్యము నేఁటివేలుటకొఱకు పరమేశ్వరుఁడు తమకు ఆయురారోగ్యము లొసంగ వలయునని ప్రార్థించి విరమించెదము

ఇట్లు,

రామనాథపురము. 25-1-1897. } దేవరవారి పదభక్తులగు శిష్యులును, సేవకులును.

## రామనాథపుర ప్రసంగము.

ఈస్వాగతపత్త్రమునకు ప్రత్యుత్తరముగా వివేకానందస్వాము లిట్లనిరి.—

"చాలదినములుగా నిదురించుచున్న భారతమాత మేల్కాంచినది ఇక నామెను నిద్రపుచ్చుట కెవ్వరిచేతను గానేరదు. ఇక నామె నిద్రపోదు

మన మాతృదేశముకొఱకును మన మతముకొఱకును నేనొనర్చిన సేవ యేదేని కొంచె ముండెనేని యది శ్రీరామనాథపురము రాజాగారివలననే జరిగినదని తలంపుడు ఇక ననేక సత్కార్యములు చేయవలసియున్నది లోకములోని పరదేశీయులకు పలువిషయములను బోధింపవలయును జ్ఞానము, నీతి, నయ, ధర్మము, భూతదయ మొదలగు విషయములయందు నేటికిని మనదేశమే శ్రేష్ఠమైయున్నది మనలో ప్రసిద్ధులగు బ్రహ్మజ్ఞాను లుండుటం బట్టియే, మనకెన్నియో యుద్ధములు సంభవించినప్పటికిని, ఎందరో పరదేశస్థు లెన్నియో వేలేండ్లుగా రాజ్యపాలన మొనర్చినప్పటికిని, రాజ్యపాలకులచే నెన్నియో సంకటములు వచ్చినప్పటికిని మన మీలోకములో నశింపకయున్నారము

పశ్చిమదేశస్థులు రాజ్యకాంక్షచేతను ధనాశచేతను కష్టముల ననుభవించుచున్నారు కొందఱుమాత్రమే సంపన్నులైయుండ నేమి? వారిసంపద అందఱకు చెందునట్లు చేయుట కుపాయమేమి? అనెడి యాలోచనలోనే వారి ప్రాణము

సగము పోవుచున్నది అట్టివారికి నూతనప్రాణమును ప్రయో
గించి జీవకళ నొసంగునట్టి మతధర్మమును జ్ఞాననిష్ఠయు నను
ఎండని మంచి నీటియూట మనదేశమునందే యున్నది. మన
మతమందలి ప్రధానాంశము వైరాగ్యమే ఈలోక వాసము
రెండుదినములే శాశ్వతముగ నుండు లోకమును వెదకి
కొనుఁడు. ఆశాశ్వతలోకముకూడ తుచ్ఛమనిభావించుమహాజ్ఞా
నులు మనదేశములోఁ గలరు ఆద్యంతములేని కాలదేశములు
కూడ వారికి లక్ష్యములేదు వారు వానినిదాఁటి నిత్యవాసము
చేయుదురు అదే మనమతమందలి సత్యము. దీనికొఱకు ఎన్ని
యేని కష్టములను బడయుదురు ఇట్టి వారిని సౌఖ్యమునందు
బ్రవేశింపఁ జేయుటకై మీ రెన్నివిధములఁ బ్రేరించినను
మీమాటలను వినరొల్లరు ఇట్టిజ్ఞానవైరాగ్యమును మాత్రమే
మనము లోకులకుబోధింపవలయును పరదేశీయుల యొద్దనుండి
మనము గ్రహింప వలసిన దేదియు లేదా? అందు రేని మనము
వారియొద్దనుండి గ్రహింపఁదగినది లౌకికజ్ఞానమును, పలువురు
సంఘముగాఁ జేరి పనిచేయు విధానమును, ద్రవ్యార్జనము చేయు
మార్గమును, అధికారముచేయు రీతిని నేర్చుకొనవచ్చును.
ప్రపంచ మెల్లెడల నేకరీతిగానుండుటకు సాధ్యము కాదు గాన,
మన దేశమునందలి జ్ఞానవైరాగ్య విద్యను పరదేశముల కిచ్చి
వారియొద్దనుండి లౌకికవిద్య మనము గైకొనఁదగును. అంతయే
గాని, ఇహలోకసుఖభోగమే ఈశ్వరధ్యానమని యెవఁడేని
హిందువులకు బోధింపఁ దొడంగునేని, వాఁడు అసత్యవంతుఁడే.
మఱియునట్టివాని నీపుణ్యభూమిలో నెవ్వఁడును అంగీకరింపఁడు.

అట్టివారి మాటలను వినుటకు మనమెప్పుడు పశ్చిమఖండ నాగరకమునందు ఎంతటి పటాటోపమును అట్టహాసమును అధికారమునుండినను, అవి యన్నియు మాయావికారము లేయని నేను వారి ముఖముపై కొట్టి చెప్పఁగలను. అవి యన్నియు అశాశ్వతము లైనవి దేవుఁడొక్కఁడే—ఆత్మయొక్కటే—నిత్యస్వరూపః; పరమార్థ జ్ఞాన మొక్కటే నిత్యమైనది. దానినే దృఢముగాఁ గైకొనుఁడు

"అయినను, ఉత్తమపురుషార్థము నొందునట్టి దశావిశేషము చేకూఱని ప్రకృతిగలవారల కొక విధమైన లౌకిక విషయ మావశ్యకమనియే తోఁచెడిని నిష్కామకర్మముచేయుటకును, అనంతర మాకర్మమును త్యజించి ధ్యానయోగ నిష్ఠయం దుండుటకును శక్తిలేనివారు వాని నాచరింపఁ గడంగుదురేని వారు వంచకు లనఁబడుదురు వారు మొదట సకామకర్మమునే చేయవలయును దాని ద్వారముగా వారుఇహభోగములయందు తృష్ణలేనివారై, యామీఁద నిష్కామ కర్మమొనర్చి, చిత్తశుద్ధినొంది, తర్వాత జ్ఞాననిష్ఠకు అర్హులగుదురు. ఇదే గీతోపదేశము దీని ననుసరించియే పూర్వమందున్న మనవారు వారివారి యోగ్యతలకుఁ దగిన యనుష్ఠానమును జేయుచుండిరి ఆపద్ధతి ప్రకృతము నశించినది పశ్చిమ దేశీయులకీవిషయమే తెలియదు ఒక్కొకఁడును ఐహిక సుఖము ననుభవించి, అవి నిరుపయుక్తములైనవని తెలిసికొన్న తర్వాత సన్యసింపవలయునని శాస్త్రములు ఘోషించుచున్నవి దృఢ

వైరాగ్యముచేతనే సన్న్యాసము కలుగవలయును తత్కాలమున సన్న్యాస ధర్మమును ఏమియుఁ దెలియనివారు అవలంబించెదరు ఇందువలన వీరికివైరాగ్యోదయమును గలుగుట లేదు. జరుగవలసిన యిహలౌకికకార్యమును జరుగుట లేదు. దృఢవైరాగ్యము లేని సన్న్యాసధర్మము ననుష్ఠించుటం జేసి ధర్మభ్రష్టులై లోకోపకారము చేయుటకు బదులు లోకాపకారము చేసినవా రగుచున్నారు ఈ హేతువుచేతనే హిందూదేశమునందు క్షామమును దారిద్ర్యమును అధికమైనది ఏదియు నెఱుఁగనిబీదవానితలపై విశేషభారము నేలమోపెదరు? వాఁడునుఐహికసుఖమునుకొంచెముఅనుభవింపనిండు. ఈవిషయమునుఆంగ్లేయుల నుండి నేర్చికొనవలయును ఇప్పుడాంగ్లేయులనుండినూతనవిషయములను దెలిసికొనవలయునని గోరువారిలో ననేకులు దోషములను గ్రహించుచున్నారేగాని, గుణములను గ్రహించువారు మిక్కిలియు నరుదుగ నున్నారు పశ్చిమఖండవాసుల సంప్రదాయములను క్రమముగాఁ దెలిసికొనక, వారిపుస్తకములలోని యసంబద్ధవిషయములను వల్లించి దేనియందును నమ్మకములేక చెడిపోవువారికంటె, పూర్వాచార పరాయణులే శ్రేష్ఠులనవచ్చును ఆంగ్లేయభాషాభిమానులకు స్వబుద్ధి లేదు. ఆంగ్లేయుల దయకొఱకు మన యాచారములు దూష్యములనెదరు. మనము వారినిఁ జూచి, "మాఆచారములోని దోషము లేమి?" అని యడిగిన, వారు "ఆంగ్లేయు లట్లనెదరు" అని చెప్పుదురు. ఇట్టివారివలన దేశమున కేమి లాభము? పూర్వకాలపువైదికులకు ఆంగ్లేయాచారము లేవియుఁ దెలియకపోయినప్పటి

కిని, వారు తమయభిప్రాయమునందే దృఢముగనిల్చియున్నారు. వారే మగవారు ? దృఢాభిప్రాయము లేని యాంగ్లేయభాషాభిమానులగు యువకులనేమని చెప్పవలయును? వీరింకనుఅవ్యక్తస్థితియందే యున్నారు వీరిని మగవారనియో, స్త్రీలనియో, లేక వేఱే యేదేని జంతువనియో చెప్పుటకుఁ దెలియకున్నాఁడను. అయినను అందఱు నిట్లులేదు అట్లుగానిమీలో రామనాథపురము రాజాగారు నొక్కరని తలంచెదను. హిందూమతాభిమానమునందు రాజాగారు మిక్కిలి పట్టుదల గలవారు, మన భరతఖండమున వీరివంటివారు వేఱొక్కరు లేరు ప్రాగ్దేశ వ్యవహారమునందును, పశ్చిమదేశ వ్యవహారమునందును మిక్కిలి ప్రావీణ్యముగల రాజకుమారుఁ డితఁడొక్కఁడే. వీరు ఆయా దేశపద్ధతులను దెలిసికొని సమత్వబుద్ధితో వర్తించుటయందు మిక్కిలి సమర్థత గలవారు

శ్లో. "శ్రద్ధధానశ్శుభాం విద్యామాదదీతావరాదపి,
అన్త్యాదపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి"

"మంచిబుద్ధిని తక్కువకులస్థునియొద్ద నుండియైనను శ్రద్ధతో గ్రహింపనగును శ్రేష్ఠమైన ధర్మమును నీచునొద్ద నుండి యేనియుఁ దెలిసికొనవచ్చును ఉత్తమస్త్రీనిహీనకులమందుండి నప్పటికిని గ్రహింపఁదగును" అని మనువచనము గలదు కాఁబట్టి శ్రేష్ఠమైన విషయములను ఏజాతివానియొద్దనుండియైనను మీరు పడయవచ్చును. అయినను మీయొక్క స్వాతంత్ర్యమును వదలఁగూడదు ఇతరము లెన్ని కల్గినను హిందూధర్మమునువిడువ

రాడు. ఒక్కొక్కఁడును తనపూర్వకర్మమునకుఁ దగిన ట్లీజన్మము నందు కొన్ని కృత్యములు చేయవలసిన బాధ్యత కలవాఁడై యున్నాఁడు ఈయభిప్రాయమునే మన పెద్దలు కలవారై యుండిరి. కాఁబట్టి మనము చేసెడి ప్రతికార్యమును మన పెద్దలు చూచుచున్నారు. మీరు జాగ్రత్తతో నుండుఁడు. ఆబాధ్యత యెద్దియనఁగా, బ్రాహ్మణునిఁగూర్చి మను వి ట్లని చెప్పియున్నాఁడు.

శ్లో॥ "బ్రాహ్మణో జాయమానోహి
పృథివ్యా మధిజాయతే
ఈశ్వర స్సర్వభూతానాం
ధర్మకోశస్య గుప్తయే"

"ధర్మమనెడి నిధిని రక్షించుటకై బ్రాహ్మణుఁడు జన్మించి యున్నాఁడు." ధర్మమనఁగా సనాతనమైన హిందూధర్మమని యర్థము ఈధర్మరక్షణమే యీ పుణ్యభూమియందుఁ బుట్టిన వారియొక్క బాధ్యతయై యున్నది దీనిని మఱచి లోకసుఖములను గోరుచుందుమేని మూఁడుతరములలో హిందూజాతి యనెడి నామముకూడ నశించిపోవును

కావున, సోదరులారా! మన పూర్వులవలన మనకు కులధనముగాఁగల్గిన బ్రహ్మజ్ఞానమును జాగ్రత్తతో రక్షింపవలయును. అందువలన మనకు మేలు కలుగును మీకు ఈజ్ఞానమునందు నమ్మకము న్నను లేకపోయినను మనజాతిశ్రేష్ఠత్వమును గమనించి మైనప్పటికిని దానిని సంరక్షింపుఁడు మొదట దీనినిజాగ్రత్తగా

నుంచుకొని, తర్వాత మీకు కావలసిన దానిని పరదేశీయుల యొద్దనుండి గైకొనుఁడు మీరు గైకొనునవి యన్నియు మన దేశముయొక్క ఉత్తమపురుషార్థమునకు లోఁబడియే యుండ వలయును. మీరు మనదేశపుబ్రహ్మజ్ఞానముతో పరదేశీయుల విజ్ఞానశాస్త్రసారమును ఏకము చేసితిరేని, నూతనమైన భారత వర్షము కల్గును; ఇప్పుడే ఆరీతిగా మాఱుచున్నది ఇట్లు మాఱు నేని మన భారతవర్షము మిక్కిలి సంపదతోను కీర్తితోను శిలయును. పూర్వఋషులకంటెను ప్రసిద్ధులగు ఋషు లవతరిం తురు మీపూర్వులు మీఁదనుండి దిగువ చూచునప్పుడు, మునుపటికంటె మిక్కిలి మహిమతోఁగూడియుండు తమ సంతతి వారినిఁ గాంచి సంతుష్టులగుదురు కాఁబట్టి మనమందఱమును శ్రమకోర్చి పాటుపడవలయును. ఇఁక నిద్రపోఁగూడదు. ఇది వఱకు నిదురించియున్న భారతమాతను మేల్కొలిపి మనసత్కృ త్యములను వీక్షించునట్లు కావింపుఁడు. మనతల్లియగు భారత దేవి—మునుపటికంటె మిక్కిలి తేజస్సుతో ప్రకాశించుచు నూత్నయౌవనమును దాల్చి నిత్యసింహాసనమునం దధివసించి యుండనిమ్ము. ఎవని, శైవులు శివుఁడనియు, వైష్ణవులు విష్ణు వనియు, కర్మవాదులు కర్మమనియు, బౌద్ధులు బుద్ధుఁడనియు, జైనులు జినుఁడనియు, యూధులును క్రైస్తులును జిహోవా యనియును, మహమ్మదీయులు అల్లా అనియును, సకలమతస్థు లును స్వామి యనియును, వేదాంతులు బ్రహ్మమనియును ధ్యానించెదరో, ఎవని మహామహిమగల దివ్యస్వరూపమును

భరతఖండ వాసులు సంపూర్ణముగాఁ దెలిసికొని యున్నారో ఆ పరమ కారుణికుండును, తల్లి దండ్రి సఖుఁడును అగు భగవంతుఁడు మనల రక్షించును గాక, అనుగ్రహించుఁగాక, పరాక్రమ మొసంగును గాక, ఈసత్కైంకర్యము నేను నెఱవేర్చుటకై శక్తి నిచ్చును గాక, మనము శ్రవణమువలన గ్రహించిన విషయము లనెడి యన్నము పరోపకారార్థమై యది మనకు బలమునొసంగును గాక, గురుశిష్యులమై యుండు మనము అన్యోన్యానురాగముతో నుండునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించును గాక ''

ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

ఓమ్ సహనావవతు, సహనౌభునక్తు,
సహావీర్యంకరవావహై,
తేజస్వి నావధీతమస్తు మావిద్విషావహై,
ఓమ్‌శాన్తిశ్శాన్తిశాన్తిః

హరిః ఓమ్.

---

ప్రసంగానంతరము సేతుపతి రాజుగారు స్వాములను గౌరవించి, వారి గౌరవార్థము చెన్నపురి జ్ఞాపకనిధికి ధనము సేకరింపఁ బ్రయత్న మొనర్చిరి. ఆదినము సభముగిసెను మఱునాఁడు స్వాములు రజమందిరమున కేఁగిరి. అచ్చట సంస్కృతమునను ద్రావిడమునను స్వాగతపత్రముచదువఁబడెను. పిమ్మటస్వాములు శ్రీ రాజునకు "రాజర్షి" అని బిరుదనామ మొసంగిరి తర్వాత ఆక్తిపూజయొక్క ఆవశ్యకత్వమునుగూర్చి ప్రసంగించిరి.

పిదప, స్వాములు రామనాథ పురమునుండి పరమకుడి, మానామధుర, తిరుచినాపల్లి, కుంభఘోణము అను నీ క్షేత్రములకుఁ బోయిరి అచ్చటచ్చటఁ గలవారు స్వాములవారికి వందనోపచార పత్రికలు సమర్పించి సత్కరించిరి వీనిలో కుంభఘోణమునం దొసంగిన వేదాంతప్రసంగమునం దాదియందు పూర్వోక్తప్రసంగముల సారాంశము ననువదించి యనంతరము ప్రత్యేకోపన్యాస మొసంగిరి

## కుంభఘోణము - వేదాంతప్రసంగము

"కుంభఘోణ నగర మహాజనులారా!"

మతకార్య మెంతయుల్పముగాఁ జేసినను దానిఫల మధికముగా నుండునను గీతావాక్యమునకు నా కనుతుణమును దార్కాణములు కనఁబడుచున్నవి సింహళమునుండి యిచ్చటికి నాచేసిన ప్రయాణమధ్యమందు నాకుఁ గలిగిన మనస్ఫూర్తి యగు మహాదరణము మితిమీఱియున్నది. ఈ ధర్మము మన హిందువులకుఁ దగియే యున్నది ఇది మనసంఘముయొక్క పూర్వగాథల కనుగుణముగానే యున్నది హిందువుల మైన మనకు మతము జీవనము; మతము ప్రాణతుల్యము పూర్వపశ్చిమదేశస్థుల నడుమ నేను గొంతకాలము గడపి ప్రపంచానుభవ మించుక సంపాదించితిని ప్రతిదేశమువారికి నొక్కొక సంఘలక్ష్యము గలదు కొందఱికి రాజకార్యప్రావీణ్యత, కొందఱికిసంఘాభివృద్ధి, కొందఱికి బుద్ధివిశేషము నీరీతిగా నొక్కొక్క

సంఘమున కొక్కొక లక్ష్యము గలదు ఇఁక మనకు మతమే సర్వమునకు నాధారము. అదియే మనజీవయాత్రకుఁ బ్రధానము చెన్నపురిమహాజనులు నేను అమెరికాయం దున్నపు డంపిన సన్మానపత్త్రికకు నే నిచ్చిన ప్రత్యుత్తరమున "హిందూదేశమునందలి కాపువాని కితరదేశమందలి నాగరికశిఖామణులకంటె నెక్కుడు మతము తెలియు" నని వ్రాసియున్నాఁడను. ఆవాక్యముల కిప్పుడు లక్ష్యములు నాకగపడుచున్నవి మనదేశమందలి జనసామాన్యమునకు లోకమునందు జరుగు సమాచారము లేవియుఁ దెలియ వనియుఁ దెలిసికొను స్వభావము వారియందు లేదనియు వ్యసనపడు చుండెడివాఁడను కాని యిప్పుడు నాకు వాస్తవము తెలిసినది వారికిఁ గావలసిన విషయములయందు సమాచారములం దెలిసికొనుటలో వారికున్న యాసక్తి మఱి యేయితరదేశములవారికిని లేదు యూరోపునందు జరగుచున్న రాజకార్యములను గుఱించి మనవారినడిగిన నేమియుఁ దెలియదు దెలిసికొనుట కాసక్తియును లేదు అయినను ఇండియాతో సర్వవిధములచేతను వేఱుపడిన సింహళద్వీపమునందలి ప్రతికాపువాఁడును గూడ నమెరికాలో నొక మతసభ జరిగినదనియు నందుఁ దమవాఁడొకండు వెళ్ళి కొంచెముజయముఁ గొందెననియు నెఱుఁగును కావున, వారికాసక్తి గలిగిన విషయములయందు సమాచారములను సంపాదించుటయందంతటికంటె నెక్కువ జాగరూకులై యే యుందురు. **హిందువులకు** మతమే ప్రధానభక్తిగల విషయము సంఘము

కాయువుపట్టు మతమై యుండుట మంచిదా? రాజకార్యములై యుండుట మంచిదా? యను విషయము నిప్పుడు చర్చించుట లేదు మంచి దయినను జెడ్డదయినను హిందువులకు మతము ప్రధానమైయున్నది. దానిని నశింపఁజేసి మఱియొక దానిని దానిస్థానమందుంచుట యసంభవము పెద్దదిగాఁ బెరిఁగిన యొక వృక్షము నొకచోటినుండి యూడఁదీసి మఱియొకచోనాటిన నాటుకొనదు మంచియయినను జెడ్డయయినను మతమే లక్ష్యమయి వేలకొలఁది సంవత్సరముల నుండి యిండియాయందు వర్ధిల్లుచున్నది. మేలోకీడో యనేక శతాబ్దముల నుండి మన వాయుమండలము సహితము మతమయ మయి పోయినది లగ్గుగానిం డెగ్గు గానిండు పిన్నటి నాఁటి నుండియు మన రక్తనాళములయందలి రక్తముతో మిళితమయి మన శరీరతత్త్వమంతయుఁ గూడ మతమయమయి పోవునట్లు మతములోఁ బుట్టి మతములోఁ బెరిగిన వారమయి యున్నారము అట్టి మతము నేవిధప్రతిరోధమును లేకుండఁ జిరకాలమునుండి ప్రవహించుచున్న యాప్రవాహముయొక్క స్థానము నాపుటకు వేఱొక్కటి లేకుండఁ దీసివేయుటకు సాధ్యమగునా? ఇది గంగానదిని వెనుకకు జన్మస్థానమునకు బంపి మఱియొకదారిని బ్రవహింపఁజేయుద మనుటవంటిది అదియైనను సాధ్యమగు నేమోకాని యిండియాయందు మతమార్గము నశించి దాని స్థానమునకు రాజకార్యపరాయణత్వముగాని మఱియేదిగాని వచ్చుట యసంభవము ఏమార్గమునఁ బ్రతిరోధ మల్పముగ నుండునో యామార్గమున మనము పనిచేయఁగలము.ఇండియా

యందల్పప్రతిరోధముగల మార్గము మతముగాని మఱియొకటి కాదు ఇండియాయందిదియే జీవన్మార్గము ఇదియే వృద్ధిమార్గము. ఇదియే క్షేమమార్గము తక్కినదేశములందన్ని యగత్యములలోను మతమొకటి దీనికొక చిన్న సాదృశ్యమును జెప్పెదను. ఒక పడుచునకుఁ దన బొట్టుపెట్టెలో నెన్నో వస్తువులున్నవి అందొక చిన్న జపానుబరిణయుండుట కూడ యిప్పటి కాలపు పద్ధతి. దానిని సంపాదింపవలయును అదిలేకున్న బాగుగనుండదు ఆరీతినే యితరదేశములవారి కనేకవ్యాపారములు గలవు వానికిఁ దోడు కొంచెము మతముకూడ నుండిన సంపూర్ణమగును గనుక, వారికిఁ గొంచెము మతము గలదు రాజకార్యపరాయణత్వము, సంఘసంరక్షణము నివి తక్కిన వారికిఁ బరమార్థములు వీనికిఁ దోడుగా, భగవంతుఁడు మతముతో మనల నీలోకము దాఁటించుటకు వచ్చును వారి మట్టుకు భగవంతుఁడు ప్రపంచమును శుభ్రపఱచి యందుఁ గావలసిన వన్నియు సమకూర్చువాఁడు ఆ భగవంతునికిఁ గల మహిమ యంతయే కడచిన రెండుమూఁడేండ్లనుండియు నింక ననేకముగాఁ దెలిసికొనవలసినవారయ్యును దెలిసినవారి వలె నటించుమహానుభావులు, మన హిందూమత మైహికసుఖానుకూలము కాదనియుఁ జేతినిండ ధనము నింపదనియు దేశములను దోఁచుకొను సాధనము కాదనియు బలవంతులైన వారు విచ్చలవిడిగా బలహీనులపైఁబడి వారిరక్తమును గ్రోలి పొట్ట నిండించుకొను నట్లు చేయదనియు నే కదా నిందించుచున్నారు నిశ్చయముగా మనమత మట్లు చేయఁజాలదు అది పరదేశము

లనుబాడుచేసి కొల్లపెట్టుటకై పాదఘట్టనముచే భూమి యదరు నట్లు దళముల నడిపించునది కాదు. కాఁబట్టియే వారు దీని యందేమి కలదనియందురు ఆ హేతువుమీఁదనే మనమతము నిక్కమైనదనియు నుత్తమమైనదనియు సాధింపవచ్చునని వారు లేశము నెఱుఁగరు మనదే నిక్కమగు మతము విషయగోచర మగు నీప్రపంచము మూఁడునాళ్లముచ్చట. ఇది కలకాల ముండునది కాదు అట్టిది మనకుఁ బరమార్థమెట్లగును! మనమత వృద్ధి కీదిజ్మండలమంతయు నాలుగడుగులమేరవంటిది. మనమత మింద్రియాతీతమై దేశకాలనిమిత్తాతీతమై యీప్రపంచము నంతను సముద్రమునందలి నీటిబొట్టునువలెఁ జేయునట్టిదిగా నున్నది మనదియే నిక్కమగుమతము ఏమన, ఇది భగవంతుఁ డొక్కఁడే సత్యమనియు నీ ప్రపంచమంతయు నసత్యమనియు నశ్వరమనియు ధనము తృణప్రాయ మనియు మనశ్శక్తి మిత మైనదనియు జీవనము తెలుచు దుఃఖభాజనమనియు బోధించును కాఁబట్టి మనమతమే సత్యమైనమతము మఱియును వైరాగ్యమును బోధించును యుగములనుండి సంపాదితమైన జ్ఞానమును గలిగి నిన్న మొన్నఁ బుట్టిన యితరదేశస్థుల కందఱికిని గంఠోక్తిగా నిట్లు చెప్పుచున్నది "బిడ్డలార! మీరింద్రియములకు దాసులై యున్నారు ఇంద్రియములు సాంతములుగాని యనంతములుగావు దానియందు నాశనము కలదు ఈమూఁడు దినములను భోగముతోఁ గడపినపిమ్మట మనము చెడిపోవుదుము కాఁబట్టి దీనినంతను విడిచిపెట్టుఁడు ప్రపంచము మీఁద నింద్రియములమీఁద ననురాగమును మానుఁడు.

అదిమతమునకుమార్గము. వైరాగ్యము పరమార్థసాధనముగాని భోగముగాదు" అని బోధించును. కాఁబట్టి మనమతమే సత్యమైనది. ప్రపంచరంగమునం దనేకదేశములు నాటకమునందలి పాత్రములవలెఁ బ్రాముఖ్యతవహించి సంపూర్ణప్రభావముతో నీషత్కాలము వర్తించి తుదకుఁ బేరయినను మిగులకుండ నశించుచుండఁగా మనము శాశ్వతముగా నుండుట యద్భుతము గదా! అత్యుత్తమమైనదానిని నశింపకుండఁ గాపాడవలెనని ప్రగల్భములు పల్కుచు దేహబల ముత్తమ మైనదని యెంచుచున్నారు అదియే వాస్తవమైనయెడలఁ బ్రపంచమునందు మిగుల ఘోరముగా వర్తించిన దుష్టసంఘము లన్నియు నేఁటికినిలిచియుండి బలహీనులగు మనహిందువులను బీడింపవా?

ఒక దొరసాని నాతో "హిందువు లేమిచేసినారు? ఒక్కదేశమునైన జయింపలేదే" యని చెప్పినది. ఒక్కదేశమునైనజయింపనట్టి మనము ముప్పదికోట్లు జనసంఖ్యగలిగి ప్రబలియుండుట తటస్థింపదు దానిశక్తి యింతయు నుడిగి ప్రత్యంగమును బటుత్వము తగ్గిన దనుటయు వాస్తవము కాదు. శక్తి కావలసినంత యున్నది అవసరము తటస్థించినపు డది ప్రవాహముగా బయలు వెడలును పూర్వకాలమునుండియు మనము ప్రపంచముతోఁ బందెము వేసి యున్నాము, పాశ్చాత్యులు మనుష్యుఁ డెంతవఱ కార్జింపఁగలఁడో యను విషయములను శోధించుచున్నారు మనము వానికి భిన్నముగా మనుజుఁ డెంతతక్కువతోఁ గడపుకొనఁగలఁడో యను విషయమును

శోధించుచున్నాము ఈచర్యయు వివాదమును శతాబ్దముల కొలఁది యింకను జరుగవలసి యున్నది కానిచరిత్రమంతేమైన సత్య మున్నపక్షమునను జ్యోతిషము నిక్కమైన యెడలను దక్షతతోఁ గడపుకొని జితేంద్రియు లై యుండఁగలవారు తుదకు జయమొందుటయు రాజభోగములకొఱకు దురాశతోఁ బ్రయత్నించువారోడిపోవుటయుఁదటస్థింపవలెను ఒక్కొక్క మనుష్యుని జీవితకాలమందే కాక యొక్కొక్క దేశము జీవితకాలమునందును నాకరీతివిసుగుదల ప్రపంచమునందుఁ గలుగును అట్టి విసుగుఁగల యిప్పుడు పాశ్చాత్యులకుఁ గలిగినట్లు కానిపించుచున్నది అక్కడ గొప్ప యాలోచనపరులు గలరు ధనాదాయము కొఱకు స్పర్థతో యత్నించుట వ్యర్థమనివారును గనిపెట్టుచున్నారు తమవాణిజ్యనాగరికతతోడను ఆర్జనస్పర్థతోడను విసిగి వేసారి యింతకంటెను త్తమమగు నెద్దానికైనఁ బ్రయత్నము చేయుగఁను విద్యాధికులుగలరు యూరోపునందుఁగల చెడుగులకు దివ్యౌషధము, రాజకీయవ్యాపారములు సంఘవ్యాపారముల నంటకుండుటయేయనువారును కొందఱుఁ గలరు కాని గొప్పబుద్ధిమంతు లందులకు భిన్నములగు లక్ష్యములను వృద్ధినొందించుచున్నారు మనజన్మయందుఁ గల లోకములకు రాజ్యతంత్రముసు సాంఘిక కార్యపరాయణత్వమును గావనివారు తెలిసికొనిరి ఆత్మపరిశుద్ధియే దానికిఁ బరమసాధనము. ఎంత బలమున్న నెట్టిప్రభుత్వమున్న నెంతకఠినములగు చట్టములున్నను దేశస్థితి బాగుపడ నేరదు ఆత్మవిద్యయు నీతివిశేషమునుమాత్రమే దేశమును మంచిస్థితికిఁ దెచ్చినవి కాఁబట్టి,

పశ్చిమదేశస్థులు క్రొత్తయూహలకొఱకును, క్రొత్తశాస్త్రముల కొఱకును నాతురులై ప్రయత్నించుచున్నారు. వారి క్రీస్తుమత ము పెక్కువిషయములయందు చాలమంచిదియే యైనను నది సగము మాత్రమే తెలిసినను, తెలిసినంతవఱకది చాలదని వారు కనిపెట్టినారు పాశ్చాత్యులలోని బుద్ధిమంతులు ఆతురులై కోరుచుండు నాత్మవిద్యాపిపాస మన వేదాంతశాస్త్రరసామృత ముచేఁ దీఱఁగలదని తెలిసికొనిరి అది యద్భుతము కాదు

లోకమునందలి ప్రతిమతమునత్యద్భుతముగాఁ దమతమ విశేషములను బెల్లుగా వర్ణించుట నేనువినుచున్నాను డాక్టరు బారోసుదొరగారు క్రైస్తవమతము విశేషముగ సర్వప్రపం చానుకూలమైన మత మని సెలవిచ్చిరి ఈవిషయము నించుక సేపు చర్చింపనిండు వేదాంతమతమే కాని మఱియే మతమును సర్వప్రపంచమతమై యుండనేరదనుటకు నాహేతువులు నేను నివేదింతును మన మతము గాక, తక్కిన యొకటి రెండుగాక యన్నియు నెవ్వరో యొక పురుషు నాధారము చేసికొని యున్నవి వానియందలి సిద్ధాంతములును నీతులును బోధలు నన్నియు నామతస్థాపకునివలనఁ గలిగిన యధికారము గలవై యాతనిచరిత్రముతో సంబంధము గలిగియున్నవి ఆపురుషుని వాస్తవావాస్తవములనుబట్టి యామతముయొక్క బలాబలము లుండును ఇప్పటిదినములలో వలె నట్టి పురుషునివాస్తవము భంగ మగునట్లు తటస్థించెనా యామతభవనముయొక్క పునాది చెడి భవనము పాదఘట్టితమవును అట్టి పురుషులను గుఱించి

చెప్పెడు కథలలో సగము నమ్మ నర్హము కావని కొట్టివేయుచునే యున్నాము మనమత మొక్కటి గాక తక్కిన వన్నియు నట్టిపురుషచారిత్రములతో సంబంధించునవియే యైయున్నవి మనమతమో ధర్మము లాధారముగాఁ గలది వేదములను సృజించినా నని చెప్పు మగవాఁడు కాని యాఁడుదిగాని లేదు. అవి శాశ్వతధర్మముల సముదాయము వానిని ఋషులు కనిపెట్టిరి అప్పుడప్పుడు వారిపేళ్లుమాత్రము పేర్కొనఁబడినవి వారెవ్వరో యేమో మన మెఱుఁగము చాలమందిని గుఱించి వారితండ్రు లెవ్వరో తెలియదు ఎవ్వరి విషయమునను వారి జన్మ కాలమును జన్మస్థానము నెఱుఁగము ఆఋషులకుఁ బేరులతో నిమిత్తమేమి? వారి కవియేల? వారు ధర్మములను బోధించిరి వారు బోధించిన ధర్మములకు వారే కారణములైరి నిర్గుణుఁడును సగుణుఁడు నైన భగవంతునివలెనే మన మతమును గేవలము నిర్గుణమైన ధర్మముల మీఁద నేర్పడినదైనను సగుణోపాసనకు వలసినంతయవకాశమును గల్గించుచున్నది ఎట్లన, ఏమతమం దింతకంటె నెక్కువ యవతారములు నెక్కువమంది ఋషులును గలిగి యింక ననేకమంది యుండుటకవకాశము గలదు? అవతారము లనంతము లనియు నింకననేకావతారములు కలుగఁగల వనియు భవగద్గీతనుడువుచున్నది. కాఁబట్టి, మన మతపురుషు లెవ్వరైనను నవతారములం దేవియైనను ఋషులయం దెవ్వరైనను జరిత్రసమ్మతములు కావని తేలినను మనమతమునకు హానిలేదు అప్పుడును మనమతముయథాప్రకారము చెక్కుచెదరక యుండును ఎట్లన, మన మతమునకు

ధర్మ మాధారము లోక మందఱకి నొకపురుషునియందు నమ్మకము కుదురునట్లు చేయుటకై యత్నించుట వ్యర్థము. ప్రపంచమందలి యొక్కవమంది జనులు మతవిషయమై యేక మార్గమునకువచ్చునట్లు చేయుటకుసాధ్యమగునెడల నామతము ధర్మస్థాపితమైనది కావలెను. కాని, పురుషస్థాపితమైనయెడల సాధ్యము కాదు అట్లయ్యును మనమతము పురుషదైవములకు గూడ నవకాశము గలిగియే యున్నది ఈవిషయమున నిష్టసిద్ధాంతము కావలసినంత స్వతంత్రము నిచ్చుచున్నది. నీయిష్టము వచ్చిన యవతారమును గాని ఋషినిగాని మతగురువును గాని నీకుపదేష్టగా నేర్పఱచుకొని పూజించుకొనవచ్చును. ఆరీతిని నీవేర్పఱచుకొనినదైవమందఱకంటె శ్రేష్ఠుఁడని నీవుతలంచుటకును నీకు స్వతంత్రము కలదు అందేమియు హానిలేదు; గాని నీకు శాశ్వతములైన సత్యధర్మము లాధారముగా నుండవలయును మనమతమం దొకవిశేషము గలదు అందలి యవతారము లన్నియు వేదములయందలి ధర్మములకు లక్ష్యములగునంతవఱకే యంగీకరించుచున్నాము. శ్రీకృష్ణుడు శాశ్వతము లగు మతధర్మములను లోకమునకు బోధించినాఁడనియు, వేదాంతమునకు లోకాతీతుఁడగు వ్యాఖ్యాత యనియు నధికులే యొప్పిరి

లోక మందఱు నంగీకరింపవలసిన వేదాంతమునందలి రెండవవిశేషము నవీనప్రతిశాస్త్రశోధనలవలనఁ దేలిన ఫలితము లన్నిటితోడను దానియందలి ధర్మములు సమన్వయములగుచున్నవి స్వభావస్వరూపములచే నైకమత్యము గలిగిన

రెండుమనస్సులు చిరకాలమునుండి వేఱువేఱుమార్గములంబడి యొకే గమ్యస్థానమును బొందుటకు యాత్రచేయుచున్నవి. అందొకటి పూర్వకాలపు హిందూమనస్సు, రెండవది పూర్వ కాలపు గ్రీకుమనస్సు రెండవది బాహ్యప్రపంచముయొక్క యవయవశోధనముతోఁ బ్రారంభించినది. మొదటి దంతర్లోక విభాగముతోఁ బ్రారంభించినది ఇట్లు వాని జీవయాత్రయం దనేక మాఱుబాటులు గలిగినప్పటికిని నీరెండుమనస్సులవలనఁ గలిగిన స్పందనములకును గమ్యస్థానమునుండి యొకేరీతి ప్రతి ధ్వనులను గలిగించుచున్నవని సులభముగాఁ దెలియవచ్చును. ప్రకృతకాలపు ప్రకృతిశాస్త్రసిద్ధాంతములు వేదాంతు లగు హిందువులకు మాత్రమే మతమునకు భంగములేకుండ సంగీ కార్యము లగుచున్నవి

వేదాంత సిద్ధాంతముల నవలంబించుటచేతనే ప్రకృతపు ప్రకృతిశాస్త్రసిద్ధాంతములు నిలువ నలవి యగుచున్నవి ఇది గాక, నవీనములగు ప్రకృతశాస్త్ర సిద్ధాంతము లన్నియుఁ జిరకాలము క్రిందటఁగనిపెట్టఁబడిన వేదాంతము నందలిసిద్ధాం తములే యని కూడ నభీష్టము గలవారు కనిపెట్టియున్నారు. నవీనశాస్త్రమం దవియే భౌతికభాగములో వ్రాయఁబడి నవి. అంతియ భేదము. కాఁబట్టి, వేదాంతము యొక్క యద్భుత మగుసహేతుకత్వమొకటి ప్రకృతపాశ్చాత్యపండితుల మనస్సు లమీఁద వేదాంతమునకుఁ గలయధికారము వేదాంతమునం దలి సిద్ధాంతముయొక్క సహేతుకత్వమెంతో యద్భుతముగా

నుండు నని పశ్చిమపండితో త్తములు పలుమాఱు నాతో నుడు
వుచు వచ్చిరి తన కార్యస్థానమునుండి యవతల నడుగుపెట్టుట
కును భోజనము చేయుటకును గూడఁ దీఱిక గనని యొకశాస్త్ర
శోధకులలో నొక్కరు వేదాంతమును గూర్చి నేనిచ్చు నుప
న్యాసములను వినుటకై గంటలకొలఁది కాలము నిలిచి వినుట
నేనెఱుఁగుదును. ఏమనిన, నవి యంతశాస్త్రసమ్మతములు గాను
నిప్పటికాలపు టూహాలకంతగా సరిపడినవి గాను బ్రస్తుతము
ప్రకృతిశాస్త్రమువలనఁ దేలనున్న సిద్ధాంతములతో సమన్వ
యము గలవిగాను నున్నవని యాతఁడు చెప్పెను ఇట్టి రెండు
సిద్ధాంతములను మతముతో సంబంధము గలవానిని నే నిప్పుడు
మీకెఱుకపఱచుచున్నాఁడను

అందొకటి మతముయొక్క సర్వసమానత్వము, రెండ
వది పదార్థములయొక్క యేకత్వము బాబిలోను చరిత్రమం
దునుయూధులందు నొకచక్కని మార్పుగలుగుచున్నది ఈబా
బిలోనియనులును యూధులు ననేకతెగలుగా విభాగింపఁబడి
యొక్కొక్క తెగవా రొక్కొక్కదైవముఁ గొలుచుచున్నారు.
ఈపలుదైవములకు జాతినామములు గలవు అందు బాబిలోని
యనులు దైవములకు "బాల్సు" అని పేరు "బాల్ మెరో
డాక్" అను దైవము ముఖ్యుఁడు కొంతకాలమున కందొక
తెగవారు మఱియొక తెగవారిని లోఁబఱచుకొనినమీఁదట
నాజయించినవారి దైవములపై నధికారమీయఁబడును సిమై
టులయొక్క గొప్పఁగాఁ జెప్పుకొను నేకదేవోపాసన మీరీతి

నేర్పడినది యూధులయందు వారిదైవమును "మోలక్" అందురు. అంతు "ఇసిరేయల్" అను తెగవారియొక్క "మోలకు" నకు "మోలకుయూహ్వా" యని పేరు. ఈతెగ వారు తక్కినకొన్ని తెగలను జయించి వారినందఱను లోఁబఱచుకొని తమ మోలకు తక్కినయందఱి మోలకులకంటె నధికుఁడని ప్రచురించిరి ఈజయమును సంపాదించుట కెంతజీవహింస జరిగినదో యెంత రుధిరము ప్రవహించినదో యెంతదుర్మార్గము జరిగినదో మనమందఱము నెఱిఁగియే యున్నాము పిమ్మట బాబిలోనియను లీ మోలకుయూహ్వాను నశింపఁజేయఁబూనిరి గాని, కార్యము లేకపోయినది అట్టిమతకలహములు హిందూదేశమునందుఁ గూడ జరిగినట్లు నాకుఁ దోచుచున్నది ఇక్కడ గూడ నార్యులయొక్క కలుతెగలవారు తమతమ మతములకై ప్రాముఖ్యత తెచ్చిపెట్టుటకై యొకరితో నొకరు కలహించి యుండవచ్చును కాని హిందూదేశముయొక్క చారిత్రము యూధులచారిత్రముకంటె భిన్నముగానుండెను దేశములన్నిటి యందును హిందూదేశ మాత్మవిద్యకును మతసహనమునకును సమానమైవెలయుట విధియైయుండుటంబట్టి యీకలహములు చిరకాలము జరగలేదు అంతకుఁజిరకాలము క్రిందటనే బుద్ధ్యతీతమగు చిరకాలము క్రిందటనే యొక ఋషిశిఖామణి "ఏకం సద్విప్రాబహుధావదంతి" యనివక్కాణించియున్నాఁడు. ఉచ్చరింపఁబడిన వాక్యము లన్నిటియందు నిది సర్వదా జ్ఞాపకముంచుకొనఁదగినది అన్నిసత్యములలో నుత్తమమైనది: హిందువులమైన మనస్థితి కీసత్యమాధారము అనేక యుగము

లనుండి యీ "ఏకం సద్విప్రా బహుధా వదంతి" యనునభిప్రాయము రాను రాను బలవత్తరమై సర్వవ్యాపియై మానవకోటి నాక్రమించి ప్రతిరక్తనాళమునందు వ్యాపించి ప్రత్యణువునందును నిండి యున్నది మన మాసూత్రతల్లజముయొక్క ప్రత్యక్షరమును గౌరవించుటంబట్టి మనదేశము మతసహనమున కాకరమైనది కాఁబట్టియే మనమతమును ఖండించుటకు వచ్చు నితరమతస్థులు సయిత మిచ్చట దేవాలయములను నిర్మింపఁగలుగుచున్నారు ఈవిషయమున లోకమందఱుఁ బాఠమును జెప్పించుకొనవలసి యున్నారు ఇతరదేశములం దెంత యసహనమున్నదో మీకుఁ దెలియకున్నది ఈమతద్వేషముల మూలమున నేను బరదేశములలో శరీరము విడిచిపెట్టవలసి వచ్చునేమో యని భయపడుచు వచ్చితిని మతముకొఱకు నరహత్య చేయుట తృణప్రాయముగానుండెను ఇప్పటికి పాశ్చాత్త్యులట్లుచేయకున్నను, తేపో మాపో యట్లుచేయుటకు సంసిద్ధులై యున్నారు దేశముయొక్క మతమునకు భిన్నముగా నొక్క మాట పల్కినయెడలఁ బాశ్చాత్త్యులతనిని జాతినుండి వెలిచేసి పలుబాములఁ బెట్టుదురు. మనజాతిధర్మమును నిందించుచు వారు మెత్తమెత్తని పలుకులు పలుకుదురు మీ రెవ్వరేని నావలె వారిదేశములకుఁబోయి చూచితిరేని యిక్కడ దంభములు కొట్టు పెద్దపెద్దవారలందఱును నక్కడఁదా మింత నిక్క మని నమ్మినను మతవిరుద్ధమైనమాట యొక్కటియైనఁ బల్కసాహసింపఁజాలరు కావున, నీమత సహనమునకై లోక మత్యాతురతతో నిరీక్షించుచున్నది. అది నాగరికతకొక యలంకార

మగును ఇదిగాక, యీసహనములేని నాగరికత యెంతో కాలము నిలువఁజాలదు మతమౌఢ్యము, జీవహింస, పశుప్రాయత్వము నివి యడంగువఱకు నాగరికత వృద్ధినొందదు మన మొకరినొకరు దయాదాక్షిణ్యములతోఁ జూడఁగలుగువఱకు నాగరికత తలయెత్తనేరదు అందులకుఁ బ్రధానమొకరి మతమునం దొకరికి సహనబుద్ధి యుండవలెను ఇంతియకాక మనమతము లెంతభిన్నములుగా నున్నప్పటికిని మనము పరస్పరానురాగముగలిగియుండుటయేగాక, పరస్పరసహాయులమై కూడ నుండవలెను నేను జెప్పినరీతిని హిందూదేశమునందు మనము చేయునది యిదియే మనదేశమునందే హిందువులు క్రైస్తవులకుఁ జర్చిలును మహమ్మదీయులకు మసీదులును గట్టుచున్నారు అది చేయవలసినపని వారికి మనయం దెంతద్వేషమైనను వారు మనల నెంతకఠినముగాఁ జూచినను వారెంత క్రూరులైనను వారెంత హింసించినను మనల నెన్ని దుర్భాషలాడినను ననురాగముచే వారిని మనము జయించువఱకు, ననురాగమొక్కటియే ప్రపంచమం దుండఁదగినదని ప్రపంచమునకు మనము వెల్లడి చేయువఱకును శాంతము చిరకాలము నిలిచి ఫలించి వర్ధిల్లునుగాని, ద్వేషము మోటుఁదనమును బశుప్రాయత్వమును గాదని లోకమునకు దెలియువఱకును క్రైస్తవులకుఁ జర్చిలును మహమ్మదీయులకు మసీదులును మనము కట్టుచుండవలయును.

యూరపునందలి బుద్ధిమంతులును లోకమందఱును ముఖ్యముగాఁ గ్రిందిజాతులవారును విద్యావిహీనులును బల

హీనులును హిందూదేశమునుండి తెలిసికొనవలసిన యింకొక గొప్పవిశేషము గలదు ఏదన, లోకమందలి యాత్మయొక్క యేకత్వము యూరపునందలి ప్రకృతిశాస్త్రసిద్ధాంతములవలనఁ బ్రపంచముయొక్క భౌతికాద్వైతమెట్లు సిద్ధాంతము చేయఁ బడినదో భౌతికముగా నీవును నేనును సూర్యచంద్రనక్షత్రాదులు నొకపదార్థ మహాసముద్రమందలి చిన్న చిన్న తరంగములవంటి సంబంధము నెట్లు కలిగియున్నారమో యుగముల క్రిందటనే హిందూతత్త్వశాస్త్రములో శరీరమును మనస్సును గూడ సమష్టి పదార్థమందుఁ జిన్నతరంగములని యెట్లు చూపింపఁబడి యున్నవో యింకొక్క మెట్టు దాఁటినతర్వాత వేదాంతమందాత్మాద్వైతమెట్లు సిద్ధాంతీకరింపఁబడినదో చెన్నపురి విద్యానిలయమునందుఁ గృతార్థులైన మీకందఱకు నేను జెప్పనక్కఱయే లేదు విశ్వమంతట నొక్కటే యాత్మ గలదు ఈయభిప్రాయ మీదేశమందుఁ జాలమందికిఁ గొంతవెలుఁగు గలిగింపక పోలేదు ఇప్పటికి నాయభిప్రాయము ననుకూలురనేకులు. ప్రతికూలు రెక్కువగానే యున్నారు ఆయిప్పటికిని, లోకమునకుఁ బ్రాణదాయకమగు నభిప్రాయమదియే హిందూదేశమునందలి మూఢమానవుల నంతరింపఁజేయుట కిదియే సాధనము దీని నాచరణలోనికిఁ దెచ్చి సర్వత్ర వ్యాపింపఁజేయుటకు మఱియొక సాధనముచే మనదేశమును బునరుద్ధారణము చేయుటకు సాధ్యము కాదు. తమతత్త్వశాస్త్ర నీతిశాస్త్రములయొక్క సహేతుకత్వమును శోధించుచున్నారు ఎంతఘనుఁడైనను నెంతటి దివ్యుఁడైనను నిన్నఁ బుట్టి తేఁపుగిట్టనున్న వానివంటియధి

కారప్రభావముచేత నీతిశాస్త్రమును సముద్ధరింపఁజాలను ఆ శాస్త్రమునకుఁ జెప్పెడు సమాధానము లోకమునందలి గొప్ప బుద్ధిమంతులకు రుచింపలేదు మానవేతరమగు నధికారమును ధర్మమాత్రానుచరణమును నీతిశాస్త్రమును సమర్థింపవలెను. అట్టిసమాధాన మాత్మాద్వైతమునందును నీవును నేనునొకటే యనిచెప్పు సిద్ధాంతమునందును గాక మఱియెచట నున్నయది? ప్రతిగ్రంథమును బ్రతిబాలుఁడు నట్లు వ్యాఖ్యానించుచున్నారు ఇది హిందూతత్త్వశాస్త్రమునందలి నిబంధనము. ఈ యేకత్వమే ప్రపంచమునందలి నీతిశాస్త్రమునకంతకును మూలము మనలోని తక్కువజాతివారివలెనే యూరపునందును నిదియిప్పుడవసరమై యున్నది, ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాన్సు, అమెరికా లోనగు దేశము లన్నిటియందు నిపుడు బయలుదేఱుచున్న రాజకార్యవ్యాపారములయందును సాంఘికకార్యములకు సర్వోచితమై యీయభిప్రాయము ప్రధానమగుచున్నది ఈ ప్రకారముగా నెచ్చటెచ్చట స్వేచ్ఛాసంపాదనమునకై ప్రయత్నము జరుగుచున్నదో యచ్చోటనెల్లను వేదాంతసిద్ధాంతములు క్రమక్రమముగా వనలెత్తుచున్నవి కొందఱాధర్మములకు జన్మస్థాన మెద్దియో తెలియలేకున్నారు కొందఱవి క్రొత్తగాఁ దమచేతనే జన్మించినవని యెంచుచున్నారు కొందఱు ధారాళముగా వేదాంతమే వానిమూలమని యొప్పుకొని కృతజ్ఞులై యున్నారు

మిత్రులారా! నే నమెరికాలో నున్నప్పుడు విశేషముగా నద్వైతమునే బోధించుచున్నాననియు, ద్వైతము నత్యల్పము

గాఁ జెప్పుచున్నాననియు కొందఱు చెప్పఁగావిన్నాఁడను ద్వైతమతముఁ గల భక్త్యనురాగపూజావిశేషములును వాని ప్రభావమును నే నెఱుఁగుదును గాని, యట్టి యానందబాష్పముల కిది కాలము గాదు. ఆసనములు వెల్లినవి సరళమార్గముల కిది సమయము గాదు మనవృద్ధమార్గములు మనము మఱిగిపోవువఱకు వర్ధిల్లినవి ఇప్పుడు మనము దూదిపింజలవలె నున్నారము ప్రస్తుతము వజ్రకాయమును అప్రతిహతమయి సముద్రముయొక్క లోతును గని పెట్టుటకును మృత్యువు నెదిరించుటకును సాధ్యమగు బుద్ధియును మనకుఁ గావలసి యున్నవి అదియే మనకుఁ గావలసినది. అట్టి దార్ఢ్య మద్వైతానుభూతివలనఁ గలుగును గాని వేఱువిధమునఁ గలుగదు మనయందును భగవంతునియందును నమ్మకము కలుగవలెను మీరు మీ 33 కోట్ల దేవతలను మఱియు నితరదేశస్థుల దేవతలను గూడ నమ్మెదరు సరే గాని మీయందు మీకు నమ్మకము లేదు లేనియెడల మీకు మోక్షము లేదు మీయందు నమ్మకము గల్గి సమర్థులై మెలఁగవలెను మనము వేయిసంవత్సరములనుండి పలువు రితరదేశములవారు కొద్దిజనసంఖ్య గల వారయ్యును మన తలమీఁద నడుగుపెట్టి మనపై ప్రభుత్వమును జెల్లించుటకుఁ గారణమేమి? వారు వారియందు నమ్మకము గలవారు మనము లేనివారము మనుజుఁడు పతితుఁ డనియుఁ దరుణోపాయము లేని పాపి యనియుఁ జెప్పు నసంగతప్రసంగముగాక యాపాశ్చాత్యులవలన నేను నేర్చికొనినదేమి? వారియందు దృఢమైన యాత్మవిశ్వాసము కలదు ఆంగ్లేయుల పిల్లవాఁ డేమి చెప్పును? "నే నాంగ్లేయుఁడను, దేనినై

నను సాధింపఁగల" నని చెప్పెను. అట్లే యమెరికా బాలుఁడును బ్రతియైరోపీయుఁడును జెప్పుదురు మనపిల్లకాయ లట్లు చెప్పఁగలరా! పిల్లలే కాదు పిల్లలతండ్రులైన నిట్లు చెప్పఁజాలరు. మన కాత్మవిశ్వాసము చెడినది కాఁబట్టి, నిద్రించు మనమనస్సులను మేలుకొలిపి వానియందలి యాత్మప్రభావమును వెల్లడిచేయుట కద్వైతమును బోధించు టావశ్యకమై యున్నది. కావున నే నద్వైతమును బోధించుచున్నాను గాని నే నద్వైతినైన కారణముచే దానియం దభిమానముకొఱకు బోధించుట లేదు నేను సర్వ సమ్మతమైన పద్ధతులమీఁద దానిని బోధించుచున్నాను ద్వైతమునకు విశిష్టాద్వైతమునకును హానిలేకుండుపద్ధతిని గనిపెట్టుట సులభమే భగవంతుఁ డన్నిటియందును గలఁడని చెప్పిన మత మొక్కటియు హిందూదేశమందు లేదు మన వేదాంతసిద్ధాంతము లన్నియుఁ గూడ నాత్మయందుఁ బరమపావనశాశ్వతధర్మములన్నియు స్వభావసిద్ధముగా నున్నవని చెప్పుచున్నవి కొందఱిమతంబున నీధర్మములు సంకుచితము లయి పిదపఁ బునర్విజృంభణమును గాంచును అద్వైతప్రకార మది సంకుచితమును గాదు విస్తరించుటయును లేదు మొదట గుప్తమైయున్నవి తదంతర గోచరములగును ఈ రెంటికిని బ్రయోజన మొక్కటియే యగుచున్నది ఒకదానికంటె రెండవదియెక్కువ సహేతుక మైనఁ గావచ్చునుగాని, ఫలితముమాత్రము రెంటికినిసమానమే లోకమునకు వెల్లడికావలసిన ప్రధానాభిప్రాయ మిదే. దీనియవసరము మన జన్మభూమి యగు నీదేశమున

మిక్కిలి యెక్కువగా నున్నది. మిత్త్రులారా! ఈవిషయమునం గొంచెము కఠినముగా మాటలాడవలసియున్నది. మన సోదరులలో నొకని నేయాంగ్లేయుం డైనం జంపినప్పుడు గాని యెట్టి కలకలము కలుగునో వార్తాపత్త్రికలలోం జదువుచున్నాము అది చదివినప్పుడు నాకు దుఃఖమాగదు కాని, దీని కెవ్వరు కారణభూతులని నాలోనే నేను నిందించుకొందును వేదాంతినగుటచే సహజముగా నాకట్టి శంక గలుగును <u>హిందువుల</u> కంతర్దృష్టి సహజము ప్రతివిషయము నంతర్దృష్టితోం జూతురు కనుక దీనికిం గారణ మెవ్వరని శంకగలిగినపుడు దీని కాంగ్లేయులు బాధ్యులు కారనియు, మనదుఃఖములకు మనమే కారణమనియు నాకుం దోంచును రాజ్యగర్వము గల మనపూర్వులు హీనజాతులవారి నందఱను క్రింది కణంగం ద్రొక్కి తలయెత్తనీయక వారికిం దాము మనుష్యుల మనుజ్ఞానము లేకుండునట్టి దుస్థితికిం దెచ్చినారు వారు శతాబ్దములవఱకుం గట్టెలమ్ముకొనియు నీరుమోసికొనియుం గాలక్షేపము చేయ వలసినవారై తాము దాస్యము చేయుటకే జన్మించితి మనియు నెన్నటికి నిట్లే కట్టెలు నీరు మోసికొనుచునే యుండవలసినవారు మనియు నమ్మకముకలవారైరి వారివిషయమున నెవ్వరేని నించుకదాక్షిణ్యముతో మాటలాడిన, నిప్పటి విద్యావంతులు సయితము వారిని లేవనెత్తుట యన్న వెనుకందీయుదురు అంతటితోంబోక పాశ్చాత్త్యులనుండి వచ్చునట్టియు వంశపరంపరగా వచ్చినట్టియు లేనిపోని గాథలను దీసికొనివచ్చి హేతువాదములు దీసి పాపమాపతితులను మఱింతబాధింపం జొత్తురు అమెరికాయందుం

జరగిన యీ సర్వమతసమాన్యాయసభయం దాఫిరికాఖండపు నీగ్రోయొకం డొక చక్కని యుపన్యాసము నిచ్చినాఁడు అతని యందు నాకొక విధమైన యభిమానము గలిగి వానితోఁ బలు మాఱు మాటలాడితినిగాని, వానిం గూర్చి యేమియుం దెలియ రాదయ్యెను ఒకనాఁ డింగ్లండులోఁ గొంద ఱమెరికావా రిని గలసికొని నపుడు వారు నాతో నిట్లనిరి ఆపిల్లవాఁ డొక నీగ్రోప్రముఖునికుమారుఁడు ఇంకొక ప్రముఖుని కాతనియం దాగ్రహము గలిగి యాతనిని నాతని భార్యను జంపి వంటచేసి కొని తినున ట్లాజ్ఞాపించెను వారితోపాటిచిన్న వానిని గూడఁ దిను మని యుత్తరు విచ్చెను అంతట నీపిల్లవాఁడు పాఱిపోయి యనేకదేశములు తిరిగి తిరిగి పలుబాములఁ బడి తుదకు సముద్ర తీరమును జేరి యొక యమెరకా యోడమీఁద నమెరికాకు వచ్చె నఁట ఆవ్యాఖ్యానమిచ్చిన దీపిల్లవాఁడు ఇఁక జన్మవాసనాసిద్ధాం తమును గూర్చి నేనేమి చెప్పవలెను ? ఓబ్రాహ్మణులారా! బ్రాహ్మణుల కితరులకంటె జన్మవాసనచే విద్య సులభసాధ్య మయినందున, వారి విద్యావిషయమై మనమంతగా శ్రమతీసి కొని ధనవ్యయము చేయనక్కఱలేదు సర్వవిధముల నితరుల కొఱకే వ్యయముఁబడి పాటుపడవలెను బ్రాహ్మణుఁడు జన వాదినుండియు బుద్ధిమంతుఁ డైన యెడల నితర సహాయ మక్కఱలేకయే విద్యసంపాదింపఁగలఁడు. తక్కినవారి కట్టి బుద్ధిలేకున్న నందఱు గురువులును వారికే యంతబోధను గావింపవలెను. నాకుఁ దెలిసినరీతి నిది న్యాయమును వివేక మును గావున మనదేశమందలి హీనజాతులవారి మొఱవిని వారిస్థితిని ముందు మనము తెలిసికొనవలెను. జాతిభేదమును

బలాబల తారతమ్యమును లేక ప్రతిపురుషుననును, స్త్రీకిని, బాలుననును, ప్రతివారియందు ననంతమహత్త్వము గల యాత్మయున్న దనియుఁ బ్రతివారును ఘనులగుట కవకాశ మున్నదనియు జ్ఞానము కలిగింపవలెను "ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత" యను వాక్యమును బ్రతియాత్మకును దెలియఁ జెప్పవలెను దుర్బలుల మను నభిప్రాయజనితమగు నిద్రనుండి మేల్కొనుఁడు; ఎవ్వరును బలహీనులు కారు; ఆత్మ యనంతమైనది, సర్వశక్తి మంతమైనది; సర్వజ్ఞమైనది కావున, లేచి మీయందున్న భగవంతునినమ్మి ధైర్యముగా వర్తింపుఁడు. అతిసోమరితనము, అతిదౌర్బల్యము, అతిమాంద్యము, మన సంఘము నావహించియున్నవి ఓహిందువులార! మాంద్య మును వదలిపెట్టుఁడు అందులకు మార్గము మీమతగ్రంథ ములలో నున్నది ఆత్మస్వభావమును మీరు తెలిసికొని యం దఱకును బోధించి యాత్మను మేలుకొల్పుఁడు జీవునికి స్వస్వ రూపజ్ఞానము కలిగినయెడల శక్తి జ్ఞానప్రభావపావనత్వాది సమస్తసద్గుణములును తమంతటనే వచ్చును గీతలయందు ముఖ్యముగా నేను మెచ్చుకొనునంశ మేమైన నున్నయెడల నీశ్లోకములు శ్రీకృష్ణుని బోధయందలి సారమైయున్నవి.

"సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః"

"యోమాంపశ్యతి సర్వత్ర సర్వంచమయి పశ్యతి.
తస్యాహం నప్రణశ్యామి సచమే నప్రణశ్యతి."

"సర్వభూతస్థితం యోమాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథావ ర్త మానోఽపి నయోగీ మయివ ర్తతే."

ఇచ్చటను నితర స్థలములయందును గూడ వేదాంత మెక్కువలాభకరమైన పనిచేయుట కవకాశమున్నది పరమాత్మ యొక్క యేకత్వమును సర్వవ్యాపకత్వమును మానవకోటి యొక్క క్షేమముకొఱకు లోకమంతట బోధింపవలసి యున్నది. ఎక్కడెక్కడ కీడును నవిద్యయునుగలవో యచ్చటనెల్లను భేదములను నమ్ముటవలనఁ గీడువచ్చుననియు నేకత్వమును నమ్ముట వలన మేలుకలుగుననియు నా యనుభవమునుబట్టి తెలిసినది ఇదియే వేదాంతముయొక్క ఘనమైన సిద్ధాంతము ప్రతివిషయమునందును లక్ష్యము నేర్పఱచుకొనుట యొకటి, ఆలక్ష్యము నాచరణములోనికిఁ దెచ్చి మన ప్రతివ్యాపారమునందు నాలక్ష్యమున కనుగుణముగా వర్తించుట వేఱొకటి లక్ష్యమును గనఁ బఱచుట సులభమే కాని దాని నెట్లాచరణలోనికిఁ దేవలయునో కనఁబఱచుట మాత్రము కష్టము చిరకాలమునుండి మనదేశమందుఁ జర్చించి విసిగి వేసారుచున్న విషయమగు సంఘసంస్కారమును జాతిభేదమును వచ్చుచున్నవి. నాసంఘసంస్కారములతోడను జాతిభేదములతోడను నాకుఁ బ్రసక్తిలేదు నీదే జాతియైనను గావచ్చునుగాని యంతమాత్రముచే నితరజాతివారితో వైరము పూనవలసిన యగత్యము లేదు నేనెల్లప్పుడును అనురాగమును బోధించెదను. వేదాంతమునం దుపపాదింపఁబడిన పరమాత్మయొక్క యేకత్వమును సర్వవ్యాపకత్వమును

బోధించెదను. కడచిన నూఱేండ్లనుండి మనదేశము సంస్కారములతోడను సంస్కారులతోడను మునిఁగి పోవుచున్నది. నామట్టుకు నేను సంస్కారులయం దేమియుఁ దప్పుగానను వారిలోఁ జాలమంది సదుద్దేశముగల పుణ్యపురుషులే. వారియుద్దేశములును గొన్ని విషయములయందుఁ గొనియాడఁదగినవియే కాని యీనూఱేండ్లనుండియు బ్రజ లామోదింపఁ దగినఫలితమేదియుఁగలుగలేదు వేలకొలఁది జనులు వ్యాసపీఠములనుండి వ్యాసము లిచ్చియున్నారు నమ్ములగు గురువులను వారినాగరకతను దండోపతండముగా ఖండించి దూషించినారు కాని, వాస్తగతమైన ప్రయోజన మేమియుఁ గాన్పింపదు కారణ మేమి? కారణముచెప్పుట యొకకష్టమైనపని కాదు దానికీ తిట్టుఁబోతుఁదనమే కారణము ఇదివఱలో నేను జెప్పి యున్న రీతిని మొదటమనము కొన్నిలక్షణములు గలిగినసంఘముగా నేర్పడవలయును. ఇతరులనుండి మన మనేకవిషయములను నేర్చుకొనవలసి యున్నదని యెఱుంగుదును మన నవనాగరక సంఘసంస్కారులు ప్రతిపాశ్చాత్యపద్ధతిని నించుకైన నాలోచనసేయక యంధప్రాయముగా నవలంబించుచున్నారు. అది నిశ్చయముగా మనదేశమునకుఁ బనికిరాదు ఆహేతువుచే సంస్కారోద్యమములన్నియు నిష్ఫలము లగుచున్నవి మేలుచేయుటకుఁ దిట్టుఁబోతుఁదన మెన్నఁడును మార్గము కాదు సంఘమునందుఁ గొన్నిదోషము లున్నవని పిల్లవానికి సైతముఁ దెలియును. దోషము లేసంఘమందు లేవు? నాయనుభవమును బట్టి నేను దిరిగినదేశము లన్నిటితోడఁ బోల్చిచూడఁగా మనదేశమే

యొక్కఁడు నీతిమంతమైనదనియుఁ మనమేయొక్కఁడు దైవభక్తి గలవారమనియు మనపద్ధతులు నియమములు మానవకోటి కెక్కుడు సౌఖ్యదాయకములైనయుద్దేశములు గలవనియుఁ జెప్పఁగలను కాఁబట్టి, యేసంస్కారమును నక్కఱలేదు మన దేశపుఁబద్ధతులమీఁదనే యభివృద్ధి మనకుఁ గావలెను మనదేశ చారిత్రమును విచారించి చూడగా లోకమున కింత యుపకారము చేసినది మఱి యేదేశమును నాబుద్ధికిఁ దోఁచలేదు కాఁబట్టి యీదేశమును నిందించుట కేమియు నవకాశము కనఁబడదు నేను "మీరిదివఱకుఁ జేసినది మేలే, యింకను మేలుచేయుఁ" డని చెప్పుదును పూర్వులు ఘనకార్యములనే యొనర్చిరి అంతకంటెను ఘనకార్యములనొనర్చుట కింకను నవకాశ మున్నది మనమింతటితో విరమింపఁజాలము విరమించితిమా నశింతుము ముందుకైనను లేక వెనుకకైనను బోవలయును అనఁగా, వృద్ధిపొందవలెను, లేదా క్షీణింపవలెను. మనపూర్వులనేక ఘనకార్యములను గావించినారు మన మంతకంటె నెక్కువకార్యములను జేసి వృద్ధిబొందవలసియున్నది. అట్లుగాక మనము వెనుక కట్టి క్షీణదశకు వచ్చుటెట్లు? అది కూడదు. అట్లగుట మనదేశక్షేమమునకు భంగకరము కావున, మనము ముందునకుఁబోయి ఘనతరకార్యములఁ జేయవలయును నేను మీకుఁ జెప్పవలసిన విషయ మిది క్షణకాలంపు సంస్కారము లెవ్వియును జెప్పువాఁడనుగాను ఏ చెడుగులకును బ్రతికారము చెప్పుటలేదు మీరు పురోవృద్ధి గలవారై మనపూర్వులేర్పఱచిన సమగ్రమగు పద్ధతులమీఁద నడచి వృద్ధిఁ జెందుఁ డని

మాత్రముమిమ్ముం గోరుచున్నాఁడను. మానవులయొక్క యైక్య
మును వానియందుఁ గల దివ్యస్వభావమును ననుభవమునకుఁ
దెచ్చుకొనుటకుఁ బనిచేయుమని మిమ్ములను గోరుచున్నాఁడను.
నాకు గడువిచ్చినయెడల నిప్పుడు మనము చేయవలసియున్న
ప్రత్యల్పవిషయమునకును మనపూర్వు లేర్పఱచిన పద్ధతులను
వారు స్పష్టముగాఁ దెలిసికొని సూచించిన భావికాలగతులను
జూపఁగలను వారును జాతిభేదమును బాటింపనివారే గాని,
మన సంస్కారులవంటివారు కారు జాతిభేదము లేకుండుట
యనఁగా నొక మహాపట్టనములోని జనులందఱు నేకపంక్తిని
గూడి చల్దిగుడుచుటయును సారాయిని ద్రాగుటయు నని వారి
యభిప్రాయము గాదు అందఱుఁ దెలివితక్కువవాండ్రును మతి
పోయినవాండ్రును కూడ వారియిచ్చ వచ్చినప్పుడు కోరినచోట
వలచినవారిని వివాహమై దేశమంతయు మతిపోయినదానినిగాఁ
జేయుటయుఁ గాదు దేశముయొక్క క్షేమాభివృద్ధి దాని
యందలి విధవాభర్తల సంఖ్యనుబట్టి యుండుననియు వారు
తలంచి యుండలేదు పూర్వులందు బ్రాహ్మణుఁడు మాన
వోత్తముఁడై యందఱకును మార్గదర్శిగానుండెను ఈవిష
యము ప్రతిగ్రంథమునందును బ్రధానముగాఁ జెప్పఁబడి
యున్నది యూరోపునందు కార్డినలు ప్రభువు తనపూర్వుల
యొక్క ఘనతను స్థిరపఱచుకొనుటకై యెవ్వరో యొక్క
కొండమీఁద నివసించుచు దారిఁబోవువారి నందఱను గని
పెట్టి చూచుచుఁ దోఁచినప్పుడు వారిపైఁబడి సర్వస్వము దోఁచు
కొను నొకక్రూరప్రభువును గనిపెట్టి తాను వారివంశము

లోనివాఁడ నని చెప్పుటకై వేలకొలఁది కాసులను వెచ్చించు చున్నాఁడు. ఆహా ఇట్టి పూర్వులైనఁగాని ఘనత రానేరదు కాఁబోలు? కార్డినలు దొరగారి కట్టివాఁడు దొరకువఱకును దృష్టిగా లేదు మనదేశమం దన్ననో గొప్పగొప్ప రాజులు, కందమూలఫలాశను లై యరణ్యవాసము చేయుచుఁ గౌపీనధారులై యుండు తాపసుల వంశస్థుల మని చెప్పుకొనఁ జూతురు. కాఁబట్టి, కులీనత్వమునకు వారిలక్ష్యమునకు మనలక్ష్యమునకును జాలతారతమ్యము గలదు వైరాగ్యసంయుక్తుఁడై యాత్మవిద్యాపారంగతుఁ డగు బ్రాహ్మణశ్రేష్ఠుఁడు లక్ష్యము. బ్రాహ్మణుఁడు లక్ష్యమనఁగా నభిప్రాయమేమి? దానియందు లౌకిక్యవ్యవహారశూన్యతయు బ్రహ్మజ్ఞానసంపన్నతయును సంపూర్ణముగా నున్నవనియే హిందూసంఘమునకు లక్ష్యమది. బ్రాహ్మణుఁడు చట్టమునకు లోఁబడనివాఁ డనియు నతనికిఁ జట్టము లేదనియు, రాజులకు లోఁబడువాఁడు కాఁడనియు, నతనిశరీరము వధ్యము కాదనియు మనము వినియున్నారము. ఇదియంతయు వాస్తవమే దానికి దురభిమాను లగు మనమూర్ఖులు చేయు నపార్థములను విడిచిపెట్టి వేదాంతార్థము నాలోచింపుఁడు స్వార్థపరత్వము పూర్ణముగా నశించి లోకమునకు భక్తిజ్ఞానముల నుపదేశించుటకై జీవించుచుండు బ్రాహ్మణస్త్రీపురుషులచే నలంకరింపఁ బడిన దేశమునకు శిక్షాస్మృతు లేల? శాసనము లేల? వారి నేలుటకు రక్షకసైన్యములును పటాలములు నేల? వారి నొకరేలుట కవసరమేమి? వారు ఘనులు. ఉత్తములు. వారే భగవంతుని మనుష్యులు వారే మనకు

లక్ష్యమైన బ్రాహ్మణులు. సత్యయుగకృతయుగమం దీయొక్క-బ్రాహ్మణజాతిమాత్రమే కలదు. లోకమంతయు బ్రాహ్మణులే యుండువారనియు రాను రాను వారందఱును క్షీణించి పలుజాతులుగా విభాగమైరనియుఁ మఱియుఁ గొంత కాలమునకుఁ దిరిగి యందఱు బ్రాహ్మణులగుదురనియును మహాభారతమందుఁ జెప్పఁబడియున్నది అట్టికాలము సమీపించుచున్నది. ఆవిషయమే నేను మీకు స్ఫురణకుఁ దెచ్చుచున్నాను. కాన, జాతినిగూర్చి చర్చించునప్పుడు మనయుద్యమము పై వారిని గ్రిందికిలాఁగి రాగభోగములకొఱకును అన్నపానాదులకొఱకును జెలరేఁగి సంచరించుటయునై యుండ రాదు. వేదాంతమతావలంబకులై యున్న వారందఱు నాత్మవిద్యనభ్యసించి స్వచ్ఛమైన బ్రాహ్మణులు గావలెను. ఆర్యులైన ననార్యులైన ఋషులైనను బ్రాహ్మణులైనను మన దేశస్థులందఱకును మనపూర్వు లందఱు నొక్కపని నాజ్ఞాపించియున్నారు అదియెల్లరు సమానముగా నవలంబింపఁ దగినదై యున్నది ఏదియనినమీ రెల్లప్పుడు వృద్ధినొందుచుండవలయుననియు నత్యధికుఁడు మొదలు చండాలుని వఱకు నందఱును బ్రయత్నించి బ్రాహ్మణులు కావలెననియు నాజ్ఞాపించియున్నారు. ఈవేదాంతాభిప్రాయము మనకేగాక లోకమంతటవర్తించును మానవు లెల్లరుఁ గ్రమక్రమముగాను నెమ్మదిగాను వృద్ధిచెంది యాత్మవిద్య ననుభూతికిఁ దెచ్చుకొని క్షమావంతులై భక్తిరతులై ధ్యానగరిష్ఠులై తత్వవేత్తలగుటకుఁ గాను మన కీవర్ణభేదమేర్పడినది అందుఁ దేవుఁడు గలఁడు.

ఇవియన్నియు సమకూడదు కెట్లు? దూషించుటయు, శాపములు పెట్టుటయుఁ బనికిరావని యింకొక్కమాఱు నొక్కి వక్కాణించుచున్నాఁడను. వానివలననేమియుఁ బ్రయోజనము లేదు అనేక సంవత్సరములు వానిని బ్రయోగించుట యైనది. ఏమియుఁ బ్రయోజనము లేక పోయినది అనురాగమువలనను జనరంజనమువలనను మంచిఫలముకలుగునుగాని దూషణము వలనఁ గలుగదు ఇదియొక గొప్పవిషయము. దానింగూర్చి ప్రత్యేకము కొన్ని వ్యాసము లిచ్చినంగాని దానియందలి పద్ధతులన్నియుఁ జెప్పుట కవకాశముండదు. అది నాబుద్ధికనుదినముఁ దట్టుచునేయున్నది. కావున సంఘము చాలకాలమునుండి లోకమునకుపకారకముగానున్నదని మీకుఁ దెల్పి విరమించుచున్నాఁడను ఆసంఘమునందు నేఁడు కొన్ని లోపములు సంభవించినది నిజమే అందుకు దేశముయొక్కసంతానమగు మనము సర్వప్రయత్నములచేతను వానిని మాన్పవలెను మనవారందఱకును రానున్న యపాయమును దెలుపవలయును వారిని మేలుకొల్పి యుపద్రవమునుండితప్పింపవలయును ఆసేతుహిమాచలపర్యంతము మనవారందఱకుఁ బ్రస్తుతపు దేశావస్థను దెల్పి, దానికి వారు చేయవలసిన కృత్యమును బిగ్గఱగాఁ గంఠోక్తిగాఁ దెల్పెదను వారు నామాట వినకపోయినను వారినొక్కమాటయైన నసను. వారిని దిట్టను పూర్వము మనదేశ మనేక ఘనకార్యములను జేసినది. మనమంతకంటె ఘనకార్యములు చేయకపోయినను శాంతులమైనెమ్మదిగానైన నశింపవలెను దేశాభిమానులు కందు. మనకొఱకై ఘనకార్యములు చేసిన యీదేశ

మునం దనురాగము గలిగి యుండుఁడు. మీ వృత్తాంతమును దెలిసికొనిన కొలఁదిని, సోదరులారా! మీయందు నాకను రాగము హెచ్చుచున్నది మీరందఱు సత్పురుషులు, శాంతులు. మీరు కలకాలము బాధింపఁబడుచున్నారు అదియే యీమా యా ప్రపంచమునందలిజనులదురదృష్టము దీనికై చింతింపకుఁడు; తుద కాత్మప్రభావమే జయమునొందును. ఈలోపున మనము దేశమును దూషింపక పరమపావనియగు దేశమాతయొక్క శిథిలమైయున్న పద్ధతులను నియమములను శాసనములను నిందింపక దాని క్షేమముకొఱకుఁ బనిచేయవలెను ఎంత మూఢభక్తిగల విషయములనైనను నొక్కటియైనఁ దిట్టకుఁడు. అవికూడఁ బూర్వకాలమందుఁ గొంత మేలుచేసినవియే ఈదేశ పద్ధతులవంటి మంచిపద్ధతులుగల దేశము లోకమందు వేఱొకటి లేదని యెల్లప్పుడు జ్ఞాపకముంచుకొనుఁడు ఈజాతి భేదములు నేననేకదేశములందుఁ జూచియున్నాను. ఒక్కదేశమందైన నింతచక్కని పద్ధతులమీఁద నేర్పడినవి కానరావు. జాతి భేద మనివార్యమైనయెడలఁ బరిశుద్ధమై పరోపకారపరాయణత్వముగల జాతిభేదము కావలెను ధనముతో సంబంధించిన పనులు మనకక్కఱలేదు కాఁబట్టి, యెన్నఁడును నిందావాక్యములుపలుకకుఁడు. నోరుమూసుకొని దయాళువులుకండు మన ప్రతివానిది నీభారమే యనుకొని మనదేశక్షేమమును గూర్చియును లోకమును గూర్చియును బాటుపడి పనిచేయుఁడు. వేదాంతమునందలి జ్ఞానమును బ్రతివారికిని దెల్పి వారియందుఁ గల యాత్మప్రభావమును మేలుకొల్పుఁడు అందు మీకెంత

యల్పజయము కలిగినను స్వదేశమునకై పాటుపడి యందుల కై ప్రాణమువిడిచిన సంతోష ముండును ఏవిధముగా సంపాదించినను దీనియందే యిహపరసాధనము గలదు.

## చెన్నపురి మొదటి ప్రసంగము.

వివేకానందస్వాములు కుంభఘోణమునుండి పరిజనములతో చెన్నపురికిఁ బయనమై రైలుమార్గముగవచ్చుచుండిరి. వారి రాకను విని యొక్కొక స్టేషనులోను అచ్చటి ప్రజలు స్వాములను పుష్పమాలాలంకృతులం జేసి విన్నపపత్రిక లర్పించి సత్కరించిరి.

స్వాములకొఱకు చెన్నపురిలోని ప్రభువులు నగర శృంగారము కావించి మంగళవాద్యములతో నెదుర్కొనిచని తోడ్కొనివచ్చిరి స్వాము లాదినము శ్రీమాన్‌బిళిగిరిఅయ్యంగారి గృహమున నివసించిరి తిరువల్లిక్కేణి పార్థసారథిస్వామిసన్నిధినుండి రప్పింపఁబడినతీర్థముచే స్నానముచేయించి పుష్పమాలాలంకృతులంగావించిరి అప్పుడు బ్రాహ్మణులు వేదోక్తాశీర్వచనమొసర్చిరి ఎట్లన,

శ్లో "వేదాన్తవిజ్ఞాన సునిశ్చితార్థాః
సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః
తే బ్రహ్మలోకేతు పరాన్తకాలే
పరామృతాత్ పరిముచ్యన్తిసర్వే" ౧

శ్రు. "యో వేదాదౌస్వరః ప్రోక్తో
వేదాన్తే చ ప్రతిష్ఠితః
తస్య ప్రకృతి లీనస్య
యః పరస్స మహేశ్వరః ౨

తర్వాత, విద్వన్మనోరంజనీ నాటకసమాజమువారు సంస్కృతభాషతో వందనోపచారపత్రిక సమర్పించిరి చూడవచ్చిన వారలకెల్ల తగిన ప్రత్యుత్తర మొసంగి వారినిఁ బంపివైచిరి ఆదినము సాయంకాలము నగరవాసులను జూచుటకై టవుణ్‌హాలున కేఁగిరి అచ్చట నగరవాసు లర్పించిన స్వాగత పత్రమును, ఖేత్రి మహారాజుగా రంపిన ఉపచారపత్రమును జదువఁగా విని సంతసించిరి పిమ్మట స్వాములు ప్రసంగించుటకుఁ బ్రయత్నించిరి గాని, జనులు క్రిక్కిరిసి యున్నందున హాలు నుండి దిగి బయలున నొకబండిపై నిల్చి ప్రసంగించిరి ఆప్రసంగముయొక్క సారాంశము:—

"మనుష్యుఁ డొక్కటి తలఁచిన దైవము వేఱొక్కటి తలఁచును స్వాగతోపన్యాసములును దానికి ప్రతివచనమును ఆంగ్లేయపద్ధతి ప్రకారము జరుప సంకల్పించియుండియు నట్లు జరుగక బయలున రథముపనిల్పి శ్రీకృష్ణమూర్తి అర్జుననకుపదేశించిన విధముగా నేను ప్రసంగించునట్లు దైవాజ్ఞ యైనది. ఇది నాకు పరమోత్సాహముగా నున్నది ఇన్నివేల జనులు వినునట్లిప్పుడును నేను ప్రసంగించినది లేదు ఇందువలన, హిందువులకుఁ గల మతాభినివేశమును భక్తియు తెలిసికొనవచ్చును.

ఇతరదేశములయందు రాజకీయవిషయమునందును వ్యాపారమునందును ఆసక్తి యధికమే గాని మనదేశమునందువలె మతమునం దాసక్తిలేదు లేకపోవునేని బిచ్చమెత్తు సన్యాసికి యింతటి సత్కారము జరుగునా? ప్రకృతమున లోకులు రెండు కఠినవిషయములందు ప్రవర్తించియున్నారు ఒకటి హిందువులలో సంబంధించినది. మఱొకటి పశ్చిమఖండ దేశస్థులతో సంబంధించినది.

హిందువులు—ఎది నిత్యమైన ప్రయోజనము? దేనివలన ఒకజాతివారు నశింపక యుండఁదగును? అది ప్రేమయా? లేక విరోధమా? కాదేని సుఖభోగమా? లేక వైరాగ్యశీలమా? ఈలోకయాత్రయనెడి యుద్ధమునందు జడము జయించునా? చిత్తుజయించునా? అనుటయే. ఈవిషయమునమనపూర్వులు వేలకొలఁదిసంవత్సరములనుమును పే విచారించి సిద్ధాంతీకరించియున్నారు. ఎట్లనః వైరాగ్యశీలము, అధికారమునందు కోరికలేకయుండుట, ప్రేమ అను నివియే నిత్యసుఖమునకు మార్గము లని సిద్ధాంతీకరించి యున్నారు దీనికి నిదర్శనము లోకచరిత్రమును జూచిన బోధమగును ఎందఱో విదేశీయులు మహాపరాక్రమసంపన్నులై మహైశ్వర్యమునుఅధికారమును వహించియుండి నిమిషమాత్రమున పేరూరులేక నశించిపోయిరి మన జాతివారెన్నో యిడుమలననుభవించియు నశింపక శాశ్వతముగానున్నారుకదా? దీనికింగారణమేమి? మనజాతివారికిఁగల వైరాగ్యశీలమొక్కటియే వైరాగ్యశీలము లేనిమతమేదియైనప్పటికిని నశిం

చునదే కదా? యూరోపుజాతివా రన్ననో ఎంతధనము సంపాదింపవచ్చును? ఎంత యధికారము చేయవచ్చును? అనుదానిని గుఱించి పాటుపడుచుందురు. ఇందువలన పరస్పర ద్వేషమును, క్రౌర్యమును కలుగుచున్నవి ఇది ఐరోపాలోని ప్రకృతస్థితి. మనము వర్ణాశ్రమధర్మమనెడి శ్రేష్ఠమైన సాధనమును గైకొనియున్నారము గాన, మనము ద్వేషమును క్రూరచింతనమును మఱచి స్వజాతిధర్మాచరణమునందు బుద్ధినుంచి పరమార్థమును బొందెదము"

ఇంతటితో ఉపన్యాసము విరమింపఁబడినది రాను రాను జనసమూహము వృద్ధియగుచుండెను గానస్వాములకునలువైపుల జనులకు వినునట్లు ఉపన్యసించుటకు సాధ్యము లేకపోయినది స్వాములు మదరాసులో నొకవారమునకు మీఁద నుండిరి. సంఘుసంస్కరణ సమాజము మొదలగు సమాజములవారు తమతమ సమాజములకు స్వాములను ఆహ్వానించి సత్కరించిరి. అచ్చటచ్చట సమయానుసారముగా ప్రసంగములొనర్చిరి విద్వన్మనోరంజనీసమాజము వారు సంస్కృతమున ప్రబోధచంద్రోదయనాటకమునాడిరి స్వాములు ఆనాటకమును జూచి "దాక్షిణాత్యుల సంస్కృతోచ్చారణము చాల స్పష్టముగ నున్నది" యని ప్రశంసించిరి

---

## చెన్నపురి - రెండవ ప్రసంగము

1897 సం॥ ఫిబ్రవరినెల 9 తేది సాయంకాలము విక్టోరియా టవున్ హాలులో స్వాములు మహాజనులందఱానందించునట్లు ప్రసంగించిరి.

స్వాములు ప్రసంగారంభమునం దిట్లనిరి. "ఆదినము జనసమూహ మధికమైనందున ప్రసంగమును సంపూర్ణము చేయుటకు వలనుపడకపోయినది చెన్నపురి జనులు నాయందుంచిన దయను గూర్చి వారికి నేను చాల కృతజ్ఞుఁడను నాకొసంగిన దివ్యపదములతోఁ గూడిన స్వాగతపత్త్రమునకు ప్రతివచనము చెప్పుటకు నాకు తోఁచకున్నది ఆపత్త్రములో నుదహరించిన వాక్యములకు నేను లక్ష్యభూతుఁడను గావలయునని భగవంతుని ప్రార్థించెదను నాజీవితకాలపర్యంతమును మనమతముకొఱకును మనదేశముకొఱకును పాటుపడుచుందును ఈ సత్కైంకర్యమునకుఁ దగినవానినిగాఁ జేయునట్లు భగవంతుఁ డనుగ్రహించును గాక!

మహాశయులారా, నాయెడ నెన్నియో దోషములున్నప్పటికిని కొంచెము ధైర్యముకూడనున్నదని తలంచెదను నేను ఇండియానుండి పశ్చిమఖండమునకు నొకసందేశమును గైకొనిపోయియుంటిని. అమెరికావారియెదుటను ఆంగ్లేయుల యెదుటను ధైర్యముతోఁ జెప్పినాఁడను నేఁటి యుపన్యాసమునకు మునుపు మీకుఁ గొన్ని ధైర్యవచనములు చెప్పెదను. నన్ను అధైర్యపఱచి, నా కార్యములను భంగము చేసి, యింకను శక్తియున్నచో నన్నుఁ జంపుటకుఁ గొన్ని ప్రయత్నములు చేయఁబడెను కాని, భగవత్కృపచే నేదియు కొనసాగకపోయెను అయినను మూఁడేండ్లుగా మనస్తాపముమాత్ర ముండెను ఆవిషయమును నేను పరదేశములం దెవరితోను జెప్పలేదు. నామాతృదేశమునకు

నేను వచ్చినాఁడను గాన కొన్ని విషయములఁ జెప్పఁదలంచెదను. ఈవిషయములు చెప్పుటవలన నేమిసంభవించునో యనెడి పర్య వసానమును గూడ ఆలోచింపక చెప్పుచున్నాఁడను. ఒకవేళ ఏదేని విపరీతము కల్గినను నేను భయపడువాఁడను గాను.అందుల కెంతయుఁ జింతింపను నాలుగేండ్లకు మునుపు దండకమండల ధారినై మీాయూరికి వచ్చిన సన్న్యాసివలెనే యిప్పుడు నున్నాను ఆ ప్రపంచమే యిప్పుడు నున్నది ఇఁక నేఁజెప్పవలసిన దానిని చెప్పెదను

1:—థియసాఫికల్ సొసైటిని గుఱించి కొన్ని విషయ ములు చెప్పెదను థియసాఫికల్ సమాజము వారివలన హిందూ దేశమునకుఁ గొంతమేలుకలిగి యున్నదని చెప్పకయే తెలియు చున్నది. అసమయములోని వారిలో ముఖ్యముగా అని బెసం టమ్మకుసకలహిందువులును కృతజ్ఞతకలవారై యున్నారు. ఆమె నుగూర్చి నాకుఁ జక్కఁగాఁదెలియకపోయినను ఆమె హిందూ దేశ క్షేమముకొఱకు ప్రేమతో పాటుపడుచున్నదనియును, మన దేశము వృద్ధినొందవలయునని ప్రయాసపడుచున్న దని యును తెలియుచున్నది. కాఁబట్టి హిందూదేశీయుఁ డొక్కొ క్కఁడును ఆమెయెడ కృతజ్ఞుఁడై యుండవలసినదే ఆమెకును ఆమెసహచరులకును శాశ్వతముగా భగవదనుగ్రహముకలుగు నుగాక ఆయినను ఇది వేఱేవిషయము. గౌరవము, యోగ్యత, ప్రేమ ఇవికల్గియుండుట వేఱుసమాచారము. ఇతరులు చెప్పెడి దానినిగూర్చి ఆలోచింపకయు, అది యుక్తికి సంబంధించి యున్నదా లేదా యని విచారింపమియు మఱొకసంగతి.

నేను అమెరికాలోను ఇంగ్లండులోను కావించిన కొన్ని కార్యములకు దివ్యజ్ఞానసామాజికులే సహాయులై యుండిరని వినుచున్నాను ఆవార్త యెంతమాత్రమును నిజముకాదని ఖండితముగాఁ జెప్పుదును మేము ఉదారమైన అభిప్రాయము గలవార మనియును, మాకు విరుద్ధమైన అభిప్రాయముగలవారి యెడ కూడ మేము సహనముగలవారమై యుందుమనియును దంభోక్తు లాడువారలనెందఱనో చూచియున్నాఁడను వారు చెప్పునట్లు చేసిరేని మేలే అయినను, వారు చెప్పెడిదాని నంతయు నంగీకరించువఱకుమాత్రమే నేను వారికి ప్రీతిపాత్రమై యుందును ఏదేని యొక విషయమునుగూర్చి కొంచెము ఆక్షే పించినచో వెంటనే పగవాఁ డగుదును మఱికొందఱు ఇత రులు తమమతములోఁ జేరువఱకును చాల జాగ్రత్తగలవారై యున్నారు. తమ కార్యమునకు భంగము కల్గినచో వారికిఁగల కడుపుమంటయు ద్వేషమును జెప్పనైతిఁగాదు తర్వాత వారికి ఇట్టి కార్యము చేయవచ్చును ఇట్టి కార్యము చేయరా దనెడి తలంపే యుండదు హిందువులు తమ గృహములను పరిశుద్ధ ముగా నుంచికొని యుండిన పాదిరీలకుఁ జెడుగేమి? హిందు వులు తమ్ము తామే సంస్కరించుకొనఁ బ్రయత్నించిన బ్రహ్మ సమాజమువారికిని, తక్కిన సామాజికులకును కీడేమి? వీరంద ఱేల హిందువుల ప్రయత్నములకు భంగపాటొనర్పవలయును? వారిద్వేషబుద్ధిని అసూయను జూచిన, వారితోఁ బల్కుటకే సమ్మతముగాక యున్నది

ఇంకొకవిషయము—సంఘసంస్కారులపత్త్రికలలో నొక దానియందు— నేను శూద్రుఁడ ననియు, శూద్రునకు సన్న్యాసాధికారము లేదనియును వ్రాసి యుండఁగాఁ జదివినాఁడను. నేను శూద్రుఁడ నగుదునేని ఆపత్త్రికాధిపతి చండాలజాతివాఁడు కావలయును. ఒక్కొక బ్రాహ్మణుఁడును "యమాయ ధర్మరాజాయ చిత్రగుప్తాయవై నమః" అను మంత్రమును జెప్పి యెవ్వని పాదారవిందములకు నమస్కరించు చున్నాఁడో, వాఁడే మాయుత్తమక్షత్త్రియ వంశమునకు మూలపురుషుఁడు ఇతిహాస పురాణాదులు ప్రమాణగ్రంథను లగునేని, మా వంశస్థు లీదేశమునకుఁ గావించిన మహోపకారము లొకవైపున నుండ, వారు హిందూదేశములో సగము భాగమును చాల కాలము పాలించిరనియును, బంగాళా సంఘసంస్కారపరులు తెలిసికొందురుగాక. మాజాతిని లెక్కగొననిచో హిందూ దేశమునందు నాగరకజనసంఖ్య యెంతయుండును? ఒక్క బంగాళమునందు మాత్రము తత్త్వశాస్త్రసంపన్నులును, కవిశ్రేష్ఠులును, చరిత్రగ్రంథకర్తలును, పురాతనశాస్త్రపరిశోధకులును, మతప్రవర్తకులును మాజాతిలోనే కదా పుట్టినారు? తత్కాలశాస్త్రపండితులలో ప్రఖ్యాతినొందిన శ్రీజగదీశచంద్ర వసువు మాజాతివాఁడేకదా? నాజాతియా శూద్రజాతి! అట్లగునేని, యీపత్త్రికాధిపతి చండాలజాతివాఁడే యగును అతఁడు స్వచరిత్రమును, మొదటి మూఁడుజాతుల ధర్మములను తెలిసికొని యుండవలయును. బ్రహ్మక్షత్త్రియవైశ్యు లనుద్విజాతులకు

వేదాధ్యయనమునందును సన్న్యాసమునందును సమానాధికారముకలదని వీరికి తెలియదు కాఁబోలు!

ఈవిషయము లంతయు ప్రస్తావనకు వచ్చినందునఁ జెప్ప వలసివచ్చినది వారు నన్ను శూద్రుఁ డనినందులకు నాకు ఆయాసములేదు నాపూర్వులు బీదలయెడఁ గనఁబఱచిన క్రౌర్యమున కిది పరిహారమని తలంచుచున్నాఁడను అయినను, నేను చండాలజాతివాఁడగుదునేని మఱియుసంతోషమే.ఏలన, నాగురునాథుఁడు బ్రాహ్మణోత్తముఁడై యుండియు, అతఁడొక మాలవానిగృహమును శుద్ధిచేయుటకుఁ బ్రయత్నించిన మహానుభావుఁడు కదా? అయినను ఆమాలఁడు ఆలాగు చేయవలదని నిరాకరించినాఁడు. పిమ్మట నాగురూత్తముఁడు ఆమాలనికిఁ దెలియక వాని మలజలవిసర్జనప్రదేశమును ప్రతినిత్యమును శుద్ధిఁ జేయుచుండెను అతఁడు అందఱకును దాసానుదాసుఁడై యుండఁగోరి ఆలా గొనర్చెను అట్టి మహానుభావుని పదకమలములనుగదా నేను శిరంబునఁ దాల్చి యున్నాఁడను అతఁడే నాప్రభువు నాప్రభు వనుష్ఠించిన పద్ధతిని నేనవలంబింపఁగలను. ఇట్లు కపాహిందువైనవాఁడు మీకు మేలుచేయుటకు ప్రయత్నించుచున్నాఁడు హిందువులు ఈదేశపుపామరజనులసుపరదేశాచారములనుండి తొలఁగించి ఉద్ధరింతురు. గతించిన యిరువది సంవత్సరములుగా నీదేశమునందే వసించియుండునట్టి పశ్చిమఖండ నాగరకుఁ డొక్కఁడు, తన సొంతమిత్త్రుఁడొక్కఁడు పరదేశమునందు ప్రఖ్యాతిగా నున్నాఁడని విని సహింపక, వానివలన తన సంపాదనకు భంగము కల్గునేమో యని భావించి,ఆమిత్త్రున కన్న

పానాదులు లభింపక యుండుటకుఁ దగిన ప్రయత్నము చేయుచున్నాఁడు. ఇదియే పశ్చిమఖండ నాగరకమువలనఁ గల్గిన మహాఫలము వేఱొక మహాపురుషుఁడు స్వదేశములోని పరిశుద్ధమైన వైదిక హిందూమతము ఏరీతిగా నుపయోగింపఁబడుచున్నదనుటకు నిదర్శనముగా వెలయుచున్నాఁడు మన సంఘసంస్కర్తలలో నెవ్వఁడేని మాలవాని యింటిని పరిశుద్ధము చేయఁబూనునేని, అప్పుడే నేను వానికి లోఁబడి వాని యాజ్ఞాప్రకారము వర్తింతును. అంతవఱకు నేను వానిని లక్ష్యపెట్టువాఁడనుగాను. గంపెడు మాటలకంటెను పిడికెఁడుఅనుష్ఠానము శ్రేష్ఠము

ఇఁక, చెన్నపురి సంఘసంస్కరణసమాజమువారు నాయెడ మిక్కిలి ప్రేమ గనఁబఱచి యున్నారు బంగాళా సంఘసంస్కర్తలకును చెన్నపురి సంఘసంస్కర్తలకును చాల భేదము కలదనియు చెప్పఁగా వినియున్నాఁడను. చెన్నపురి రాజధాని సకల విషయములందును చక్కని స్థితిలో నున్నదని నేను పలుమఱు చెప్పఁగా మీరు వినియున్నారు కదా? బంగాళమునందు సంఘసంస్కరణమును దానిపై వైదికాభివృద్ధియుఁ గల్గి యొకదాని కొకటి సరిపడక పోరాడుచున్నవి అట్టిపోరాటము మద్రాసులో లేదు ఇచ్చట క్రమ క్రమముగా పెంపొందుచున్నది. కాఁబట్టి బంగాళము సంఘసంస్కర్తలకును మద్రాసు సంఘసంస్కర్తలకును భేద మున్నదని నేనంగీకరించెదను వారు నన్ను భయపెట్టి తమ మతములోఁ జేర్చుకొన నెంచిరి కాఁబోలు! అది సాగనిపని. పదునాలుగేండ్లుగా నేఁటి ఆహారమునకుఁ జింతింపక, రేపటిదిన మెట్లు కడచునని విచారింపక, ఈదిన మెచ్చోటనుం

దుము, తేపటికే చోటనివసింతుము. అనువిషయమును గమ నింపక తిరుగువానిని అంతసులభముగా భయపెట్టుటకుసాధ్య మగునా? కౌపీనధారియై అత్యంతశీతలప్రదేశమున సంచరిం చినవానిని హిందూదేశమున సులువుగా నేమరించుట కగునా? కావున నేను వారి కిట్లని చెప్పెదను—నాకొక సంకల్ప మున్నది నాకును కొంచెము అనుభవమున్నది. లోకులకు నేం జెప్పవలసిన సందేశమొకటి యున్నది దానిని ధైర్యముతోను రాఁగలదానిని ఆలోచింపకయుఁ జెప్పెదను వారు ఇచ్చట కొం దఱను అచ్చట కొందఱను సంస్కరింపఁజూచెదరు నేను ప్రపం చమునంతయు సంస్కరింపవలయును ననెదను వారుఉన్న దానిని నశింపఁజూచెదరు నేను ఉన్నదాని నుంచుకొనియే దానిమీద కట్టడము కట్టవలయు నందును పైసంస్కారములయందునాకు నమ్మకమే లేదు. అభివృద్ధియందు నాకు నమ్మకము గలదు; నేనొక దేవునివలె సంఘమును "మీరీమార్గమునఁ జనుఁడు; ఆమార్గ మునఁ గా" దని యాజ్ఞాపించువాఁడను గాను శ్రీరాముఁడు సేతువుఁ గట్టినపుడు తానిసుకలో నొర్లివచ్చి శరీరమునం దంటు కొనిన రజోలేశము నిచ్చినయుడుత రీతిగా నాచేతనైన యల్ప కార్యమును నేను జేయుదును, ఇది నాస్థితి. ఈయుద్భుతమయిన సంఘము యంత్రమువలె యుగములవారికిఁ బనిచేసినది అట్టి సంఘపు జీవశక్తి మనయందుఁ బ్రవహించుచున్నది దాని మంచిచెడ్డలను జెప్ప నెవరు సాహసింతురు? అది యెట్లుసాగునో యెవ్వరు చెప్పఁగలరు? స్థితిగతు లనేకముగా మాఱును దానికి నవీనప్రమాణములు తగిలి యొకప్పుడు చుఱుకు నొకప్పుడు

మాంద్యమును బుట్టించును దాని మార్గము నెవ్వరడ్డు పెట్టఁగలరు సంతృప్తులమై పనిచేయుట మనపని కావలసిన యుపకరణములను సమకూర్చుట మనపని వృద్ధిచెందుట దానిపని. దానినీవిధమున వృద్ధిఁజెందుమని యెవ్వరు నాజ్ఞాపింపఁజాలరు. మన సంఘమందుఁ బెక్కుచెడుగులుగలవు ఇతరసంఘములయందును గలవు. మనదేశ మొక్కొక్కప్పు డనాథయువతుల కన్నీటిచే సిక్తమగుచున్నది పశ్చిమమున నవివాహితలగుయువతులనిట్టూర్పులచే వాయుమండలము విషపూరిత మగుచున్నది ఇచ్చటఁ బేదఱికము సంఘమునకు వేరువిత్తయి బాధించుచున్నది అచ్చట భోగాసక్తతచే జీవనమునందుఁ గలిగినవిసుగుదల సంఘమునకు బాధాకరమైయున్నది ఇక్కడ మనుజులకుఁ దినుటకన్నములేక ఆత్మహత్యను జేసికొనుచున్నారు అక్కడివారికి తిండి యెక్కుడగుటచేతజీవహత్య చేసికొనుచున్నారు పక్షపాతమువలెదోషమంతటనుగలదుపాదమునుండిదానినిదఱిమివేసినఁదలకెక్కును అక్కడనుండి పాఱఁదోలిన మఱియొకచోటికిఁ బోవును ఈరీతి నొకచోటినుండి మఱియొకచోటికిఁ బంపుటచే ప్రయోజనము లేదు కావున, రోగము నిదానించుమార్గమును మనము చూడవలెను. మేలు కీడుఁనునవి యొకేపదార్థముయొక్క పూర్వాపరభాగము లని మనశాస్త్రము చెప్పుచున్నది ఒకటి యున్నపుడు రెండవది యుండుట విధాయకమే. సముద్రమందొకతరంగము బయలువెడలిన దానికిఁ బ్రతితరంగముమఱియొక చోటఁ గలుగవలసినదే. జీవనమే దుఃఖపూరితము. మఱియొక జీవికి హానిచేయకుండ మనమూపిరి విడువనైనఁ జాలము. ఒక

పట్టెడు ఆహారముఁ దింటిమా యంతయాహార మింకొకనికి లేకుండ జేసితిమనవలయును ఇది జీవశాసనము ఇదియే తత్త్వము కాఁబట్టి చేయవలసినపని యంతయు బాహ్యము కాదనియు నాత్మసంబంధమైనదనియుఁ దెలిసికొనుటయే మనకర్తవ్యము. మన మెంత పెద్దమాటలు చెప్పినను మనము చేయునది విద్యాసాధనము గాని కార్యసాధనము కాదనియు దోషాపనోదనమునకై మనము చేయు ప్రయత్నములన్నిటియందును దెలిసియుండవలసిన ముఖ్యప్రయోజన మిది; దీనివలన మనకు శాంతము కలిగి మతద్వేషమును విడువవలెను లోకచారిత్రములవలనఁ గార్పణ్యము చేఁ జేసినసంస్కారము లన్నియు నష్టమైపోయినట్లు మనకుఁ దెలియుచున్నది. అమెరికాయందు బానిసతనము నశింపఁజేసి ప్రజలకు న్యాయమును స్వేచ్ఛయుఁ గలిగించుటకు జరిగిన ఘోరయుద్ధమునకన్న ఘనతరమైన లోకోపకారమగు కార్యము మఱియేదియును లేదు దానిసంగతి మీ రందఱెఱింగినదే దాననెట్టిఫలము గలిగినది? ఆబానిసలు మునుపటికంటె నూఱురెట్లధికదుఃఖము నొందుచున్నారు. ఇందులకుఁ బూర్వ మీ నీగ్రోబానిసలకుం దెవ్వరికయిన స్వామ్య ముండెడిది. వారు తమయితరాస్తితోఁ బాటు వీరినిఁగూడ క్షీణింపకుండఁ గాపాడుకొనుచు వచ్చిరి ఇపుడు వీండ్రెవ్వరిసొత్తును గారు వారిజీవనములు వ్యర్థములు ఎందునకునుమాలిన ఏదో సాకుఁ గల్పించి ప్రాణములతోడనే చితిపేర్చి దహించుచున్నారు గుఱి పెట్టి కాల్చుచున్నారు. వారినిఁ జంపిన వారికి శాసనము లేదు. ఏమి? ఆబానిసలు సిద్దీలు. వారు జంతు

పులకంబెను నీచులు. మనుష్యులే కారు. బలవంతముగాను గార్వణ్యము చేతను జేసిన దోషాపనోదనమునకు ఫల మిది మేలుచేయుట కైనను గార్వణ్యముతోఁ బ్రయత్నించుట కూడ దని యీ రీతిగాఁ జరిత్రము వక్కాణించుచున్నది అది నేను జూచినాఁడను నాయనుభవమువలన నాకిది బోధపడినది. కావున, ఈదూషకసమాజములయందుఁ జేరఁజాలను ఏల దూషింపవలెను?. ప్రతిసంఘమందును దోషములు గలవు. అది యెల్లరకుఁ దెలియును బ్రతిబాలుఁడును దీని నెఱుఁగును. వ్యాసపీఠము మీఁదనిల్చి హిందూసంఘమునందలి దోషములను గూర్చి వ్యాసములుకూడ నీయఁగలరు. దేశద్రిమ్మరు లందఱును దమదారింబోవుచు మార్గమధ్యమున ధూమశకటములమీఁద నుండి హిందూదేశమును జూచిన ప్రతిమూర్ఖుఁడును దాని యందలి దోషములను గూర్చి యుపన్యాసము లిచ్చుటకు సిద్ధపడును అదినిజమే; దోషములను బ్రతివాఁడును జూపఁగలఁడు కాని, ఆదోషములకుఁ బరిహారము చెప్పుటమాత్రము కష్టము ఒకపిల్లవాఁడు సముద్రమునందుఁబడికొట్టుకొనిపోవుచుండఁగా నొడ్డునుండి తత్త్వమును బోధించు తత్త్వవేత్తతో నాబాలుఁడు 'ముందు నన్నొడ్డునకుఁ దీసి తర్వాత నీయుపన్యాసముం గావింపు'మని చెప్పినరీతిగా మనదేశస్థు లెప్పుడు "మా కుపన్యాసము లింకజాలును. సమాజములు చాలును వార్తాపత్రికలు చాలును, ఇవియన్నియుఁ గావలసినన్ని యున్నవి కాని మాయందు నిజమయిన ప్రేమ గలపురుషుఁడేఁడి? మాయందుఁ గనికరముగలవాఁడెవ్వఁడు? అట్టివాఁడు కావలెను" అందురు.

ఈసంస్కారులతో నేకీభవింపని విషయ మిది, వారునూతేండ్ల నుండి పనిచేయుచున్నారు, వారనేకదూషణగ్రంథములను సృష్టించిరేకాని యంతకంటెఁ బ్రయోజనమేమి కలిగినది? అట్టి గ్రంథములు లేకుండఁబోవుఁగాక! చెలఁరేగి మతస్థుల నంద ఱను దిట్టితిట్టి విసిగించి వారు తుదకెదురు తిరిగి దూషించు వఱకును బాధించిరి, ఇందులకు ఫలితముగా దేశభాష లన్నిటి యందు దూషణగ్రంథములు కావలసినన్ని బయలుదేఱినవి. ఆగ్రంథములను జూచిన మన మందఱమును సిగ్గుపడవలసి యున్నది. ఇదియా సంస్కారము? ఇదియా సంఘమునకు ఖ్యాతిఁ దెచ్చుమార్గము' ఇది యెవ్వరితప్పు?

ఇంకొక గొప్పవిషయమును మన మాలోచింపవలసియు న్నది ఇచ్చట మనదేశమందు మనలను రాజులు పాలించు చున్నారు వారు మనకు శాసనముల నేర్పఱచినారు ఇపుడా ప్ర భువులు గతించినారు వారిస్థానమున కెవ్వరు వచ్చియుండలేదు ఇప్పటి దొరతనమువారికి సాహసము చాలదు. వారు జనసా మాన్యముయొక్క యభిప్రాయమునుబట్టి పద్ధతులను మార్చు కొనువారై యున్నారు అట్టి క్షేమకరమును బలవత్తరమునగు జనాభిప్రాయ మేర్పడువఱకుఁజాలకాలము పట్టును. ఈమధ్యకా లమంతయు మనము వేచియుండవలెను సంస్కారమంతయు శాక్కవిషయమునకుఁదేలుచున్నది ఎవరికి సంస్కారము కావ లెను! అట్టిసంస్కారమును కావలసినవారినిగాముందు చేయుఁడు. అట్టివారెక్కడఁ గలరు? కొద్దిమంది పెట్టుబాధ లోకమం దధమ మైనది. ఎవ్వరో పదిమంది కలిసి లోకమందు దోషమున్న దని

నంతమాత్రముచేత లోకమంతయుఁ గదలఁజాలదు ఎందుచేతఁ గదలదు? ముందు వారికి విద్యనిచ్చి శాసననిర్మాణసంఘమునేర్పఱచిన శాసనములు తమంతటఁ గలుగును మొదట శాసనములను నిర్మింపఁగలశక్తిని గలుగఁజేయవలెను ప్రభువులు గతించిరి. ప్రజలకు శక్తిలేదు దానిని గలిగింప వలెను కాఁబట్టి సంఘసంస్కారమునకైనను ముందు విద్య కావలయును అంతవఱకును వేచియుండవలెను ఇదివరలో బయలుదేఱినసంస్కారములన్నియునలంకారార్థమే. ఈసంస్కారములు మొదటి రెండువర్ణములకు మాత్రమే సంబంధించియున్నవి కాని,తక్కినవానిని స్పృశింపలేదు విధవావివాహసంస్కారము హిందూసంఘములో నూటికితొంబదియుందికి అక్కరలేదు అట్టిప్రసంగములన్నియు మొదటివర్ణములకుమాత్రమే సంబంధించి తక్కినజనసామాన్యమును దృఢించుచున్నది వీరెల్లకాలముఁ దమగృహములను శుభ్రముగాను జక్కఁగానుంచుకొని పరులదృష్టికి రమణీయముగాఁ గనపడునట్లు చేసికొనిరి అది సంస్కారము కాదు. మనము విషయములయొక్క మూలమునకుఁ బోవలయును. ఆమూలసంస్కారమునిన నాయభిప్రాయమిది జ్ఞానాగ్ని కింధనము సమకూర్చి ప్రజ్వలింపఁజేసి హిందూసంఘమును నిర్మింపుఁడు అదియెంత సుకరము కాదు. అది యెంతేఘనమైన విషయము! తొందరపడవలదు నామాటలు వినుండు ఈవిషయమునే వందసంవత్సరములనుండి యోజిగియున్నది

నేఁడు దక్షిణమునందు ముఖ్యముగా బౌద్ధమతమును గూర్చియు దానిసంశయవాదమునుగూర్చియు ముచ్చటించువా

డుకకలదు. మనఈక్షీణదశకుబౌద్ధమతము కారణమని వారులేశ మునెఱుంగరు. ఆమతము చేసిన మహోపకారముమనకిది. తన్మత వ్యాపకనమునకుఁ గారణ మందలియత్యద్భుతమైన నీతియును బుద్ధుని పౌరుష ప్రభావముననియామతముయొక్క యౌన్నత్య మునకును క్షీణతకునుగారణము నెఱుంగని వారు వ్రాసిన గ్రంథ ములయందు మనముచదువుచున్నారము. నాకు బుద్ధునియందు విశేషగౌరవమును ప్రపత్తియుఁగలదు గాని, బౌద్ధమతవ్యాప్తి కిఁ గారణము బుద్ధుని ప్రభావమును, ఆమతమందలి ఆసిద్ధాంత ములుగావు వారుకట్టించిన దేవాలయములును, బ్రతిష్ఠించిన విగ్రహములును జేసినగొప్పగొప్పకర్మలును గారణములు, ఈ మత మీరీతిగా వృద్ధి చెందినది మనహోమద్రవ్యము లన్నియు నాహుతిఁజేసెడుకుండ మత్యల్పమయినదగుట చేతనీగొప్పగొప్ప యాలయాదులముందఱ నెందుసకును గొఱగాక క్రమముగా నన్నియునశించినవి అవియన్నియుఁ దుదకొకతుచ్ఛసముదాయ ముగా నేర్పడినవి అద్దానిని మీతోఁ జెప్పుటకైనను వ్రీడా కరముగా నున్నవి. తెలియఁగోరువారు దేవాలయమునను దక్షిణదేశమునకుఁ బోయి చూచినఁదెలియును బౌద్ధమతము మనకొసఁగిన సర్వస్వమునిది పిమ్మట శంకరాచార్యాది సంస్కా రులు బయలుదేఱినది మొద లిప్పటివఱకు నెమ్మదిగా మరల వేదాంతమతము నెప్పటిస్థితికిఁ దెచ్చుటకై ప్రయత్నము జరగు చున్నది వారు దేశమునందలి దురాచారముల నెఱిఁగి యుండి యును దూషింపలేదు "మీకున్న దంతయుఁదప్పు దానిని దానిని బారవేయుఁ" డని వారు చెప్పలేదు డాక్టరు బారోసు

దొరగారు క్రీస్తుమతము 300 యేండ్లలోపున రోమను గ్రీసు మతముల ప్రభావము నణంచివేసినదని వ్రాసియున్నారు. అది యూరపును గ్రీసుదేశమును రోమును జూచినవాఁడు వ్రాయు వ్రాతఁ కాదు. ఆయామతముల ప్రచార మింకను బూర్తిగా నున్నది. ప్రతిశాఖయందును దుదకు విరుద్ధవాదులయందును గూడ నందుఁ బేరులు మాఱినవి కాని మునుపటి దేవతలనే యిప్పుడును గొలుచుచున్నారు దేవకోటియంతయు మేరీలయి దేవతలందఱును మునులైరి కర్మలు మాఱినవి తుదకుఁ బూర్వపుకర్మ కూడ నిప్పుడునున్నది కనుక సంపూర్ణమైన మార్పు లుండఁజాలవు అదిసుకరముగా దనుసంగతి శంకరాచార్యు లెఱుఁగుదురు రామానుజాచార్యులు నెఱుఁగుదురు వారికిఁ గల యింకొకమార్గము క్రమముగా జనసామాన్యమును మన మతముయొక్క పరమార్థమునకుఁ గొనివచ్చుటయే. వారు రెండవమార్గమునఁ బడినయెడలఁ గుత్సితులేయగుదురు వేమన వారిమతమే పరిణామమతము అందుల కాత్మ క్రమక్రమముగా నీమెట్లన్నియు నెక్కి తుదకుఁ బరమార్థమును సాధింపవలెను ఇందులకీ మెట్లన్నియు నవసరమే వాని నెవ్వరు ఖండింపఁగలరు?

ప్రతిమారాధనము తప్పని ప్రతివారును నిప్పటి దినములలో సంశయింపకుండఁ జెప్పుచున్నారు నేను నొకప్పు డట్లే యనుకొంటిని ఈ ప్రతిమారాధనమువలనఁ బరమార్థమును సాధించిన మహాపురుషుని పాదసేవ నాకు లభించుటవలన నట్లనుకొనినందులకుఁ దగిన ప్రాయశ్చిత్తము నాకు కలిగినది అట్టి

పురుషుఁడు రామకృష్ణపరమహంసులు. హిందువులారా! ప్రతిమారాధనమువలన రామకృష్ణ పరమహంసులవంటివారు కలుగునెడల మీకు ప్రతిమారాధనము కావలయునా? సంస్కారము కావలయునా ? నాకు బదులు చెప్పుఁడు ఇంకను వేయిప్రతిమలను గ్రహింపుఁడు దానిమూలముగా రామకృష్ణపరమహంసులను గలిగింపుఁడు మీకు దైవము తోడ్పడుఁగాక ; ఏవిధమున నయిన నిట్టి ఘనులఁ గలిగింపుఁడు అట్టి విగ్రహారాధనమును నిందింతురా ? ఏల ? కొన్నివందలయేండ్ల క్రిందట నొక యూఁదుఁడు దాని నిందించునట్లు తటస్థించుట గాని మఱియొక కారణముగాని కనఁబడదు. అతఁడు తనను దనవిగ్రహమును గాక తక్కినవారివిగ్రహములను ఖండించెను. భగవంతునికి మన మేదేని రూపమును గల్పించుట ఘోరకృత్యమనియు నాతఁడు తెల్పెను గాని అతఁడు దేవుని నొక్క పెట్టె కిరుప్రక్కలను జెఱి యొక దేవదూతను నిలిపి పైన నొక మేఘము వ్రాలునట్లు నిర్మించిన యెడల నది పావనాతిపావనకృత్యమని తలంచినాఁడు భగవంతుఁడు పావురపురూపమున వచ్చిన నది పవిత్రమఁట! గోరూపమున వచ్చినయెడల నది మౌఢ్యమని నిందించెదరు లోకవర్తన మీరీతినున్నది అందుచేత నొకకవి "హా మన మెంత మూర్ఖులము" అని రచియించి యున్నాఁడు అందుచేతనే మన మొకరినొకరు న్యాయదృష్టితోఁ జూచుకొనుట కష్టముగా నున్నది అదియే మానవకోటికిఁ గొదవగా నున్నది అదియే ద్వేషములకును గలహములకును బోరాటములకును మూలము. చెన్నపురిరైన దాఁటి యొకఁగళ యనేక వేల

సంవత్సరములనుండి వచ్చినగాథలు మున్నూరుకోట్ల ప్రజలకు
ధర్మసూత్రములను జెప్ప సిద్ధపడు నూనూఁగుమీసముల బాల
కులారా! మీకు సిగ్గులేదా? ఇట్టి అకృత్యమును మాని మీ
పాతములనుజూచుకొనుఁడు గౌరవహీనులయిన మీరు కొన్ని
పంక్తులు కాగితముమీఁద గిలుకుటకు శక్తిగలిగి యెవరో
యొకమూఢుఁడు దానిం బ్రచురించుటకు దొరకఁగానే ప్రపం
చమునకు మీరు గురువులై మార్గదర్శులు కాఁజూచుచున్నారు
గదా? నాకుఁ జెన్నపురి సంస్కారులయందుఁ గౌరవప్రప
త్తులు చాలగలవు. వారి దయాహృదయములకును దేశాభి
మానమునకును దరిద్రులయందలి కనికరమునకును నాకు వారి
యెడలఁ జాలగౌరవము కలదు కాని, వారిపద్ధతులు సరిగావని
సోదరభావముతోఁ జెప్పుచున్నాను నూటేండ్లనుండి యుండియు
నామార్గము కార్యకారి కాలేదు కాఁబట్టి యిఁక నుఁజేయొక
పద్ధతిని బ్రయత్నింతము అది చాలును హిందూదేశమునం
దెన్నఁడైన సంస్కారులకుఁ గఱవా! మీరు హిందూదేశ
చరిత్రమును జదివితిరా? రామానుజులెవరు? శంకరులెవరు?
మధ్వాచార్యులెవరు? నానక్ ఎవ్వరు' చైతన్యులెవ్వరు? కబీ
రెవ్వరు? దాదు ఎవ్వరు? ఈతేజోవంతులగు పురుషరత్నము
లందఱెవ్వరు? రామానుజులు హీనజాతులవారికొఱకు వగవ
లేదా? చండాలునిసయితముఁ దనకూటమునందు జేర్చు
కొనుట కాయన ప్రయత్నింపలేదా? మ్లేచ్ఛులను దనమత
మందుఁ జేర్చుకొనలేదా! నానకు హిందువులతోడను మహమ్మ
దీయులతోడను సంబంధము గలుపుటకు యత్నింపలేదా! వారం

దలును యత్నించిరి. దాని ప్రభావ మిప్పటికిని బనిచేయుచున్నది. భేద మొక్కటికలదు వారికిప్పటివారివలె దంభమును దూషణోక్తులును లేవు వా రెన్నఁడును దూషించి యెఱుఁగరు సంఘము వృద్ధి కావలె నని ప్రజలకు "మన మిదివరకుఁ జేసినది మంచిదే. ఇంకను సత్కార్యములను జేయుద"మని చెప్పుచు వచ్చిరి "మీరు దుర్మార్గులుగ నున్నారు; సన్మార్గులు కండు" అని చెప్పలేదు. అయినను, "మీరు ఉత్తములై యున్నారు ఇంకను ఉత్తమోత్తములు కండు" అని చెప్పుచుండిరి ఇట్లనుటచే నెంత యభివృద్ధి కాకర మగుచున్నదో చూడుఁడు! మన స్వభావమునకుఁ దగినట్లేకదా వృద్ధినొందవలయును. పశ్చిమఖండ వాసులు, మన మనుష్ఠించునట్లొనర్చి యుండు ఆచారములను గూర్చి ప్రశంసించి ప్రయోజనము లేదు వారి యాచారములు మన కలవడుట సాధ్యము కానిపని అసాధ్యమని తెలిసియు వారు మరలమరల ప్రయత్నించుచున్నారుగాని, యీశ్వరానుగ్రహముచే నాయాచారములు మనకు పట్టుపడుటలేదు విదేశీయుల ఆచారానుష్ఠానములను నేను దూషింపలేదు అవి వారికే తగినవి మనకుఁగాదు వారికి అమృతముగానుండునవి మనకు విషముగా నుండవచ్చును ఈవిషయమును మాత్రము మనము చక్కఁగా నేర్పుకొనవలయును వారికిఁగల శాస్త్రములు, స్థాపనములు, పెద్దల యాచారములు, మొదలగునవి వారియొక్క తత్కాలనాగరతకుఁ దగినట్లున్నవి అట్లే మనము కూడ మనపూర్వుల యాచారములననుసరించియును, వేలకొలఁది సంవత్సరములుగా వచ్చెడి కర్మఫలము ననుసరించి

యును వర్తించుచున్నాము ఎల్లకాలమును మనము మన పూర్వాచారముల ననుసరింపవలసినవారమే పెద్దలపద్ధతిని మీఱరాదని నాయభిప్రాయము, మనపూర్వుల కార్యము లన్నియుచాల శ్రేష్ఠములైనవి వారుశక్తియు,పారిశుద్ధ్యమును, జీవకళయు మనకొసంగినవారు మన మందఱమును మనపూర్వులవంటి యద్భుత కార్యములను జేయవలయును ప్రకృతము కాలస్థితి మాఱియున్నది మనము దానికిఁ దగినట్లు కొన్నిపద్ధతు లనుమార్చుకొనవలయును. అయినను ఒక్కొకజాతికిని ఒక్కొక ప్రధానపురుషార్థ ముండునట్లు తెలియుచున్నది ఇంగ్లండు మొదలగు శీతలదేశమునందు రాజ్యతంత్రమే ప్రధానపురుషార్థము, హిందూదేశమునందు మాత్రము మోక్షమే ప్రధాన పురుషార్థము. వీరి కిదే జీవము, దీని నెవ్వరేని హింసింపఁ బ్రయత్నింతురేని, మనజాతివారు నశించిపోదురు కాఁబట్టి మీరు మీకు జీవనీయమగు మతసిద్ధాంతమును త్యజించి,పరదేశీయుల యొక్క రాజ్యతంత్రము మొదలగువానిని అవలంబింతురేని మీరు ఈలోకమునందే నశింతురు అట్టిస్థితి రానీయకయు, మతపద్ధతుల నతిక్రమింపకయు వర్తింప వలయును ఇందువల ననే మనకు వలయుఫలముసిద్ధించును అమెరికాలో హిందూ మతప్రసంగము చేయవలసినచో, దానివలన వారికి ప్రపంచ సౌఖ్య మిట్టిది చేకూఱునని చెప్పవలయును అట్లు చెప్పనిచో నచ్చోట ప్రసంగము చేయుటకు సాధ్యము కానేరదు ఇంగ్లాండులో వేదాంతోపన్యాసముచేయుటకుఁ బ్రయత్నించిన, దాని వలన సంఘసంస్కరణమునం దిట్టిమార్పు కల్గుననియును, ఈవిధ

మైన రాజ్యవ్యవస్థ సిద్ధించుననియును జెప్పవలయును. అట్లే ఇండియాయందు సంఘసంస్కారమును రాజ్యతంత్రమును బోధింపవలసినయెడల, వానివలనఁ గల్గుమోక్షసాధన మిట్టి దని నిరూపింప వలయును ఒక్కొకనికెట్లు ఒక్కొక యభిమత ముండునట్లు ఒక్కొకజాతికిని ఒక్కొకఅభిమతము కలదు మన యభిమత మిట్టిదని వేలకొలఁదిసంవత్సరములకుపూర్వమే మన మేర్పఱచుకొనియున్నారము గాన, ఆప్రకారమే మనమువర్తింప వలయును. అట్లు వర్తించుటవలన మన కేవిధమైన చెడుగును లేదు జడమును నిగ్రహించి చిత్తును గ్రహించుటవలనను, మనుజుని నిగ్రహించి ఈశ్వరుని గ్రహించుటవలనను చెడు గేమి? పరలోకమందు తీవ్రమైన శ్రద్ధయును, ఇహలోకమందు తీవ్రమైన ద్వేషమును, దృఢమగువైరాగ్యశక్తియును, ఊర్జితమైన యీశ్వరభక్తియును, నిత్యమైనఆత్మవస్తువునందుస్థిరమైనవమ్మకమును, మీమనస్సులందు నెలకొని యున్నవి వీనినిత్యజించుట కెవ్వ రంగీకరింతురు మీచేతఁగాదని నేనుశపథము చేయుచున్నాను. కొన్నాళ్లు నాతో మీరు నాస్తికవాదము చేయుదురుగాని, వాస్తవముగ మీరు నాస్తికులు కారని నాకుఁ దెలియును మీతలపై నేను చేయినుంచినను జూడుఁడు వెంటనే మీరు ఆస్తికులగుదురు మీస్వభావమును మార్చికొనుటకు మీచే నెట్లు సాధ్యమగును? అదే మీసిజస్వభావము కాఁబట్టి ఇండియాలో నేవిధమైన సంస్కారము చేయవలసి యున్నప్పటికిని మతవిషయమును మొదట చక్కఁజేయవలయును ఇండియాయందు సంఘసంస్కరణవిషయముగాఁగాని, రాజ్యతంత్ర విషయముగాఁగాని

ఆందోళనము చేయఁ దలపెట్టుటకు పూర్వము మతవిషయమైన యాందోళనమును ముందుగాఁ జేయుఁడు దీనినే మొదట చేయవలసినది మన వేదశాస్త్రపురాణేతిహాసములలోని తత్త్వములు గ్రంథములయందేగాక, మఠములందును, ఆశ్రమముల యందును, గురువులయందును, గురుపీఠమునకుఁ దగిన జాతుల యందును, మనుష్యులయందునుమఱుఁగువడియున్నవి కావున, వానిని ఆయా స్థలములయం దుండి గ్రహింపవలయును. ఇట్లు చేసిన ఆతత్త్వములు ఆసేతుహిమాలయపర్యంతము వ్యాపించును ఇవి ప్రతిమనుజునకును దెలిసి యుండవలయును. ఏలన, "శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" "దానిని విని చింతించి యెఱుంగవలయును" అని చెప్పఁబడి యుండుటం బట్టి మనుజులు దీనినే మొదట శ్రవణము చేయవలయును ఎవ్వరు ప్రజలను వేదశాస్త్రములలోని తత్త్వములను శ్రవణము చేయునట్లు ప్రేరేపింతురో అట్టివారి సత్కర్మమునకు సాటివె త్తిద్దియు లేదు వ్యాసులు—"ఈకలియుగములో మిగిలియుండు నది దానమొక్కటియే అందు బ్రహ్మవిద్యాదానము మొదటిది. రెండవది లౌకికవిద్యాదానము మూఁడవది ప్రాణదానము నాలవది అన్నదానము" కావున చాలబీదదేశమగు మనదేశమునందు అనేకదానములు చేయఁబడుచున్నవి ఈదేశమునందు మాత్రమే యెచ్చటఁజూచినను అన్నసత్రములు గలవు ఏబిచ్చగాఁడును పస్తుపడియుండనిదేశము హిందూదేశ మొక్కటియే

ఇట్టి ధర్మదేశమునందు మొదటి రెండుదానములను జేయుటకుఁ బ్రయత్నము చేయుదము. మొదట బ్రహ్మవిద్యను వ్యాపింపఁ జేయుదము. అదియు నీయొక్క దేశమునందు మాత్రము వ్యాపింపఁజేసినచాలదు ప్రపంచమంతట వ్యాపింపఁ జేయవలయును ఇది మనపూర్వులపద్ధతి హిందూశాస్త్రజ్ఞానము ఎప్పుడును విదేశమునకుఁ బోయినది లేదనియును, నేనొక్కఁడనే విదేశమునకుఁబోయి మొదటమొదట ప్రసంగించినవాఁడననియును కొందఱు చెప్పెదరు అట్టివారు తమవంశచరిత్రము నెఱుంగనివారు ఆవశ్యకమైనప్పుడంతయు మన బ్రహ్మజ్ఞానప్రవాహము అన్యదేశములందు ప్రవహించి యున్నది రాజ్యతంత్రజ్ఞానమును భేరినినాదముతోను వీరభటులయుద్ఘోషముతోనుకలుగఁ జేయవచ్చును లౌకికజ్ఞానమును సంఘసంస్కరణజ్ఞానమును నిప్పును కత్తిని గొని నిర్బంధముగా బోధింపవచ్చును ఆత్మజ్ఞానమును సావధానముగను నిదానముగను ఉపదేశింపవలయును. ఎవరికంటికిఁ గనఁబడకయు ఎవరిచెవికి వినఁబడకయు రోజాపుష్పమును పుష్పింపఁజేయు మంచు నీటిబిందువువంటిది బ్రహ్మవిద్యాప్రభావము ఇదే హిందూదేశము అప్పుడప్పుడు లోకుల కొసంగుదానము ఒక గొప్పజాతివారు జయశీలురై లోకమంతట వ్యాపించి, లోకమునందలి యితరులగు గొప్ప జాతివారినిఁ దమలోఁ జేర్చికొని, బాటలను రాకపోకలకు సాధనములను మిక్కుటముగాఁ గావించుకొను కాలమందు హిందూదేశము మేల్కని లేచి లోకోద్ధారము కొఱకు

తన బ్రహ్మవిద్యను బోధించును. ఈ యలవాటు బుద్ధావతార కాలమునకు పూర్వమునుండియు కలదు దీని చిహ్నములు చీనాలోను, చిన్న యేష్యాలోను, మలయద్వీపములమధ్యయం దును గనఁబడుచున్నవి నాగరకమని ప్రకృతము పెరిమగాఁ జెప్పఁబోనుచుండునవి యన్నియు బ్రహ్మవిద్యాప్రవాహములోని యొకనీటిబుగ్గకు సమానముకావు అట్టి సమయ మిప్పుడు సంభవించియున్నది. ఆంగ్లేయ రాజ్య పాలనమువలన లోకము లోని సకలజాతులును ఎప్పుడునులేని ఐకమత్యమునుబడసియు న్నారు ప్రపంచమంతట సంచరించుటకుఁ దగిన మార్గములను సాధనములనుఆంగ్లేయు లేర్పఱచియున్నారు ఆంగ్లేయుల సామ ర్థ్యముచేత ప్రపంచమునంతయు నొక్కటిగాఁ జేసి యున్నారు. కాఁబట్టి, హిందువులు తమ అధ్యాత్మజ్ఞానమును తెలిసినంత వఱకు విదేశములకుఁజని ప్రకటనము చేయుచున్నారు హిందూ వేదాంతజ్ఞానము ప్రపంచమంతయు వ్యాపించు వఱకును హిందువులు పోయి ప్రకటించు చుండవలయును నే నురికా దేశమునకుఁ జనినకార్యము నాదియుఁగాదు, మీాదియుఁగాదు. హిందూదేశముయొక్క యోగక్షేమములనువిచారించెడి భగ వంతుఁడు నన్ను నునావంటి వేలకొలఁది జనులను లోకములోని సకలజాతుల యొద్దకును బంపఁగలఁడు కావున, మీారు వేదాం తమును బోధించుటకొఱకు విదేశములకుఁబోండు ఇది మీారు చేయవలసిన కార్యము మీారు అధ్యాత్మజ్ఞానప్రవచనము చేసినతరావత, మీాకు లౌకికజ్ఞానమును, ఇంకను వలయు నితర

జ్ఞానమును తనంతట కల్గును. మీరు మతభక్తి లేక, లౌకికజ్ఞానమును మాత్రము గోరుదురేని, మీ ప్రయత్న మీ దేశములో నిరుపయోగ మగును ఇట్టి కారణముచేతనే మనదేశములో బౌద్ధుల ప్రయత్నము పాడై పోయెను. కాఁబట్టి ఓసోదరులారా! మన దేశములోని బాలురను మతవిద్యాధికులనుగా నొనర్చి, మన దేశమునందును అన్యదేశములందును వారినిఁ బంపి వేదాంతతత్త్వముల నుపదేశించునట్లును, తన్నిమిత్తమై మన దేశమునందు మతవిద్యాపాఠశాలల నేర్పఱచవలయుననినాయభిప్రాయము ఈ కార్యముసఫల మయ్యెనేని సర్వకార్యములును సిద్ధియగును. దీనిని సాధించుటకు శక్తియు యోగ్యతయు, ఉత్సాహమును గల బాలురే తగినవారు. ఇట్టివారు నూఱుగు రున్నఁజాలును ఈప్రపంచమును తలక్రిందుగాఁ జేయవచ్చును. మనస్సంకల్పము సకలసంకల్పములకంటెను శ్రేష్ఠమైనది అసంకల్పమునకు సమస్తమును లోఁబడినది ఏలన, ఇదియె భగవత్సంకల్పము ఈపరిశుద్ధమైన శక్తివంతమగుసంకల్పము సర్వశక్తి కలది యగును ఈవిషయమునందు మీకు నమ్మకము లేదా? మీ మేలైన మతతత్త్వములను ప్రవచనము చేయుఁడు లోకము దానికై కాచియున్నది నూర్లకొలఁది సంవత్సరములుగా లోకులు నీచపద్ధతికి లోఁబడి యున్నారు వారుఏవిధమైన అధికారమును శాధ్యతయును లేదని బోధింపఁబడి యున్నారు. లోకములోని పామరజనులనుజూచి, "మీరు మనుజులే కారు" అని చెప్పియున్నారు. ఇట్లు చాలదినములనుండి వారిని భయ పెట్టి యున్నారు. తుదకు వారు మృగప్రాయులై పోయిరి

ఆత్మ విషయమును శ్రవణము జేయుటకు నీచజాతి వారికి మనవా రెంతయు అవకాశమీయలేదు కావున ఇప్పుడు వారినిఆత్మ విష యమును వినునట్లు కావింపుఁడు చావనిదియును పుట్టనిదియును కత్తిచే ఖండింపఁబడనిదియును, అగ్నిచేఁ గాలనిదియును, గాలిచేఁ శోషింపఁ బడనిదియును, నిత్యమైనదియును, సర్వవ్యాపియైనది యును, మీలోపల ప్రకాశించునదియును అగు ఆత్మను నీచాతి నీచులు సైతమువిననిండు వారికి వారియందే నమ్మకముకలుగ నిండు ఏలన, ఆంగ్లేయులకును మీకును గల వ్యత్యాస మేమి? వారు మతమును గూర్చియు విధులనుగూర్చియు మాటలాడు చుండనిండు. ఆవ్యత్యాసమును నే నెఱుంగుదును అదేమన, ఆంగ్లేయులకు తమయందు నమ్మకము కలదు మనవారి కది లేదు తాముఆంగ్లేయులమనియు, ఏ కార్య మొనర్పుటకు తమకు శక్తిగలదనియును వారికి నమ్మకము కలదు మనకన్ననో, ఏ కార్య మును మనచేతఁ గాదని బోధమై యున్నది దానికిఁ దగినట్లే క్రమ క్రమముగా మనము క్షీణించుచున్నాము కాఁబట్టి మనకు మనయందే నమ్మకము కలుగవలయును ప్రకృతమును మనకు శక్తియే (బలమే) కావలయును మనము శక్తిలేనివారై యు న్నందుననే కదా మనయొద్దకు రహస్యవిద్యలును గుప్తవిద్య లునువచ్చుచున్నవి. ఒక వేళ వానిలో నేదేని సారముండవచ్చును గాని, అవి మనలను నశింపఁజేయుచున్నవి చేసినవి.

కాఁబట్టి ఇఁకనైనను మీరు బలమును సంపాదించిగొనుఁడు వజ్రశరీరము గలవారగుఁడు మనము చాలకాలమునుండి దుఃఖంచుచున్నారము ఇఁక దుఃఖంపకుఁడు మహాధీరత్వముతో

లేచినిలువంబడుఁడు మగధీరులనెడి గౌరవమును బడయుఁడు. మగధీరులు చేయు కార్యమే ప్రయోజనమునిచ్చును. ఎప్పుడును మగధీరుల యుపదేశమే మనకుఁ గావలసినది. ఏది శరీరసంబంధమునను, బుద్ధివిషయమునను, అధ్యాత్మజ్ఞానవిషయమునను మిమ్ము బలహీనులగునట్లొనర్చుచున్నదో, అదియంతయు విషమని తెలిసి నిగ్రహింపుఁడు. అందు జీవములేదు. అది నిజమై యుండుటకుఁ గానేరదు. నిజమైనదే శక్తిని, పరిశుద్ధిని, జ్ఞానమును, వీరోత్పత్తినికలుగఁజేయును. మీఁద చెప్పిన రహస్యవిద్యలలో కొంత నిజమున్నను, అవి సామాన్యముగా దుర్బలమైనవి. నామాటలను విశ్వసింపుఁడు. ఆవిషయమునందు నాకు స్వానుభవము కలదు. నేను హిందూదేశమంతయు సంచరించి యున్నాఁడను. ఇంచుమించుగా అన్ని గుహాలలోనికిఁ బోయి వెదకిచూచియున్నాఁడను. పెక్కేండ్లు హిమాలయమున నుండి యున్నాఁడను. తమ జీవితకాలమునంతయు నచ్చోటనే గడపుచుండు వారినిఁ జూచియున్నాఁడను. ఇట్లు సంచరించి నేను దెలిసికొన్నదేమన— సిద్ధుల నొందవలయునని యుపదేశింపఁబడు రహస్యవిద్యలు దుర్బలమునే కలుగఁజేయుచున్నవి. నేను మనదేశమునందు విశ్వాసముగలవాఁడను. కావున, మీరు దుర్బలులై యుండుటను జూచి యోర్వలేను. ఇదివఱకే దుర్బలులై యున్నారు. ఇంకను దుర్బలత్వమును బొందుటను జూచి సహింపను. కావున, నేను మీకొఱకును సత్యముకొఱకును "చాలును నిలుపుము" అని ఘోషించువాఁడను. ఇప్పుడు మీరుండుస్థితియందే యుండుఁడు. దుర్బలమును బొందకుఁడు. తేజోవంతమై యుండు ఉపనిష

త్తులను చేకొనుఁడు దుర్బలముకొసంగు రహస్యవిద్యలను
త్యజింపుఁడు తత్త్వశాస్త్రములను గ్రహింపుఁడు రహస్యము
లనువవియన్నియు సామాన్యవిషయములు అవి సామాన్యు
లకుఁ దగినవి గాని మీకుఁ దగనివి. మీరు ఉపనిషద్రహస్య
ములను దెలిసికొని యారీతివర్తింపుఁడు అపుడు **హిందూ**
దేశమునకు విమోచనము కల్గును

ఇంకొకమాటచెప్పి నా ప్రసంగమును విరమించెదను.
దేశాభిమానమును గూర్చి ప్రసంగము చేయుచున్నారు కదా?
నాకును దేశాభిమానము కలదు దేశాభిమానమునకుఁ గల
ముఖ్యవిషయములు మూఁడు మొదటిది-హృదయమునకుదిగువ
నుండి అనుతాపము గలుగవలయును ఉత్తబుద్ధియందును యుక్తి
యందు నేమియున్నది? అది కొంచెము దూరముపోయి నిలిచి
పోవుచున్నది అయినను హృదయము ద్వారముగనే అనుగ్ర
హము కల్గుచున్నవి. తెఱచుటకు సాధ్యముగాని తలుపుల నన్ని
టిని ప్రేమయనునది తెఱచునట్లు చేయుచున్నది సకలరహస్యముల
దెలిసికొనునట్లు చేయునట్టిది ప్రేమయే. కాఁబట్టి, సంఘసంస్కా
రులును, దేశాభిమానులును అగు స్నేహితులారా! మీరుపరుల
సుఖదుఃఖములయందు అనుతాపము గలవారై యుండుఁడు.
ఆయభిప్రాయము మీకుఁ గలదా? దేవతలయు ఋషులయు సంత
తిలోఁ బుట్టినవా రెందఱో మృతప్రాయులై, వానికంటె నీచ
ముగాఁ జూడఁబడుచున్నారనునది మీకుఁ దెలియునా? ఎందఱో
అన్నములేక మడియుట నెఱుఁగుదురా? ఎందఱో వేలకొలఁది
సంవత్సరములుగా అన్నమునకుఁ జాలక పరితపించుటను

తెలిసికొంటిరా? అజ్ఞానమనెడి కాఱుచీఁకటి మనదేశమును క్రమ్ముకొన్న విషయము నెఱుఁగుదురా? అది మిమ్ము నెలకొననీక చేయుచుండుటను గమనించితిరా? అది మిమ్ము నిద్రపోనీక చేయుచున్నదా? అది మీరక్తనాళములలోఁ బ్రవేశించి మీ హృదయమునకు అనుతాపము కలుగఁజేసి యెడతెగక దడదడ కొట్టుకొనునట్లు చేయుచున్నదా? అది మిమ్ము ఒకవిధమైన పిచ్చి పట్టినవారినిగాఁ జేసినదా? నాశము చేఁగల్గిన దుఃఖము మిమ్ము పట్టుకొన్నదా? ఆకారణముచే మీరు మీ పేరును, ప్రఖ్యాతిని, భార్యను, బిడ్డలను, ఇండ్లను శరీరములను గూడ మఱచిపోతిరా? ఇంతవఱకు మీరు చేసితిరేని యిదియే దేశాభిమానమునకు మొదటిమెట్టు నేను అమెరికాదేశమునకు సర్వమతమహాసభకుఁ బోవుటలేదని మీలో ననేకులకుఁ దెలియును. అయినను ఈయనుతాపము నాకుఁ గలిగియున్నందునను, ఈదేశమునకు కీర్తి కలుగఁజేయవలయుననియును నాకుఁ గోరికకలదు ఈదేశమును ప్రసిద్ధికిఁ దెచ్చుట కేదిసాధనమని తెలిసికొనుటకై పండ్రెండేండ్లు నేను ఇండియాదేశమంతయు సంచరించినాఁడను కాఁబట్టియే నేను అమెరికాదేశమున కేఁగినాఁడ ఈసర్వమతమహాసభను గూర్చి యెవరికిచింత? ఇచ్చట నాదేశస్థులకొఱకు ప్రతిక్షణమును విచారించుచు దానివలన నేను శుష్కీభూతుఁడనైతిని? ఈ సభవిషయమై యెవరికి అక్కఱ! కావున ఇట్టిదే మొదటిమెట్టని తెలిసికొనుఁడు

మీకు అనుతాపము ఉండవచ్చును. అయినను, దానిని గూర్చి మాటలాడుచు కాలముగడపుటకంటెను ఏదేని ప్రయో

జనకరమగు కార్యమును చేయుటకును, అట్లే దూషించుటకు మాటుగా ఏదేని సహాయము చేయుటకును, జీవచ్ఛవములవలె నుండు వారిని సంరక్షించు మార్గమును కనిపెట్టితిరా? ఇంతయుఁ జేసినను చాలదు. కొండలవంటి యిడుమలు వచ్చినను వానిని లక్ష్యము పెట్టను శక్తియు దృఢసంకల్పమును మీకుఁ గలదా? ప్రపంచములోనివా రందఱు చేరి కత్తి చేఁబూని మిమ్మెదిరింప వచ్చినప్పటికిని మీరు ధైర్యముతో వారి నెదిరింపఁగలరా? మీ దారపుత్త్రులును, ధనమును, పేరును నశించినను మీరు గైకొన్న కర్మమునుండి మరలక యుందురా? మీరు,

శ్లో॥ "నిన్దన్తు నీతినిపుణా యది వా స్తువన్తు
లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేచ్ఛమ్,
అద్యైవ వా మరణ మస్తు యుగాన్తరే వా
ప్రారబ్ధ ముత్తమగుణా న పరిత్యజన్తి

"నీతియందు నిపుణులైనవారు దూషించినను, లేక పొగడినను, సంపదవచ్చినను, ఆసంపద నశించినను, నేఁడే మరణము కల్గినను, లేక నూతేండ్లకుఁ దర్వాత వచ్చినను, ఉత్తమగుణము గలవారు ప్రారంభించిన కార్యము నెంతమాత్రమును విడువరు"

అని భర్తృహరి చెప్పినట్లు దృఢసంకల్పముతో నుందురా? ఈ మూఁడంశములును మీయొద్దనుండెనేని మీలో రొక్కరును అద్భుత కార్యములు చేయఁగలరు మీరు వార్తాపత్త్రికలలో వ్రాయవలసినది లేదు మీ ముఖమండలమే ప్రకాశించు చుండును.

మీరు గుహలలోనున్నను మీకారణములు మహాప్రవాహము వలె నేఁడు కాకున్న నిఁక నూతేండ్లకైనను ప్రపంచమంతయు వ్యాపించును మంచితలంపు, చిత్తశుద్ధి, పరిశుద్ధమైన యభిప్రాయము, అను వీని ప్రభావ మట్టిది

"స్నేహితులారా! చాలసేపు మిమ్ము నిలువం బెట్టియున్నాఁడను ఇంకొకసంగతి వినుఁడు మనజాతి యనెడియోడ జీవయాత్ర యనెడి మహాజలమునందు కోట్లకొలఁది జనుల నెక్కించికొని పెక్కేండ్లుగాఁ బోవుచున్నది. ఆయోడ మూలముగా ననేకులు ఆనందమయ మైన ఆగట్టును జేరిరి ప్రకృతము మన పాపవశము చే రంధ్రమై యున్నది. లోకములోనియోడ లన్నిటికం టె నీయోడ చాల కాలము సంచరించినది ఇట్టి యోడ ఎట్లు పోయిననేమియని మనము చూచుట ధర్మమా? మనజాతియనెడి యోడ శిథిలమైనప్పుడు ఆజాతికిఁ బుట్టిన బిడ్డలమగు మనము ఆ రంధ్రమును మూయుటకు ప్రయత్నము చేయుదము. అది సాధ్యము కాదేని మనముకూడ దానితోనే కూలుదము మనము మనస్ఫూర్తిగా మన మెదడుచేఁడు మేనుతో ఆద్వారమును మూయవచ్చును మనము కాలయాపనము చేయుచు దానినిదూషింపరాదు మనజాతినిఁజూచి నిందింపఁగూడదు. దాని పూర్వకాల ప్రభావముచేతఁగదా నేను దానినే కోరుచున్నాఁడను మీరు దేవునిబిడ్డలనికదా నేను మిమ్ము విశ్వసించుచున్నాను మీరు పూర్వులసంతతివారుకదా? మీకు వారి మంగళాశాసనము కలుగవలయుఁ గాని వారిశాపముమీకు కలుగరాదు. నాయభిప్రాయములను మీకుఁ జెప్పవచ్చినాఁడను మీరు ఆదరముతో

వినినచో నేనును మీతోఁగలసి పనిచేయఁగల వాఁడను. ఒక వేళ నన్ను మీరు నిరాకరించి తొలఁగఁద్రోచితిరేని, మరల నేను మీ యొద్దకే వచ్చి మీానడుమనే కూరుచుండి మీతోడనే మునిఁగి పోఁగల వాఁడను."

అనియిట్లుపన్యసింపఁగా, జనులును మిక్కిలి అనుతాపము గలవారై ఆనందసాగర మగ్నులైరి.

---

## చెన్నపురి - మూఁడవ ప్రసంగము.

"సోదరులారా! ప్రకృతము మనజాతికిని, మన మతమునకును "హిందు" పదము ప్రయోగింపఁబడుచున్నది. ఈపదమునకును నేను ఉపయోగించు "వేదాంతము" అను పదమునకును గల సంబంధమును కొంచెము చెప్పెదను. "హిందు" అను శబ్దము పూర్వకాలమున పారసీకులు సింధునదికిఁ బెట్టినపేరు. సంస్కృతమున 'స' కారము పారసీకభాషయందు 'హ' కారముగా మారును. కావున, 'సింధు' 'హిందు' అయినది పిమ్మట గ్రీకులకు హ కారము నుచ్చరించుట కష్టముగఁ దోఁచి హ కారమును విడిచి యందలి యచ్చునుమాత్రము వారుచ్చరించి ఇండియను లన సాగిరి మునుపటి కాలమం దీపదమునకు సింధునది యావలియొద్దునున్న వారను నీ మొదలగు నేయర్థములున్నను బ్రస్తుత మాయర్థమంతయుఁ బోయినది సింధునది యావలి యొద్దుననున్న వారందఱు నొకమతస్థులు కారు హిందువులు,

మహమ్మదీయులు, పారసీకులు, క్రైస్తవులు, బౌద్ధులు, జైనులు లోనగు ననేకమతస్థులుగలరు. సరియైన వ్యుత్పత్త్యర్థముదీసి కొన్న హిందుశబ్దము వీరికందఱకును జెల్లఁదగియున్నది కాఁబట్టి మతసమామ్నాయమై యనేకమతములును సిద్ధాంతములును గర్మలును గలిగి యొక్క దేవాలయమను నేర్పాటులేక యన్నింటిని కలిగియుండు మన మతమునకు నామమిడుట మిక్కిలి కష్టముగాఁగానిపించుచున్నది. అన్ని శాఖలవారునంగీకరించువిషయ మొక్కటి యున్నది అందఱును వేదములను నమ్ముదురు వేదములను బరమప్రమాణములనుగ నంగీకరింపనివా రెవ్వరును హిందువు లనిపించుకొననేరరు. ఈవేదములన్నియు రెండు భాగములుగ విభాగింపఁబడి యున్నవి కర్మకాండము, జ్ఞానకాండము నని కర్మకాండమందు యజ్ఞయాగాదులగు కర్మలు వివరింపఁబడి యున్నవి వానిలోఁ జాలభాగ మిప్పుడు వాడుకలో లేవు జ్ఞానకాండమునకే వేదాంతము, ఉపనిషత్తులు నని పేరు అందు వేదములయందలి యాత్మబోధ యుండును. వాని నెల్లప్పుడును మనగురువులును, తత్త్వశాస్త్రజ్ఞులును, గ్రంథకర్తలును, ద్వైతాదిమతత్రయమువారును గూడఁ బ్రమాణముగఁ దీసికొనుచుందురు. ఏశాఖవారయినను "ఉపనిషత్ప్రమాణము" నంగీకరించి తీరవలెను లేకున్న వారిమతము విరుద్ధమతమగును కాఁబట్టి,యీకాలమున మనకందఱకును 'వేదాంతి, వైదిక' యను రెండుపేరులు తగియున్నవి నేను వేదాంతమతము, వేదాంతము ననుపదము లీయర్థముతో వాడుచున్నాను. ఇంకను గొంత స్పష్టముగాఁ జెప్పవలసిన యంశము లున్నవి.

ఏమనః నీవడుమఁ గొందఱు వేదాంతమున నద్వైతమొక్కటే యను నభిప్రాయమును గలిగియున్నారు ఉపనిషత్తులాధారము గఁబయలుదేఱిన యనేకమతములో నద్వైత మొక్కటియని మన మెఱుఁగుదుము ఉపనిషత్తులయందు అద్వైతుల కెంతగౌరవమో యంతగౌరవము విశిష్టాద్వైతులకును గలదు వేదాంతమద్వైతుల కెంత ప్రమాణమో విశిష్టాద్వైతులకుఁ గూడ నంత ప్రమాణమే. ఇట్లే ద్వైతులును దక్కినవారును బ్రమాణముగఁ దీసికొందురు ఇందులకుఁ గారణమును గొంతకలదు. మనకు వేదములును గలవు స్మృతులును బురాణములును గూడఁగలవు కాని, వీనికి వేదములకున్నంత గౌరవము లేదు. శ్రుతికిని స్మృతిపురాణములకును నేదేనియొక విషయమున భేదముకలిగినప్పుడు శ్రుతినంగీకరించి స్మృతిని దిరస్కరింపవలెను. అద్వైతమతస్థాపకులగు శంకరాచార్యస్వాములువ్రాసిన భాష్యమునం దంతట శ్రుతులనే వక్కాణించుచువచ్చినారు, గాని యొక్కడనో శ్రుతియందు విస్పష్టముగ లేనివిషయమును సృష్టీకరింపవలసివచ్చినప్పుడు తక్క స్మృతిని బ్రమాణముగఁ దీసికొనియుండ లేదు కాని, తక్కినద్వైతమతముల వారుస్మృతులనెక్కువగ గొని శ్రుతులనుదక్కువగ వాడుచువచ్చిరి ద్వైతభావ మెంతయెక్కువగనున్న నంత స్మృతులకుఁ బ్రాముఖ్యమును శ్రుతులకనాచరణమును గలుగుచు వచ్చినది ఈ కారణముచేత వేదాంతియన్నప్పుడు డద్వైతిగ గ్రహించుచువచ్చుట తటస్థించియుండవచ్చును ఏది యెట్లున్నను వేదాంతమను శబ్దము హిందూదేశమందలి మతములకన్నింటికిని వర్తించుచున్నది వేదము

లన్నింటికంటెఁ బురాతనములని యందఱు నంగీకరించి యున్నారు. ప్రకృతి విద్యావంతులేమనినను హిందువులు వేదములలోఁ గొన్ని యొకప్పుడును మఱికొన్ని యింకొకప్పుడును వ్రాయఁబడినవనికూడ నంగీకరింపరు వా రెల్లప్పుడును వేదములన్నియు నేక కాలముననే కలిగినవనియు, నంతియ కాని యవి యొకప్పుడు వ్రాయఁబడినవి కావనియు, సదా యీశ్వరునియందే యున్నవనియు నమ్ముదురు వేదాంతము త్రిమతములకును వర్తించు నన్నప్పుడు నాయభిప్రాయ మిది. మఱియును బౌద్ధమతమును, జైనమతమును, చూడఁ గొంతమట్టుకు వా రంగీకరించినయెడల మనలోఁ జేర్చుకొందుము. మనకేమియునభ్యంతరము లేదు వారు రారుగాని మనము సిద్ధముగ నున్నారము. ఏమన:—బాగుగఁ దఱచిచూచినయెడల బౌద్ధమతసారముగూడ నుపనిషత్తులనుండియే గ్రహింపఁబడినది బౌద్ధమతముయొక్క ప్రసిద్ధిఁ జెందిన నీతిశాస్త్రముకూడ ప్రతివాక్యము నుపనిషత్తులలో నేదో యొకదాని యందుండి తీరును జైనమతమునందలి వారిస్వాభావికములగు వెఱ్ఱితలంపులను దీసివేసినయెడల తక్కిన ప్రధాన విషయములన్నియు నుపనిషత్తులందుండియే గ్రహింపఁబడి యున్నవి. ఇంతియేగాక యా యుపనిషత్తులయందు నవీనముగ బయలుదేఱిన హిందూమతాభిప్రాయము లన్నియుఁ గలవు కొందఱు కారణమేమియు లేకయే ఉపనిషత్తులం దెచ్చటను భక్తిలేదనిచెప్పుచుందురు ఉపనిషత్తులనుజదివినవారి కందఱకు నిది వాస్తవము కాదని తెలియగలదు కావలసినచో ఉపనిషత్తులందుఁ జాలినంత భక్తికలదు తరువాతఁ దరువాతఁ బురాణ

ములయందు స్మృతులయందును విశేషముగఁ బెరిఁగిన యూహా
సస్యములకు బీజము లుపనిషత్తులయందే వేయఁబడినవి విష
యము సంగ్రహముగ నచ్చటఁ గలదు అది పురాణములందు
విపులము చేయఁబడినది సంపూర్ణమైన హిందూమతాభిప్రాయ
మేదియు నుపనిషత్తులయందుఁ గానరానిది లేదు. కొందఱు
ఉపనిషత్పరిచయము లేక భక్తి యెక్కడనుండియో క్రొత్తగ
వచ్చినట్లు సమర్థింపఁ బరిహాసపాత్రములగు కొన్ని ప్రయత్నము
లు చేసిరి మనముచూచుచుండఁగనే యాప్రయత్నములన్నియు
విఫలములైనవి కదా! కావలసిన భక్తియంతయు వానియందుఁ
గలదు ఉపనిషత్తుల నేల? సంహితలలోనే గలదు పూజ, యను
రాగము లోనగునవియన్నియు నందుఁ గలవు భక్తి యొక్క
లక్ష్యములు మాత్ర మంతకంతకుఁ గొప్పవగుచున్నవి సంహి
తాభాగములలో నచ్చటచ్చటఁ గొన్ని చోట్ల భయము, ఆపదలు
లోనగు మతాభిప్రాయములు కలవు వానియందుఁ గొన్నిచోట్ల
భక్తుఁడు వరుణాదులముందు వడఁకుచున్నట్లు చెప్పఁబడును
పాపమనునుద్దేశముతో మిగుల బాధపడినట్లు కొన్నిచోట్ల నగ
పడును అట్టివిషయము లుపనిషత్తులయందుఁ జర్చించుట కవ
కాశము లేదు ఉపనిషత్తులందు భయమనునది లేదు వాని
యందు భక్తిజ్ఞానమతములు మాత్రమే గలవు

ఈయుపనిషత్తులు మనకుఁ బ్రమాణగ్రంథములు. వానికి
వేలువేలు వ్యాఖ్యానములు గలవు గాని యిదివఱలోఁ జెప్పి
యున్న రీతిని వేదములకును బురాణములకును భేదము కలిగిన
యెడల పురాణములనువిడిచి శ్రుతిని గ్రహింపవలెను ఇట్లు
య్యును నాచరణమునందు నూటింటఁ దొంబదిమందిపౌరాణికు

లును బదిమంది వైదికులును గలరు. మఱియును, మనలో విశేషముగ వ్యాపించియున్న పరస్పరవిరుద్ధము లగునాచారములును వేదములయం దెచ్చటను గాన్పింపని మతాభిప్రాయములును శ్రుతిస్మృతిపురాణములలో నేనియందును లేనియభ్యాసములును నివి యన్నియుఁ గేవల దేశాచారములుగాని వేఱు కావు ప్రతిపల్లెటూరివాఁడునుగూడ నీయాచారము నసించినయెడలఁ దనహిందూత్వమే నశించుచునని యెంచును వేదాంతము నీయాచారము నొక్కటియే యని వాని యభిప్రాయయ తాఁ జేయుచున్నపని వేదవిహితము కాదనియుఁ, దానట్లు చేయకున్న హానిలేదు సరికదా తనకు మేలుకూడఁ గలదనియు వేదములను జదివి యాతఁడు గ్రహింపనేరకున్నాఁడు. ఇఁక రెండవచిక్కేది యనిన, శ్రుతు లనంతములు సామవేదమునందు వేయిశాఖలు గలవని పతంజలిమహాభాష్యము చెప్పుచున్నది అవియన్నియు నేవి? ఎవరికిఁ దెలియవు అట్లేప్రతివేదమందును జాలభాగములు నశించినవి కొన్నిమాత్రమే మనకు మిగిలినవి కొన్ని కొందఱుకుటుంబములవారి వశమందుఁ జిక్కినవి ఆవంశములు గొన్నియంతరించుటయుఁ గొన్ని పరహింసవలన నశించుటయు. దటస్థించినది. అప్పుడు వారితోపాటు వారివశమందుఁగల వేదభాగములుకూడ నుత్పన్నములయినవి వేదములకు వ్యతిరేకముగ దేనినైనను బోధింపఁ బోవుప్రతివారికి నీవిషయ మొక్క శరణాలయముగ నున్నది. ఆచారమునకును వేదవిధికిని భేదముకలిగినప్పుడు మనము వేదవిధి యిది కాదనినవారందులకు "ఈ వేదమందు కాదు శిథిలమయిన భాగమందు మేము చెప్పినట్లే యున్నది" అని చెప్పు

దురు వేదపఠనమందును వ్యాఖ్యానములందునుగల భేదము లన్నియుండఁగ వీనియన్నిటియందునుగల యేకసూత్రమును గ్రహించుట కష్టము ఈభేదములకు నుపభేదములకును సామాన్యకేంద్రస్థాన మొకటికలదనియు, వీనికన్నిటికి నైక్యము కలదనియు, నీపరస్పరవిరుద్ధాభాసముల కన్నింటికిని గల సమాధానమే మనమతమనియును మన మెఱుఁగవలెను. అట్లు కాకున్న నింతికాల మిది నిలిచియుండనే యుండదు

ఇఁక వ్యాఖ్యాతలవిషయమున నొక చిక్కు గలదు అద్వైతవాఖ్యాత యద్వైతగ్రంథము లన్నిఁటిని యథాప్రకారముగ నంగీకరించి ద్వైతగ్రంథము కంటఁబడఁగనే దానిని మారణము చేసి విఱిచి యెట్లయిన విపరీతార్థమును గల్పించును. 'అజశబ్దమునకు మేఁక యనియు, బ్రహ్మయనియుఁ గూడనర్థము కలదు అది వ్యాఖ్యాత యిష్టానుసారముగఁ దేనినయినఁ దీసికొనవచ్చును ఈరీతినే ద్వైతులింకను ఘోరమయిన యర్థములనుదీయుదురు ఈద్వైతపాఠముల నన్నింటిని బొందుగానుంచి దానికి వ్యతిరేకమయిన పాఠము లన్నింటికి లేనిపోనివిరుద్ధార్థములు తెచ్చి పెట్టుదురు సంస్కృతభాషయందుఁ గలచిక్కులను బట్టియు వేదభాష మిగుల పురాతనమగుటను నొక్కపదము యొక్క యర్థమును గూర్చి యెన్నియుగములయినను జర్చ సేయవచ్చును ఎవ్వరయినఁ బండితుఁడు తలఁచుకొనిన యెడల నెట్టియర్థములేనిప్రలాపములకును సూత్రానుసారముగ నర్థము చెప్పఁగలఁడు ఉపనిషత్తులనుబోధపఱచుకొనుటలో నివి కొన్ని చిక్కులుగ నున్నవి నాకుద్వైతాద్వైతములయందును

భక్తిజ్ఞానములయందును సమానబుద్ధియుఁ బ్రజ్ఞయుఁగల మహాత్ముని సహవాసము లభించినది. అందుచేత వ్యాఖ్యాతులయభిప్రాయముల యవసరము లేకుండనే యుపనిషత్తులను బోధపఱచుకొనుటకు సాధ్య మయినది నాయల్పశోధనవలనఁ దేలినంత వఱకు నావి యెవ్వియును బరస్పరవిరుద్ధములు కావని నా తాత్పర్యము గ్రంథములను బెనవేసి యర్థములను లాగవలసిన యవసరము లేదు అవి యతిరమణీయములు అత్యద్భుతములు పరస్పరవిరుద్ధములు గావు ఒకదానితో నొకటి చక్కని యనుబంధము గలవి ఒకదానికొకటి మార్గదర్శనము సేనొక్క సంగతిని గనిపెట్టినాఁడను ఉ. నిషత్తులన్నియు ద్వైతాభిప్రాయములతోఁ బ్రారంభమయి యద్వైతాభిప్రాయవిజృంభణముతో సమాప్తమగును

కాఁబట్టి, నేను జెప్పిన పురుషుని లక్ష్యముగాఁ గొనిన యెడల మనకు ద్వైతాద్వైత వివాదములతోఁ బని లేదు సంఘముయొక్క స్థితికి రెండును విధాయకములే ద్వైతమును గావలెను అద్వైతమును గావలెను సంఘముయొక్క మతస్థితికి ద్వైతులెంతయవసరమో అద్వైతులు నంత యావశ్యకమే ఒకరు లేనిదే రెండవవారుండుటకు వీలు లేదు ద్వైతాద్వైతము లన్యోన్యపూరకములు ఒకటి భవనము- రెండవది దానిపై నాచ్ఛాదనము ఒకటి మూలము- రెండవది ఫలము. మఱియు నుపనిషత్తులయందలి పాఠములకుఁ ద్రిప్పిత్రిప్పి యర్థములను గల్పించుట మిక్కిలి హాస్యాస్పదము అందలిభాషమిగుల నద్భుతమైనది. శాస్త్రప్రాశస్త్యమును ముక్తిగ్రంథములు నగుటయే

గాక యుపనిషత్తులయందలిభాష మిగుల చక్కనిభాష. ఇందు హిందువుల యాత్మజ్ఞానవిషయికమగు బుద్ధివిశేషముబయల్పడు చున్నది. ఇతరదేశములందును మిక్కిలి చక్కని వర్ణనలుకలవు; గానియవియన్నియుభౌతికప్రభావవిశేషములు మిల్టను,డ్యాంటి, హోమరు మున్నగువారత్యద్భుతములగు కావ్యములనురచియించియున్నారు అవియన్నియు విషయగోచరములగుపదార్థప్రభావవిశేషములు మాత్రమే అట్టివి మన సంహితాభాగము లందుఁ గలవు. సృష్టివర్ణనము లోనగు ఋక్కులు కొన్ని యత్యద్భుతము లయినవికలవు అందు భాషాప్రభావమెంతో విశేషముగఁ గాన్పించినది కాని యింకను వారి మనస్సులందుఁ గల మహాదభిప్రాయములను వెలిపుచ్చుట కామార్గము చాలినది కాదు అందుచేత నుపనిషత్తులయందు భాషాధోరణి మాతినది భాష వ్యతిరేకార్థక మయినది అదికొన్నిచోట్ల నల్లకల్లోలముగ నుండును ఒక్కొక్కప్పుడు విషయాతీతముగా మనలను గొనిపోయి మధ్యమార్గమందు విడిచి తుద కతీంద్రియమైన యొద్దానినో కనఁబఱచును అదియెట్టిదో యేమో మనము తెలియఁజాలము కాని యేదియోకలదనిమాత్రము ధ్రువముగ నమ్ముదుము వీనితోఁ దుల్యమగు భావము లేగ్రంథములందును లేవు "నతత్ర సూర్యోభాతి నచంద్రతారకమ్" మొదలగు వానికంటెఁ బూర్ణమగుతత్త్వశాస్త్రప్రశంస యొచ్చటనుండును? ఈకథం గనుఁడు "ఒకచెట్టుమీఁద రెండుపక్షులు మిగుల సఖ్యముతో వాసముచేయుచుండెనఁట అందొకటి యాచెట్టు క్రిందికొమ్మపైఁ గూరుచుండి పండ్లను దినుచుండునఁట రెండ

వది చెట్టుయొక్క పైకొమ్మపైఁ గూరుచుండి దేనిని భుజింపకోరకుండునఁట మొదటిది తియ్యనిపండ్లు దినినప్పుడు సుఖమును, చేఁదుపండ్లు లభించినప్పుడు వ్యసనమును బొందుచుండును. రెండవది పండ్లను దినదు గనుక దానికి ఖేదమోదములు రెండును గూడ లేక తనతేజోమహిమయం దేయానందించుచుండునఁట. ఇదియే మానవాత్మయొక్క స్వరూపము. మనుష్యుఁడీప్రపంచమునందలి సుఖదుఃఖముల ననుభవించుచు నీషణాదులం దాసక్తితోఁ దగుల్కొని వేసట నొందుచున్నాఁడు" అని చెప్పఁబడియున్నది మఱికొన్నిచోట్ల నీయుపనిషత్తులందు వీనిని, రథచోదకునికిని మదించి లొంగదియు నలవికానిహయములకునుబోల్చియున్నాఁడు ఇట్లీసంసారమునందువ్యర్థప్రయోజనముల కయి ప్రయత్నించువారి స్థితి యిట్టిదిగా నున్నది. బాలప్రాయమువారు ముందెద్దియో యున్నతదశగలదని యాశపెట్టుకొని తుదకు విఫలులగుటయు వృద్ధులు గతించిన తమ వృత్తాంతములను దలపోసికొనుచుండుటయు దుదకెవ్వరునీవలనుండి తప్పించుకొనఁ దారిగానక పోవుటయు నిట్లుండును మనమీరీతి నున్నారము కాని ప్రతివానికి నేదేని గొప్పవిపత్తు తటస్థించినప్పుడు అత్యధికమయిన సంతోషసమయమునను గొన్ని నిమిషముల పాటు మాయాయవనిక తొలఁగి విషయాతీతము, సుఖదుఃఖాతీతము, బుద్ధ్యతీతము, ప్రకృత్యతీతము, కీర్తిధనప్రతిష్ఠాద్యాశాతీతము నగు నొకపదార్థము మినుకుమినుకుమనుచుఁ గొంచెము గానవచ్చుట కలదు.

ఈసమయమున విషమధురఫలముల రెంటిని ద్యజించి

స్వయంప్రభావమందు మగ్నమై,తృప్తిఁజెందిభగవద్గీతలయందుఁ జెప్పినచొప్పున నాత్మయందే తృప్తిఁజెంది యాత్మేతరమగు దానిని దేనినిగోరనివారి కేకర్మయు నక్కఱలేక యేమియుఁ జాటుపడ నక్కఱలేదను రీతినున్న యీ రెండవపక్షి తెలియవచ్చును మరల వెంటనే దానిని మఱచి తిరిగి మధురఫలములను విషఫలములను భుజియించి కొంతకాలమయినతరువాత మరల రెండవపక్షినిగాంచి క్రిందిపక్షి తనకు దుఃఖప్రహారణములు దగిలినకొలఁదినిఁ బైపైకి వచ్చును. ఈ ప్రహారణములు గట్టిగఁదలిగిన యదృష్టముపట్టినప్పుడు తన మిత్రమును బ్రాణమునగు రెండవపక్షికి మిక్కిలి సమీపముగఁబోవ దాని తేజస్సు తనచుట్టు వ్యాప్తమగును దాని సమీపమునకుఁ బోయినకొలఁదిఁ దనస్వరూపము కరఁగిపోవుచున్నట్లు తెలియవచ్చును ఇంకను దరికిఁ జేరినప్పుడు తనస్వరూపమే యంత ర్ధానము నొందును తనకు వేఱయిన యునికియే కాన్పింపదు అప్పుడు తానిదివఱకుఁ దనకంటె భిన్నముగ గోచరించుచు వచ్చిన రెండవ యండడమునుయొక్క ప్రతిబింబమునే గాని వేఱు కాదనియు, దాని తేజమంతయు దనదేయనియుఁ దెలిసి భయముతీరి తృప్తినొందును ఈకథ నుపనిషత్తులుద్వైత ముతోఁ బ్రారంభించి యద్వైతముతో సమాప్తము చేసినవి ఇట్టి మహత్తరమయిన యభిప్రాయములకుఁ దార్కాణముగ ననేకములగు కథలు గలవు. కాని వానినన్నింటి నిట వ్రాయుటకు నవకాశము చాలదు. అందలిభాషయు విషయములను గూడ మిగుల సారవంతములుగనుండి గదాప్రహారములవలె

మనకు నాటును వాని కపార్థముచేయుట కవకాశము లేదు. ప్రతిశబ్దమును స్థిరమయి సార్థకమైయుండును. బుద్ధిని భ్రమ పెట్టు నున్మాదవచనములుగాని భ్రమణములుగాని చిక్కులుగాని యందుఁగానరావు. గుణభంగసూచనములందు లేవు ద్వర్థి వచనాతివ్యాప్తిగాని యసంఖ్యాకములగు విశేషణ ప్రయోగ ములుగాని బుద్ధిని భ్రమింపఁజేసి యర్థమేమో తెలియకుండఁ జేయు మఱియేమిగాని యందు లేవు. అది మనుష్యకృతమే యై నచో చెక్కు చెదరని సామర్థ్యముగలసంఘముయొక్క కృత్యమై యుండవలెను ప్రతిపుటయందును సామర్థ్యము కంటికిఁ గనఁ బడుచుండును ఇది యొకటి మనము జ్ఞప్తియం దుంచవలసి యున్నది నాజీవితకాలమున నేను నేర్చుకొన్న వానిలో నిది యొక గొప్పవిషయము అది మనుష్యునికి హెచ్చరికయు బల మును బోధించును మానవసహజమైన దౌర్బల్యము కొంత లేదా యనియందు లేనిఁ గలదు కాని యది మఱికొంత దౌర్బ ల్యము చేతఁ బోవునా సామర్థ్యమువలనఁగదా దానిని లేకుండ జేసికొనవలెను కాఁబట్టి 'నభయేత్' అని బోధించు గ్రంథ మిదియే తక్కిన మతగ్రంథములు వేనియందు నీ విశేష ణము జీవేశ్వరుల కెవ్వరికిని బ్రయోగించి యుండలేదు ఈ సందర్భమునఁ బాశ్చాత్యప్రభుశిఖామణియగు మహా అలెగ్జాం డరుకథ జ్ఞప్తికి వచ్చుచున్నది అతఁడు సింధునదియొద్దను నొక హిందూసన్న్యాసినిగాంచి యమితమగు ధనము నొసంగెద ననియుఁ, గ్రీసుదేశమునకు రమ్మనియు, భ్రమపెట్టి యడుగ నా యోగి యాతని ధనామిషమును బరిహసించి రానని తిరస్క

రించెను. అంతట నాచక్రవర్తి తనయధికారము మెఱయ "నీవు రాకున్నఁ జంపెద" నని బెదరింప నాతపస్వి పెద్దపెట్టున నవ్వి "ఎంతయసత్యము పల్కితివి! ఇంత దబ్బఱమాటను నీవెన్న డును బల్కియుండవు. నన్నెవ్వరు చంపసమర్థులు? ఈనశ్వర ప్రపంచమునకుఁ జక్రవర్తివగు నీవా నన్నుఁజంపుట! ఎంతవెఱ్ఱి! నాయనా! నేనాత్మను నాకు జననమరణములు లేవు నేను సర్వవ్యాపిని సర్వజ్ఞుఁడను అనంతుఁడను అట్టి నన్నెట్లుజంపఁ గలవు?" అనెను సామర్థ్యమనఁగ నిది అదియే సమర్థత మిత్రులారా! అస్మద్దేశీయులారా! నేనుపనిషత్తులను జదివినకొలఁదిని మీకై విచారము వీరుచుండును మనకుఁ గావలసినది సామ ర్థ్యము. గాని నొవ్వరిత్తురు? మనలను బలహీనపఱచుటకుఁ గావలసినన్ని కథలును బురాణములును గలవు ప్రతిపురాణము నందును బ్రపంచమునందలి భాండాగారముల నన్నిటిని నింపఁ గలిగినన్ని కథలుగలవు మనసామర్థ్యమునకుఁ భంగకరము లయిన కథ లనేక కాలమునుండి మనకుఁగలవు కడచిన వేయి యేండ్లనుండి పుట్టినగాథలన్నియు మనలను రానురాను బల హీనులనుగఁ జేసి చివరకు మీఁదఁ గాలుమోప వాంఛించిన ప్రతివారి కాలిక్రిందను బురుగులమై యడఁగి యుండవలసిన స్థితికి వచ్చినారము కావున నోప్రాణమిత్రులారా! మీతోనుండి మీతో గతింపవలెనని యున్న నన్నుఁ గొన్నిమాటలు సెప్ప నిండు. మనకు బలముకావలెను ముమ్మాటికిని దార్ఢ్యము మనకుఁ గావలెను ఉపనిషత్తులు బలమున కాకరములు. ప్రపంచ మంతకును బలము నీయఁగల సమర్థత దానియందుఁ గలదు

వానిమూలమున లోకమంతటికిఁ బ్రాణప్రతిష్ఠ చేయవచ్చును అని బలహీనులను, దుఃఖభాజనులను, బతితుల నన్నిజాతుల వారిని మీపాదములమీఁదనిలిచి స్వేచ్ఛగా నుండుఁడనియెలుఁ గెత్తి చాటుచున్నవి. స్వేచ్ఛ శారీరకస్వేచ్ఛ, మానసికస్వేచ్ఛ యివి యుపనిషత్తులయందలి యుత్సాహకవాక్యములు ముక్తిని గూర్చి చెప్పుగ్రంథము లివియే ప్రకృతిబంధములనుండియు దౌర్బల్యము నుండియుఁ దప్పించుకొనుఁడు అట్టి విముక్తి మీకుఁ గలదని యివి సూచించుచున్నవి ఇంకొక విశేషము నీవుద్వైతివైనను ఆత్మపూర్ణమని యొప్పుకొందువు ఆత్మకొన్ని కర్మలవలన నిట్టిస్థితికి వచ్చినది కాని యది పూర్ణమేయని యందువు. రామానుజాచార్యులు బోధించిన సంకోచవిజృంభణములు బ్రకృతిశాస్త్రజ్ఞులు కనిపెట్టిన పరిణామసిద్ధాంతమే కాని వేఱుకాదు ఆత్మ వెనుకకుఁ బోయి సంకుచితమయి దాని శక్తులన్నియు నణఁగి పుణ్యకర్మలవలనను, పుణ్యతలంపుల వలనను, దిరిగి విజృంభించి తన పూర్ణమును, మరలఁబొందును. అద్వైతి ప్రకృతియందుఁ బరిణామము నంగీకరించును కాని యాత్మయం దంగీకరింపఁడు ఇది భేదము ఇచ్చట మీకును నాకును నడుమ నొకతెరయుండి దానియం దొక చిన్నరంధ్రమున్నట్లూహింపుఁడు నేను దెరవెనుకనుండియీసభను జూచుచున్నాను నాకుఁ గొందఱు సభ్యులు మాత్రమే కనఁబడుచున్నారు. రంధ్రము కొంచెము పెద్దదిచేసినకొలఁది నెక్కువమంది యగపడుదురు. తుదకు రంధ్రము తెరయంతటి పరిమాణము కలదైనపుడు సభయంతయుఁ గాన్పించును. అప్పుడు

మననడుమ నేమియు నుండదు మార్పంతయుఁ దెరయందే కలిగినది మనము యథాప్రకారముగానే యున్నారము మార్పు తెరయందుఁ గలిగినది మొకటి నుండియుఁ జివఱకు మీరును నేనును గూడ నొక్కరీతినే యుంటిమి. తెరయందు భేదము కలిగినది ఇట్లు పరిణామవాదము విషయమై యద్వైతుల యభిప్రాయము ప్రకృతిపరిణామమును గుఱించి లోనియాత్మ విజృంభించుట

ఆత్మ యేకారణముచేతను మాఱునది కాదు ఆది మాయావృతమై యుండును ఆమాయాచ్ఛాదనము క్రమక్రమముగ సన్నగిలకొలఁది సహజమగు లోనిప్రభావము వెల్లడి యగును హిందూదేశమువలనఁ బాశ్చాత్యులు నేర్చుకొనవలసినయంశ మిదియే జనులేమి చెప్పినను నెంతడంబములువచించినను, రానురాను దుద కీవిషయము నంగీకరింపని దేశ మెద్దియు నుండదు ప్రతివిషయము నెట్లుమాఱుచున్నదో మనము చూచుచున్నాము. మంచిదని ఋజువు దొరకువఱకుఁ బ్రతివస్తువును జెడ్డదానిగానే తీసికొనుచుందుము. విద్య చెప్పించుటయందును నేరస్థులను శిక్షించుటయందును, ఉన్మాదులకు వైద్యము చేయించుటయందును సాధారణవ్యాధులకు మందులిచ్చుటయందును, బూర్వమిదియే పద్ధతి ప్రస్తుతపుపద్ధతి యేమి? శరీర మారోగ్యమయినదనియుఁ బ్రకృతి చేతనే వ్యాధులు కుదురుననియుఁ జెప్పెడి ప్రస్తుతపు శాస్త్రము ఔషధము దేహమందు మంచిపదార్థములనుగూడఁ బెట్టుటకు మాత్రము వినియోగించుమనని చెప్పుచుమ ఇఁక నేరస్థులవిషయమయి యేమి చెప్పుచున్నారు? వాఁ

డెంతనీచుఁడైనను ఆతనియందును దైవాంశముకలదు కావున, వానిగూడ నందులకుఁ దగినట్లుగా జూడవలయునని యనుచున్నారు. ఇట్టిసంగతులన్నియు మాఱినవి చెఱసాలలు పశ్చాత్తాపస్థానము లని చెప్పుచున్నారు ఈప్రకారముగ లోననున్న దివ్యాంశము ప్రతివస్తువునందును గోచరమగు చున్నది దీనికి సమాధానము మనగ్రంథములం దున్నది మనము వానిని గ్రహింపవలెను. మనుష్యుల యన్యోన్యాదరణముకూడఁ గ్రమక్రమముగ మాఱిపూర్వపు దుర్బలాభిప్రాయములన్నియు నంతరించును ఈశతాబ్దియందే యవియన్నియు నశించును. జనులు విజృంభించి మనల నెంత నిందించినను నిందింపవచ్చును పాపము లేదను ఘోరసిద్ధాంతమును బోధించినను నన్ను లోకమందఱు నిందించినారు మంచిది, వారిసంతతివారు నన్నుఁబుణ్యము బోధించినందులకు వందింతురు పుణ్యబోధకుఁడను గాని పాపబోధకుఁడను గానని యెంచి నేను ధన్యత నొందుదును హిందూదేశమువలనఁ బ్రపంచము నేర్చుకొను రెండవవిషయము ప్రపంచము యొక్క యైక్యము ప్రభేదములను అంతరములనుగల్పించు మునుపటి యభిప్రాయములన్నియు నంతర్ధానము నొందుచున్నవి. విద్యుచ్ఛక్తియు ధూమశక్తియుఁ బ్రపంచముయొక్క యన్ని దేశముల నొకదానితో నొకదానినిగలుపుచున్నవి. అందుచేత హిందువుల మయిన మనము, మనదేశమున కావలనున్న వారలందఱు రాక్షసులనియుఁ బిశాచములనియుఁ ననుచాలము క్రైస్తవులును హిందూదేశము వారందఱు నరాశను లనియు మృగప్రాయు లనియుఁ జెప్పఁజాలరు మన మితర

దేశములకుఁబోయితిమా మనవంటిమనుష్యులు మనకు వాక్కా-
యకర్మలచే సహాయమొనర్ప సంసిద్ధులయి యుండుటఁ జూడఁ
గలము ఒక్కొక్కచోట మనస్వదేశమందుకంటె మంచివారిని
గూడఁ జూడవచ్చును అట్లే వారిచ్చటికి వచ్చినప్పుడు నదేరీతి
సోదరభావమును, సంతోషపూర్వకమయిన యాదరణమును,
భగవత్సహాయమును గాంతురు మన దుఃఖమునకంతకును అజ్ఞా-
నము కారణ మని యుపనిషత్తులు చెప్పుచున్నవి అవి సాంఘిక
విషయములయందును, ఆత్మీయవిషయములయందును గూడ
వాస్తవమే యగుచున్నవి అజ్ఞానముచేతనే పరస్పరద్వేషము
పుట్టుచున్నది అజ్ఞానముచేతనే మనకుఁ బరస్పరానురాగము
లేకపోవుచున్నది మన మొకరి నొకరు తెలిసికొనినతోడనే
యనురాగ మంకురించుచున్నది అది కలిగి తీరవలెను. మన
మొక్కటియే కదా, మనకుఁ దెలియనప్పటికి నైక్యము స్ఫురిత
మగుచున్నది రాజకార్యములును సాంఘికవిషయములును
గూడ నొకదేశమునకుఁ బ్రత్యేకముగ నిర్ణయింపఁబడ వీలు
లేదు అవి రానురాను ఘనము లగుచున్నవి వానిని బరదేశ
సంబంధమును బట్టిచూచిగాని తీర్మానించుట కవకాశము లేదు.
దేశములయొక్క పరస్పరసిద్ధాంతములును బరస్పరసర్గములును,
ప్రస్తుతము మిగులప్రాముఖ్యమును వహించియున్నవి. అవియైక
మత్యసూచకము ప్రకృతిశాస్త్రమునందు నట్టి విషయములే
దినదినము బయల్పడుచున్నవి పదార్థవిషయమున సర్వప్రపం
చము సూర్యచంద్రాదులు నొకేపదార్థమనియు నామమందు
మాత్రమే భేదమనియుఁ దెలిసికొనుచున్నారము. మానసిక

ప్రమేయమున బుద్ధియొక్కటేయనియు, నది సముద్రమువంటి దనియు, నీవు నేను నందలి చిన్న సుడులవంటి వారమనియు నాత్మయొయందునది మాఱునది కాదనియుఁ జెప్పుకొనుచున్నారము అదిపరిణామరహితమై భాగశూన్యమై యేకమయియున్న యాత్మ నీతికొఱకైన యార్తధ్వనికూడ బయలుదేఱుచున్నది. అదియును మనగ్రంథములందున్నది నీతి యెందులకో, దానికి మూలమేమో, అది లోకమునకుఁ దెలియవలసియున్నది అదియును మనగ్రంథములందు దొరకును

హిందూదేశమున మనకుఁ గావలసిన దెద్ది? ఇతరులకీపై విషయము లింతగఁ గావలసియున్నప్పుడు మన కివి వారికంటెఁ బదిరెట్లావశ్యకములు ఉపనిషన్మహత్త్వమున్నప్పటికిని మనపూర్వు లెంతగొప్పవారైనను మనమిప్పుడు చాలదేశముల వారికంటె హీనులమయియున్నారము అన్నింటికంటె మొదట మనకు దేహబలము లేదు మనకష్టములలో ముప్పాతికవంతున కది కారణము మనము సోమరులమయి యున్నారము మనము పనిచేయఁజాలము ఒకరితో నొకరు కూడఁ జాలము. మనకుఁ బరస్పరానురాగము లేదు స్వార్థపరత్వమెక్కువ యూరోపునందలి స్త్రీలవలెనున్నాము పరస్పరద్వేషమును అసూయయు లేక ముగ్గురమైనఁ గూడి మనఁజాల కున్నారము ఇది మనస్థితి. కట్టుఁబాటునది లేక స్వార్థపరులమయి బొట్టునిలువుగఁ బెట్టవలెనా? లేక అడ్డముగఁ బెట్టుకొనవలయునా? యనురీతి యల్పవిషయములకొఱకు సంవత్సరములకొలఁదిపోరాడుచున్నాము దృష్టిదోష మున్నదా లేదా యను నల్పవిషయమును గూర్చి

పెద్దపెద్ద గ్రంథములను వ్రాసి కాలవ్యయము చేయుచున్నారము. ఇది యీనడుమఁ గొన్ని వందల యేండ్లనుండి కలిగినది. ఇట్టిఘన కార్యములకై కాలవ్యయము చేయుచు మన మట్లున్నయెడల నింతకంటె మంచిస్థితికి మన మెన్నటికిని రాఁజాలము ఇందులకు మనము సిగ్గుపడకున్నాము ఒకవేళ నెప్పుడైనను సిగ్గుపడినను మనము దలఁచినదానిని జేయఁజాలము మన కనేకాలోచనలు కలవు గాని, మన మెన్నఁడును గార్యాచరణమునకుఁ దిగనేరము చిలుకలవలె వట్టిమాటలాడుటయుఁ గ్రియచే నేమియుం జేయలేకపోవుటయు మన కలవాటయినది. ఇందులకుఁ గారణమేమి? శరీరదౌర్బల్యము. ఈమన దుర్బలబుద్ధులేమియుం జేయఁజాలవు. అది మారవలెను మొదట మన పసివారలందఱు దార్ఢ్యవంతులుగావలెను తరువాత, మతము వచ్చిన వచ్చుఁగాక ఇట్టిస్థితినిఁ బట్టి మనకు గీతాధ్యయనముకంటెఁ బాదకందుకఖేలనమే మోక్షసాధనముగఁ గనిపించుచున్నది ఇట్లు చెప్పుట మిక్కిలి సాహసమే అయినను, చెప్పవలసి వచ్చినది మీయెడల నాకుఁ బ్రేమకలదు నాకుఁ గొంచె మనుభవమును గలదు కీలెఱిఁగి రక్షవేయవలెను మీకు భుజబలమెక్కువైనకొలఁది గీత సులభముగఁ బోధపడును. మీరక్తనాళములందు దృఢరక్త మెక్కువగఁ బ్రవహించినకొలఁదిని మీకు శ్రీకృష్ణుని బుద్ధిసామర్థ్యములు సుబోధము లగును మీరు పురుషులయి సమర్థులయి నిలువఁగలిగినయెడల నుపనిషత్తులును ఆత్మప్రభావమును సులభముగఁ దెలియును ఈప్రకారముగ మన కవసరమైన విషయములందు వీని నుపయోగింపవలెను నేనద్వైత

మును బోధించినందులకుఁ జాలమందికి విసుగు గలిగినది నే
నద్వైతమునుగాని ద్వైతమునుగాని ప్రత్యేకముగ బోధించు
వాఁడను గాను. ఇప్పుడు మనకుఁ గావలసినది ఆత్మనుగూర్చిన
జ్ఞానము దాని శక్తిసామర్థ్యములు, దాని శాశ్వతపూర్ణత్వము,
పావనత్వము వీనిని దెలిసికొనవలయును

నాకొక బిడ్డయుండినయెడల దానికి "నీవేపరమాత్మ"
వని పుట్టిననాఁటినుండియుఁ బోధింతును. అనఁగా మీరల్లు చేయ
వలయును పురాణములందు మదాలసం గూర్చిన కథ యొకటి
కలదు ఆమెకొక శిశువు కలుగఁగా నామె యాబిడ్డను దొట్టి
లోఁబెట్టి "నీవే పావనుఁడవు, నిర్మలుఁడవు, పాపరహితుఁడవు,
సర్వశక్తుఁడవు, ఘనుఁడవు" అని పాటలుపాడెను ఆహా! అం
దెంత విశేషము గలదు నీవు ఘనుఁడ వనుకొంటివా ఘనుఁడ
వయ్యెదవు నే నీలోకమంతయుం దిరిగినందుల కేమిగలిగినది?
ఇతరదేశములవా రందఱుఁ బాపులను గూర్చి మాటలాడ
వచ్చును, గాని వారు నిశ్చయముగఁ దాము బాపుల మని నమ్మి
తిరా? వారుమధ్య ఆఫ్రికాలోని నీగ్రోలకంటె ఘనులు కానే
రరు వారి కట్టివెఱ్ఱినమ్మకము కలుగకుండ దైవము కాపాడును
గాక! ఆంగ్లేయులు దాము లోకమును బాలించుటకుఁ జన్మించి
తిమని నమ్మియున్నారు తాను ఘనుఁడననియు లోకమునఁ దాఁ
జేయఁజాలనిది లేదనియు నాతనికి నమ్మికగలదు వలసినచో
నాతఁడు సూర్యుని కడకుఁ గాని చంద్రుని కడకుఁగాని పోఁగ
లఁడు అందుమూలమున నాతనికి ఘనత గలుగును తానొక
పాపాత్ముఁడననియుఁ గలకాలము నిట్లు పతితుఁడై పడి యుండ
వలసినవాఁడనియు, నమ్మికయే యాతని కున్న యెడల నాంగ్లేయు

లిప్పుడున్న స్థితియం దుండనే యుండరు. కాఁబట్టి యీప్రకార ముగఁ బ్రతిసంఘమందును మతగురువు లేమి చెప్పుచున్నను మనయందున్న దైవాంశము తనంతట వెల్లడి యగుచుండును మనకునమ్మకముపోయినది. మన కాంగ్లేయ స్త్రీపురుషులకంటె వేయి రెట్లు నమ్మకము తక్కువై పోయినది. ఇవి తేటమాటలయ్యును జెప్పక తప్పనిసరి యైనది ఆంగ్లేయస్త్రీలును బురుషులును మన శాస్త్రములయందలి విశేషములను గాంచిన తోడనే వెఱ్ఱిపట్టి నట్లుగా వారు ప్రభుకోటి లోనివారయ్యును తోడివారు నవ్వి, పరిహసించుచున్నను మనదేశమునకు వచ్చి మనమతమును మనకు బోధించుచున్నారు మనలో నెంద ఱట్లు చేయఁగలరు? ఆలోచింపుఁడు! ఏల చేయఁజాలరు? తెలియకయా? మీకు వారి కంటె నెక్కువ దెలియును, అదియే యనర్థదాయకమయినది. మీకుఁ దెలియవలసినదానికంటె నెక్కువ దెలిసినది అదివచ్చిన విఁత్తుమీరక్తము చెడి తొరువలె నయినది- మెదడు నిద్రపోవు చుండును శరీరమునబలము లేదు. ఈశరీరమును మార్చవలెను శరీరదార్ఢ్యము లేకపోవుటయే గొప్పలోటు. మూరేండ్లనుండి సంస్కారము లని ధర్మలక్ష్యము లని వవరుటయే గాని, యాచ రణము కావలసినప్పు డెవ్వరును గానరారు ఈరీతిని లోకమం దఱకు వెగటు పుట్టి సంస్కారముననఁ బరిహాసాస్పద మయినది. కారణమేమి? మీకు జ్ఞానము లేదా యనిన వారికంటె నధిక ముగఁ గలదు దీని కంతకును గారణము దౌర్బల్యము నీలో నీకు నమ్మకము లేదు వేలకొలఁది యేండ్లు జాతిభేదమూలకమ

యిన పరస్పరహింసయుఁ బర రాజుల బాధలును మనబలమునం తను నాశనము చేసినది. అట్లణఁగిపోయి వెన్నెముక లేని క్రిమి కీటకములవలెఁ బడియున్నారము

ఇఁక మనకు బలమెట్లు కలుగును? మనకుఁ గావలసినది బలము ఆబలమును సంపాదించుటలో మొదటిపని యుపని షత్తులను నమ్మి నేనాత్మనని నమ్ముట "శ్లో. అచ్ఛేద్యోయ మదా హ్యోయ మక్లేద్యోశోష్య యేవచ, నిత్యస్సర్వగతస్థాణు రచ లోయంసనాతనః" అను నీయమృతవాక్యములను పలుమాఱు చ్చరింపుఁడు మనము బలహీనులమని యనవలదు. మనము దేన్నైనను జేయఁగలము మనమేమి చేయఁజాలము? ప్రతి కార్యమును జేయఁగలము. మనయందఱియందుఁ దేజోవంత మగు నాత్మ యున్నయది దానిని నమ్మవలెను నాచికేతుని యందు నమ్మక ముంచుఁడు తండ్రి యజ్ఞము చేయుచున్నప్పు డాతనికిఁ గొప్పనమ్మక మొకటికలిగినది అట్టినమ్మకము మీకంద ఱకుఁ గలుగుఁగాక కలిగినచో మీరందఱును మహామహులై లోకమునంతను గదలింప సమర్థులగుదురు. మీరంద ఱట్లగుదు రని కోరుచున్నాఁడను మీకుఁ గలుగవలసినమ్మకమిది మీకు ఉపనిషత్తుల వలనఁ గలుగు సామర్థ్య మిట్టిది ఆహా! ఇది సన్న్యాసులకు మాత్రమా! రహస్యమా! ఉపనిషత్తు లడవుల పాలయిన సన్న్యాసులచేతిలో మాత్రమే చిక్కినవి శంకరు లొక్కరు కొంచెము దయగలిగి గృహస్థులు కూడ నుపనిష త్తుల నధ్యయనము చేయవలయు ననియుఁ దాన మేలేగాని నష్టము లేదనియుఁ దెల్పినారు అయినను ఇప్పటికిని ఉపనిషత్తు

లడవులలోని వారికనియే యందఱును దలంచుచున్నారు. నేను వెనుకఁ జెప్పినరీతిని వేదములగు శాశ్వతమగు వ్యాఖ్యానము నొక్క_మాఱు శ్రీకృష్ణభగవానులు మనకందఱకును భగవద్గీతల యందుఁ జేసిపెట్టినాఁడు. అది యందఱకు నన్ని వ్యాపార ములకును దగియున్నది వేదాంతములయందలి ఘనాభిప్రా యము లడవులయందు మాత్రమే కాపురముండక గుహలలోనే నిద్రింపక న్యాయసభలయందును, వ్యాసపీఠములయందును, పేదల పర్ణశాలలందును, పల్లెకూటములందును, విద్యార్థుల యందును గూడ వ్యాపింపవలెను.

ప్రతిపురుషుఁడును స్త్రీయును, పసిబిడ్డయును, వృత్తిభేద ములతో నిమిత్తము లేక ప్రతివాఁడును వానినవలంబించినయెడల భయరహితు లగుదురు ఉపనిషదభిప్రాయములను హీనజాతివా రలెట్లవలంబించి యాచరింతురంటిరా, యామార్గముఁ జూపింపఁ బడినది. అదియనంతము మఱి మనంతము దానినిమీఱి యెవ్వ రును బోఁజాలరు నీవేమిచేసిన నది నీమేలుకొఱకగును పల్లె వాఁడు తానాత్మ ననువృత్తితోఁ బనిచేసెనా పల్లెవాండ్రలో నాతఁడు శ్రేష్ఠుఁడగును విద్యార్థి తానాత్మ ననుకొని పనిచేసెనా యాతఁడుత్తమవిద్యార్థియగును అట్లే న్యాయవాది యగును. ఇట్లయిన జాతులు యథాప్రకారముగ నుండును కొన్నికొన్ని తరగతులుగ విభజింపఁబడుట సంఘమునకు స్వభావసిద్ధము ఏవి పోవును' జ త్యనుసారములగు నధికారములు. జాతిభేదమునవా జము సంఘమందు నేనొకపనిని జేసిన నీవొకపనిని జేయవలెను నీవు దేశమును బాలింతువు. నేను జెప్పులు కుట్టుదును. అంత

మాత్రముచేత నీవు నాకంటె నధికుఁడవగు టెట్లు ? నీవు నాచె ప్పులను బాగుచేయను జాలవు నేను దేశమును బాలింపను లేను విధులను బంచుకొని పనిచేయుట స్వభావసిద్ధము. నేను జెప్పులు బాగుచేయుటయందుఁ దెలివిగలవాఁడను నీవు వేదపఠనమందుఁ గట్టివాఁడవు అందు చేత నీవు నానెత్తిమీఁద కెక్కుట కేమి యధికారము గలదు ? నీవు నరహత్యఁజేసిన నిన్నుఁ బొగడి నేనొకజామపండు నపహరించిన నన్నుఁజీలియుదురా! ఇట్టిభేద ములు పోవును కాని జాతిభేదముండుట మంచిది జీవయాత్ర నడుపుటకు సహజమయిన యుపాయ మిదియే. మనుష్యులు జాతులుగ నేర్పడవలెను. అది తప్పదు. ఎక్కడకుఁ బోయిచూచి నను జాతిభేదము లుండి తీరును కాని, దానితోపాటు కొన్ని జాతుల కెక్కువ యధికారము గలదని యెంచరాదు అవి యన్నియు నశింపఁజేయవలెను నిమ్నోకపల్లెవానికి వేదాంతముప దేశించిన యెడల నాతఁడు "నేను నీవంటివాఁడనే నేను పల్లె వాఁడను నీవు తత్వశాస్త్రజ్ఞుఁడవు అయినను, నీయందున్న భగవంతుఁడు నాయందును గలఁడు" అని చెప్పును మనకుఁ గావలసినదే యిది ఎవ్వరికి నెక్కువ యధికారము వలదు అందఱకు సమానాధికార ముండవలెను. ప్రతివానికి లోనున్న యాత్మను బోధింపవలెను; బోధించిన నెవరి మోక్షము వారు సంపాదించుకొందురు వృద్ధికి స్వేచ్ఛయే మూలము.

"నే నీస్త్రీకి మోక్షము నిత్తును ఈబిడ్డకు ముక్తిఁగలుగఁ జేయుదును." అని చెప్పుట తప్పు విధవలవిషయముననుస్త్రీల విషయముననునీవేమి చెప్పెద వని పలుమాఱు నన్నుఁ బ్రశ్న

వేయుచు వచ్చిరి దీనికి నేనొక్కటే సమాధానమును చెప్పుచున్నాను "ఇట్టి తెలివి తక్కువ ప్రశ్న నన్నేల వేయుదురు? నేను వితంతువునా? ఆఁడుదానవా? వితంతువులయు స్త్రీలయు విషయములు పరిష్కరించుటకు మీ రెవ్వరు? ప్రతివితంతువును ప్రతిస్త్రీని బాలించెడు భగవంతులగా మీరు? దూరముగఁ దొలఁగిపొండు. వారికార్యములు వారే చక్కఁబెట్టుకొందురు. భగవంతుఁ డంతఱను రక్షించుచు ప్రతివిషయమును నీకే తెలియుచునుకొనుటకు మీ రెవ్వరు? ఓపాపిష్ఠులారా! భగవంతుని పైనఁగూడ మీకధికారము గలదని యనుకొనుటకు మీకేమి యీసాహసము! మీకర్మనుమీ రెఱిఁగియుండుఁడు అపారమగు కర్మ యచ్చట నున్నది. ఓ నింద్యులారా! మీసంఘము మిమ్ములను వ్యాసపీఠములం దెక్కించుఁగాక మీతోడివారు మిమ్ములను గొండయెక్కించి పొగడుదురు గాక బుద్ధిహీనులు మిమ్ము స్తుతింతురుగాక కాని పైనున్న భగవంతుఁడు నిద్రించువాఁడు కాఁడు అతఁడు మిమ్ములను బట్టి యిప్పుడో తరువాతనో శిక్షింపక మానఁడు. కాఁబట్టి ప్రతిపురుషుఁడును, స్త్రీయును భగవంతుఁ డనుకొనిచూడుఁడు మీరు సేవఁజేయఁగలరుగాని, యెవ్వరికి సహాయము చేయఁజాలరు భగవంతుని సంతానమునకును జీతనైనచో భగవంతునికిని సేవఁజేయుఁడు. భగవదభీష్టమయినచో నదియాతనిసంతానమగు నెవ్వరికైన సాయమగును. మీరు ఘనులమని మాత్ర మెన్నుకొనవలదు భగవత్సేవకు మీకధికారముండుటయు నితరులకు లేకుండుటయు మీభాగ్యమే మీసాయ మెవ్వరికి నక్కఱలేదు నిక్కముగు సహాయముదైవ

పూజ కొందఱు పేదవార లున్నయెడల నామోక్షముకొఱకు నేను పోయి వారిని బూజింతును వారియందుఁ భగవంతుఁడు గలఁడు కొందఱు దుఃఖభాజనులున్నయెడల నునము మన మోక్షముకొఱకుఁబోయివ్యాధిగ్రస్థుల మూలమునను నేరస్థుల మూలమునను నేరస్థుల యాకారమునను, వెఱ్ఱివాండ్ర రూపమునను గుష్ఠరోగులవలెను బాపాత్ములపోలికను గాన్పించు భగవంతుని మనము పూజింతుము"

ఈపలుకులు గడుసాహసములు కాని మనముపూజ చేసి తరించుటకవకాశముకలుగున ట్లియాకారము లన్నిఁటితోడను భగవంతుఁడు మనకు సాధ్యుఁడగుట మనపుణ్యము నీవొకనిని పాలించి వానికి మేలు చేయుదునను నభిప్రాయమును విడిచి పెట్టుము ఏదేనియొక్క మొక్కవిషయమునను నీవుచేయగలిగినదేమి? పెరుఁగవలసిన విత్తనమునకుఁ గావలసిన న్లు నీరు గాలి మొదలగు వానినిదానికడఁజేర్పుటమాత్రమునీవు చేయఁగలవు పిమ్మట దానికిఁగావలసిన వానినన్నిఁటని దానిస్వభావముననుఁబట్టి యదితీసికొని వానిం దనయందు లీనముచేసికొని వానిస్వభావముచొప్పున నది పెరుఁగును అట్లే ప్రపంచమునకుఁ జ్ఞానమును గలిగింపుఁడు ప్రతిమానవునికిని జ్ఞానమునుగలిగింపుఁడు ఒక్కొకఁడును భగవంతుని జేరుటకు పాటని తుదముట్టవలదు బీదలకునుజ్ఞానము కావలెను.పాదులకును గావలెను.కాని,వీరికి బీదలకంటె నెక్కుడు గావలెను చదువురాని వారికిని జ్ఞానము కావలెను. చదువుకొనినవారికి మఱింత కావలెను ఏమన, ఇప్పటి అల్పవిద్యచే దంభములు విపరీతమైనవి అట్లుగాక ఈరీతిగా

నందఱకును మంచిజ్ఞానమును గలిగించి,తక్కినదానిని భగవంతు నకు విడిచి పెట్టుఁడు "కర్మణ్యేవాధికారస్తు మాఫలేషు కదా చన"యని భగవంతుఁడు చెప్పియున్నాఁడు చేసినకర్మమునకీకు ఫల మెన్నఁడును వలదు. ఎన్నండును గర్మమును మానియు నుండవలదు మనపూర్వులకును మనకు నట్టిమహత్తరమైన యుఁ దేశమును గావించిన యాప్రభువు తనయాజ్ఞానుసారము వర్తించుటకు మనకు సామర్థ్య మొసంగుఁగాక!

## "చెన్నపురి - నాల్గవప్రసంగము"

### భరతఖండమహాత్ములు

భరతఖండములోని మహాత్ములను గూర్చి యుపన్యసింపఁ దలంచితిని కాని నామనస్సు చరిత్రశోధకు లూహించి తెలిసి కొనుటకు సాధ్యపడని పురాతనమగు కాలమునందు నిలిచి యున్నది ఆకాలపు ఐతిహ్యములు కూడ దురూహ్యములు. అయినను వేలకొలఁది మహాత్ములు మనదేశమునం దవతరించి యుండకపోరు ఏలన, ఇన్ని వేలేండ్లుగా నెందఱో మహాత్ము లీహిందూదేశమునందు జన్మింపకయుండరు? అట్టి వారిలోఁ బ్రఖ్యాతినొందిన మహాత్ములను కొందఱను గూర్చి చెప్పెదను. ప్రథమమున మనకుఁ బ్రమాణముపై యుండు శాస్త్రములను గూర్చివిచారింపవలసి యున్నది. అనఁగా మనశాస్త్రములయందు ద్వివిధవిద్యలు గలవు ఒకటి పరవిద్య. ఇంకొకట అపరవిద్య. పరవిద్యనిత్యమైనది అపరవిద్య విశేషప్రమాణము కలది కాక పోయినప్పటికిని, కాలదేశవర్తమానముననుసరించి యదిప్రమా

మైయున్నది జీవాత్మలక్షణము, పరమాత్మలక్షణము, మోక్ష లక్షణము, జీవేశ్వరసంబంధలక్షణము, మోక్షలక్షణము అను త్యతత్త్వము లణంగిన జ్ఞానసంగ్రహమును మనము శ్రుతి యనియు, వేదమనియు వ్యవహరించెదము దీనికి రెండవ పిట్టున నుండు ధర్మతత్త్వసంగ్రహమును స్మృతి యనెదము ధర్మశాస్త్రములను మనువు, యాజ్ఞవల్క్య మొదలగువారు రచియించిరి ఈధర్మములు పురాణములు మొదలు తంత్రముల వాఁక నుండు గ్రంథములయందుఁ జెప్పఁబడియున్నది అయి నను, శ్రుతులకంటెను స్మృతులు విశేషములుగావు ఏలన, శ్రుతులకంటె స్మృతులు ప్రమాణములు కావు శ్రుతులే ప్రబలప్రమాణములు మనుష్యులు పరగతినొందుటకుఁ దగిన విషయము లన్నియు శ్రుతులయందే చెప్పఁబడి యున్నవనియు, వాని విశేషవివరణములు స్మృతులయందును పురాణముల యందును జెప్పఁబడి యున్నవనియును దెలియఁదగును పర మార్గసాధనమునకు వలయు మూలతత్త్వసంబంధవిషయము లన్నియు వేదములయందే గలవు ఈవిషయము లితర గ్రంథ ములయం దంత విస్తరముగఁ జెప్పఁబడియుండలేదు ఏదేది అత్యావశ్యకమైనదో యది మున్నే తెలిసికొనఁబడెను జీవాత్మ పరిపూర్ణస్థితినిఁ బొందుటకు వలయు విషయము లన్నియు శ్రుతులయందుఁగలవు అయినను వీనివిశేషవివరములు శ్రుతుల యందు జెప్పలేదు కావుననే, అవి స్మృతులయందు జెప్పఁ బడెను. ఇంకొకవిశేష మేమన, శ్రుతులందు చెప్పఁబడిన సత్యవాక్య ములను మహర్షు లనేకులు స్వానుభవముచేఁ దెలిసికొని చెప్పి

నారనియేసిద్ధాంతము వారిలో ననేకులు పురుషులును, స్త్రీలును గొందఱు కలరు వారినే మంత్రద్రష్ట లనెదము. వారిజీవితచరిత్రము లంతగా మనకుఁ దెలియకపోయినను వారి విశేషాభిప్రాయములను వారు భగవత్కృపచేఁ దెలిసికొన్న స్వానుభవవిశేషములును మనదేశమునందు మహాప్రసిద్ధమై యుండు పరిశుద్ధమైన వేదములలోఁ గనంబడుచున్నవి స్మృతులందును పురాణములయందునుమహాపురుషులదివ్యచరిత్రములు నిండియున్నవి. ఆస్మృత్యాదులయందు ప్రపంచమును భేదించునట్టి శక్తిగల మహాపురుషులదివ్యరూపములు కనులఁగట్టినట్లు కాన్పించుచున్నవి. వారిమహోపదేశములకంటెను వారిదివ్యాకృతులు మహానందము నొసంగుచున్నవి

మఱొక విశేషముకలదు అనఁగా, మనమతము సగుణ నిర్గుణ స్వరూపబ్రహ్మమును బోధించుచున్నవి అయినను, మనమతమునకు ముఖ్యప్రమాణమైన వేదములు నిర్గుణబ్రహ్మమునే ప్రశంసించుచున్నవి స్మృతులయందును పురాణములయందును, సగుణబ్రహ్మమునుగూర్చి ప్రశంసింపఁబడియున్నవి వీనియందు భగవంతునిదివ్యావతారములయు, భగవత్కృపకు పాత్రులగు మహాత్ములయు చరిత్రలుకలవు. ఈసగుణబ్రహ్మవాదమునందే మన మతమునకును పరమతములకును పోరాటము కలదు. ఎట్లన, మనమతముతక్క, ప్రపంచమందలి తక్కినమతములన్నియునామతస్థాపకులజీవితచరిత్రముల యాధారముచేత జీవించియున్నది క్రీస్తుమతము ఏసుక్రీస్తుచరిత్రమనెడి పునాదిపై కట్టఁబడియున్నది ఇట్లే, మహమ్మదీయమతము, బౌద్ధ

మతము, జైనమతము మొదలగునవియు నేర్పడియున్నవి కాఁబట్టి, ఈమతములను స్థాపించిన మహాపురుషులచరిత్రములు వాస్తవములు గావని సిద్ధాంతికమైనపుడు ఈమతము లన్నియు నిరాధారములై నశించును మన మతముమాత్రము శాశ్వతముగానిలిచియుండును. దీనికింగారణ మేమనఁగా, మనమతమును కేవలము పురుషులుస్థాపించినది కాదు. అపౌరుషేయమును నిత్యతత్త్వములనుఆధారముగాఁగలదియునై యున్నది మనమతమును మన మనుష్ఠించుటకుఁ గారణ మేమన, అది యొకమహర్షిచే ననుష్ఠింపఁబడినదని, గాని, లేక, అవతారపురుషునిచే నేర్పఱుపఁబడిన దనిగాని కాదు వేదములకు కృష్ణమూర్తి ప్రమాణముకాదు కృష్ణమూర్తికి వేదములు ప్రమాణము. వేదాంతమును బోధించినవారిలో శ్రీకృష్ణమూర్తి శ్రేష్ఠులనుటంబట్టియే వారికి మహిమకలిగినది అట్లేతక్కినఅవతారపురుషులచరిత్రలు నని తెలియఁదగినది మన మూలసిద్ధాంత మేమన, మనుజుఁడు పరిపూర్ణదశనొందుటకును, ముక్తినొందుటకునువలయువిషయములన్నియు వేదములయందే కలవు వానిలోలేనివేవియు నీకుఁగ్రొత్తగా కనిపెట్టవలసినది లేదు. జ్ఞానముయొక్కపారమునెడి పూర్ణైక్యమును దాఁటి చనుటయును నదిసాధ్యము కానిపని అది అసంభావితము ఈహద్దు మునుపే యేర్పడియున్నందున నీకు దానిని గడచుటకుఁగానేరదుకదా "తత్త్వమసి" అను మహావాక్యము ఎప్పుడు ప్రవర్తించినదో, అప్పుడే తత్త్వజ్ఞానముసంపూర్ణమైనది ఈ మహావాక్యము వేదములో

నిది వేదములోఁ జెప్పఁబడక యుండునవియేవనఁగా, కాలదేశ వర్తమానముల ననుసరించి ప్రజలకువిధినిషేధములను బోధించు ధర్మములు మాత్రమే జనులను సన్మార్గమునందు సంచరించున ట్లొనర్పుటకొఱకే మహాత్ములును, ఆచార్యులును, మునీంద్రులును అవతరించిరి. ఈవిషయమునుగూర్చి గీతయందుఁ జెప్పఁబడి యున్నది

శ్లో. "యదాయదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానుస్సృజామ్యహమ్.
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"

"ఎప్పుడు ధర్మనాశము, అధర్మవృద్ధియుఁ గలుగునో అప్పుడు నే నవతరింతును శిష్టులను రక్షించుటకును, దుష్టులను శిక్షించుటకును, ధర్మమును స్థాపించుటకును ప్రతియుగమందును అవతరింతును" ఇదే హిందూదేశమతస్వభావము

ఇంతదనుకఁ జెప్పినదాని సారాంశ మేమనఁగా, స్వతః ప్రమాణమై, తర్కము లాదిగాఁగలవాని యపేక్షలేనిదై, ఎట్టి మహిమగలమహర్షులయు అవతారపురుషులయు అభిప్రాయము లకులోఁబడనిదియు నగు నిత్యతత్త్వములను ప్రమాణముగాఁ గలసిద్ధాంతము ప్రత్యేకముగానున్నది ఇట్టిసిద్ధాంతముహిందూ దేశమునం దుండుటంబట్టియే సకలజనులను సామాన్యముగా ననుసరింపఁదగిన మతము వేదాంతముతప్ప వేఱే లేదని చెప్పు టకు మన కవకాశము గలిగియున్నది. అది కేవలము మహాపురు

షులనుగూర్చి మాత్రము ప్రశంసింపఁబడక పరమ పురుషార్థ తత్త్వములను సైతము బోధించుటంజేసి, ప్రపంచమునందు సర్వార్హసమ్మతమై వెలయుచున్నది కేవలము ఒక్కపురుషుని చరిత్రమునుమాత్ర మాధారముగాఁగల మతమేదియు సకల జనులచేతను అంగీకారకృతము కానేరదు మనదేశమునందనేక మహాత్ము లవతరించియున్నారు ఒక్కొకప్రదేశమునందును వారి వారిమనోస్థితికిఁ దగినట్లు ఆమహాత్ములలోఁ గొందఱను ప్రమాణ ముగా నంగీకరించి యున్నారు అట్లుండఁగా, మహమ్మదు, బుద్ధుఁడు, క్రీస్తువు అను వీరిలో నెవరినేని యొకరిని లోక మంతయు ప్రమాణముగానంగీకరింపవలయుననినసాధ్యమగునా? ఇంతియగాక, లోకములోని సదాచారము, ధర్మము, జ్ఞానము, భక్తి అనునివియన్నియునాయొక్కపురుషుని సమ్మతివడసియుండి నప్పుడు మాత్రమే అది సత్యమగును ఇది సాధ్యమా? అయినను వేదాంతమతమున కటువంటి పౌరుషేయప్రమాణము ఆవశ్యకములేదు మనుజునినిత్యాత్మస్వరూపమే దానికి ప్రమా ణము అది ప్రేరించు సదాచారమునకు మనుజుని అధ్యాత్మ నిత్యచిన్మయస్థితియే ఆధారము ఇట్టి చిన్మయస్థితి పూర్వమే యున్నదియును, పొందఁబడినదియు నై యున్నదేగాని యిఁక పొందవలసినదిగాదు (ఏలన,అదియే ఆత్మయొక్క వాస్తవస్వరూ పము) ఇదేమనదేశముయొక్క వాస్తవస్థితియగు జ్ఞానతత్త్వము అయినను, సామాన్యజనుల కిది కష్టసాధ్యమై యున్నందున, వారుసులభముగాఁ దెలిసికొని అనువర్తించుటకై యొకమహా

పురుషుని అనుష్ఠానమును దివ్యచరిత్రమును ఆవశ్యకమనుటను చాలా కాలమునకుమును పేనునమహర్షులు తెలిసికొనియున్నారు.

సగుణ బ్రహ్మవాదమును నిరాకరించి యుపదేశము చేసిన బుద్ధమునినే యతఁడు గతించిన యేఁబదియేండ్ల కంతయు నతనిశిష్యు లతని భగవంతుని గావించిరి కాఁబట్టి సగుణరూప భగవంతుఁ డావశ్యకమని సిద్ధించుచున్నది అయినఃప్పటికిని మన మే మన మనస్సంకల్పముచే సృష్టించిన వ్యర్థమైన భగవంతునిక౦టెను, మన కాలములోనే పుట్టి మనతో మైత్రి సల్పిన ప్రత్యక్షమహాత్ములే శ్రేష్ఠులు మనము ఏభగవంతుని కల్పింపవలసినది లేదు అట్లు కల్పించిన దేవుని పూజించుటకంటె మహాత్ములను పూజించుటయే మేలు.

మీరుగాని నేనుగాని కల్పింపఁదగిన యీశ్వరభావనకంటెను, శ్రీకృష్ణమూర్తి చాలశ్రేష్ఠుఁడు కదా! మీరుగాని నేను మనస్సులో భావింపఁదగిన యేవిధమైన భావనకంటెను బుద్ధుఁడు పరమోత్తమమైన ప్రత్యక్షపరపూర్ణ భావన కాదా ? కావుననే లోకులు కల్పితదేవతల నుపేక్షించి మహాత్ములను పూజించుచున్నారు ఈవిషయమును మనపూర్వులు తెలిసియే మహాత్ములను అవతారపురుషులను పూజించిరి ఇంతమాత్రమే గాక, అవతారపురుషులలో నుత్తముఁడైన యవతారపురుషుఁడగు శ్రీకృష్ణమూర్తి యిట్లని చెప్పియున్నాఁడు

శ్లో "యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా
తత్తదేవాఽవగచ్ఛత్వం మమ తేజోఽంశసంభవమ్."

"ఐశ్వర్యము, బలపరాక్రమము, ఉత్సాహము, కాంతి అనువీనితోఁ గూడియుండు వస్తువు లేవేవిగలవో, అవియంతయు నా తేజస్సుయొక్క అంశమువలనఁబుట్టినవని తెలిసికొనుము

ఇందువలన సకలదేశములందుఁ బుట్టిన అవతారపురుషులను హిందువు లేయాటంకమును లేక పూజింపవచ్చునని సిద్ధించుచున్నవి కదా ఏదేశమునందు జన్మించినను,ఏఋషియైనను, ఏజ్ఞానియైనను హిందువులకు పూజనీయుఁడే మనము కొన్ని సమయములయందు క్రీస్తుదేవాలయములకును, మహమ్మదీయుల మసీదులకును పోవుట ప్రత్యక్షమే కదా అట్లు చేయుటయే మంచిది. అందువలన దోషమేమి? మనమతము సర్వసాధారణమతమని మున్నే చెప్పియున్నాఁడను అది సకలమతములను తనలో నైక్యము చేసికొనునట్టి శక్తికలది. ఈలోకములో నిదివఱకు ప్రచారమున నుండు సకలమతసిద్ధాంతములను మనమతములోఁ జేర్చుకొని, యింక నూతనముగా నేర్పడు మతసిద్ధాంతములనుగూడ నారీతిగానే హిందూమతమనెడివిశాలమైన హస్తములచే నాలింగనము చేసికొనుటకై మనము వేచియుండవచ్చును.

ఇదియే మహాపురుషులను గుఱించియు, ఈశ్వరావతారములను గుఱించియు చెప్పఁబడిన సిద్ధాంతము వీరుగాక యితర మధ్యమపురుషులును గలరు వేదములందు అచ్చటచ్చట ఋషియను పదము ప్రయోగింపఁబడి యున్నది ఇక్కాలమునం దాపదము సర్వసాధారణముగా వాడఁబడుచున్నది అన్నిటికిని ఋషినే ప్రమాణముగా నంగీకరించుటకుఁ గారణమేమి?

"ఋషిర్మన్త్రద్రష్టా" "ఋషి-యనునతఁడు మంత్రద్రష్ట" అనఁగా ఋషిమంత్రములను యోగానుభవముచేఁ జూచినవారని వేదములందుఁ జెప్పఁబడియున్నది. ఇట్టివారే ఋషులు అని యర్థము మతము సత్యమనుటకు ప్రమాణమేమి? దానిని నిరూపించుటకుఁ గాదు

"యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ."

"దేనిని పొందుటకుఁ గాక వాక్కు మనస్సుతో మఱలుచున్నదో" అనియు,

"నతత్ర చక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతి"

"అచ్చటికి కన్నులు పోవు, వాక్కుపోదు" అని వేదము మొఱపెట్టుచున్నది ఆత్మనిశ్చయము, ఈశ్వరనిశ్చయము, నిత్యానందజీవితము, ఉత్తమపురుషార్థము అను నీ మొదలగు విషయములను బహిర్ముఖముగాఁ దెలిసికొనుటకు సాధ్యముకాదు దీనియందు ప్రవర్తించు మనస్సు ఎడతెగక మాఱుచుండునది గను, నిరంతరము చలించుచుండు నదిగను, ఖండవ్యాప్తిగలది గను నుండుటంబట్టి, అది అనంతమై, నిష్కళమై, అఖండమై, నిత్యమై యుండు పరవస్తువు నెట్లు తెలిసికొని చెప్పఁగలుగు? కానేరదు ఈవిషయమును గూర్చి ప్రాణము లేని జడరూపమైన ప్రకృతియందు శోధించి నిజమును కనిపెట్టుటకుఁ గాక, శ్రమపడినవా రెందఱో గలరు అట్లయినయెడల, వేదములందు ప్రతిపాదింపఁబడుజ్ఞానక్రమమేమి? అనఁగా, అది ఋషిమూలముగా కలిగినదని చెప్పుదుము ఈజ్ఞానము ఇంద్రియము

లందలిది కాదు. అజ్ఞానమే యింద్రియములుగాను మనుజుఁడు పొందవలసిన ఉత్తమపురుషార్థముగాను నున్నది ఇంద్రియములే మనుష్యుఁడు పొందవలసిన యుత్తమపురుషార్థమని యెవ్వరు ధైర్యముతోఁ జెప్పుదురు? మనము మిక్కిలి ప్రేమించియున్న స్నేహితులమరణమును ప్రత్యక్షముగాఁజూచినపుడును, మనకు మహాపదసంభవించినపుడును, లేక మహానందము కలిగినపుడును, కొంతసేపు మనమనస్సు నిశ్చలమై, ఆసమయమునందు మన నిజస్థితి తెలిసినట్లును, మనస్సునకును వాక్కునకును అందనట్టి చాలదూరమునందుఁగల మేరలేని పరాకాశములోని మహాతేజస్సునుమిణుఁగురువంటి అల్పప్రకాశమువలెమన మనుభవించునట్లునుతోఁచుచున్నది ఇదిసామాన్యమైనఅనుభవము దీనినే పరమార్థమునందు అభ్యసించి పరిపూర్తిచేయవలయును. ఆత్మ ఇంద్రియములచేఁ గట్టువడదనియును, లెక్కింపవలవి కానిదనియును, ఎఱుకచేతఁగూడ లెక్కింప సాధ్యము కానిదనియును చాలకాలమునకు మునుపే మనవారు కనిపెట్టియున్నారు

ఎఱుక, లేక, చైతన్యము (కాన్షెన్సు) అనునది అఖండజ్ఞానమనెడి గొలుసులోని యొక యంశమునకుఁ బేరు బ్రహ్మమును చైతన్యమును ఒకటిగాదు చైతన్యమనునది బ్రహ్మము యొక్క యేకాంశము చైతన్యమునకు రానిచోటనే ధీరులుసత్యవస్తువును వెదకుచున్నారు చైతన్యముఇంద్రియములకుఁగట్టువడినది దీనికిఆవలను,ఇంద్రియములకు ఆవలనునుండుఅధ్యాత్మతత్త్వమును తెలిసికొనవలయును. ఇట్లుఇంద్రియముల యొక్క మేరను దాఁటి కాయసిద్ధికొందినపురుషు లిప్పటికిని గలరు వీరికే బుర

షులని పేరు వీరే అధ్యాత్మతత్త్వమును ప్రత్యక్షముగాఁ జూచినవారు ఇట్టి ప్రత్యక్షానుభవమే వేదప్రమాణనిరూపణము నాయెదుటనుండు బల్ల వాస్తవముగా నున్నదనుటకు నేను ప్రత్యక్షముగాఁ జూచుటయే కదా. ప్రమాణను అలాగే వేదములలో జెప్పఁబడినవిషయములు సత్య మనుటకు ఋషులయొక్క ప్రత్యక్షతత్త్వదర్శనమే ప్రమాణము ఈబల్లను నాయొక్క యింద్రియములచే నెఱుఁగుచున్నాను అట్లే అధ్యాత్మతత్త్వనిజస్థితిని, ఆత్మయొక్కయింద్రియాతీతజ్ఞాన దశయం దెఱుఁగుచున్నరను

ఈఋషిస్థితి కాలదేశములచేతను, స్త్రీపురుషజాతులచేతను ఆర్యానార్య లనెడి జనసమూహభేదములచేతను బాధింపంబడనిది ఈఋషిత్వము ఋషుల సంతతివారైన ఆర్యులకును, అట్టివారు కానట్టి అనార్యులకును, వేయేల? మ్లేచ్ఛాదులకును సమానబాధ్యతగల వస్తువని వాత్స్యాయన ముని ధైర్యముతోఁ జెప్పను ఇదియే వేదోక్తమైన ఋషిత్వము. హిందూదేశముయొక్క మహాభాగ్యమైన యీజ్ఞానమును నిరంతరమును జ్ఞాపకమునం దుంచికొనవలయును ఈవిషయమును ప్రపంచములోని విదేశీయు లెల్లరును నేర్చికొందురేని జగడములును సంకటములును లేకపోవును మతసిద్ధాంత మనునది గ్రంథములయందును, పద్ధతియందును, మతసిద్ధాంతములయందును, మతవిషయవచనములయందును, మతవాదములయందును లేదు ఋజుమార్గమునసుండి క్రమక్రమముగా పరిపక్వదశను బొంది పరగతి నొందుటయే నిజమైన మతము

సోదరులారా! మీలో నొక్కొకరును ఒక్కొకఋషియై అధ్యాత్మవిషయములను ప్రత్యక్షముగాఁ జూచునంతదాఁక మత వైరాగ్యము ప్రారంభము కాలేదనియే చెప్పఁగలను. ఇంద్రియాతీతమైన జ్ఞానము మీకుఁ గల్గునంతదాఁక మతవైరాగ్య మనునది ఉత్తమాటలుగాను, సాధనముగాను నేర్పడును మీమాటలన్నియు రెండవ, లేక మూఁడవతరగతిమాటలేగాని వేఱుగాదు. ఈవిషయమై బుద్ధదేవుఁడు బ్రాహ్మణులతో వాదించినపుడు వారినిఁ జూచి,'మీరు బ్రహ్మలక్షణమును జెప్పుచున్నారేగాని బ్రహ్మమును జూచితిరా!'అని, వారు "లేదు"అనిరి మరల, "మీతండ్రియైననుజూచినాఁడా?"అన,"లేదు"అనిరి తర్వాత"మీతాతయైనను జూచెనా?" అన,'లేదు'అనిరి అంతబుద్ధదేవుఁడు,"ఆబ్రహ్మమును మీతండ్రితాతలేచూడకుండఁగా, మీరేలవాదముచేసి యితరుల నోడింపఁ బ్రయత్నించెదరు" అనెను. కాఁబట్టి వృథావాదము ప్రయోజనము లేనిది మన వేదాంతములయందు, "నాయమాత్మా ప్రవచనేన లభ్యోనమేధయా న బహునాశ్రుతేన" "ఈఆత్మ, తలుచుగా మాటలాడుటచేతను, ఉత్కృష్టమైన బుద్ధిచేతను, వేదాధ్యయనముచేతను పొందుటకుఁ గాదు"అని చెప్పఁబడియున్నది కాబట్టి లోకులనుజూచి వేద వాక్యానుసారముగానిట్లని చెప్పుదును___మీ వాదములన్నియు వ్యర్థములు ఏదేవునిఁగూర్చి వాదింపఁదొడంగుదురో ఆదేవుని మీరుచూచితిరా మీరుచూడనియెడల మీవాదమువ్యర్థమే? మీరుచెప్పునదియిట్టిదని మీకుఁదెలియదు మీరుభగవంతునిఁజూచియుందు

రేని వాకింపరు. మీాముఖమునందు బ్రహ్మతేజస్సు ప్రజ్వలించు చుండును పూర్వకాలంబున ఉపనిషత్తులందు ప్రసిద్ధులైన ఋషీశ్వరు లొక్కరు బ్రహ్మము నెఱుంగుటకై తనకుమారునిఁ బంపఁగా, నతఁడు పోయి మరలవచ్చెను అంత కుమారునిం గాంచి "నీవేమి తెలిసికొంటివి?" అన, ఇన్ని శాస్త్రములను జదివితిని" అనెను తండ్రి "ఇది ప్రయోజనకారిగాదు.—ఇంకొక సారి పొమ్ము" అన, కుమారుఁడు మరల పోయివచ్చెను అపుడు తండ్రి, "నీవేమి తెలిసికొంటివి?" అనఁగా, కుమారుఁడు, "ఆశాస్త్రములనే తెలిసికొంటిని" అనెను తండ్రి, "ఇది వ్యర్థమైనది.— మరల పొమ్ము" అనిన తనకుమారుఁ డాలాగే పోయిరాఁగా, ఆచిన్న వానిముఖము మహాప్రకాశమానమై యుండెను. వెంటనే తండ్రి లేచి, "నీవు బ్రహ్మజ్ఞానివైతివి" అనెను ఈరీతిగా మీాకెప్పుడు బ్రహ్మజ్ఞానము కల్గుచున్నదో అప్పుడే మీాముఖమును, మీాకంఠమును, మీాస్వభావమును మాఱిపోవును అప్పుడు మీారు ఋషియగుటను నిరోధింప నేరికిం దరము కాదు ఇదే మనమతమును గోచరింపఁజేయు ఋషిత్వము. ప్రసంగములు, శాస్త్రములు, వాదములు, ద్వైతాద్వైతములు, వేదములు, ఇవి యన్నియు రెండవపక్షమే మున్ను చెప్పినదే మొదటిపక్షము వేదాంగములన్నియు మధ్యపక్షము అపరోక్షానుభూతిని గోచరింపఁజేయు జ్ఞానమే ఉత్తమజ్ఞానము ఇట్టి యనుభవము గలవారు వేదములందుఁ జెప్పఁబడిన ఋషులు ఋషిత్వమే మనుష్యు లెఱుంగవలసినట్టి ఉత్తమస్థితియని తెలిసెడిని. మన మెన్నిజన్మములకైనను ఋషిత్వ

మును బొందవలయు ననుటయే మనహిందూమతసిద్ధాంతము దీనినే ప్రతిమనుష్యుఁడును అపేక్షించునది ఇదియే ముక్తి స్థానము అనేక దేవాలయములకును, అనేకనదులకును జనుట వలనఁ బ్రయోజనము లేదు మంత్రద్రష్టయగు ఋషియగుట మోక్షము అదే పరమపదము

పైని చెప్పఁబడిన కాలమునకుఁ దర్వాత, లోకులందఱును తప్పాశ్రయించునట్టి శక్తిగలమహాత్ములును అవతారపురుషులును జన్మించిరి వీరి సంఖ్య అనంతమని భాగవతమునందుఁ జెప్పఁబడియున్నది ఈయవతారములో రామకృష్ణావతారములు మిక్కిలి పొగడఁదగినవి ,వీరు హిందువులచే ముఖ్యముగాఁ బూజింపఁబడుచున్నారు శ్రీరాముఁడు దేవతలచేస్తుతింపఁబడు క్షత్రియులవీరచూడామణి అతఁడు సత్యమునకు స్థానము. ధర్మమునకాలవాలము సర్వోత్తముఁడు. ఉత్తముఁడగు తండ్రియును, ఉత్తముఁడగు పుత్త్రుఁడును, ఉత్తముఁడగు భర్తయును అతఁడే. అతని పుణ్యచరిత్రమును వాల్మీకిముని వర్ణించియున్నాఁడు వాల్మీకివలె పరిశుద్ధముగను,మృదువుగను,సరళముగను వర్ణించువాఁ డెవ్వఁడేని గలఁడా? లేనే లేఁడు సీతాదేవిని గూర్చియో—చెప్పుట కేరితరము? లోకములోఁగల గ్రంథములన్నిటిని వెదకినను అట్టి స్త్రీరత్నము కనబఁడదు. ఆమెతో సమమైన స్త్రీయే లేదు "నభూతో నభవిష్యతి"-"కల్గినది లేదు. కలుగఁబోవుటయు లేదు" రామునివంటివా రుండవచ్చునేమో గాని సీతవంటివారు కలుగరు భరతఖండస్త్రీలు ఈరీతిగా వర్తింపవలయు ననుటను దెలియఁబఱచుటకు ఆమెయే లక్ష్యము.భరత

ఖండము నందలి యుత్తమ స్త్రీలలక్షణము లన్నిటికిని ఆపరిశుద్ధు రాలగు సీతాదేవిజీవితమందలి యాశయములే కదా లక్ష్యమై తనరుచున్న ది ఆర్యావర్తమునందుఆబాలవృద్ధపర్యంతమూసీతా మహాదేవి అనేకసహస్రవర్షములుగా పూజింపఃబడుచున్నది. ఏల ? ఉత్తము రాలు, మహానుభావురాలది పరిశుద్ధురాలు. సహనశక్తిగలది మహాపతివ్రత సతీతిలకము. జనకరాజగృహ దీపము అకలంకచరిత ఇట్టిసీతనుగూర్చి వర్ణింప నేరికిసాధ్యము? మఱియు బిగాకందలఱు నామహాదేవి దివ్యచరిత్రము దెలియును. మనదేశములోని సకలపురాణేతిహాసములును, వేదములును, భాషలును పాడిసప్పటికిని, హిందువు లీదేశములో నున్నంత కాలము సీతాదేవి దివ్యచరిత్రముండును ఇవి నుమ్మాటికిని సత్యము ఇంకొకమాటవినుఁడు సీతాదేవి,హిందూ స్త్రీపురుషుల ప్రాణధాతువులయందు ప్రవేశించియున్నది కావున మనమందఱ మును సీతాదేవి పుత్త్రులముకదా' మనయొక్క స్త్రీలను తత్కా లపునాగరకతకు లోనగునట్లు కావించుటకై యెన్ని ప్రయత్నము లొనర్చినను, అదిఁ తాదేవియొక్క సదాచారములకు విరుద్ధము లుగానుండునేని, అది ప్రయోజనము కాకపోవుటను మనము ప్రతిదినమును జూచుచున్నారము సీతాదేవి పద్ధతులనే మన స్త్రీ లును అవలంబించి వృద్ధినొందవలయును ఇదియే మనస్త్రీలకు ఉత్తమమైన మార్గము

"దీనికిఁ దర్వాత పూజింపబడు పరమపురుషుఁడు శ్రీకృష్ణ మూర్తి ఇతనినే స్త్రీలును, పురుషులును, బాలురును, బిడ్డలును పూజించుచున్నారు ఇతఁడు సాక్షా ద్భగవంతుఁడు. తక్కిన

దైవములు అంశావతారములు శ్రీకృష్ణమూర్తియొక్క గుణ విశేషములు అత్యద్భుతములు ఇతఁడు మహాశ్చర్యకరమైన సన్న్యాసిగాను, గృహస్థుఁడుగాను ఒక్క సమయమునందే యుండినవాఁడు అత్యాశ్చర్యకరమగు రజోగుణస్వరూపమైన అధికారశక్తి యతనికిఁ గలదు గాని, అతనికత్యద్భుతమైనవైరాగ్యమును నెలకొని యుండెను శ్రీగీతయొక్క సారస్యము నెఱిఁగిన వారికిమాత్రమే యీవిషయము తెలియును తక్కిన వారికి తెలియదు శ్రీకృష్ణమూర్తి యుపదేశమున కతఁడే లక్ష్యభూతుఁడై యుండినాఁడు అతఁ డుపదేశించిన తత్త్వముల ననుష్ఠించి చూపినవాఁ డతఁడే ఆగీతకు అతఁడే వ్యాఖ్యానముగా నుండెను అతఁ డనేకులను, సింహాసనాసీనులను జేసెను. తానేమో సింహాసన మలంకరింపలేదు భరతఖండము లోని రాజు లెల్లరు నతనిమాటకు లోఁబడి వర్తించుచుపాదాక్రాంతులై యుండిరి అయినను తాను మాత్రము రాజుగా నుండుటకుఁ గోరలేదు అతఁడు సామాన్యుఁడుగానే గోపస్త్రీలోలుఁడై యుండెను ఎప్పుడు నట్లేయున్నాఁడు ఇప్పుడు నట్లేయున్నాఁడు అతని అద్భుతచరిత్ర నేమని చెప్పవచ్చును? అతఁడు ప్రతిగోపికయందును ప్రేమగలవాఁడై యుండెను ఆదివ్యలీల మనోవాక్కాయములందును పరిశుద్ధమై పొందరానిదై యితరులెఱుంగఁ గూడనిదై మహోత్కృష్టమైనదికదా? బృందావనమునందు జరిగినట్లువర్ణింపఁబడిన యాదివ్యనాటకముయొక్క స్వారస్యమును ప్రేమామృతపానము చే మైమఱచినవారు తప తక్కినవా రెట్లెఱుంగుదురు?

గోపికలయొక్క ప్రేమరహస్య మెవ్వ రెఱుంగుదురు? ప్రేమపరిపూర్తి వారియొద్దనే కనుంగొనందగును. అదేకదా ఇతరమును గోరని ప్రేమము స్వర్గమును లక్ష్యము చేయని ప్రియము. ఈలోకములోఁ గాని, వేఱే యేలోకములోఁగాని దేనిని లక్ష్యపెట్టని ప్రేమ యది యొకటియే

సోదరులారా! గోపికాస్త్రీల ప్రేమవృత్తాంతముచేతనే సగుణ నిర్గుణ వివాదమునకు సమాధానము నెఱుంగఁదగు. ఈ లోకయాత్రలో సాధ్యమైనదియు శ్రేష్ఠమైనదియు నగు భావన సగుణబ్రహ్మమే యని మనకుఁ దెలియును. అటు లుండియు, మన యింద్రియములకు విషయమగు ప్రత్యక్షమైన వస్తు వేదియో దానిని తెలిసికొనవలయు నని మన మనస్సు కోరుచున్నది. దాని పాదములయందు మన హృదయము నర్పించి తైలధారవలె నెడతెగక మనప్రేమను సమర్పణము చేయఁగోరెదము. కాఁబట్టి మనుష్యస్వభావముచేత సగుణబ్రహ్మము కోరఁదగినదై యున్నది యుక్తియు దీని కనుగుణముగానే యున్నది బ్రహ్మసూత్రములలోని పూర్వవాదములే యిచ్చోటను కలుగుచున్నది ఇదియే ద్రౌపదీదేవి ధర్మరాజు నడిగిన ప్రశ్నమునై యున్నది ఎట్లన, 'సర్వదయాపరుఁడై, సర్వశక్తిమంతుఁడై యుండు సగుణరూపుఁడగు భగవంతుఁ డొకఁడు గలఁడేని నరకతుల్యమగు నీభూలోక మేల యుండవలయును? అతఁడు దీని నేల సృజించెను? అతఁడు పక్షపాతిగా నుండవలయును' దీనికిం దగిన సమాధానము తోఁచలేదు అయినను, గోపికలవంటి ప్రేమయే దీనికి సమాధానము ఎట్లనఁగా, శ్రీకృష్ణుని వర్ణించు

నట్టి ప్రతివిశేషణములు వారు త్యజించిరి అతఁడు లోకమును సృష్టించునట్టి కర్తయనియును, సర్వజ్ఞుఁడనియును, సర్వేశ్వరుఁడనియును, కేవలుఁడనియును వారు తలంచలేదు వారి ముఖ్యాభిప్రాయము అపారప్రేమగానున్నాఁడనియే. ఆప్రేమయే వారికి సర్వమునై యుండినది గోపికలకు శ్రీకృష్ణపరమాత్మ బృందావనంబునఁ గ్రీడించు బాలకృష్ణుఁడని మాత్రమే తెలియును దేవాదిదేవుఁడును రాజాధిరాజును అగుపురుషోత్తముఁడు గోపికలయెడ గొల్లపిల్లకాయగనుండినాఁడు మఱియు,

శ్లో॥ "నధనం నజనం నసున్దరీం కవితాంవా జగదీశ కామయే।
మమజన్మని జన్మనీశ్వరభవతాద్భక్తిరహైతుకీత్వయి"॥

అనఁగా, సంపద వలదు బంధుజను లక్కఱలేదు విద్య వలదు. స్వర్గలోకయాత్రయు నావశ్యకములేదు అయినను, నాకెన్ని జన్మములు సంభవించినప్పటికిని నీపాదారవిందముల యందలి ప్రేమకొఱకు ఫలాపేక్షలేక ప్రేమ నర్పించుటకు మాత్రము వరమిమ్ము స్వామీ? అను నిట్టి భక్తితోఁ గూడిన యభిప్రాయమే గోపికలకుఁ గలిగియుండెను మన మతమందలి యుత్కృష్ట మంతయు నీభక్తియందే యున్నది ఇతరఫలమును గోరకు ప్రేమకొఱకే ప్రేమము నర్పింపవలయు ననుటయును, కర్మముకొఱకే కర్మమును జేయవలయు ననుటను, ఆభక్తియొక్క లక్షణముగా నున్నది ఈ మహోపదేశమును లోకమునందు మొట్టమొదట గావించినవారు పుణ్యభూమియగు భరతఖండమునం దవతరించిన శ్రీకృష్ణమూర్తియే కదా! దేవుఁడు దండించుననెడి భయముచేఁ గల్గిన మతములకాల

మంతయుఁ గడచిపోయినది ఇపుడు నరకలోకభయమును లేదు; స్వర్గలోక సుఖేచ్ఛయును లేదు. వీనికి బదులు ఫలాపేక్ష రహితమైనట్టి ప్రేమకొఱకు ప్రేమము, ధర్మముకొఱకు ధర్మము, కర్మముకొఱకు కర్మము చేయఁదగిన దనెడి ఉత్తమ సిద్ధాంత మేర్పడినది ఆహా! గోపికలయొక్క ప్రేమమును, వారివ్యామోహమును వర్ణింపఁ దరమగునా? గోపికల మహాద్భుత లీలా విశేషమును దెలియని మూఢులు నింకను గొందఱు మనలో నున్నారు మనరక్తమునందు మిశ్రమమైన మూఢులు గోపికల లీలావినోదములు విన్నంతమాత్రాననే అం దేమో అపరిశుద్ధమగు విషయము లున్నవని చెవులు మూసికొను చున్నారని మఱియొకపరి చెప్పుచున్నాను. అట్టివారి నుద్దేశించి చెప్పవదేమనఁగా,—— మొట్టమొదట మిమ్ము మీరు పరిశుద్ధులం గావించికొనుఁడు; పిమ్మట గోపకల ప్రేమచరిత్రమును వర్ణించిన మహాపురుషుఁడు శుకబ్రహ్మఋషి యని జ్ఞప్తియందుంచికొనుఁడు; అనియే గోపికల అద్భుతచరిత్రమును రచియించినవాఁడు పరిశుద్ధుఁడై జన్మించిన శుకబ్రహ్మముకదా? మనస్సునందు స్వలాభము కోరువఱకును భగవంతునియెడ ప్రేమకలుగదు కొందఱు భగవంతునియందుఁ గూడ వ్యాపారము నారంభించి బోధించెదరు ఎట్లన, "నీవు నన్నుఁగొల్వనియెడల నీవుచచ్చునపుడు నిన్ను నరకములోఁ ద్రోయుదును అనియిట్లు భయపెట్టుచున్నారు ఇది వర్తకతుల్యమేకదా? ఒకవర్తకుఁడేదేని వస్తువిచ్చి దానికి బదులు ధనము నడుగునట్లే భగవంతుఁడు మోక్షమిచ్చి తన్నుఁ గొల్వుమనుట సోదరులారా!

భగవంతునియం దిట్టి యభిప్రాయము గలవారు గోపికలయొక్క పరిశుద్ధప్రేమ రహస్యము లెట్లు తెలియఁగలరు?

శ్లో. సురతవర్ధనంశోకనాశనం స్వరిక వేణునాను......చుమ్బితం
ఇతర రాగవిస్మారణం నృణాంవితరవీరన స్తేఽధరామృతమ్
గోపికాగీత.

అహా!ఆమధురాధరమును ఒకసారి ముద్దిడునట్టిభాగ్యము కలుగునా! నీవెవరిని ముద్దిడుచున్నావో వారికి నీయందుప్రేమ యధిక మగుచున్నది దుఃఖములన్నియుఁదొలఁగుచున్నవి. నీవు గాక యితరపదార్థమునందు ప్రేమయను దానినే రుఱచిపోయెదము "ఇదికదా వాస్తవమైన ప్రేమ ప్రార్థనము గాఁబట్టి ధనము, కీర్తి, పొగడ్త, క్షణభంగురమైన యీలోకమునందు నీకుఁగల యాశ, అను వీనిని మొదట విసర్జింపుము. పిమ్మట, గోపికలయొక్క ప్రేమ యిట్టిదని నీవు తెలిసికొందువు. ఆప్రేమయనునది నీయొక్క సకలాశలను నివర్తి చేయకగాని గోచరము కాదు అనఁగా ఆప్రేమ అంతటి పరిశుద్ధమైనది కావున, నీవును అంతటి పరిశుద్ధుడైనఁగాని తెలిసికొననేరవు ఐహిక సుఖభోగముల యందును, సంపదయందును, కీర్తియందును సదాబుద్ధిని వినియోగించు మూఢులు గోపికల యొక్క ప్రేమను దెలిసికొనఁగలరా? ఇట్టివారు ఆప్రేమనుగూర్చి పరిహసింపఁ దొడంగుట సాహసమే అహా యేమివింత! ఏమివింత! శ్రీకృష్ణావతారముయొక్క సార మంతయు నా గోపికలతో గూడి క్రీడించిన వైభవ సమూహమేకదా? ఉత్తమ మోక్ష

శాస్త్రమగు గీతకూడ గోపికలయొక్క ప్రేమపిపాసకు సమాన ముకాదు. ఏలన గీతయందు పరగతికొందు పద్ధతిమాత్రమే క్రముక్రమముగా బోధింపఁబడి యున్నది అయినను గోపికల విషయమునందు ఆనందోన్మాదమే విస్తరముగాఁ గనంబడుచు న్నది ఇట్టి స్థితియందు గురువు, శిష్యుఁడు, ఉపదేశము, భగ వంతుఁడు, పరమపదము మొదలగునవి యంతయు నేకమగు చున్నది సమస్తమును త్యజింపఁబడుచున్నది మిగిలియుండునది ప్రేమోన్మాదమొకటియే ఈ యున్మాదావస్థయందు సకలప్రాణు లును కృష్ణస్వరూపముగ నుండుటయే గాక, తానును కృష్ణ మయమై ప్రకాశించుచు ఇదియే కృష్ణపరమాత్మయొక్క నిజ స్వరూపము మీరు కృష్ణమూర్తి చరిత్రముయొక్క నిజము నెఱుంగక పరిహాసించుచు కాలమును వ్యర్థముగాఁ బోఁగొట్ట వలదు. పురుషార్థసాధనమగు మూలతత్త్వమును గైకొనుఁడు. శ్రీకృష్ణచరిత్రమునం దనేక ప్రక్షిప్తములుగలవని కొంద అని దరు అట్లుండిన నుండవచ్చును. అయినను అట్టిప్రక్షిప్తమున కాధారము లేకయుండునా? లోకములో నేమహాపురుషుని చరిత్రమును పరిశీలించిచూచినప్పటికిని,ఒక్కొకరును వారువా రుపదేశించిన విషయము లాకాలమునందు ప్రచారములో నున్నవిగా నైనను, అంతకుముం దున్నవా రాచరించినవిగా నైన నుండవలయు ననియే దోఁచెడిని అట్టి మహాపురుషు లుండిరో లేరో యని సంశయము గలుగవచ్చును. అయినను కర్మముకొఱకు కర్మమును ప్రేమకొఱకు ప్రేమయు చేయవలయు ననెడివిధిని శ్రీకృష్ణమూర్తి బోధింపలేదని చెప్పెడివా రెవరేని

యుండురేని, అట్టివారు నాయొదుటవచ్చి చెప్పనిండు కాఁబట్టి ఈపద్ధతిని యెవరేని యొకరు మొదట చెప్పియుండవలయును. వేఱొకరివలన విని చెప్పియుండ నగుననుట పొసఁగదు శ్రీకృష్ణమూర్తి పుట్టినపుడా యభిప్రాయములు గాలిలో నెగురుచుండలేదు! కావున, దీనిని శ్రీకృష్ణుఁడే మొదట బోధించినాఁడు దీనినే మనము గ్రహింపఁదగిన ఉత్తమభావన మనము పొందఁదగిన జ్ఞాన మేమన, శ్రీకృష్ణుడు గోపీజనవల్లభుఁడనియు, బృందావన సంచారియనియు మాత్రమే మీ కెప్పు డట్టి ప్రేమోన్మాదము కల్గునో! ఎప్పుడు మీరు గోపికల నిజస్వరూపము నెఱుంగుదురో, అప్పుడు ప్రేమయనునది యిట్టిదని యెఱుంగఁగలరు ఎప్పుడు మీకులోకమంతయు లేకపోవునో, ఇతరచింతన లన్నియు నశించిపోవునో, ఫలాపేక్ష లేకపోవునన్నదో వాస్తవతత్త్వము నెఱుంగవలయుననెడి తలంపుకూడ లేక పరిశుద్ధహృదయు లగుదురో, అప్పుడు ప్రేమోన్మాదము జనించును. గోపికలు ప్రేమకొఱకు ప్రేమనర్పించిన విషయము బోధమగును ఆప్రేమ తననంతట మి మ్మావహించును అదే ఉత్తమగతి ఆప్రేమ మీకు లభించెనేని సమస్తమును లభించినట్లే నిశ్చయింపనగును

"ప్రేమగలవారికి సమస్తమును కరతలామలకము"

ఇదివఱకు శ్రీకృష్ణమూర్తియొక్క అతిమానుషచేష్టితములను గూర్చి విచారించినారము. ఇఁక అతఁడుపదేశించిన గీతనుగూర్చి విచారింతము. ప్రకృతము బండిని ముందుగను, గుఱ్ఱమును వెనుకను నిల్పుటవంటి అసందర్భమైన ప్రయత్నము

మనహిందూ దేశమున వ్యాపించియున్నది కృష్ణుని గోపికారమణుఁడనుట సరికాదని కొందఱనెదరు. ఐరోపావారికిఁగూడ అట్టి కృష్ణుఁడు పనికిరాఁడఁట! ఐరోపావారికి సమ్మతములేని కృష్ణుఁడు ఎట్లుండనగును ? ఉండగూడదు ! మహాభారతమునందు ఒకటి రెండు స్థలములందు తప్ప, తక్కిన స్థలములందు గోపికల ప్రస్తావనయే లేదు. ఆస్థలములుకూడ అంత ప్రధానములు కావు ద్రౌపది శరణాగతిస్తుతియందు శ్రీకృష్ణుఁడు బృందావనమున నున్నట్లు స్తుతింపఁబడి యున్నది శిశుపాలుఁడు దూషించినఘట్టములోను శ్రీకృష్ణుఁడుబృందావనమునం దున్నట్లున్నది ఇవియంతయు ప్రక్షిప్తములఁట! ఐరోపావారుఅక్కఱలేదని చెప్పెడి విషయముల నంతయుఁ ద్రోసిపుచ్చవలసినదే కాదా! ఈమదోన్మత్తులు వర్తకయుక్తిచేనిట్లనెదరు వీరికి మతముకూడ ఒకరీతివర్తకమే వీరు కొన్ని కార్యములు చేసి పరగతినొందుటకుఁ బ్రయత్నించుచున్నారు ఇచ్చటకొంచము సంచిమొనలుంచి పరమున దానిని వడ్డితోఁ గూడఁబొందుటకు చూచుచున్నారు ఇట్టి వ్యాపారము గోపికలు చేయలేదుకదా.

ఇఁక గీతాచార్యుఁడగు శ్రీకృష్ణునిఁగూర్చి విచారింతము. వేదార్థములను ప్రకాశింపఁజేయునట్టి గ్రంథము గీతకంటె వేఱొక్కటి లేనేలేదు ఇఁక నట్టిగ్రంథము కలుగఁబోదు వేదములకనేకులు అనేకవిధములుగా వ్యాఖ్యానములొనర్చియుండుటంబట్టి వాస్తవార్థమును దెలిసికొనుట మిక్కిలికష్టము కావుననే శ్రుతుల నొసంగిన భగవంతుఁడే గీతాచార్యుఁడై యవతరించినాఁడు మన దేశమేగాక ప్రపంచములోని సకలదేశములకును సద్గతి నొసంగఁదగిన గ్రంథము గీత యొక్కటియే. ఇటీవల

వేదములకును గీతకును వ్యాఖ్యానము చేయఁదొడంగిన వారిలో ననేకులు వాస్తవార్థముల నెఱుంగనిది ఆశ్చర్యముగానే యున్నది ఎట్లన, వ్యాఖ్యానకర్త అద్వైతిగా నుండినచో నతఁడు అద్వైతమును తఱుచుగా బోధించు నుపనిషత్తు నొకదాని నాధారముగాఁ గైకొనుచున్నాఁడు అయినను, ఆయుపనిషత్తులో ద్వైతవాక్యములును గొన్ని యుండును ఆవాక్యములకు తన సామర్థ్యముచే నెట్టట్లో అద్వైతపక్షమున కనుకూలమైన అర్థము చేయుచున్నాఁడు ద్వైతమతస్థుఁడు వ్యాఖ్యానము చేయఁ బూనినచో నద్వైతవాక్యములకు విపరీతార్థము కల్పించుచున్నాఁడు గీతకు వ్యాఖ్యానము చేయువారల కట్టికష్టము లేదు ఆత్మ, క్రమక్రమముగా స్థూలమునుండి సూక్ష్మమునకును, సూక్ష్మమునుండి సూక్ష్మతరమునకును బోయి తుదకు పరమపదమును బొందవలయునని గీత బోధించుచున్నది అందు కర్మకాండ మావశ్యకమని బోధించినప్పటికిని, అది మోక్షము నొసంగదనియును, అయినను చిత్తశుద్ధితోఁ జేయు కర్మమును, విగ్రహారాధనమును సోపానక్రమముగా మోక్షము నొసంగు ననియును జెప్పఁబడియున్నది పరిశుద్ధహృదయముతో జేయు నుపాసనము మోక్షము నొసంగును కాఁబట్టి, పలుతెఱఁగులగు భగవదారాధనములును ఆవశ్యకములై యున్నవి ఆవశ్యకములు కానిచో నిత్యాద్యుపాసనాదు లేర్పడియుండవు తత్కాలమున మనలోఁ గొందఱు చెప్పునట్లు మతములును, మతసంప్రదాయములును వంచకులును, దుష్టులును ధనము సంపాదించుటకొఱ కేర్పడినవికావు ఎవ రేమి చెప్పినప్పటికిని

మన మతసంప్రదాయములు ధనార్జనకొఱకు కల్పించినవి కావు. ఇవి చిత్తశుద్ధికలుగుట కొఱకును, పలు తెఱఁగులగు భిన్నరుచి గల వారి కోర్కులను కొనసాగించుటకొఱకును ఏర్పడి యున్నవి. కాఁబట్టి మీరు వీనికి విరుద్ధముగా బోధింపకుఁడు. ఎప్పుడు వీనికి ఆవశ్యకత లేకపోవునో, అప్పుడు మతములును మతసంప్రదాయములును లేకపోవును కాఁబట్టి, ఆవశ్యకతయ్యుండునంతవఱకును, వానిని మీరెంత ఖండింపఁజూచినను అవి యుండియే తీరును మీమాటను వినకున్నారనెడి క్రోధముచే విగ్రహారాధకులను మీరు చంపినప్పటికిని, తుదకు ప్రపంచములోని వాగల నందఱను రక్తప్రవాహములో ముంచినప్పటికిని విగ్రహారాధన కావశ్యకమున్నంతవఱకును అది యుండక మానదు ఇట్టి కర్మానుష్ఠానములును, పలు తెఱఁగులగు మతములును సోపానక్రమముగా మోక్షము నొసంగునవి కావున, అవి యుండవలయును ఈవిషయమును శ్రీకృష్ణమూర్తి వివరించియున్నాఁడు

ఇఁక హిందూదేశచరిత్రముయొక్క దుఃఖకరమైన ప్రకరణమొకటి కలదు. బహుకాలమునను మునుపే మతకలహములు కలవని గీతవలనఁ దెలిసెడిని. వానిని నివృత్తిచేయుట కొఱకే శ్రీకృష్ణమూర్తి యవతరించినాఁడు

"మయిసర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ"

"ఇవి యంతయు దారమునందు గ్రుచ్చఁబడిన మణులవలె నాయం దున్నవి" అని మనదేశమునందు ప్రథారహితు

లగుబ్రాహ్మణులకును క్షత్రియులకును జగడము జరిగియున్నది. తత్పూర్వము జనులలో నైకమత్య ముండినట్లు తెలియుచున్నది. అట్టి ఐకమత్యమునుమరల స్థాపించుటకొఱకే మహామహిమగల తేజోమూర్తి గౌతమబుద్ధుఁ డవతరించెను

ఆతనిని భగవ దవతారముని భావించి పూజించెదము. ఇతనివలె నీతిమార్గము నేమహాపురుషుఁడును లోకమునందు బోధించినవాఁడు లేఁడు తానే తన శిష్యుఁడై అవతరించినట్లు, ఇతనికిముం దవతరించిన శ్రీకృష్ణమూర్తి యుపదేశించిన పరమార్థములను అనుష్ఠించు మార్గమును జూపుటకొఱకు గౌతమబుద్ధుఁడై యవతరించెను

శ్లో "స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్,
స్త్రియో వైశ్యాస్తథాశూద్ర స్తేఽపియాన్తి పరాఙ్గతిమ్"

"ఈధర్మమును కొంచెముగా ననుష్ఠించినను, మహాభయమునుండి రక్షించుచున్నది స్త్రీలైనను, వైశ్యులైనను, శూద్రులైనను, ఉత్తమగతిని బొందెదరు." అనెడి గీతాభిప్రాయమే మరల గౌతమబుద్ధుని మూలముగా సంభవించినది. సకలజనులయొక్క బంధము విడిపడఁజేసి, సకలజనులకును మోక్షాధికారము కలదని సిద్ధాంతీకరించుటకు శ్రీకృష్ణమూర్తి మహాగంభీరధ్వనితోఁ జెప్పిన వాక్యములను వినుఁడు

శ్లో "ఇహైవతైర్జితః స్వర్గో యేషాంసామ్యే స్థితంమనః,
నిర్దోషం హి సమంబ్రహ్మతస్మాత్ బ్రహ్మణి తే స్థితాః

సమంపశ్యన్‌హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్
నహినస్త్యాత్మ నాత్మానం ప్రాప్నోతి పరమాంగతిమ్"

"సమత్వమునందు మనస్సు నుంచినవారు ఈజన్మము నందే స్వర్గమును జయించినవారు. బ్రహ్మము దోషములేనిదై సమమై యుండుటంబట్టి, వారు బ్రహ్మమునందే యుండువారుగ నున్నారు"

"సకల శరీరములయందుండు ఆత్మను ఏకరూపముగాఁ జూచువాఁడు తనమనస్సుచే తన ఆత్మను హింసింపఁడు కావున, పరగతి నొందఁగలఁడు"

ఈ యుపదేశమును అనుష్ఠానము ద్వారముగాఁ గనఁబఱచుటకు తానే వరల వచ్చినట్లు గౌతమబుద్ధుఁడై అవతరించెను ఇతఁడు బీదలకును దీనులకును ధర్మోపదేశము చేసినాఁడు. ఇతఁడుతన యుపదేశములందఱకును బోధము కావలయునని యే గీర్వాణ భాషలోఁ జెప్పక దేశభాషలోఁ జెప్పను బిచ్చగాండ్రతోను, కష్టపడు వారితోను కలసి మెలసి వర్తింప నెంచి సింహాసనమును ద్యజించినాఁడు శ్రీరామచంద్రుఁ డెట్లు ప్రీతి చేత నీచజాతివాఁడగు గుహుని ఆలింగనము జేసికొన్నాఁడో అట్లే బుద్ధుడును ప్రేమచేత చండాలునినైత మాలింగనము చేసి కొన్నాఁడు బుద్ధుని దివ్యచరిత్రమును, ఆతఁ డొనర్చిన మహాత్కార్యమును మీరెల్లరు నెఱింగినదియే అయినను ఆతని కార్యములలో నొక్క లోపముకలదు. అందులకై మన ము నేఁటి దాఁక అవస్థపడుచున్నారము బుద్ధుఁడు దోషరహి

తుఁడు. పరిశుద్ధుఁడు మహిమగలవాఁడు అయినను, అతఁడు
ఆర్యులతోఁ గలసి వర్తించుచున్న అనాగరకులగు మూఢులకు
తన ధర్మములను బోధించెను వారు ఆధర్మముల ప్రకారము
అనుష్ఠింపక పోయిన దురదృష్ట మొక్కటే ఆలోపము. పలు
తెఱఁగులగు మూఢాచారములును మూఢభక్తియు గల
జాతులు ఆర్యులతోఁ జేరి నాగరకులవలెఁ గానంబడుచుండి,
మఱికొన్నాళ్ల కంతయు తమ పూర్వ పద్ధతి చొప్పుననే పాము
లను, దయ్యములను పూజింప నారంభించిరి అది మొదలు అతి
నీచమైన మూఢాచారములును మూఢభక్తియు నింకను మనదేశ
మునుండి తొలఁగక యున్నది ఆదియందున్న బౌద్ధులు జీవహింస
చేయఁగూడదని చెప్పినదేగాక, యజ్ఞములయందుఁగూడ జీవ
హింస చేయరాదనిరి ఆ కాలములో ప్రతిగృహమునందును అగ్ని
పూజ గలదు. బౌద్ధుల యుపదేశమువలన యజ్ఞములు నిలిచిపో
యెను ఆస్థానమునందు విగ్రహారాధనము స్థాపిత మయ్యెను.
దేవాలయములు నిర్మింపఁబడినవి; పురోహిత పరంపరయు,
మఱియు నిక్కాలమునఁ గానంబడు సమస్తమైనయైతిహ్యములును
కల్గినవి బ్రాహ్మణుల విగ్రహారాధనమును బుద్ధముని నశింపఁ
జేసెనని కొందఱువ్రాసిన గ్రంథములందుఁ జూచినాను వీరు అవి
చారపరులు హిందూదేశములో ప్రకృతముననుండు బ్రాహ్మణ
మతమును విగ్రహారాధనమును బౌద్ధమతము చేతనే కల్గినదని వా
రెఱుంగరు కొన్నాళ్లకుముందు రుష్యాదేశస్థుఁ డొకఁడు వ్రాసిన
గ్రంథములో ఏసుక్రీస్తును గూర్చి యొకఅద్భుతచరిత్రమును
వ్రాసియున్నాఁడు అందు ఏసుక్రీస్తు శాస్త్రాధ్యయనముకొఱకు

జగన్నాథమునందలి బ్రాహ్మణులకడకుఁ బోయి యుండినట్లును, ఆబ్రాహ్మణులు ఇతరజాతివారితోఁగలియకుండుటయే గాక విగ్రహారాధనము చేయుటను జూచి విసుగు జెందినట్లును, పిమ్మట తిబెత్తును జేరి బౌద్ధగురువుల నాశ్రయించి సంపూర్ణజ్ఞానమును బొంది వచ్చినట్లును వ్రాయఁబడి యున్నది. హిందూదేశ చరిత్ర మించుక తెలిసియున్నప్పటికిని, ఋష్యావానిమాట సత్యాబద్ధమని తోఁచును ఎట్లన, జగన్నాథములోని దేవాలయము పురాతన బౌద్ధాలయము; మనవారు దానిని హిందూదేవాలయముగా మార్చిరి. ఇట్లనేకములగు బౌద్ధాలయములు హిందూదేవాలయములైనవి ఇంకను ఇట్టికార్యముల ననేకములను మనము చేయవలసి యున్నారము. క్రీస్తువు జన్మించినకాలమునందచ్చట నొక్క బ్రాహ్మణుఁడైనను లేఁడు గావున, ఋష్యాదేశీయుని వాక్యములం దెంతయు సత్యము లేదు ఆ కాలములో బుద్ధుని బోధించిన జీవకారుణ్య మేమి, ఉత్తమమైన నీతిమార్గము లేమి, నిత్యమైన ఆత్మయనుపదికలదా లేదా యనుటను గుఱించిన అతిసూక్ష్మమైన తత్వవాదము లేమి:—ఇవన్నియు నుండియు, బౌద్ధమతము సమూలముగా నాశమైనది అందువలనఁ గల్గిన కీడు మిక్కిలి భయంకరమైనది బౌద్ధమత నాశానంతరము గల్గిన ఘోరవిషయములను జెప్పుటకు కాలము చాలదు అతిక్రూరమైన ఆచారములును, మనుష్యులు తమ బుద్ధినంతయు వినియోగించి యెంత తెలివి యనగునో అంత భయంకరమును అసభ్యమనగు పుస్తకములును, దుష్టాచారములును నీచగతి నొందిన బౌద్ధమతముచేతనే కల్గినవి.

అయినను భరతఖండము మరల ఉజ్జీవింపవలసినదిగా నున్నందున, భగవంతుండు మరల నవతరించినాఁడు ఏల? "అధర్మము ప్రబలినప్పుడు నేను అవతరించెదను" అని యతఁడే చెప్పియున్నాఁడు కదా? ఈ అవతారము దక్షిణమునందుఁ గల్గెను. ఏమహాపురుషుఁడు తనపదునాఱవయేఁటతన గ్రంథములన్నిఁటిని వ్రాసి ముగించినాఁ డనెదమో ఆబ్రాహ్మణబాలకుఁడే ఆమహాపురుషుఁడు అతఁడే భగవదవతారము పదునాఱేండ్లబాలుఁడు రచియించిన గ్రంథములు ప్రపంచమంతట ప్రకాశించుచున్నవి. దురాచారములతోఁ నిండియున్న భరతఖండమును పూర్వాపరిశుద్ధస్థితికిఁ దెచ్చుట సాధ్యమైన పనియా? ప్రస్తుతము మీరు సంస్కరింపఁ బూనియుండుదుష్కృత్యము లెల్లనాకాలములోఁ గలిగినవే టార్టారులు, బెలూచివారు, మొదలగు సకలమైన క్రూరజాతివారు ఇండియాదేశమునకు వచ్చి బౌద్ధమతముఁ జేరి మన దేశస్థులతోఁ గలిసి, వారిదురాచారముల నంతయు వ్యాపింపఁజేసిరి. ఇట్లుబౌద్ధమతము వలనఁ గల్గిన హీనస్థితినిఁ దొలంగించుటకే ఆబాలుఁ డవతరించినాఁడు అతఁడే శంకరాచార్యులు. అది మొదలు నేఁటిదాక ఆదురాచారములను బోఁగొట్టుటకై ప్రయత్నములు జరుగుచున్నవి కాని, ఇంకను సంపూర్తి కాలేదు శ్రీశంకరాచార్యులు బౌద్ధమతముయొక్క యథార్థ సారమునకును, వేదాంతము యొక్క యథార్థ సారమునకును అధికవ్యత్యాసము లేదనియును, బుద్ధుని తత్త్వోపదేశములను అతని శిష్యులు తెలిసికొనక ఆత్మ లేదనియు, దేవుఁడు లేఁడనియు వాదించుచు నాస్తికులై పోయిరనియును నిరూపిం

చిరి ఇట్లు శంకరులు బోధింపఁగా బౌద్ధు లందఱును తమ మత
మును త్యజించి ఆర్యులైరి అయినను, వారు తమపూర్వా
చారము లనుమాట సమాత్రము మోచికొని వచ్చిరి ఏమి
చేయవచ్చును!

తర్వాత మహాతేజస్వియగు రామానుజు లవతరించిరి.
శంకరులు మహాజ్ఞానియై యుండియు వారియందు దయ మిక్కు
టముగా లేదని తలంచెదను రామానుజులవారి హృదయము
కరుణాసాగర మన వచ్చును వారు దీనులకై మిక్కిలి పరిత
పించిరి కల్మషసహితములై యున్న కర్మానుష్ఠానములను కూడి
నంతవఱకు పరిశుద్ధము కావించి, నూతనాచారములను, నూతన
పూజలను స్థాపించి జనుల కొఱఁతలను దీర్చిరి మఱియు
మోక్షద్వారమును బ్రాహ్మణులకును చండాలురకును తెఱచి
నారు ఇదే శ్రీరామానుజాచార్యులు కావించిన మహాత్కృం
కర్యము ఈకైంకర్యము ఉత్తరదేశమునందు మిక్కిలి వ్యాపిం
చినదేగాక, ఆకాలమునందున్న మహాష్మదీయులవలనఁ గీడు
మూడనివిధముగ నప్పుడప్పు డవతరించిన మహాపురుషులచే
నభివృద్ధి కావింపఁబడుచుండెను ఉత్తరదేశములో నవతరించిన
మహాపురుషులలో శ్రేష్ఠులైనవారు శ్రీకృష్ణచైతన్యులు శ్రీరా
మానుజులవారి కాలమునుండి, యొకవిశేషము జరుగుచున్నది.
ఏమనఁగా, ఒక్కొక మహాపురుషుఁడును, సకలజనులును మోక్ష
మును బొందవలయుననెడి యుద్దేశముతో మతబోధ కావిం
చుటయే ఈయభిప్రాయమే శంకరులకు మున్న వతరించిన మహా
పురుషుల యభిప్రాయమునై యుండినది అట్లే రామానుజులు

మొదలవతరించినవారి యభిప్రాయముగా నున్నది అందఱును మోక్షాధికారులని శంకరు లుపదేశింపలేదని యేల చెప్పుచున్నారో నాకుఁ దెలియలేదు. బుద్ధునియం దెట్లు దోషారోపణము చేయుచున్నారో, అట్లే శంకరులయందు నీదోషము నారోపించెదరు బుద్ధుని శిష్యులకెట్లు గ్రాహ్యశక్తి లేమిచే నతని సిద్ధాంతము నెఱుంగని విధమున, శంకరులశిష్యులును వారి సిద్ధాంతము నెఱుంగకపోయిరని నేను తలంచెదను ఉత్తరదేశమునం దవతరించిన శ్రీకృష్ణచైతన్యులను గూర్చి మాత్రము కొంచెము ప్రసంగించి యీయుపన్యాసమును ముగించెదను

శ్రీకృష్ణచైతన్యులు గోపికలయొక్క వ్యామోహము ననుష్ఠించి చూపెను అతఁడు పరంపరగా తర్కశాస్త్రపండితు లగు బ్రాహ్మణకుటుంబమున జన్మించెను ఇతఁడును మహాతార్కికులతో వాదించి జయించినాఁడు ఇతఁడు కీర్తిని బొందవలయునని బాల్యమునుండి తలంచుచుండెను గాని, ఒక మునీంద్రు ననుగ్రహమువలన నతని చిత్తవృత్తియంతయు మాఱిపోయెను అతఁడు తన తర్కవిద్యాచార్య పట్టమును త్యజించి భగవద్భక్తి యందు తత్పరుఁడైనాఁడు ఇతనిభక్తి బంగాళాదేశమంతయు వ్యాపించినది అదిమొదలు సకలజనులును చిత్తశాంతినొందిరి ఆయనప్రేమకు పారములేదు పుణ్యాత్మునకును, పాపాత్మునకును, హిందువునకును, మహమ్మదీయునకును, పరిశుద్ధునకును, అపరిశుద్ధునకును, వేశ్యకును, ఎందును కొఱగానివానికిని, ఆతనిప్రేమయందును, అనుగ్రహమునందును భాగముండినది ప్రపంచమందన్నియు క్షీణించునట్లే ఆతని మతమును క్షీణింపఁదొడంగెను.

కాని, దీనులకును జాతిభ్రష్టులకును అతనివైష్ణవమతము ఆధారముగనున్నది ప్రపంచములో నొక్కవిశేషముమాత్రము కలదు ఏయేమతములు తర్కశాస్త్రాధారములు కలవైయున్నవో, అవి మాత్రమేజీవించియున్నవి శ్రీశంకరులసిద్ధాంతమునందు సకల మతములును సమ్మతములుగా గానంబడినప్పటికిని, జాత్యాచారములందుమాత్ర మెక్కువ నిర్బంధము గానంబడు చున్నది వైష్ణవసంప్రదాయములందు జాతి సంబంధమైన విషయములందు సమరసభావ మున్నప్పటికిని తత్త్వ విషయములయం దెక్కువ నిర్బంధము కలదు

వీరిలో శంకరులు పరమజ్ఞానమూర్తి చైతన్యులు పరమకరుణామూర్తి శంకరులవంటి అపారజ్ఞానశక్తియు, చైతన్యులవంటి విశాలమైన సదయ హృదయమును, ఒక్క శరీరమునందే గలిసి ప్రకాశించిన వారును; సకల సంప్రదాయములయందును సకలప్రాణులయందును సాక్షీభూతుఁడై ప్రకాశించు బ్రహ్మస్వరూప దర్శనముచే నానందించు వారును, హిందూదేశములోను, ఇతర దేశములలోను గల సకలప్రాణులయెడ మిక్కిలి కనికరముగలవారును; సకల సంప్రదాయములను సమన్వయము చేసి భక్తియు జ్ఞానమును కలుగునట్లు దివ్యోపదేశముచేయునట్టి అద్భుతశక్తిగల మహాత్ము లొక రవతరింప వలసిన కాలమేర్పడియుండినది. కావున, నపు డామహాను భావు లవతరించిరి వారి దివ్యచరణారవిందములను సేవించు భాగ్యము దాసునికి చాల కాలము సంభవించి యుండెను. ఆయవతారమునం దొక్క

విశేషము కలదు ఆంగిలేయుల నాగరకతయు ఆచారములును ఇండియాలోని యితర ప్రదేశములకంటె నెక్కువగా వ్యాపించి యున్న కలకత్తా నగరమునకు సమీపమునందే ఆమహాను భావుని దివ్యచరిత్ర మంతయు జరిగినది వా రచ్చోట జన్మించి యు నేగ్రంథమును జదువక యే సర్వము నెఱింగిరి వారికి తమ చేవ్రాలు చేయుటకుఁ గూడఁ దెలియదు సర్వకలాశాలలందు తీ ర్ణులై పట్టభద్రు లనేకులు వారి అపారజ్ఞానమున కచ్చెరువొం దిరి వారి దివ్య చరిత్రము అతివిస్తరము గాన విశదీకరించుట కవకాశము లేదు ఆమహానుభావుని దివ్యనామము రామ కృష్ణపరమహంసమూర్తి వారు సకలఋషుల లక్షణములు గలవారు వారి మహోపదేశము ప్రతిక్షణమునందును ఫలకారి యనిమాత్రము వచించి విరమించెదను. ఆయన దివ్య శక్తిని యెఱుంగుఁడు. వా రొక చిన్నపల్లెలో బీదవాఁడగు అర్చక బ్రాహ్మణునకుఁ గుమారుఁడై పుట్టినాఁడు ఆయనను గూర్చి యెవరును తలంచినదే లేదు అట్టి వారిని ప్రకృతము మనదేశ ములోను అన్య దేశములోను గల వేలకువేలు జనులు మహా భక్తితో పూజించుచున్నారు ఈశ్వరానుగ్రహము నెవ్వ రెఱుంగఁగలరు? కాఁబట్టి, సోదరులారా! ప్రకృతము జరుగు చుండు కార్యములయందు సర్వదయాపరుఁడగు సర్వేశ్వరుని దివ్యశక్తి మీకుఁ గనఁబడదేని, మీరు అంధులే యగుదురు. ఆవిషయమును వివరించుట కిప్పుడు కాలముచాలదు ఆమహా త్ముని దివ్యచరిత్రమును సమయమును సందర్భమును గల్గినపుడు చెప్పెదను. ఇప్పుడు నే నేదేని సద్వాక్యమును జెప్పియుండిన

నది మదాచార్యస్వాములగు శ్రీరామకృష్ణహంసుల వారిదని యును, అసదావాక్యములన్నియు నావియనియును విన్నవించె దను

## చెన్నపురి - ఐదవప్రసంగము.

### భరతఖండ భవిష్యత్కాలము

సోదరులారా!

అన్యదేశములందు జ్ఞానము వ్యాపించుటకుమునుపే ఆ జ్ఞానమునకు మాతృభూమి భరతఖండమై యుండెను సాగర ములవంటి నదులు ప్రవహించుట యీదేశమునందలి ఆత్మజ్ఞాన ప్రవాహమును సూచించుచున్నది ఇచ్చటకదా సదాహిమాల యము మంచుగడ్డలచేఁగప్పఁబడి దేవలోకరహస్యముల నెఱుం గుటకుఁ బోవుచున్నదో యనునట్లుక్రమక్రమముగా నాకాశము నంటున ట్లున్నది ఇచ్చటకదా మహాజ్ఞాను లుండిరి ఇచ్చట కదా మనుష్యుఁ డెట్టివాఁడు? ప్రపంచమెట్టిది? అను విచార మాదియందుఁ బుట్టెను ఆత్మ నాశరహితమైనది; దేవుఁ డొకఁడు కలఁడు; అతఁడే జగమునందును ప్రపంచమునందును వ్యా పించియున్నాఁడు; అనెడి సిద్ధాంతము మొట్టమొదట కావింపఁ బడినది ఇచ్చటనేకదా తత్త్వవిచారమును, మతమును ఎంత వఱకుఁ దెలిసికొనుటకు సాధ్యమో అంతవఱకుఁ ఇచ్చటనుండి యేకదా తత్త్వజ్ఞానము సముద్రమునుండి లేచెడి యలలవలె నితరదేశములందు వ్యాపించెను! ఇంకను ఇచ్చటనుండియేజ్ఞాన

బలములేని దేశములకు జ్ఞానబలము నీయవలసియున్నది చాల కాలమునుండియు పరరాజులచే నెదిరింపఁబడియు, పలువిధములగు పరదేశాచారములు మధ్యమధ్య వ్యాపించియు, చలింపక పర్వతమువలె నాశరహితమైన జీవతత్త్వస్థితి నెలకొనియుండు భరతఖండ మిదేకదా? స్థిరమైనదై నాశరహితమైన వీర్యము గలదై యుండునట్టి జీవితముగల దేశముకదా యిది? ఆత్మను మనమెట్లు నాశరహితమైనదని చెప్పెదమో అట్లు ఆద్యంతహితమై అమృతస్వరూపమై యుండు నట్టి దేశము ఇదియేకదా?

ప్రకృతము నేను మనభరతఖండ పూర్వస్థితిని గూర్చి మీకు జ్ఞప్తిచేయుటకు నిశ్చయించియున్నాఁడను కొందఱు పూర్వకాలపు ఔత్కృష్ట్యమును ప్రశంసించుటవలన లాభము కలుగదనెదరు? అయినను పూర్వకాలమునకు ననుసరించియే గదా రాఁగల కాలస్వరూప మేర్పడుచున్నది? కాఁబట్టి శాశ్వతమై వెలయుచుండు నిత్యనిర్మలమైన జ్ఞానప్రవాహమునందు మగ్నులగుఁడు పిమ్మట లేచి నలువైపుల పరికింపుఁడు ముందునకుఁ జనుఁడు భరతఖండమును మునుపటికంటె ప్రకాశవంతము కావింపుఁడు మనపూర్వులు గొప్పవారని తెలిసికొనుఁడు. మనపూర్వులు మన కెన్నివిధములగు లాభములను గలుగఁజేసి యున్నారో గమనింపుఁడు పూర్వు లాచరించిన ఘనకార్యములందు నమ్మకమునుంచి మన భరతఖండమును మునుపటికంటె నధిక తేజోవంతమైనదానినిగాఁ జేయుఁడు మనము మధ్యకాలమున హీనగతిపొందినవిషయ మందఱకుఁ దెలియును అట్లు కావలసినదే. గొప్పవృక్షములు మంచిపండ్ల నిచ్చు

చున్నవి. ఆపండ్లను భూమిలో నాటెదము అది మురిగి మొల చుట కారంభించి మొదటి చెట్టుకంటెమించి పెరుగనగు కావున మన క్షీణగతి ఆవశ్యకమే ఇందుండియే భవిష్యత్కాల భరత ఖండము కలుగఁబోవుచున్నది. ఇప్పుడే అది మొలచి మూడా కులు విడిచి యున్నది. "ఊర్ధ్వమూలమ్" అనెడి మహావృక్షము నిప్పుడే చూడవచ్చును దానినే చెప్పెదను.

ఈదేశవిషయములు మిక్కిలి చిక్కైనవి. ఏలన, ఇచ్చట ఆర్యులును, ద్రావిడులును, తార్తారులును, తురుష్కులును, మొగలాయీలును, ఆంగిలేయులును ఇంకను పలుజాతుల వారును వచ్చియున్నారు. మఱియు భాషలును ఆచారములును ఒకరి కొకరికి సంబంధము లేనివై యున్నవి ఇవి యెన్ని యున్న ప్పటికిని మనకు సామాన్యమైనది మతమొకటే ఐరోపాదేశ ములో రాజకీయవిషయము ప్రజల కైకమత్యమును గలుగఁ జేయుచున్నది. మన దేశమునందు మతమే ఆకార్యమును జేయు చున్నది కావున, హిందూదేశక్షేమార్థమై మనము మొదట నొక్కమతమునే యంగీకరించునట్లు చేయవలయును ఒక్కమత మనుటవలన, క్రీస్తువులు మహమ్మదీయులు బౌద్ధులు అను వీరి వంటి యభిప్రాయము నాకులేదు పలుతెగల మతస్థులును సాధారణముగా నంగీకరింపఁదగిన విషయములు కొన్ని యున్నవి. వానినిగుఱించి చెప్పెదను సకలమతస్థులకును సాధారణముగ నుండు విషయములకు లోనుగాని విషయము లెన్ని యున్నను 'మనకేమి ? ఇందులకు మన మతము చోటిచ్చుచున్నది. సాధారణముగా నందఱకును సమ్మతమగు పద్ధతులను సకలజనుల కును బోధించి వారిని ఉజ్జీవింపఁజేయుటయే మనకు ప్రధానకర్త

వ్యమై యున్నది. మనదేశములో ముఖ్యముగామతమునుగూర్చి పాటుపడుదుమేని, భాషలు జాతులు మొదలగు భేదము లెన్ని యున్నను బాధలేదు మతవైరాగ్యమునకు ముం దేవియునిల్వ వు ద్వైతులు, అద్వైతులు, విశిష్టాద్వైతులు, శైవులు, వైష్ణవులు, పాశుపతులు ఇంకను గల మతము లన్నిఁటికిని సామాన్యముగ నుండువిషయములనుమాత్రము మనము తెలిసి వర్తింతుమేని మతకలహములు కలుగవు ఇదియే మన ప్రథమకర్తవ్యము. మనశాస్త్రములందు పూర్వులు దోషములని యొత్తి చూపిన వన్నియు అసమ్మతములైన కార్యములని తెలియవలయును అల్పవిభేదములను పాటింపకుందుమేని మనమభివృద్ధి నొందుదుము రక్తమునందు బలముండునేని వ్యాధికి హేతువగు ప్రాణులు మన శరీరములో జీవింపవు మనకు జ్ఞానమే జీవాధారమైన రక్తము అతిపరిశుద్ధమై బలముగలదై యుండునేని, రాజకీయ వ్యవహారమునందును, జనాచారమునందును, ఇంకను అనేకములగు విషయములందును, మనకుఁగల కొఱఁతలన్నియును నివృత్తియగును దీనికి వైద్యశాస్త్రమునందు దృష్టాంతముకలదు వ్యాధికి హేతువైన ప్రాణులు నిమిషమునకు లక్షల కొలఁది మన శరీరములోఁ బ్రవేశించుచున్నవి అయినను, మన శరీరమునందు దార్ఢ్యము లేనప్పుడు మాత్రమే అవి నిలిచి వ్యాధిని కలిగించు శక్తిగలవి యగుచున్నవి.

ఒక్కమనుజాన కెట్లో అట్లే ఒకదేశమునకనియు నెఱుంగుఁడు దేశమగు జనాంగముయొక్క శరీరమునందు దార్ఢ్యము తగ్గినపుడు రాజకీయవిషయము, జనాచారము, విద్యా విష

యము ఈ మొదలగువాని కన్నిఁటికిని అవకాశమీానివ్యాధి కలుగును కాఁబట్టి, ఈవ్యాధిని నిర్మూలము చేయవలయును. అందులకు రక్తము పరిశుద్ధము కావలయును కదా ? దానిని మతమూలముగానే కావింపవలయును. ఇది మంచిదో చెడ్డదో చెప్పలేను గాని, ప్రకృతి మిది మీాకు సంభవించి యున్నది దీనిని మీారు తొలఁగఁ ద్రోచికొనుటకు సాధ్యము కాదు. ఏలన, మనకు మతమే ప్రాణాధారము. దానిని బలము గలదానినిగాఁ జేయవలయును. మనపూర్వులు తమ ప్రాణములను బోఁగొట్టుకొనుటకు సమ్మతించినారు గాని, మతమును బోఁగొట్టుటకు సమ్మతింపలేదు వారు మనమతము నాలాగు కాపాడి యుంచినందున కదా మనము తలయెత్తి నడుచుచున్నారము? మ్లేచ్ఛులు పడఁగొట్టిన గోపురములు తత్క్షణమే మునుపటికంటె నున్నతముగా నిర్మించిరికదా? దక్షిణ దేశములోని కొన్ని దేవాలయములను గుఱించియు, గుజరాతులోని సోమనాథదేవాలయములను గుఱించియు, మనము పుస్తకములలోఁ జదివినదానికంటె నతి ఘోరముగ పాడు చేయఁబడినవని మన మెఱుఁగుదుము. ఇట్లు పలుసారులు సంభవించినప్పటికిని మతవైరాగ్యముగల మన వారు పునరుద్ధారము కావించిరి. ఇందువలన మనపూర్వుల పట్టుదలయు వారిమనస్సు ప్రవేశించిన మార్గమును మనము తెలిసికొనవచ్చును అట్లు వారొనర్పకయుండిరేని మనము సర్వనాశమై పోయియుందుము కదా ? ఇట్లనుటవలన నేను 'రాజకీయ విషయములును, సంఘసంస్కరణమును అవశ్యకము లేవని చెప్పినట్లు భావింపకుఁడు ఇవన్నియు రెండవపక్షమని నా యభిప్రాయము.

మనకు మతమే ముఖ్యము. దానికి బలమును కలిగింపవలయును. దాని నేలాగు చేయవలయు ననుటనుగుఱించి నాయభిప్రాయము నెఱింగించెదను ఈయభిప్రాయము నాకు చాలదినములనుండి కలదు నేను ఇంగ్లండునకుఁ బోయినది యందులకే గాని వేఱు కాదు. మతమహాసభకొఱకు అమెరికాకుఁ బోలేదు అదియు నొక కారణముగా నేర్పడినది నాయభిప్రాయ మేమన, మన గ్రంథములయందును, మతములయందును, ఆశ్రమములయందును నిండియుండు జ్ఞానమును ప్రసంగము ద్వారముగా సకలజనులకును బోధింపవలయుననియే ప్రకృతము అజ్ఞానము మఱుగుపడియుండుటకుఁ గారణము దానిని బయల్పడనీక కావించిన దొక్కటియే కాదు పురాతనభాషయగు సంస్కృతభాషయుఁ దీనికిఁ దోడైనది ఆభాషయందే సకలశాస్త్రము లుండుటం బట్టి దాని నందఱు నభ్యసింపవలయును బాల్యము మొదలు సంస్కృతమునే చదువుచుండు నాకే యొకొక్క క్రొత్తగ్రంథమును క్రొత్తగా నేర్చుచుండఁగా, నెంతమాత్రమును పరిచయము లేనివారి కెట్లుండునో మీరే యూహింపుఁడు. కావున, మీరు బాలురకు సంస్కృతభాషను నేర్పుటతోఁ గూడ, వారివారి స్వభాషయందు జ్ఞానవిద్యను బోధింపవలయును ఏవిషయమును గాని సంస్కృతభాషయందుఁ జెప్పుదు మేని, అది గౌరవమును, కీర్తిని, బలమును నిచ్చును రామానుజులు, చైతన్యులు, కబీరు మొదలగువారు సకలజనులకును అందును నీచజాతులను మహోన్నతదశకుఁ గొనిరా నెంచి ప్రయత్నించియు, వారి కాలానంతరము నూటేండ్లలోపల వారి యభిప్రాయములన్నియు నిరుపయుక్తము

లైనవి. కారణ మేమనఁగా, ప్రజలకు సంస్కృతభాష రానిదే గాని వేఱొండుకాదు బుద్ధుఁడును సంస్కృతమును వ్యాపింపఁ జేయకపోయినందుననే ఆమతమును నిరర్థక మైనది అతఁడు త్వరగా జనులకు జ్ఞానమును బోధింప నెంచినందున దేశభాష యగు పాళీభాషలోఁ దన యభిప్రాయములను దెలియఁజేసెను. అందువలన నతని మతము చాలదూరము వ్యాపించినది అయినను వారికి సంస్కృతభాష తెలియనిచే వారు యోగ్యతలేనివా రైరి విశ్వకదా ఆఁత్సమయమున చలింపకుండునది కేవలము జ్ఞానోపదేశము చేయుట మాత్రమే జనులకు ప్రయోజనకారి కాదు; సంస్కృత విద్యోపదేశముకూడ చేయవలయును మన మెఱుంగిన దేశస్థులలో ననేకులు తెలివిగలవారుగాఁ గానంబడి నప్పటికిని వారు సింహాది క్రూరసత్వములవలెను అడవిమను ష్యులవలె నున్నారు వారికి తెలివియు నాగరికతయు పైపైగా మాత్రమున్నవి సోకిచూచినచో లోపలనుండు కృత్రిమము లన్నియుఁ బయల్పడును కావున, వారివారి భాషలలో బోధించి నచో వాస్తవాభిప్రాయము బోధపడుటయే గాక, శాశ్వతముగ హృదయమున నాటియుండును కావున సంస్కృతమును వృద్ధి చేయవలయును. ఇట్లు చేసిన సంస్కృతభాషాసహాయమున నొక నూతనశక్తి యుదయమయి అది అన్యజాతులవారికంటె నధిక శక్తికలదై వారిని జయించును ఇప్పుడు మీరు తక్కువజాతి వారివలెఁ గన్పట్టుచున్నారు మీరు సంస్కృతమందు సమర్థు లగుదురేని మీరు ఎక్కువజాతివా రగుటమాత్రమే గాక, మిక్కిలి క్షేమమును బడయఁగలరు అగ్రవర్ణస్థులను దూషింపఁ

దొడంగుదురేని దేశము ఛిన్నభిన్నమై పోవుటయే గాక, మన స్తాపమును సంభవించును. కావున, అగ్రవర్ణస్థుల యాధిక్యతకుఁ గారణమైన విద్యను మీరు సంపాదించిన మీరు కోరెడి సమత్వము సంఘటిల్లును.

ఈ చెన్నపురి రాజధానియందొక విషయము ప్రస్తావింపఁబడి యున్నది అనఁగా, దక్షిణదేశములో ద్రావిడులను నొక తెగవారుండి రనియును, వారు ఉత్తరమునుండివచ్చిన ఆర్యులతోఁ జేరకున్నా రనియును,ఇచ్చటఁగలద్రావిడబ్రాహ్మణులు మాత్రము ఆర్యులలోనుండి చీలినవా రనియును జెప్పుచున్నారు.ఇదంతయు నిరాధార మైనది ఉత్తర, దక్షిణ, దేశములవారికి భాషాభేద మొకటి గానంబడుచున్నదిగాని, వేఱేభేదమేమియుఁ గానము. ఇప్పుడు ఇచ్చట ఉత్తర,దక్షిణ దేశస్థు లెందఱో చేరియున్నారు కదా? మన ఆంగిలేయమిత్రు లెవ్వరేని మనలను వేర్వేఱుగా విభజింపఁగలరా?ఉత్తరదేశము లోనుండివచ్చినబ్రాహ్మణులు తమ సంస్కృతభాషను మఱచిపోయినట్లే యిచ్చట గలవారును తమ భాషను మఱచి ద్రావిడము నభ్యసించి యుండఁగూడదా? ఈ న్యాయ మిరుతెగలవారికిని బాధాకరమే ద్రావిడు లెచ్చట నుండి వచ్చిరి వారందఱు నిప్పుడు పర్వతములలోను వనములలోను మాత్రమే గలరు. వారి భాషను మాత్రము గైకొని యుందురు అందఱును ఉత్తరమునుండి వచ్చినవారే.

ఇఁక నీవిషయమై ఆంగిలేయులు చెప్పెడివానిని వినుఁడు ఈ దేశీయు లందఱును శూద్రులనియును, ఆర్య లీదేశమునకు

వచ్చి యాశూద్రులను దాసులను(బానిసలను)గా జేసిరనియును కొందఱు చెప్పెదరు.ఆర్యులు తిబెత్తు మధ్యప్రదేశములోనుండి వచ్చినట్లు కొందఱును,ఆసియామధ్యలోనుండి వచ్చినారని మఱి కొందఱును, ఉత్తర ధ్రువప్రాంతము నుండి వచ్చిరని నూతనముగాఁ గొందఱును,ఆర్యులనువారు తమవలెకపిలరోమములుగల వారని యింకనుగొందఱును,నల్లని వెండ్రుకలుగలవారని వేఱు కొందఱును చెప్పుచున్నారు మనశాస్త్రములందిట్టి యభిప్రాయముల కేయాధారమును లేదు ఆర్యులు హిందూదేశమున కావలనుండినవా రనుట కేయాధారమును గనఁబడదు. పూర్వము ఆఫ్గనిస్థానము హిందూదేశముతోఁ జేరియుండినది ఇంతమాత్రమే చెప్పవచ్చును తక్కిన మాట లన్నియు వివేకము లేనివారి మాటలే మఱియు న్యాయవిరుద్ధమైనవి. మఱియు, ఆంగిలేయులును,అమెరికనులును,పోర్చుగీసులును,ఇంకనుగలపరదేశస్థులును ఆఫ్గనిస్థానము వారికి బానిసలంజేసికొనినదేగాక వారిలోఁగతించిన వారిశవములను కాకులకు గ్రద్దల కాహారమగునట్లు పాఱవైచెను ఆఫ్గనిస్త్రీలకును తమకును గల్గిన బిడ్డలనుగూడ బానిసవృత్తియందే యుంచుకొనుచు నుండిరి. ఎన్నియో వేలేండ్లకుముం దిచ్చటికి వచ్చిన ఆర్యులుకూడ తమవలనే స్వదేశస్థులను హింసించినారని తలంచెదరు ఇది అసాధ్యమైనపని అధికసంఖ్యగల స్వదేశస్థులను అల్పసంఖ్యగల ఆర్యులు వారిని తమకుబానిసలనుగఁ జేసికొనిన ట్లూహించుట బుద్ధిమాంద్యమే కదా? వాస్తవమేమనఁగా, మహాభారతమునందు కలియుగములో బ్రాహ్మణు లొక్కరే యుండిరనియు, తర్వాత

వృత్తిభేదము చేత జాతిభేదము కలిగినదని యుఁజెప్పఁబడియున్నది. ఇదే యుక్తియుక్తముగనున్నది. ఇఁక రాఁగల కలియుగమునందు పూర్వమునందువలె సకలజాతులును అగును ఇదెట్లు సాధ్యమగుననఁగా, ఎక్కువ జాతుల తక్కువజాతిలోఁ బ్రవేశింపఁ జేయుటవలనఁ గాదు; తక్కువజాతులను ఎక్కువజాతులగునట్లు చేయుటవలన నగును బ్రహ్మజ్ఞానము గలవాఁడే బ్రాహ్మణుఁడు. వాఁడే మనుష్యశ్రేష్ఠుఁడు శ్రీశంకరాచార్యులు గీతాభాష్యమునందు శ్రీకృష్ణమూర్తి బ్రహ్మజ్ఞానులను గలుగఁజేయుటకొఱకే యవతరించినారని చెప్పియున్నారు గదా? ప్రకృతమున బ్రాహ్మణు లెంతక్షీణగతి నొందియున్నను వారి శ్రేష్ఠత్వమునే మనము గమనింపవలసిన వారమై యున్నారము ఏలన, ఇంత దనుక బ్రహ్మజ్ఞానులు ఇతరజాతుల వారికంటె నెక్కువజనులు బ్రాహ్మణులలోనే కదా జన్మించి యున్నారు అయినను, మనము వారి తప్పులను మాత్ర మిట్టివని నయమునఁ దెల్పవచ్చును గాని, వారితో తగవులాడుదుమేని యైకమత్యము చెడును. మఱింత కీడు సంభవించును తనుకే మర్యాదగల దనెడికాలము ఆంగ్లేయ రాజుల వలన మాఱిపోయినది మహమ్మదీయుల పాలనములోనే మాఱుదలనొంద నారంభమయ్యెను. కావుననే కదా మనలో నైదింట నొకపాలుజనులు మహమ్మదీయులైరి కత్తికిభయఁపడి మహమ్మదుమతము నవలంబించిరని భావింకఁడు జాగ్రత్త పుచ్చుకొనినచో నీచెన్నపురిలోని సగము జనులు క్రీస్తుమతస్థు లగుదురు నేను మలయాళదేశమున నొకవింతను జూచినాఁడను ఎక్కువ జాతులవారు వసించుచో

టికి మాలవారు పోఁగూడదు ఆమాలవాఁడే తురకమతము, లేక, క్రీస్తుమతము నవలంబించి వేఱేపేరు నుంచికొన్నచో వాఁడావీధిలోఁబోవచ్చును ఈమలయాళీలకెలివి నేమనవచ్చును? ఇట్టివారిని లోకులెల్లరునిందింతురుగాకయని నాయభిప్రాయము తనకు సొంతమైన బిడ్డగానున్నపుడు ఆబిడ్డను పస్తువేయుటయు, అదేబిడ్డ పరులకు సొంతమైనపుడు చేరఁదీసి వెన్నఁబెట్టి పెంచుట యునువలె, మలయాళీలకెలివి తేజరిల్లుచున్నది. కాఁబట్టి జాతి వైరము వలదు తక్కువజాతులను ఇంకను క్రిందికిఁ ద్రోయక యెక్కువ జాతులగునట్లు చేయుఁడు ఇట్లనుటచే ఎక్కువజాతులను క్రిందికిఁ ద్రోయుఁడని కాదు ఇదే మన శాస్త్రవిహిత ధర్మము అనఁగా చండాలురకు కొన్ని కొన్ని స్వాతంత్ర్యముల నొసంగి క్రమముగా వారిని యెక్కువజాతివారినిగాఁ జేయవలయుననియే శూద్రుఁడు వేదమును విన్నచో వానిచెవిలో సీసమును కరిగించి పోయవలయు ననియును, వాఁడు జ్ఞాపకమునం దుంచుకొనునేని వానిం జంపవలయు ననియును, 'ఓరి బ్రాహ్మణుఁడా,' అన్నంతనే వాని నాలుకను ఖండింపవలసిన దనియును, ఇంక నిట్టివి పెక్కులు వ్రాయంబడి యుండు గ్రంథము లనేకములు గలవు ఇట్టి క్రూరనిబంధములనొనర్చిన వారు మనుష్యమాత్రులు గారు; వారుపిశాచములే అయినను, నిబంధములను వ్రాసినవారిని మనముదూషింపఁగూడదు ఆకాలములో నట్టి ఆచారము లుండెను వానినే గ్రంథస్థముకావించిరి మఱి కొన్ని దినములకు "శూద్రునకు విశేషవిషయములను బోధింపవలదు" అని నియమించిరి. ఈకాలపు స్మృతులయందు

"బ్రాహ్మణుఁడు చేయుదానిని శూద్రుఁడును జేయుటశ్లాఘ్యము" అని వ్రాయఁబడి యున్నది ఇట్లే కాలక్రమమున మాఱుచుండును. ఈ దేశమునం దనేక జాతులవారున్నారు వీరిలోఁ గొందఱు బ్రాహ్మణులగుటకుఁ బ్రయత్నించుచున్నారు. ఏజాతివారైనను ఒకటిగాఁ జేరి మేము బ్రాహ్మణులమని చెప్పినచోఁ గాదనువా రెవ్వరు? ఇది ప్రత్యక్షానుభవము. కొన్ని జాతులవారు బలము నొంది యైకమత్యముతో నొక్కతీరున వాదింతురేని వారిని అడ్డగించు వా రెవ్వరు? వారు ఇతరుల జోలికి పోక తమంతట తాము వృద్ధినొందుట కాక్షేప ముండదు కదా

శ్రీశంకరాచార్యులు మొదలగు పెద్దలే జాతుల నేర్పాటుచేసినవారు వారుచేసినవానినెల్లఁ జెప్పుదునేని మీఁకు నాపై ఆగ్రహము కలుగక పోదు అయినను, నాయాత్ర యందును నాయనుభవము నందును తెలిసిన విషయము లతి విచిత్రములు మన పూర్వులు బెలూచిస్థాన జనులను గుంపులు గుంపులుగాఁ జేర్చి యొక నిమిషములో క్షత్రియులను జేసిరి; మఱియు జాలరివారిని బ్రాహ్మణులను జేసిరి ఇట్లు కావించిన వారు ఋషులుగాన, మనము వారిని నిందింపఁదగదు. మీరును ఋషులు కావలయును అదేసూక్ష్మము. ఋషియనఁగా నెవరు; పారిశుద్ధ్యముగలవాఁడే పారిశుద్ధ్యములేనివాఁడొకఁడు "నేను ఋషి" అనినంత కానేరఁడు మీరు నిజముగా ఋషులైనచో మీప్రభావముచేత మీరు చెప్పెడి విధమున ప్రజలువర్తింతురు ఇట్టి మహిమగలవారే ఋషులు ఇట్లు చెప్పినందుచే తనే నెఱవేఱినట్లు కానేరదు కాలక్రమమున సిద్ధింపఁదగినది.

కాఁబట్టి జాతిద్వేషమును మానవలయును. మత్సరము దేశమున కరిష్టదాయకము. ఐకమత్యమే ప్రయోజన మొసంగును. జాతిద్వేషము ముఖ్యముగా బ్రాహ్మణులకుఁ గూడదు. ఏలన, బ్రాహ్మణులకే సకలగౌరవములు కలవనెడి కాలముపోయినది. కాబట్టి తమ క్షేమార్థమై యితరులను ద్వేషింప కుండుటయే మంచిది. ఈయభిప్రాయమును బ్రాహ్మణులు శీఘ్రముగా గ్రహించి వర్తింపకపోయిరేని క్రూర మరణమునకు లోను గావలసినవారగుదురు మఱియు ఇతరుల క్షేమార్థమై పాటు పడవలసిన వాఁడు బ్రాహ్మణుఁడే అట్లు చేసినవాఁడే బ్రాహ్మణుఁడు. ఇట్లు చేయక కేవలము ధనార్జనము చేయువాఁడు బ్రాహ్మణుఁడు కాఁడు సద్బ్రాహ్మణునకు దానముచేసిన మోక్షమును, అసద్బ్రాహ్మణునకు దానముచేసిన నరకమునుసిద్ధించునని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి లౌకికవ్యవహారము బ్రాహ్మణునకుఁ దగదు. అది ఇతరజాతులవారికే తగినది బ్రాహ్మణులు తమకు సొంతమైన విద్యాబలముచే నితరులకు బోధింపవలయునని కోరుచున్నాఁడను తాము బ్రాహ్మణులని యితరు లనుకొనునట్లు వర్తింపరాదు. బ్రాహ్మణుని సత్కరింపనేల! అనఁగా, అతఁడు సద్గుణనిధిగానున్నాఁడు. అని మనువుచెప్పియున్నాఁడు కావున, బ్రాహ్మణులు తమ నిధిని యితరులకు నీయవలయును ఇండియాదేశములో నితరజాతులకంటె మున్నుగా సర్వసంగపరిత్యాగము చేసిన వాఁడు బ్రాహ్మణుఁడే బ్రాహ్మణుఁడు పురుషార్థమును బొందినాఁడని మీరు చెప్పుటకంటె, మీరేలవానిని మించి ప్రవర్తింపఁగూడదు? అయినను విద్యాధికారమును దుర్వినియోగముచే

యఁగూడదు అది మనకొఱకే యుపయోగపడవలయును తనకుఁ దెలిసినవిద్యను పరులకు బోధింపవలయును సర్పముచేఁ గఱువంబడినవాఁడు మరల నాసర్పమేవచ్చి ఆవిషమును జుఱ్ఱుకొనిన, సర్పదష్టుఁడు బ్రదుకుననెడి గ్రుడ్డినమ్మకము బంగాళా దేశమునందుఁ గలదు అట్లే బ్రాహ్మణుఁడును తానుంచిన విషమును తానే పీల్చుకొనవలయును. బ్రాహ్మణేతరులకు నేఁజెప్పెడిదేమనఁగా, మీ రవసరపడకూడదు; బ్రాహ్మణులతో జగడమాడఁదగదు; జ్ఞానమును సంస్కృతవిద్యను సంపాదించుకొనవలదని మిమ్మెవ్వరా క్షేపించిరి? మీరు వ్యర్థముగా వారిని నిందించుట దోషము మీశక్తినంతయు వినియోగించి బ్రాహ్మణులకుఁ గల జ్ఞానమును సంపాదింపుఁడు అపుడు మీరు మంచి సంస్కృతవిద్వాంసు లగుదురు హిందూదేశములోని సకల జాతులును సంస్కృతవిద్యనభ్యసించుటకొఱకై మీధనమును వినియోగించి పాఠశాలల నెలకొల్పుఁడు ఎప్పుడు మీకు సంస్కృతము వచ్చునో, అప్పుడే మీకు బ్రాహ్మణులకుఁ గల గౌరవము వచ్చును

హిందూదేశమునందు సంస్కృతభాషకుమాత్రమే అధికారము గలదనెడి రహస్యమును దెలిసికొనుఁడు ఆభాష మీకు వచ్చెనేని మిమ్మెవ్వరును దూషింపరు మనశ్శక్తిచే నొక్కఁడు అనేకులను ఆశ్రయించునట్లు చేసికొనుచున్నాఁడు. ఈ ప్రపంచమే ఒక్కదాని సంకల్పముచేఁ గల్గినదని అద్వైత మతాభిప్రాయముగ నుండఁగా, అట్టి అభిప్రాయమును సకలజనులును వహించినచో నందఱును శక్తివంతుల మగుదురు కదా? నలువదిలక్షల ఆంగ్లేయులు మున్నూఱులక్షల హిందువులను తమయాజ్ఞకు

బఱుచుకొని యుండలేదా ! కావున, మనము ప్రత్యేకప్రత్యేకముగా వర్తింపగ ఐకమత్యము గలవారమై యుందుమేని మనదేశము అభివృద్ధి నొందును దీనినిగుఱించి అథర్వవేద సంహితయం దిట్లు చెప్పఁబడి యున్నది

"సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవోమనాంసి జానతామ్, దేవాభాగం యథాపూర్వే సంజానానా ఉపాసత, సమానోమన్త్రః సమితిః సమానీ సమానం మనః సహచిత్తమేషామ్ సమానంమన్త్రమభిమన్త్రయేవః సమానీవ ఆకూతిః సమానా హృదయానివః, సమానమస్తు వోమనోయథావః సుసహాసతి."

మీరందఱును ఒక్క మనస్సును ఒక్క తలంపును గలవారు కండు వేలన, దేవతలు ఆదిలో నొక్క మనస్సుగలవారై యున్నందున మనుష్యులచేఁ బూజింపఁబడిరి అటు లుండుటయే క్షేమకరము ద్రావిడు లనియును, ఆర్యు లనియును, అన్యులని యును తలంచి జగడముచేయక యుందురేని గాఁగల కాలమున భారతవర్షము క్షేమపడును చీనాదేశస్థులును, జపానుదేశస్థులును ఒక్కతలంపు గలవారైయున్నారు అందువలని లాభము మీకుఁ దెలిసియే యున్నది చిన్నదేశములోని జనులు ఒక్కతలంపుతో నుండుటంబట్టి పెద్దదేశములవారిని జయించి పరిపాలించుచున్నారు. దేశము పెద్దదిగా నుండునేని అందు జనులు ఐకమత్యము లేనివారై యున్నారు దేశమునందు కలహము లుండఁగూడదు. అది క్షేమమునకు భంగకరము.

మనవారికి మఱియొక లోపము కలదు. మనము చాలకాలమునుండి పరరాజుల పాలనను లోఁబడియున్నారము ఇందువలన మనము స్త్రీలవలె నున్నారము ఈదేశములోఁగాని, ఇతరదేశములలోఁగాని స్త్రీలు మూఁపురుగూడి మూఁడుక్షణములు ఐకమత్యముతో నుండినదాని నేను జూడలేదు పరస్పరము కలహించికొందురు ఐరోపాదేశములలో గొప్పసభల నేర్పఱచి స్త్రీలశక్తినిఁగూర్చి మహాంఫటముగా సభలు చేయుటయేగాని, వారు జగడమాడుటను మాత్రము మానుటలేదు పిమ్మట నొక్క పురుషుఁడు చని వారిని సమాధానము చేయుచున్నాఁడు వారిని సమాధానపఱచుట కింకను ఒకపురుషుఁడు కావలసియున్నాఁడు లోకమంతయు నటులే యున్నది మనము నిప్పు డదేవిధముగ నున్నారము స్త్రీలను వేఱొకస్త్రీ వచ్చి పరిపాలింపఁదొడంగెనేని, ఈస్త్రీలు ఆస్త్రీని హింసింతురు కదా? ఆపరిపాలన మొక్క పురుషుఁడు చేసినచో నందఱుస్త్రీలును భయపడుదురు ఇట్టిస్థితి యందే మనమున్నాము మఱియు మనలో నొక్కఁడు పైకెక్కుటకుఁ బ్రయత్నించిన మనమందఱమును వానిని దిగువం ద్రోఁచెదము ఇట్టిపనిని అన్యదేశస్థుఁ డొనర్పంబూనినచో నూరకుండెదము ఇది మనకు సహజమై పోయినది బానిసలందఱును యజమానులు కావలయును ఈయభిప్రాయమును మఱవకుఁడు, ఇఁక నేఁబదియేండ్లవఱకు నీమహామాతృమూర్తిని ధ్యానింపుఁడు. తక్కిన వ్యర్థమైన దేవత లొకవైపున నుండనిండు మన స్వజన స్వదేశ స్వరూపదేవత ప్రకృతము మేల్కొనియున్నది. సర్వత్ర తన చేతులను, ఎల్లచోట తనపాదములను, సకలదిశ

లందు తన వీనులనుగల్గిన విరాట్స్వరూపమూర్తిని విడిచిపెట్టి వ్యర్థదేవతలను గొల్చుట కేల ప్రయత్నించెదరు? ఎచ్చోటను నిండియుండు నీదేవతను ముందుగాఁ బూజింతురేని, పిమ్మట సకలదేవతలను బూజించునట్టి శక్తిగలవారగుదురు అరక్రోసు దూరము నడుచుటకు శక్తిలేకయుండఁగా, ఆంజనేయునివలె సముద్రలంఘనము చేయవలయు ననెదరు. ఇది కానిపని ఒక్కొకఁడును "నేను యోగిని" "నేను ధ్యాననిష్ఠుఁడను" అనుచున్నాఁడు ఇది సాధ్యమా? దినమంతయు వ్యవహారములందు మగ్నుఁడై కర్మములు చేయుచుండువాఁడు సాయంకాలమునం దూపిరిని ముక్కుమూసి పీల్చినంతమాత్రాన ఋషులు ఆకాశములోనుండి దుమికి దర్శనమిత్తురా యేమి? ఇది యాటయా? ఇట్లు చేయుట నవ్వులాటయే చిత్తశుద్ధియు సత్యమును మొదట నభ్యసింపవలయును దీనికి విరాట్స్వరూపమును పూజించుటయే యుపాయము మన చుట్టుప్రక్కలనుండు మనుష్యులును తక్కిన జీవకోటులును విరాట్స్వరూపము ఆస్వరూపము నారాధింపుఁడు. మీరు మొదట పూజింపవలసినది మీస్వదేశస్థుల నని యెఱుఁగుడు అటుపిమ్మటనే యితరదైవములను పూజింపవలయును మీస్వదేశీయుల నారాధింపని కారణముననేగదా మీ కిట్టి కష్టములు సంభవించెను ఇఁకనైనఁ గనులు దెఱచిచూడుఁడు. నేనిప్పుడు జేయఁదలంచిన కార్యముల నెఱింగించెదను. వినుఁడు.

మనదేశీయుల వైదిక లౌకిక విద్యను మనవశముచేసికొనవలయును. ఇది మీమనస్సున నాటుచున్నదా? మీరుకలలోను, మెలకువలోను,తలంపులోను, మాటలోను, కార్యము

లోనుఇదే యభిప్రాయముగలవారై కార్యమును నెఱవేర్పఁడు. ప్రకృతము మీరు నేర్చినవిద్యవలన కొంత మేలు కల్గినను అంత కంటె కీడు అధికముగా నుండుటంబట్టి ఆమేలు అడుగున పడి పోయినది మఱియు నావిద్య ఉత్తమగుణములనొసంగునది కాదు ఉన్న మతిని పోఁగొట్టునది గానున్నది అది మనకావశ్యకమైనదాని నివృద్ధికిఁ దెచ్చుచున్నది బాలుఁడు బడికిఁబోయినంతనే, మొద టిది-తండ్రిమూఢుఁడు, రెండవది-తనతాత అప్రయోజకుఁడు, మూఁడవది-ఆచార్యుఁడు వేషధారి, నాలవది-వేదము అబద్ధము అని నేర్చుకొనుచున్నాఁడు ఇట్లు చదివి పదునాఱవసంవత్సర మున దుర్బలుఁడై సర్వానుబద్ధమనెడి వాదము చేయుటకు సం సిద్ధుఁ డగుచున్నాఁడు కాఁబట్టియే యీవిద్య యేఁబదేండ్లుగా నభ్యసింపఁబడినప్పటికిని హిందూదేశమంతట నొక్కఁడేనిస్వబుద్ధి గలవాఁడు కలుగకున్నాఁడు స్వబుద్ధిగలవారు కొందఱుందు రేని, వారు ఇతరస్థలములందో, లేక సద్గురువులయొద్దనో నేర్చిన వారే గాని ప్రకృతము సర్వత్రవ్యాప్తమైయుండు విద్యవలనఁ గాదు తత్కాలపువిద్య విద్యయే కాదు. విద్యయనఁగా వృత్తాంత ములను జ్ఞప్తియందుంచికొనుట కాదు విద్యయనఁగా సద్గుణము, సదాచారము, ఆత్మోన్నతి, పురుషార్థము మొదలగువాని నొసం గునది యేదిరో అదియే విద్య లెక్కలేని పుస్తకములను కంఠ పాఠము చేయుటకంటె, ఐదువిషయముల నైనను తాదాత్మ్య సంబంధముతో నేర్చి తనజీవితకాలమునంతయు సన్మార్గమున చరించినవాఁడే ఉత్తముఁడు

"యథా ఖర శ్చన్దనభారవాహీ
భారస్య వేత్తా న తు చన్దనస్య"

చందనపుకట్టెలను మోసెడిగాడిద, ఆభారమును మాత్రమే యెఱుఁగును గాని, దాని గుణము నెఱుఁగదుకదా? విషయములను నింపించికొని యుంచుటవలననే విద్య వచ్చినట్లు భావింతురేని, ఈప్రపంచములోని పుస్తకభాండాగారము లందలి యొక్కొకపుస్తకము నొక్కొక జ్ఞానియనియు, గ్రంథ మాలికలు మహర్షులనియు నేల మనము భావింపఁగూడదు? కావున, మనము లక్ష్యమునం దుంచి కొనవలసిన దేమనఁగా, వైదిక లౌకిక విద్యలను మనసా్వధీనమునందుంచికొని, అవి నెఱ వేఱునట్టిప్రయత్నము చేయవలయును. ఇది గొప్పకార్య మనియు, ఇది నెఱవేఱునో నెఱవేఱదో యనియు భయ మొందక ప్రయత్నింపవలయును మఱియు నీచెన్నపురియం దొకయాలయము నేర్పఱుపవలయును ఆయాలయము సకల మతస్థులకును సామాన్యమైనదిగ నుండవలయును మతకలహ ములు కల్గునందురేమో, అట్టికలహముల కవకాశ మీయక సకలహిందూమతస్థులకును సామాన్యమై యుండు "ఓం" అను చిహ్నమే ఆయాలయములో నుంచిన కలహములు కలుగవు ఇట్లొనర్చిన ప్రతిమనుష్యుఁడును మాయాలయ మనుటకు సమ్మతించువాఁడగును తమతమ యిష్టదైవములను వారివారికి అనుకూలముగు స్థలములం దుంచికొనవచ్చును. సామాన్యముగా నెల్లవారికి సమ్మతమైన యీయాలయములోఁ గలహము చేయకుఁడు. ఈయాలయములో మతభేదముల

కెడమీయక ప్రతిమతస్థులకును విరోధములేని యంశములు మాత్ర ముపదేశింపఁబడును అయినను వారివారి మతసంప్రదాయ విషయములను గూర్చి బాహాటముగా నుపన్యసింప వచ్చును కాని ఇతరసంప్రదాయస్థులతో జగడమాఁడఁగూడదు. ఒక్కొక్కరు చెప్పెడిదానిని వినవలయును అదియే యీ కాలమునకుఁ గావలసినది మీఁదఁజెప్పిన ఆలయములో నుపదేశించుటకుఁ దగినవారిని యేర్పఱుప వలయును కదా? అట్టివా రెట్లు లభింపఁగలరు అనఁగా మన మొకవిద్యాశాలను నిర్మించి సన్మార్గు లగుఉపాధ్యాయులను నియమించి వారిచే మన బాలురకు విద్యనేర్పిన లభింతురు మఱియు ఉపాధ్యాయులు లౌకికవిద్యతో బాటు శ్రద్ధగా మతవిద్యనుగూడ నేర్పవలయును. మతవిద్యను లౌకికవిద్యను ప్రతిగృహమునకుఁ బోయి నేర్పెడి యుపాధ్యాయులు పెక్కండ్రు ఏర్పడవలయును ఈ కార్యము ప్రతిగ్రామమునందును జరుగవలయును ఈమహాకార్యమునకు విశేషధనము కావలయునని చింతింపఁబనిలేదు ధనము తృణ సమానము ఇది నాయనుభవసిద్ధము ఎట్లన, నేను పంద్రెం డేండ్లుగా రేపటికి భిక్ష యెచ్చటదొరకును అనుటనుగూర్చి విచారింపకయే కాలముగడపినాఁడను నాకేదికావలయునో అది తనంతట వచ్చి నన్నాశ్రయించును ఏలన, అది నాయొద్ద దాస్యవృత్తియందుండవలయునేగాని, నేనుదానికి దాసుండను గాను. ఇదియే సరియగువాక్యము పైనివివరించిన కార్యములు చేయుటకు కావలసినవారు మనుజులే. ఈవిషయమొక్కటే ఆలోచనలో నుండునది ప్రకృతము మన పెట్టిస్థితియం దున్నా

మనువిషయము నింతకు మున్నే వివరించి యున్నాఁడను. కాఁబట్టి యీకార్యమును జేయుటకు నడుము కట్టుఁడు నాకు మనుజులున్నారనియుఁ దెలియును ఓ చెన్నపురి బాలులారా! మిమ్ము నేను నమ్మియున్నాఁడను. మీరు నేఁజెప్పెడి కార్యములను జేసితిరేని మిక్కిలి కీర్తినొందుదురు. నేను బాలుఁడై యుండినప్పుడు నాశక్తియందు నాకు నమ్మకముండినది. ఆనమ్మకముతోనే యిప్పుడును నేను పనిచేయుచున్నాను మీరొక్కొ శక్తిసామర్థ్యములను వినియోగించి కార్య మొనర్పుఁడు. మీయందుశక్తియున్నది; నమ్ముఁడు మీరు నేఁజెప్పిన కార్యములొనర్చితిరేని, హిందూదేశములోని వారలనందఱను పునర్జన్మమెత్తినవారినిగా, చేసినవారగుదురు మఱియు మీ రిట్లు కావింతురేని, పదిసంవత్సరములలో ప్రపంచములోని జనులందఱును మీకు సహాయులగుదురు, మీయభిప్రాయముల నన్నిఁటిని అంగీకరింతురు. మఱియు ప్రపంచములోని ప్రతిదేశమునకును బోయి మనము పనిచేయవలయును మనదేశములోని ప్రతిగ్రామమునకునుబోయి ప్రసంగము చేయవలయును ఈకార్యముచేయుటకై నాకు బాలురు కావలయును. "బల శాలురును, ఆరోగ్యము గలవారును, బుద్ధిసూక్ష్మముగలవారును, బాలురుగా నుండువారును దేవుని కడకుఁ బోవువారు" అని వేదము మొఱఁబెట్టుచున్నది రాఁగల కాలమును నిర్ణయించుటకు ఇదే తగినసమయము మీరు బలమును యౌవనమును కల్గియుండునప్పుడే యీపని చేయఁ బూన వలయును అప్పుడు వికసించిన పుష్పమెట్లు భగవంతునకు సమర్పింపఁదగినదో, అట్లే ఇతరవ్యవహారములలోఁ జొరని మీరు

చేయునట్టి కార్యము భగవత్ప్రీతికరముగా నుండును. (కలహములు చేయుటకును, న్యాయవాదివృత్తినిఁ బడయుటకును బ్రయత్నించుటకంటె లోకోపకారకార్యములను జేయుటకుఁ బ్రయత్నింపుఁడు) మీ దేశముయొక్క మేలుకొఱకును,మనుష్యజాతి క్షేమముకొఱకును స్వప్రయోజనమును లక్ష్యపెట్టకయుండుటయే విశేషము మన కాయువు స్వల్పము. ఈలోకయాత్రలో నేమిసారమున్నది? హిందువులగు మీకు ఆత్మనిత్యమనెడి జ్ఞానము పుట్టినప్పటినుండియే కల్గియున్నది ఈపట్టణములోని బాలురు కొంద ఱప్పుడప్పుడు వచ్చి నాతో నాస్తికప్రసంగము చేసెదరు హిందువులగువా రెప్పుడును నాస్తికులు కారని నానమ్మకము కొంద ఱాంగిలేయగ్రంథములను జదివి నాస్తికులై యుండవచ్చునని తలంచుట కవకాశముకలదు గాని, ఆనాస్తికత్వ మైదునెలలకు మీఁద నుండదు ఏలన, అది మన మనస్సులో నాటనేనాటదు; మనశరీరములోనంటదు మన రక్తములోఁ గలియదు మీస్వభావములో లేనిదానిని నమ్ముటకు మీచేతఁగాదు, మీరు మీస్వభావమును మార్చికొనుటకుఁ బ్రయత్నించి నప్పటికిని అది నెఱవేఱదు కావున మీరట్లు గుటకు యత్నింపవలదు నేనును నాబాల్యమునం దొకప్పుడట్లు గుటకుఁ బ్రయత్నించితిని గాని, అది, సాధ్యము కాకపోయెను ఆయువు స్వల్పమైనను ఆత్మ అనాదినిత్యమని జ్ఞప్తియందుంచికొనుఁడు. మరణము నిశ్చయముగాన, మనము ఆకార్యమును ఎటులైనను సాధించుటకు మన యాయువును వినియోగింపవల

యును. దీనినే మనము మన సంకల్పముగా నుంచికొందుమేని ధర్మసంస్థాపనము కొఱకు కల్పకల్పముల నవతరించుచున్నట్లు వాగ్దత్తము చేసిన భగవంతుఁడగు శ్రీకృష్ణమూర్తి మనల నాశీర్వదించును గాక."

---

(వివేకానందస్వాములు చెన్నపురిలోఁ గొన్నిదినములుండి అనంతరము కలకత్తా, డార్జిలింగు, కాశ్మీరము, జమ్మునగరము, పంజాబులోని సియాల్‌కోట, లాహోరు అను నీప్రదేశముల కేఁగిరి. అచ్చటచ్చటఁగల మహాజనులభినందనపత్రము లర్పించి సత్కరించిరి. స్వాములు కొన్నిస్థలములం దుపన్యాసము లొసంగిరి. పిమ్మట కలకత్తాకుఁబోయి "రామకృష్ణమిషన్" అనెడి వేదాంత మతప్రసంగ సమాజమును నేర్పఱచిరి. బేలూరు, మద్రాసు, మాయావతి అను నీస్థలములందు మఠములను స్థాపించిరి. కాశి, కనఖలము అనుచోట్లలో క్షామనివారణ సంఘములను నెలకొల్పిరి. మూర్షదాబాదుతోఁ జేరిన పర్వత అనుచోట అనాథశరణాలయమును స్థాపించిరి.

స్వాము లచ్చట చాలదినములు సంచారము చేసినందున శరీరమున కనారోగ్యము సంప్రాప్తించినందున, సముద్రయాత్ర చేయుటవలన ఆరోగ్యము కల్గునని తలంచి మరల అమెరికా దేశమునకుఁబోయిరి. ఆరోగ్యము కల్గినతర్వాత, అచ్చటనుండి సాన్‌ఫ్రాన్‌సిస్కోనగరమునకుఁబోయి అచ్చట "వేదాంతసంఘము"ను స్థాపించిరి. పిమ్మట, ఫ్రాన్సుదేశమునకు ముఖ్యనగరమగు పారిసులోఁగూడిన మహాసభకు స్వాము లాహ్వానింపఁబడినందున నచ్చటి కేఁగిరి.

1900 సం. మధ్యకాలమున స్వాములు మరల హిందూదేశమునకు వచ్చిరి అయినను శరీరము మాత్రము ఆరోగ్యస్థితిలో లేకుండెను అయినను, 1901 సం. మార్చినెల 19-వ తేది శిష్యులతోఁ గూడి ఢక్కా నగరమునకుఁ జనిరి అచ్చట రెండు ప్రసంగములు కావించిరి

## లాహోరు - వేదాంతోపన్యాసము

"మహాశయులారా!

మనము నివసించు ప్రపంచములు రెండు ఒకటిబహిః ప్రపంచము, రెండవది యంతఃప్రపంచము చిరకాలమునుండి మానవకోటి యీ రెంటియందును సమానముగాఁ గాలయాత్రను నడుపుచున్నది మనుష్యుఁడాయాత్రను బైటనుండి ప్రారంభించి బహిఃప్రపంచమునందలిబహువిషయములకు సమాధానముల నరయఁగోరినాఁడు అత్యద్భుతములు రమణీయములు నగు వానియందుఁగల కోరికను, దనచుట్టునున్న వస్తువులమూలమునఁ దీర్చుకొనదలంచెను తన హావభావము లన్నిఁటిని బైకి భాషామూలమున వ్యక్తీకరింపఁగోరెను ఇట్టియుద్దేశములతోఁ బాటుపడఁగాఁ బడఁగా నత్యాశ్చర్యకరము లగు సమాధానములును రమణీయములగు వస్తువుల కన్నిఁటికిఁ జక్కని ప్రవచనములును భగవత్పూజావిధానములును బయలు దేఱినవి

ఇది యిట్లుండ, రెండవది యగునంతః ప్రపంచము మనుజునికి మొదటిదానికంటె మిక్కిలి రమణీయము నద్భుతమును

విరివియుఁ గలిగి గోచరించెను వేదముయొక్క కర్మకాండభాగ మందు మతమునుగూర్చి యద్భుతములగు వాక్యములును, సర్వాధికారియు సృష్టిస్థితిలయ కారణము నగు భగవంతునిగూర్చిన యభిప్రాయములును హృదయమునకత్యాహ్లాదకరములగు భాషతో వర్ణింపఁబడియున్నవి ఋగ్వేదమందుఁ బ్రళయమును వర్ణించిన శ్లోకము మీలో చాలమందికి జ్ఞాపక ముండియుండ వచ్చును ఆశ్లోక మభూతోపమానము గదా ఇట్లున్నప్పటికిని నిదియంతయు బహిఃప్రపంచ విశేషమే యగుట నింకను స్థూల పదార్థ సంబంధ ముండుట గానవచ్చుచున్నది. ఇదియు నవ్యక్త వర్ణనమే యయినను బదార్థసంబంధియనియు,స్థూలశరీరానుగతము గానిమనోసంబంధి గాదనియు మనము తెలిసికొనుచున్నాము. అది వ్యవథానావ్యక్తము గాని యూహావ్యక్తము కాదు కావు ననే రెండవభాగ మగు జ్ఞానకాండమం దంతయుఁ బైదానికి విరుద్ధమగు విషయములు చెప్పఁబడినవి మొదటిది బహిఃప్రకృతి ద్వారా ప్రపంచరహస్యశోధనము భౌతికప్రపంచవిషయముల మూలమున జీవరహస్యములను గనిపెట్టుటకైన ప్రయత్నము మొదటిది "యస్యైతే హి మహతో మహాత్వం" ఈహిమా లయము లెవ్వని ప్రభావమును వెల్లడించుచున్నవి.అనునది మహా మహాదుద్దేశమేగాని,దానితో హిందువులకుఁ దృప్తికలుగలేదు. కలుగక వెనుక తిరిగి యంతశ్శోధనమును ప్రారంభించిరి. భౌతికవిచారమును విడిచి యాధ్యాత్మికవిచారమును మొదలు పెట్టిరి "మనుష్యుఁడు మృతినొందినతరువాత వాఁ డేమగును" అను నొకధ్వని బయలుదేఱినది "అస్తిత్యేకేనాయమస్తీతి

చైకే" "కొందఱాతఁ డుండు నందురు. మఱికొందఱు పోయె నందురు" మృత్యుదేవతా ! యేది సత్యము దీనికిని మొదటి ప్రక్రియకును చాలయంతరము బహిఃప్రపంచమునందుఁగల జ్ఞానమునంతను సంపాదించెనుగాని యంతటితో హిందువుల మనస్సునకుఁ దృప్తిలేదు ఇంకను లోపలికిఁ జొచ్చి శోధించి తమయాత్మను నారసి సమాధానమును కనుఁగొనెను వేదమందలి యీభాగమున కుపనిషత్తులు వేదాంతము ఆరణ్యకములు లేక రహస్యము ననిపేరు ఇక్కడ మతమున కినవసరములగు బహిరాడంబరము లన్నియు విడిచి పెట్టఁబడినవి ఇం దాత్మ విషయములు భౌతికభాషలోఁ జెప్పఁబడక యాత్మభాషలోనే చెప్పఁబడినవి. అం దెక్కడ స్థూలసంబంధము లేదు మనతో సంబంధించిన విషయము లేవియు నుండవు నిశ్చయముగాను, నిరంకుశముగాను నిరుపమానములు ఘనాఘనములు నగుసత్యములు ప్రపంచమునకు ఘంటాపథముగా బోధించిన యీయుపనిషద్వేత్తలమహాద్బుద్ధు లిప్పటిమనము తేఱిపాఱిధైర్యముతో నత్తెత్తి చూడనైన శక్యముగానివి మనబుద్ధుల కతీతములు. ఈయంశము మీకు విన్నవింప నెంచినాఁడను జ్ఞానకాండమను నది యొక మహాసముద్రమువంటిది అం దొక్క లేశమును గ్రహించుట కనేక జన్మాంతరములు పట్టును. కనుక, శ్రీరామానుజులవారు దానిని వేదముల కుత్తమాంగమనియు భుజములనియు వేదసారమనియుఁ జెప్పిన దెంతయు వాస్తవము వేదములయందలి కర్మకాండయెడల హిందువుల కందఱకు మిక్కిలి గౌరవమే గాని శ్రుతి యన్నప్పుడుమాత్రము సర్వసాధారణముగా నుప

షత్తు లనియే భావము మన తత్త్వశాస్త్రజ్ఞు లందఱు వ్యాస పతంజలి గౌతమాదులును, తత్త్వశాస్త్రజనకుం డగు కపిలుఁడును సహితము వారు వ్రాసినదానికి లక్ష్యములు గావలసినప్పుడుపనిషత్తులనే యాధారముగాఁ గొనిరి గాని మఱి దేనిని గాదు శాశ్వత ధర్మము లచ్చటనే గాని మఱి యెచ్చటవారకును? ఒక కాలమునుబట్టి కలిగిన సత్యములు కొన్ని యొక కాలమునకును, ఒక విధముగాను, కొన్నిస్థితిగతులయందును మాత్రము సత్యములై యుండును మఱికొన్ని సత్యములు మానవస్వభావమునుబట్టి యేర్పడి మానవస్వభావ మున్నంతవఱకు శాశ్వతముగా నుండును ఇదియే సర్వలోక సమ్మతములగు సత్యములు హిందూదేశమందు వచ్చితీరు నని మన మనుకొను మార్పులన్నియు సంఘవిషయములందును, వేషభాషలయందును, భోజనమజ్జనాదులయందును పూజాపురస్కారముల యందును, మాత్రమే వచ్చును శ్రుతులయందలి యీసర్వసామాన్యధర్మములు నుత్కృష్టములగు వేదాంతసిద్ధాంతములును నిరంతరములై, నిరంకుశములై తమ సంపూర్ణప్రభావముతోఁ గదలక నిలిచియుండును ఉపనిషత్తులలోఁ బూర్ణముగాఁ జెప్పఁబడిన యీయభిప్రాయములకు బీజాంకురములు కర్మకాండమునం దే నాటఁబడినవి. అన్ని శాఖల వేదాంతులు నంగీకరించిన సృష్టిప్రకారమును, అన్ని హిందూ తర్కసిద్ధాంతములకు నాధారముగు మనశ్శాస్త్రముగూడ నదివఱకే ప్రపంచమునకుఁ దెలుపఁబడినది కాఁబట్టి వేదాంతవిషయమును గూర్చి ముచ్చటించుటకు ముందుఁ గొన్ని వాక్యము లాయావిషయములనుగూర్చి యించుక

చెప్పనొప్పును ముందు నే నుపయోగపఱచుచున్న వేదాంత శబ్దప్రయోగము సంగతి జ్ఞప్తిచేసికొనవలెను ఏమి దురదృష్ట మోగాని యిప్పుడు హిందూదేశమందు వేదాంత మనఁగానే యద్వైతమతమునకు మాత్రము చెందునని యూహించుచు న్నారు. కాని, యిప్పుడును మనము చదువుకొనుటకుఁ బ్రస్థాన త్రయమున్నదని యెఱుఁగవలయును మొట్టమొదట దైవబో ధితములగు నుపనిషత్తులు తరువాత నదివఱకుఁగల తత్వ సిద్ధాంతముల సమామ్నాయమగుటచే వ్యాససూత్రములు ప్రధానములు ఈసిద్ధాంతము లనునవి యొకదానితో నొకటి విరోధింపక పరస్పరసహాకారములుగా నుండును వీని నన్నిఁ టినిఁ జక్కఁగా సవరించి యన్వయసౌకర్యము గావించిన యతఁడు వ్యాసులు ఈసూత్రములకు నుపనిషత్తులకును నడుమ వేదాంతమునకు దివ్యమగు వ్యాఖ్యానమగు శ్రీమద్భగవద్గీతలు గలవు ఇట్లుపనిషత్తులు, గీత, సూత్రములు నీమూఁడును ద్వైత విశిష్టాద్వైతములను భేదములేక ప్రతిమతము వారికిని ప్రమాణగ్రంథములుగ నున్నవి

మఱియు, మతస్థాపకులగు శంకరరామానుజమధ్వచైతన్య వల్లభాచార్యులు అందఱుఁగూడ నీమూఁటి నాధారముచేసి కొని క్రొత్తగా వ్యాఖ్యానములను వ్రాయుచువచ్చిరి అందు చేత, వేదాంతశబ్ద ముపనిషత్తులనుండి పుట్టిన యొక్కమతము నకే వర్తించు ననుట సరికాదు. వేదాంతశబ్ద మీమూఁటికిని గూడ వర్తించుచున్నది వేదాంతి యనుపించుకొనుట కద్వైతి కెంత యధికారముకలదో యంతటి యధికారము రామాను జీయునకును గలదు. ఇంతేగాక, హిందువనఁగా వేదాంతి యని

నాయభిప్రాయము వేదాంతియన్న నదియే యర్థము. ఇంకొక్క విషయము మీరుజ్ఞప్తియందుంచుకొనవలయును. ఈమతము లనాదిగా నున్నవిగాని, యద్వైతము శంకరులతోడ వచ్చినది గాదు శంకరులు పుట్టకమును పనేక కాలము నుండియున్నది. అతఁడామత ప్రతినిధులలోఁ గడపటివాఁడు. అట్లే రామానుజ మతము రామానుజులకుఁ బూర్వ మనేక కాలమునుండి కలదు. ఈప్రకారముగానే తక్కిన యద్వైతమతములును వానితో పాటుగా నున్నవి నాబుద్ధికి గోచరించినంతవఱ కివి యెవ్వియుఁ బరస్పరవిరుద్ధములుగావని నాసిద్ధాంతము నెమ్మదియైన సామవాక్యములతోఁ బ్రారంభమై యద్వైతవిజృంభణముతో నంత మగుచు మహావిషయములను మహాబోధ గావించెడు షడ్దర్శనములవలెనే మతత్రయమునందును మనుష్యుని క్రమక్రమముగా నెక్కుడజ్ఞానాభివృద్ధిఁజెంది తుద కద్వైతమందు సర్వైక్యమును గాంచినది కావున,నీమూఁడును పరస్పరవిరుద్ధములు గావు అయినను, ఇట్లనేకులు పొరఁబడుచున్నారని మాత్రము చెప్ప వలసియున్నది అద్వైతమతబోధకుఁడు,శుద్ధాద్వైత మత గ్రంథములను మాత్రమే గ్రహించి, తక్కిన ద్వైతవిశిష్టాద్వైత భాగములను విడిచి తన మతానుసారమగు నర్థమును గల్పింపఁ బూనును ద్వైతులు తమ ద్వైతమునకుఁ బనికివచ్చు భాగము లటుండనిచ్చి యద్వైతభాగములను విడిచి ద్వైతార్థమును చెప్పఁజూతురు వారందఱు మనకు గురువులే కాని గురువుదోషములను సహితము చెప్పవలయుననియున్నది వారావిషయము నందు మాత్రము దోషులని నాయభిప్రాయము. గ్రంథ మార

ణము మన కక్కఱ లేదు మతకాపట్యము మనకుఁ బనిలేదు.
వ్యాకరణవేషణముతో మన కవసరము లేదు గ్రంథములందు
లేని మన యభిప్రాయముల నందుఁ జొన్పుటకై ప్రయత్నింపవల
సిన యగత్యము మనకు లేదు ప్రమాణములగు వేదములయం
దలి యద్భుతరసమును మనము గ్రహించితిమేని మన పనియం
తయు సుకరము ఉపనిషత్తుల మార్గమొక్కటి యున్నది "దేనిని
దెలిసి యన్నిఁటిని దెలియఁగలము?" నవీనభాషలో నుపనిష
త్తులయందలి విషయ మేమనిన: నైక్యమునుగని పెట్టుట. భేదమం
దైక్యమును గనుటగదా జ్ఞానము ప్రతిశాస్త్రమునకు నిదియే
పద్ధతి మనుష్యుని జ్ఞానమంతయు భేదమం దైక్యమును గను
టయై యున్నది మన ప్రకృతిశాస్త్రము లనెడు చిన్న చిన్న జ్ఞాన
లేశములయొక్క యుద్దేశము కొన్ని ప్రభేదములకుఁగలయైక్య
మును గనుట యైనప్పుడు నానారూపములయందును బదార్థపరి
మార్గములలోఁ బ్రతివిషయమందును భేదముకలిగి యనేకలోక
ములుగల యీసృష్టియం దైక్యమును గనుటయెంత పెద్దపనియో
చెప్ప నక్కఱ లేదు ఈయైక్యశోధన ముపనిషత్తుల పని అనఁగా
నిక్కడ నరుంధతీదర్శనన్యాయము పట్టినది. ధ్రువనక్షత్రమును
మన మొకనికిఁ జూపింతమన్న మొదట దానికంటెఁ బెద్దదియుఁ,
బ్రకాశమైనదియు నగు నొకనక్షత్రముం జూపి దానిమీఁద
దృష్టినిలిపినతరువాత క్రమక్రమముగా ధ్రువనక్షత్రమును జూ
పింతుము మనము చేయవలసినపనియు నిదియే ఇందులకుఁ దార్కా
ణముగా నుపనిషత్తులను జూడుఁడు ప్రతిప్రకరణమును మొదట
నుపాసనతో ద్వైతముగాఁ బ్రారంభ మగును తర్వాత భగ

వంతుఁడు సృష్టి స్థితి లయ కర్త యని బోధింపఁబడును అతఁడే పూజ్యుఁ డనియుఁ బ్రభువనియు బాహ్యాంతరప్రకృతినిర్ణేత యనియు బాహ్యాంతరప్రకృతులకంటె భిన్నుఁడనియుఁ జెప్పఁ బడును. ఇఁకఁ గొంచెము దాఁటినతరువాత నీగ్రంథమే భగవంతుఁడు ప్రకృతి కావల లేఁడనియును అందే లీనమై యున్నాఁ డనియుఁ జెప్పును చిట్టచివరకు ద్వైగుణ్యము నశించి యాతఁ డొక్కఁడే సత్య మగును భేదమే లేదు "తత్త్వమసి శ్వేతకేతో" ఆలీనమైనవాఁడు ఆత్మయే యని తేలును "శ్వేతకేతూ! నీవే యది" దాని కింక భిన్నము లేదు అభిప్రాయభేదమును లేదు ఈసత్యము నిశ్శంకముగా బోధింపఁబడినది. ఆసత్యమును వ్యాపింపఁజేయుటకు మన కెంతమాత్రమును సందేహ మవసరము లేదు ధైర్యముగా బోధింప వచ్చును భగవదనుగ్రహమువలన నేన ట్లాచరింతును

ఇఁకఁ బూర్వాంశమును విచారింతము. మొట్టమొదట మనము తెలిసికొనవలసినవి రెండు మొదటిది వేదాంతశాస్త్రములకన్నిఁటికిని సంబంధించిన మనశ్శాస్త్రము రెండవది సృష్టివిషయము మన మెన్నఁడు కలనైన నెఱుంగని క్రొత్తక్రొత్త విషయములు పిడుగులవలె శాస్త్రశోధనలవలన నిప్పటిదినములలోఁ బైకివచ్చుచున్నవి. శక్తి యనుదానిని మనుష్యుఁడుచాల కాలముక్రిందటనే కనిపెట్టినాఁడు కాని తమకు కనుపించెడు శక్తులన్నియు నొకమూలశక్తియొక్క పరిణామములని తెలిసికొన్నది మొన్నమొన్ననే. ఉష్ణము, ఆఁకలి, అయస్కాంతాకర్షణము,విద్యుచ్ఛక్తిలోనగునవి యన్నియు నొక్కటేయనియిప్పు

డిప్పుడే కనిపెట్టినారు ఇట్లే సంహితయందును గలదు సంహిత
లెంత ప్రాచీనమైనను శక్తివిషయమై యందున్న సంగతినే మీకు
నేను జెప్పుచున్నాను శక్తులన్నియు నాకర్షణశక్తియైనను,విద్యు
చ్ఛక్తియైనను మఱి యేదియైన నవియన్నియు ఒక్కటివే. అవి
యొక యూహారూపమున నంతఃకరణమునఁ బ్రతిఫలించి గోచ
రించును మనుష్యునియంతరింద్రియము లన్నిఁటికిని బ్రాణము
మూలము ప్రాణమనేమి? స్పందనము అనఁగాఁ గంపనములేక
వణఁకుటవంట చలనము ఈ విశ్వమంతయు నాదిస్థితికి క్షీణించి
నప్పుడీశక్తియంతయు నేమగును? అది యంతయు నశించునా?
నశింపదు నశించినయెడలఁ బునర్విజృంభణమున కవకాశమెక్క
డిది? ఈ విజృంభణములు తరంగములభంగి లేచుచు నణఁగుచు
నుండును గదా దీనిని సృష్టియందురు సృష్టి యన నిర్మాణము
కాదు విజృంభణము ప్రతివస్తువును రానురాను సూక్ష్మమై
తుదకు దాని యాదిస్థితికి క్షీణించి కొంతవఱ కట్లణఁగి యుండి
తిరిగి విజృంభణమునకు సిద్ధమగును ఇదిసృష్టి ఈశక్తులన్నియు
నేమగును? అవియు నాప్రాణముయొక్క స్థితికి వచ్చును ఈ
యాదిప్రాణము చలనము లేనంతటి స్థితికి వచ్చును.
చలనము బొత్తిగమాత్రము లేక యుండదు. ఇది సూక్త
మందు చెప్పఁబడినప్రకారము స్పందనరహితమైన స్పందనము.
అనిదావతము ఉపనిషత్తులయందలి పరిభాషను దెలిసికొనుట
మిక్కిలి కష్టము ఇందుల కుదాహరణము:— వాయుశబ్దము,
కొన్నిచోట్ల గాలిపరముగాను, కొన్నిచోట్ల చలనపరము
గాను నుపయోగింపఁబడినపుడు తఱచుగా నొకదానికొకటి
పొరపడుచుండుట తటస్థించును ఈవిషయమున మనము జాగ

రూపులమై యుండవలయును. పదార్థ మనునది యేమగును ? పదార్థమునం దంతట నీశక్తులు వ్యాపించియుండును. ఇవియన్నియు సూక్ష్మాతిసూక్ష్మమగు నొకపదార్థమందు లీనముౕ తిరిగి విజృంభించును ఆవిజృంభణములలో మొదటిది యాకాశము. దాని కేమని పేరుపెట్టినను ఆకాశ మాదిపదార్థము ప్రాణము యొక్క యుత్పత్తివలన నీయాకాశము చలించును స్పందన మొందును (అనఁగా శబ్దముకలుగును) ఆస్పందన మధికమయి తసువాతి సృష్టి జరగునప్పు డాకాశము సూర్యచంద్రాది గోళములుగాఁ బరిణమించును "యదిదంకించి జగత్సర్వంప్రాణయజేత నిస్సృతం" ప్రాణము చలనము నొందుచుండఁ ప్రపంచమందలి ప్రతివస్తువును సృష్టింపఁబడుచున్నది యని మనము చదువుచున్నాము ఇందు 'యజేత' యను పదము ప్రధానము "యజ్" ధాతువునకు స్పందనమర్థము "నిస్సృతం" అనఁగా విజృంభించును విస్తరించును యదిదం కించిత్ = ఈప్రపంచమేదికలదో, ఇది సృష్టి క్రమమం దొకభాగము. అం దనేకసూక్ష్మాంశము లింకను గలవు. అవి విజృంభణ మెట్లుజరగునో, మొదట నాకాశ మెట్లుకలుగునో, ఆయాకాశమునుండి యితర వస్తువు లెట్లుకలుగునో, ఆకాశమునకు స్పందన మెట్లు కలుగునో, వానినుండి వాయువెట్లుకలుగునో అనునీ మొదలగునవి. వీనినుండియొక విషయము గోచరించుచున్నది సూక్ష్మము నుండి స్థూలపదార్థము కలుగును. స్థూలపదార్థమున్నిఁటికం టెవెనుకసృష్టియై యన్నిఁటికి వెలుపల నుండును ఆస్థూలపదార్థమునకు ముందుసూక్ష్మపదార్థముండును. ఇట్లంతయు రెండుగా విభజింపఁబడినది; కాని, ఐక్యము

గాన్పించుట లేదు కాని శక్తియుం దైక్యమై ప్రాణమున్నది
పదార్థమం దాకాశమున్నది ఈ రెంటికి నైక్యమున కేమయిన
అవకాశ మున్నదా? ఈ రెండు నొకటియగునా? ఈ విషయమునఁ
బ్రకృతప్రకృతిశాస్త్రములు మౌనమును బూనియున్నవి. ఇంక
నేమార్గమును ద్రొక్క లేదు ఇంతవఱకుఁ దఱచిదఱచి పూర్వపు
ప్రాణాకాశములవఱకు వచ్చినరీతినే తక్కినభాగము కూడఁ గని
పెట్టినచోఁ బూర్వపు మార్గమునకే వచ్చి యాదారినే నడవవలసి
యుండును. తరువాతి యేకపదార్థము సర్వవ్యాపియు, నిర్గుణుఁ
డునగు బ్రహ్మము దానినే మహత్తందురు ఇది యా రెంటికి నై
క్యస్థానము నీమనస్సనునది నీమెదడనెడి వలయందుఁ జిక్కు
కొనిన మహత్పదార్థముయొక్క లేశము ఈ మెదడుయొక్క గళ్ల
యందు చిక్కుకొనిన మహత్పదార్థలేశములయొక్క మొత్తము
సమిష్టి ఇంకను విభాగముచేయుచు పోవలయును ఇంతటితో
సమగ్రము కాలేదు ఇచ్చటనున్న మనమందఱ మొక్కొక్కరము
నొక్కొక్క సూక్ష్మప్రపంచముగా నున్నాము లోకమంతయుఁ
గలసి స్థూలప్రపంచముగా నేర్పడుచున్నది. సృష్టియందున్న ప్రతి
దాని వెలుపల నిట్టె మార్పులు జరగుచున్నవని మన **మూహింప**
వలయును మనుష్యులను బరీక్షించి చూడఁగలిగిన యెడల,
మన మనుష్యులలోఁ గూడ నిట్టివి జరగుచున్నవని మన
**మూహింపవచ్చును** మనస్సన నేమి? ఇప్పటికాలమందుఁ
బ్రకృతిశాస్త్రములు వృద్ధియయి శారీరశాస్త్రము ప్రబలి పురా
తనమతములను ముట్టడించుచు నీవిషయమందుఁ బాశ్చా
త్యులకు నిలువ తావులేకుండ మెదడునకును మనస్సునకు నభేద

మని నిరాశ కలిగించుచున్నది ఇది మన మెఱుఁగినవిషయమే. హిందూబాలుఁడు మొదట నేర్చుకొనవలసిన విషయ మిదియే. మనస్సును సూక్ష్మమగుపదార్థమే యను విషయము శరీరము స్థూలపదార్థము దానివెనుక సూక్ష్మశరీరము, లేక మనస్సు. ఇదియును బదార్థమే కాని సూక్ష్మ మయినది కాని, యది యాత్మ కాదు ఆత్మకు సరియైన యింగ్లీషుపదము లేదు ఈ యాత్మయే వస్తువగుపురుషుఁడు ఈయాత్మ పదార్థవికారమగు మనస్సును దనయుపకరణముగా వాడుకొనును మనస్సునే అంతఃకరణ మని యందురు. ఆమనస్సులోపలనున్న యనేకసాధనముల మూలమున బాహ్యేంద్రియములచేతఁ బనిచేయించును. ఈ మనస్సేమి? కన్ను లున్నంతమాత్రానఁ జూడఁజాలమనియు, లోపల నొకయింద్రియ ముండవలయుననియు, నది చెడినచో వేయికన్ను లున్నను నిష్ప్రయోజన మనియుఁ బశ్చిమశాస్త్రజ్ఞులు మొన్న మొన్న కనిపెట్టిరి. మనశాస్త్రమునందు దృష్టియున్నప్పు డంతర్దృష్టిలేని యీ నేత్రమాత్రము కాదు మనశాస్త్రము దీనితోనే ప్రారంభము వాస్తవమైన దృష్టి యంతరింద్రియములది కాని బాహ్యేంద్రియములది కాదు. ఏమి పేరు పెట్టినప్పుడును ఇంద్రియములు కన్ను ముక్కు చెవులకుఁ గావు ఈ యింద్రియము లన్నియును మనోబుద్ధి చిత్తాహంకారములు గలిసి మనము అగుచున్నవి ఏశారీరశాస్త్రజ్ఞుఁడైనను వచ్చి మనస్సనెడి యింద్రియమొకటి కలదని చెప్పిన నీవు ఆశ్చర్యపడవలసిన యగత్యము లేదు మన శాస్త్రజ్ఞులకావిషయ మిదివఱకే తెలియునని చెప్పుము మన మతమునందోనమూ లేయివి

మన మిప్పుడే మనోబుద్ధి చిత్తాహంకారము లననేమో తెలిసికొనవలసి యున్నది. మనస్సుయొక్క పదార్థమునకుఁ జిత్తమని పేరు మహత్తుయొక్క ఆభాగము మనస్సునకును దాని వేఱువేఱు స్థితులకును బేరు సాయంకాలమునఁ దటాక మొక్క తరంగమైన లేక సమానముగా నున్న రీతిని మనస్సున్నప్పు డా స్థితియందుఁ జిత్తమని పేరు అట్టి నిర్మలతటాకమం దొక రాయి వైచిన నీరు పైకెగసి రాయివైపునకు వచ్చి తరంగములు బయలుదేఱును నిశ్చలతటాకమువంటి చిత్తమునకుఁ బైనున్న విషయము లన్నియు నీరాయివంటివి ఇంద్రియమార్గమున నాచిత్త మావిషయములపైఁ దగిలినప్పుడు దానియందు స్పందనము చలనము కలుగును దానికి మనస్సని పేరు అది స్థిరమైనది కాదు దీనిపైని గొంతవ్యాపారముజరగి స్థిరమైనబుద్ధి యుద్భవించును దానితో నేను తదితరము నను నభిప్రాయము కలుగును నాచేతిమీఁద నొక్కదోమ యున్నదనుకొనుఁడు. ఈసంగతి యింద్రియముల ద్వారా చిత్తమునకుఁ దెలిసి యది చలించును అది మనస్సు దానిమీఁదటఁ బ్రతీకారముచేయు నుద్దేశముకలిగి దోమను దఱిమివేయవలయునను బుద్ధి పుట్టును ఈప్రకారముగానే తటాకమున రాళ్లుఁబడుచుండును అయినఁ దటాకమునకును జిత్తమునకును భేదము కలదు తటాకమునందు రాలెప్పుడును బైనుండిపడుచుండును చిత్తమందన్ననో పైనుండియు లోపలనుండియు గూడఁ బడుచుండును. దానికే యంతఃకరణ మందురు అద్వైతసిద్ధాంతమును బోధపఱచుకొనుట కింకొక్క విషయమును నేర్చుకొనవలసి యున్నది. మీ రందఱు ముత్యములను జూచి యుందురు.

అవి యెట్లు చేయఁబడునో ఆవిషయముగూడ మీకుఁ దెలి యును ఒక్కరజోరేణువు మాశ్తికమాత్రకయగు శుక్తి యందుఁ బ్రవేశించి యందుఁగొంత గుల కలిగించును ఇందు లకుఁ బ్రతీకారము నాశుక్తియొక్క రసమా రేణువును గప్పును. అప్పు డదిఘనీభవించి ముత్యముగా నేర్పడును అట్లే సర్వ ప్రపంచము నొక ముత్యము రీతి నేర్పడుచున్నది మనకు పైనుండి యొక దెబ్బతగులును అది తగులఁగానే దానికిఁ బ్రతీ కారము చింతించి మనస్సు దానిమీఁదఁ బ్రసరించును ఈ సంగతి మనకుఁ దెలిసినప్పుడు మనమనస్సే గాని మఱియొకటి గాదు కాఁబట్టి బాహ్యప్రపంచము విధాయకముగాఁ గలదని నమ్మకము గలవారు కూడ మనకుఁ దెలియునది ప్రపంచమును, మనస్సునని యొప్పుకొనవలెను. కాని యీమన స్సాప్రపంచము నందును గప్పివేయునంతటి గొప్పది అందుచేతఁ బ్రపంచ మెప్పుడును దెలియరానిదే యైయున్నది కాఁబట్టి బాహ్య ప్రపంచమున నున్నది యెప్పుడును దెలియరానిదే యయి యున్నది మనకు దానిని గూర్చి తెలియునది యంతయు మన మనస్సునుబట్టి యేర్పడినదే అట్లే ఇతరప్రపంచ విషయమును, ఆత్మవిషయమున నిట్లేపొసఁగును ఆత్మను దెలిసికొనుట మనస్సు ద్వారా తెలియవలయును. కనుక, యాత్మనుగూర్చి మనము తెలిసికొనునది యాత్మయు మన మనస్సును గలిసినది అనఁగా మన మనస్సు మూలమునఁ బరిణామమునుబొంది యేర్పా టయిన యాత్మను దెలియుచున్నాము ఈవిషయమునకు ముందు వర్తిము కాని, యిది జ్ఞప్తియం దుంచికొందము తరు వాత వేద్యమగు నంశమిది శరీరము నిరంతర పదార్థప్రవాహ

మునకుఁ బేరు ప్రతినిమిషమును మనము దానికిఁ బదార్థమును జేర్పుచునే యున్నాము ప్రతినిమిషమును దానినుండి పదార్థము పోవుచునే యున్నది ప్రతినిమిషమును నదియందు నీరువచ్చుచుఁ బోవుచున్నట్లుగానే ఇదియు జరగుచుండును ఈ రాకపోకలు చేయుచున్న జలసముదాయము నంతటిని మనము నది యని చెప్పుదుము దేనిని మనము నది యందుము? ప్రతినిమిషమందును నీరు మాఱుచునే యున్నది. గట్టును మాఱుచున్నది. చెట్లు మొక్కలు ఆకులు అన్నియు మాఱుచున్నవి ఈ మార్పులన్నిఁటిని గలపియే మనము నది యందుము అట్లే మనస్సు నని యెఱుంగుఁడు బౌద్ధులగొప్ప క్షణికవిజ్ఞానవాద మొకటి కలదు, అది మిక్కిలి కష్టమైనది గాని, మిక్కిలి శాస్త్రీయముగాను సహేతుకముగాను వ్రాయఁబడినది ఇదియును వేదాంత మందొక భాగమునకు వ్యతిరేకించి వ్రాయఁబడినది దానికి సమాధానము చెప్పవలసి యున్నది దానికి అద్వైతము చేతనేగాని మఱిదేనిచేతను సమాధానము చెప్పుటకు వీలులేదు అద్వైతమును గుఱించి యెట్టి విరుద్ధాభిప్రాయములు గలిగి యున్నను, అద్వైతమన్న జనులెంత భయపడినను, అదియే లోకమునకు ముక్తిదాయకము దానియందలి వస్తువులకు హేతువు లున్నవి. ద్వైతాదులు పూజనాసాధనములు, మిక్కిలి మంచివియును మనస్సునకుఁ దృప్తికరములునుగా నుండెను అవి మనస్సునకు ముందును సహకారములుగా నుండవచ్చును గాని, మనుష్యుఁడు మతస్థుఁడును దార్కికుఁడును గూడ నై యుండిన యెడల నద్వైతమే యతనికి సాధనము. ఇప్పుడు మన స్వైకవైఖరకుఁ

బ్రవహించుచు రెండవ వైపునుండి నింపఁబడుచుండెడు నొక నదివంటిది. ఆత్మ యను నా యేకపదార్థ మేది ? శరీరమం దెల్లప్పుడు మార్పులు జరగుచున్నప్పటికిని, మన యభిప్రాయము లును వస్తువులనుగుఱించిన యుద్దేశములును మాత్రముమాఱ వు. కాఁబట్టి పలు తావులనుండి వచ్చు వెలుతురుయొక్క కిరణము లొక గోడమీఁదనో, తెఱమీఁదనో, మఱి చలింపని దేని మీఁదనో, పడినప్పుడు మాత్రమే కలిసికొనుటకు వీలుపడి యప్పుడే యొక సముదాయ మగుటకు వీలు కలుగుచున్నది. అట్లే మన యాభిప్రాయములును ఇంద్రియములును దీని మీఁద బడి యైక్యమును జెందును ఇది మనస్సు కాదు మనస్సుకూడ మార్పును జెందునదే కాఁబట్టి, యిది మనస్సు కాదు కనుక మాఱుచుండనట్టియు, మాఱెడు స్వభావము లేనట్టియు, మన యభిప్రాయముల నన్నిఁటిని బ్రతిఫలింపఁజేసెడు నది యేదో యొకటి శరీరమునకంటెను మనస్సుకంటెను భిన్నమైనది యుండి తీరవలయును అది సంపూర్ణమైనది ఆత్మ పదార్థమై ప్రతివస్తువును స్థూల మయినను సూక్ష్మమైన మనస్సయినను మార్పును జెందునదిగానే యుండును స్థూలపదార్థ మని మన మను బాహ్యప్రపంచమంతయుఁ బరిణామములతో నిండి యున్నది పరిణామాతీత మైనది పదార్థమై యుండఁజాలదు. అది యాత్మీయము. అనఁగా బదార్థము కానిది నాశరహిత మయినది పరిణామశూన్యము

తరువాత నీపదార్థమును సృజించినవా రెవ్వరు? అనువిష యము విచారణీయము దీనికి మనుష్యుని యంతరస్వభావ మును బట్టియే సత్యమును దెలిసికొనవలసియున్నది ఆత్మ విషయ

మునవలెనేయిచ్చటనుసంశయముకలుగును ప్రతిమనుష్యునందు నాశనరహితమును బరిణామశూన్యము నగు నొక యాత్మ మనశ్శరీరాతీతమై యున్నదని యొప్పుకొనిన నాత్మలకు నురల నేకత్వము, పరస్పరానురాగము గలదు. నాయాత్మ నీయాత్మ పైని యెట్లు పనిచేయఁగలదు? దేనిద్వారా పని జరగును? నీయాత్మనుగుఱించి నే నేమయిన ననుకొనుటయెట్లు? నీయాత్మ తోడను నాయాత్మతోడఁ గూడ నంటియుండి పనిచేయు నింకొక యాత్మ కావశ్యకత కలుగుచున్నది అది యనంతసంఖ్య గల యీయాత్మలనన్నిఁటని గప్పి వానియందును వానిలోన నుండి వానితో ననురాగప్రేమలు కలిగి పనిచేయుచుండును ఈసర్వవ్యాపి యైన యాత్మయే పరమాత్మ సర్వలోకేశ్వరుఁ డైన భగవంతుఁడు మఱియు నాత్మ పదార్థము కాదు. కనుక, పదార్థికములగు చట్టములకు లోఁబడదు ఆచట్టములను శాస్త్రములను బట్టి దానిచర్యలను మనము తీర్మానింపఁజాలము కాఁబట్టి యది నాశనరహితమును బరిణామశూన్యము నయినది "నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః" ఈయాత్మ నగ్ని దహింపనేరదు. శస్త్రములు ఛేదింపనేరవు ఖడ్గము ఖండింపఁజాలదు వాయు వెండింపనేరదు నీరు కరఁగింపదు అదియు జేయము జననమరణశూన్యము అయిన నీయాత్మ యేమి చేయుచున్నది? భగవద్గీతలను బట్టియు వేదాంతమునుబట్టియు నీయాత్మ విభుడనియుఁ గపిలునిప్రకారము సర్వవ్యాపియనియు నే తెలిసికొనుచున్నాను మనదేశమం దీయాత్మ యణువని చెప్పుమతములు కూడఁ గలవు పరిణామావస్థయం దణువని వారనుదాని యొక్కనిజస్వభావము విభుఁడే

అత్యాశ్చర్యకరమైన యింకొక్క విశేషము కలదు. ఇది హిందూమతశాఖ లన్నిఁటికిని సామాన్యమైనది గావున, దానిని శ్రద్ధతో విని జ్ఞాపక ముంచుకొనవలయును ఇది మనదేశమం దన్నిఁటిలోను మిగులఁ బ్రధానము ఇంగ్లాండునందును, జర్మని యందును బోధింపఁబడుచుండు పరిణామవాదమును మీరు వినియున్నారు దాని ప్రకారము సర్వజంతువులు నొక్కటే యనియు నొకదానియొక్క వేలువేలు రూపము లిట్లు భేదముగాఁ గానిపించుచున్న వనియుఁ బురుగు మొదలు మహాపురుషుని వఱకు నొక్కటే యనియు నొకటిమఱియొకటిగాఁ బూర్ణత్వము సిద్ధించువఱకు మాఱుచుండుననియుఁ గనఁబడుచున్నది మనకదియును గలదు పతంజలియోగి జాత్యంతరపరిణామమును వక్కాణించి యున్నాఁడు ఒకజాతి యింకొకజాతిగాఁ బరిణమించును పరిణామ మనఁగా నొకవస్తు వింకొకటిగా మాఱుట ఇఁక మనకును ఐరోపీయులకు భేద మెక్కడ? "ప్రకృత్యాపూరాత్" ప్రపంచము పూర్ణము కావందున యూరోపియను లీపరిణామము స్పర్ధామూలక మందురు ప్రపంచము అపూర్ణమననేమి? పురువు బుద్ధుఁడగునని యొప్పుకొందము కాని, యొకయంత్రముచేతఁ బనిచేయింతమంటిమా మనమాయంత్రము మీఁదఁ బనిచేయవలయును రూపభేద మెంత కలిగినను శక్తిమొత్తమొక్కటే నీకొకచోఁ గొంతశక్తి కావలయునన్న దానినింకొకచోట నుంచవలయును. అది యింకొకరూపమున నుండవచ్చును గాని యది దీనితో సమానమై యుండవలయును కావున, బుద్ధుఁ పరిణామముయొక్క యొక్కకొన నున్నప్పుడు పురువు బుద్ధుఁడే

కావలయును. బుద్ధుఁడు వృద్ధిఁజెందిన పురువయినయెడలఁ బురువు క్షీణించినబుద్ధుఁ డగుచున్నాఁడు. ఈ ప్రపంచమంతయు ననంతశక్తియొక్క విజృంభపరిణామరూపమైనచోఁ బ్రపంచమందిది యాయనంతశక్తియొక్క క్షీణపరిణామరూపము మఱియొకటి కానేరదు. కనుక, దీనిని బట్టి ప్రతిజీవము ననంతమైనదని తేలుచున్నది మనకాలిక్రింది పురువు మొదలు మహాన్నత్యమందున్న మహాపురుషునివఱకన్నియు ననంతశక్తియుఁ బావనత్వమును మఱియు ననంతమగుసర్వమును గలిగియున్నాఁడు భేదము పరిణామవైశాల్యమందు మాత్రమున్నది. పురువునందా యనంతశక్తియం దొక్క లేశమాత్రమే వ్యక్తమగుచున్నది నీయం దంతకంటె నెక్కువగా వ్యక్తమగుచున్నది ఇంకొకనియందు మఱియు నధికముగా వ్యక్తమగుచున్నది ఇదియే భేదము "తతః క్షేత్రికవత్" అని పతంజలి వచియించి యున్నాఁడు "మడికి నీరు పెట్టుచున్న కర్షకునివలె" నని యర్థము తన పొలములోనికి నీరువచ్చుట కొకమూలఁ జిన్నకన్నమును దానికొకతాళము నున్నది నీరు కావలసినప్పుడు తాళము తీసినట్లయిన నీరు దానియంతట నది స్వశక్తిచేతఁ బొలములోనికిఁ బ్రవహించును మనము క్రొత్తగా శక్తిని వినియోగింప నక్కఱలేదు ఇదివఱకే యున్నది. అట్లే మనలో ప్రతివానికి నట్టి యనంతశక్తి, బలము, పావనత్వము, నానందము నన్నియుఁ గలవు. మనశరీరములు మన నిజస్వభావము వెల్లడికాకుండ మఱుఁగుపఱచుచున్నవి ఈశరీరములు రాను రాను సూక్ష్మమయి, తామసగుణము రాజసగుణమును, రాజసగుణము సత్త్వగుణము నయినకొలఁది, యీ

శక్తి యొక్కువగా వ్యక్తమగుచుండును అందుచేతనే మనవారు న్నపానద్రవ్యములయం దంత జాగరూకులై యుందువారు. అట్టి యభిప్రాయములు బాల్యవివాహములవలెనే యంతరింప వచ్చును బాల్యవివాహ మప్రస్తుతవిషయమైనను నుదాహరణముగాఁ జెప్పుచున్నాను బాల్యవివాహముయొక్క యభిప్రాయములే నిక్కమగు నాగరికతగల యభిప్రాయములు స్త్రీపురుషులకుఁ దమయిష్టమువచ్చినట్లు విషయసంతృప్తి కనుగుణముగా నుండుటకై భర్తలను భార్యలను వరించుటకు స్వాతంత్ర్యముండి సంఘమందు హద్దులేనిచోఁ జిట్టచివరకుఁ గీడుమూడును

దుష్టసంతానము రాక్షససంతానమును ఫలిత మగును పురుషుఁడు ప్రతిదేశమందును దుష్టసంతానమును గని యాదుర్మార్గుల నణఁచి పెట్టుటకు రక్షకభటులను వృద్ధిచేయుచున్నాఁడు కాని, యాప్రకారము కీడును నాశనము చేయుట కగ్రపాంశము కాదు మొదటనే కీడు కలుగకుండ జాగ్రత్త పెట్టవలయును. సంఘము దుష్టవరుకు నీవివాహమువలని లాభనష్టములు నీకేగాక సంఘ మందఱకునుగూడఁ జెందును బాధకరముగానే యుండును కాఁబట్టి, యెవరిని పెండ్లి చేసికొనఁగూడునో యెవరిని చేసికొనఁగూడదో నిర్ణయించుటకు సంఘమున కధికారము కలదు. బాల్యవివాహమం దంతటి యభిప్రాయము కలదు. జ్యోతిషప్రకారము వధూవరుల జాతి సరిపడవలయును మనుస్మృతిప్రకారము కేవలేంద్రియసుఖాసక్తి మూలమున జన్మించినవాఁడా ర్యసంతతివాఁడుగాఁడు గర్భోత్పత్తిమొదలు మరణాంతము వేదవిధుల ననుసరించి జరగినవాఁడే యార్యుఁడనఁబడుచున్నాఁడు.

అట్టి యార్యసంతతి ప్రపంచమునం దక్కువయిన కొలందిం బ్రపంచమందుం గీడెక్కువయయి కలికాలమువచ్చియున్నది. కాని ఇవి యన్నియుం బోయినవి. వాని నన్నింటిని దిరిగి సంపూర్ణముగా నెలకొలుపుట యసంభవమనుట వాస్తవము. ఆపదు ద్దేశముల లోంగొన్ని యిప్పుడు పరిహాసాస్పదమును గూడనై పోయిన వనుటనిక్కమే ఇప్పటి తల్లిదండ్రులు మునుపటివంటివారు కారు. సంఘమును బూర్వమంతటి విద్యావంతమై యుండలేదు సంఘమునకును జనులయందంతయను రాగమును ప్రేమయును లేవు. ఆచరణ మెట్లున్నను ధర్మము నుంచి దైనప్పుడొక్క మార్గము కొనసాగనున్న మతియొక మార్గమున నడువవచ్చునుగాని, విషయము నేల యొంపనీయవలయును ఇదియే యాహారవిషయము నను బనికివచ్చును ఆచరణము మిక్కిలి పాడుగానున్నది గాని, యందుచే ధర్మమునకు హాని యేమి? ధర్మము పరమధర్మము, శాశ్వతముగా నుండవలయును దానిని క్రొత్తగాం బనిచేసి సంస్కరించి యుద్ధరింపుడు ఆత్మను గూర్చి మనమతములన్నియు నమ్మవలసినది పైనిచెప్పిన విషయము. ద్వైతు లీయాత్మ పాప కర్మల మూలమున సంకుచితమై దానిశక్తులును స్వభావమునణంగియున్న వనియు, పుణ్యకర్మలవలన నవి తిరిగి విస్తరించుననియుం జెప్పుదురు. అద్వైతి,ఆత్మ కెట్టిసంకోచవిజృంభణము లేవనియు నూరక యట్లగపడునే కాని యది నిక్కము కాదనియుంజెప్పను. అంతియే భేదము. కాని, యీశక్తులన్నియు నాత్మయందున్న వనియుం బైటినుండిదానికి లేదనియు,నాకాశమునుండి దానిలో నేదియుం బడలేదనియు, నందఱు నంగీకరింతురు. వేదములును

లోనినుండి పైకి వచ్చినవే గాని లోపలఁ బడినవి కావు అవి ప్రత్యాత్మయందును గల శాశ్వతధర్మ సూత్రములు వేదములు పిపీలికము యొక్క యాత్మయందును ఋషీశ్వరుని యాత్మ యందును గూడఁ గలవు పిపీలికము వృద్ధిఁ జెంది ఋషిశరీర మును దాల్చినపుఁ డవి వ్యక్తము లగును. మనప్రభావము మన యం దున్న దనియు, మనకు నిర్వాణము మనయందే యున్న దనియు ననునది యొకగొప్ప విషయము. అది సంకుచిత మైన దన్నను మాయావృత మైన దన్నను సరియే ఆ యభిప్రాయ మొక్కటే దానిని నమ్మవలయు బుద్ధుని కేది సాధ్యమో యది యధమాధమునకుఁ గూడ సాధ్యమే యని నమ్మవలెను. ఇది యాత్మసిద్ధాంతము కాని యిప్పుడొక పెద్ద వివాదము కలుగును ఇచ్చట బౌద్ధులుకలరు వారు శరీరము నొకభాగము గాను, మనస్సు నొకభాగముగాను విభాగము చేసియున్నారు. ఆత్మ యనావశ్యక మని వా రందురు. ఆత్మయున్న దని యనుకొన నగత్య మే లేదు వస్తువు నంటియుండు గుణములకును వస్తువున కును బ్రయోజన మేమి ? మేము గుణములనిమాత్రమే చెప్పు దుము. ఒక కారణమువలననే మనకు సమాధానమగుచున్నది. రెండు కారణములను దెచ్చిపెట్టి కొనుట న్యాయము కాదు. ఈ ప్రకారము వాదము జరపిజరపి వస్తువాదులను బౌద్ధులోడిం చిరి నీ కొకయాత్మ, నా కొకయాత్మ, అందఱకును దలకొక యాత్మ, మనశ్శరీ రాతీతమై యున్న దని చెప్పు వస్తుగుణవాదుల యం దొక్క భేదము పుట్టినది. ఇంతవఱకు మనకు ద్వైత మం తయు సరిగానే కనఁబడుచున్నది శరీరము, మనస్సు, ఆత్మ ఈ

యాత్మలన్నిఁటిని వ్యాప్తమై పరమాత్మ, యివియన్నియు దాని యందుఁ గలవు కాని చిక్కెక్కడ నున్నది ఈ యాత్మయుఁ బరమాత్మయు వస్తువులు. వానికి మనశ్శరీరాదులన్నియు గుణములవలె నంటి యున్నవి వస్తువు నెవ్వరు నెన్నఁడును జూచి యుండలేదు. అట్టి వస్తు వున్నదనుకొనినఁ బ్రయోజనమేమి? ఇన్ని యేల? క్షణికులమై యుండు నదంతయు నీమానసికపరిణామము లేగాని, మఱే యేదియుఁ గాదని యేల చెప్పరాదు! అవి యొకదానినొకటి యంటి యుండును, ఒకటి గాదు ఒకదానిని వెంబడించి తరంగములవలె నొకటి చనుచుండును. ఎన్నఁడును సంపూర్ణములు కావు. ఒకటిగా నేర్పడవు మనుష్యుఁడొకతరంగమువంటివాఁడు ఒకటి నశించిన, రెండవది ప్రారంభమగును ఈతరంగరాహిత్యమే నిర్వాణము ఈవిషయమున ద్వైతము నాశమును వహించును వివిధమైన హేతువును జెప్పనేరదు ఇచ్చట ద్వైతుల భగవంతుఁ డెవ్వడు? భగవంతుఁడు సర్వవ్యాపియై కరచరణాద్యవయవరహితుఁ డయ్యు సృష్ట్యాదికార్యముల నొనరించుచుఁ గుంభకారుఁడు ఘటమును జేసినరీతిని బ్రపంచమునంతను సృష్టించువాఁ డైనయెడల నట్టివానిని బౌద్ధులు తాము పోరాడుదుము గాని పూజింపమనిరి ఈలోక మంతయు దుఃఖపూరితమై యున్నది. అట్టిది భగవత్కార్యమే యయినచో నాతనితోఁ బోరాడవలయును. మఱియు నీభగవంతుఁడు న్యాయహీనుఁడు నపంగతుఁడు నగుచున్నాఁడు గనుక, క్షణికుల జోలి మనకక్కఱలేదు ఉద్దేశము

యొక్క యితరాంశములును మన కక్కరలేదు "సత్యమేవ జయతి"

సత్యమే జయ మొందును అసత్య మెన్నఁడును గాదు. దేవాలయమునకు మార్గము సత్యమే; ప్రతివారు నీధ్వజము తోడనే నడచుచున్నారు కాని వారియభిప్రాయము బలహీనుల నణఁగఁద్రొక్కుటయే నీద్వైతాభిప్రాయములతో నీవు వచ్చి యేదోవిగ్రహము నారాధించుచున్న యొకపేదవానితోఁ గలహము పెట్టుకొని నీవు మిక్కిలి వివేకివనియు వాని నోడింపఁగలననియుఁ దలంతువు గాని, యాతఁడు తిరుగఁబడి నీసగుణదైవము నోడించి యది వెఱ్ఱిభ్రమ యని చెప్పినా నీవేమి చేయుదువు? భక్తిని శరణుచొచ్చి చాలపాట్లుపడి తుదకు వానిని నాస్తికుఁడని రోదనము చేయుదువు మనల నెవ్వ రోడించిన వారు? నాస్తికులు నీవు కారణవాదివై సహేతుకముగా నుండు నెడలఁ దుదవఱకు నట్లేయుండవలయును కాకున్న నింకెట్టి స్వాతంత్ర్యము కావలయునని కోరుదువో యట్టి స్వాతంత్ర్య మితరులకు నిమ్ము. భగవంతుఁడు కలఁడని నీవెట్లు ఋజువు చేయఁగలవు. ఇంతకంటె కాదని నిమిషములోఁ గనఁబఱుపవచ్చును. అతఁడు కలఁడనుటకు లేశమును ఋజువు గాన్పింపదు లేఁడనుటకుఁ గొంత కానఁబడును గుణములుగలిగిన నీభగవంతుని యనంతకోటి జీవాత్మలను కలిగి యేయాత్మమట్టు కాయాత్మల వేత్తైనదని చెప్పుచు నీభగవంతుఁడు కలఁడని యెట్లు ఋజువు చేయఁగలవు? నీవేవిషయమునఁ బృథక్పురుషుఁడవు? శరీరమునఁ గాదు; ఏమనినఁ బదార్థమునందుఁ గొంతవచ్చి నీశరీరమై తిరిగి

యిదియేపోయి స్థావరాదులయందుఁగలసి వానిశరీరమైయుండు
నని పూర్వము బౌద్ధులకుఁ దెలిసినవానికంటె విశదముగాఁ దెలి
యును ఇట్లే మనస్సు విషయమునను గనఁబడుచున్నది ఇంకను
నీకు మూర్తిమహత్త్వమెక్కడ? నీకిప్పు డొక యాలోచన
యుండును తేపింకొక యాలోచన యుండును బాల్యమున నీ
కున్న యూహలకును యౌవనమం దున్న వానికిని భేదము కలదు.
అట్లే వార్ధకమందు వేఱొకరీతి నుండును. నీకు మూర్తిమత్త్వ
మేది? అహంకార మనుటకును వీలులేదు. ఇది మన యునికి
యందుఁ గొంతభాగమందుమాత్రమే యుండును; నేను నీతో
మాటలాడుచుండఁగా నవయవము లన్నియుఁ బనిచేయుచుం
డును గాని, దానినేనెఱుఁగను ఉనికికిఁ దెలివియే ప్రమాణమైన
యెడల నాకుఁ దెలియనివి గాఁబట్టి, యాయవయవములు కృత్య
ములు లేనివే యిప్పుడునీసగుణదైవసిద్ధాంతము లెక్కడనున్నవి?
అట్టి భగవంతుఁడు కలఁడని యెట్లు సిద్ధపఱుపఁగలవు ఇందులకు
విరుద్ధముగా బౌద్ధులిచ్చ యంతయు హేతురహితమే కాక పరా
పేక్షాపరునిగా నొనరించి మనుజునిఁబిఱికివానిగాఁ జేసిన హేతు
వుచేత నని నీతికర మనికూడ వక్కాణించుచున్నారు. మన
యెదుటనున్న ప్రపంచము మనుజుఁడే చేసినాఁడు. ఇట్టి విషయ
ములో మన మెన్నఁడు కాని నెఱుఁగనట్టి సాహాయ్యమును బొం
దనట్టియు నెవ్వరో యున్నాఁడని యనుకొననేల? ఏలపిఱికి పంద
లై మీపిల్లలను గూడ మీరు బలహీను లని కల్మషు లని నీచు
లనిచెప్పి, కల్పితపురుషునిచరణములకడ కుక్కలవలె వంగిప్రాకు
లాడుచుండఁ జేసెదరు? మీ రసత్యములను దెల్పుటయే కాక

ప్రపంచమునకు గొప్పకీడు నొనరించు చున్నారనికూడ బౌద్ధులనవచ్చును. ఈ ప్రపంచమంతయు మోహావేశకము కదా! నీవు చెప్పునది నీకు నమ్మకము. బుద్ధుఁడు మొట్టమొదట పల్కిన వాక్యమిది "నీవేమనికొనిన నట్లగుదువు అది నిజమైన యెడల నీవు శూన్యుఁడవని యెన్నఁడును బోధింపకుము ఎక్కడనో కొండమీఁదనున్న వాఁడెవ్వఁడో సాయ మొనరించినఁగాని నీ వేమియుఁ జేయఁజాలవని బోధింపకుము ఇందులకు ఫలమేల? మేముపాపులము భగవంతుఁడా! నమ్ముఁ బవిత్రము చేయు మను నుద్దేశమునఁబడి యనేకదుష్కృత్యముల పాలగుదుము. మనలో నుండు దుష్కృత్యములలో నూటికిఁ దొంబది యిట్టి సగుణ దైవ మొకఁడు కలఁడనియు వానినుండు మనము కుక్కల వలెనుంటి మనియు దురభిప్రాయమువలనఁ గలిగిన" దనియు బౌద్ధు లందురు మనుష్యునికిఁ గావలసిన పరమార్థము భగవత్సదనముగు వైకుంఠమునకుఁ బోయి యచ్చటఁ జేతులుముడుచుకొని శాశ్వతముగా నాథగవంతునియెదుట నిలుచుటయే యైన యెడల నంతకంటె నాత్మహత్యే మేలని బౌద్ధులు చెప్పుదురు ఇందులకే వారు నిర్వాణమును నొకదానిని గల్పించితి మందురు ఈయంశము లన్నియు బౌద్ధునివలెనే నేను జెప్పుచున్నాను. ఏమన నీదినములలో నద్వైతవిషయము లన్నియు నవి నీతి మతము లని చెప్పుచున్నారు గావునఁ బ్రతిపక్షులు తక్కినవారి నేనునుచున్నారో చెప్పవలయును రెండుపక్షములును మనము నిశ్శంకముగాను,నిర్భయముగాను విచారింపవలయును భగవంతుఁడను నొకపురుషుఁడు ప్రపంచమును సృజింపఁజాలఁడని

మొందటఁ దెలిసికొంటిమి ఈయంశమును బిల్లవాఁడైన నీదినము లలో నమ్మఁడు. కుంభకారుఁడు ఘటములను జేసినాఁడు గనుక, భగవంతుఁడు లోకమును సృజించినాఁడనినఁ గుంభకారుఁడును భగవంతుఁడే అట్టి భగవంతుని కరచరణాదులు లేకుండఁ బని చేయునన్న వాని నున్మాగవైద్యశాలకుఁ గొనిపోవలయును ఆ భగవంతుఁడు సృష్టికర్త. నీవెల్లప్పుడును మొఱపెట్టుకొనువాఁ డెన్నఁడైన నీజన్మమందు నీకుసాహాయ్యము చేసినాఁడా? యనునది నవీనశాస్త్రముయొక్క మఱియొక ప్రశ్న నీకుఁ గలుగుసాహాయ్య మంతయు నీప్రయత్నమువలననే కలిగినదనియు, నీవు భగవం తుఁడా యని యార్చుటయందు నీశక్తిని గొంతవ్యయము చేయ నక్కఱ లేదనియు నట్టిరోదనమక్కఱ లేకయే నీవు బాగుగా నుం డువనియు వారు ఋజువు చేయుదురు ఇట్టి సగుణదైవ సిద్ధాం తములోడనే యాచార్యాడంబరమును బ్రజాపీడనమును వచ్చి నవి ఈయభిప్రాయ మెచ్చటచ్చటనున్న నచ్చోటనెల్లను మతా చార్య దంభమును బ్రజాపీడనమును దప్పక యున్నవి. ఈసి ద్ధాంతము నశించినఁగాని యివి యణఁగవు అని బౌద్ధు లందురు మనుష్యుఁడు శానొకమహాపురుషునిముందఱ నొదుగవలసిన దను నభిప్రాయ మున్నంతవఱకుఁ గొన్నియధికారములతోను స్వాతంత్ర్యములతోను నాచార్యులు బయలుదేఱుటయు వారిని జనులు మధ్యవర్తులనుగఁ గోరుకొనుటయు జరగుచుం డును బ్రాహ్మణుని నెత్తిగొట్టినప్పటికిని నీనెత్తిగొట్టినవాఁడే వానిస్థానము నాక్రమించి వానికన్నఁ గ్రూరుఁడగును. ఏమన, బ్రాహ్మణులకుఁ గొంత దాక్షిణ్య ముండునది వీరి కదియు నుండక

క్రూరాతిక్రూరులై బాధింతురు భిక్షుకునకు భాగ్య మబ్బిన మొదల నాతఁడు ప్రపంచమంతయుఁ దృణముని యెంచును గనుక నీసగుణాద్వైత మున్నంతవఱకు నీగురువు లుందురు ప్రపంచ మందు నీతియుండుట కవకాశ ముండదు మహాచార్య భేషజ మును బ్రజాపీడనము నవినాభావసంబంధము గలవి ఇవి యెందులకు వచ్చినవి? పూర్వమందుఁ గొందఱు బలవంతులు బల హీనులును జేతఁజిక్కఁబట్టి మీరు మాకు విధేయులు కానిచో మిమ్ము నాశనము చేసెద మనిచెప్పిరి. ఇది సారాంశము "సభాయాం వజ్రముద్యతం" తనకు వినయమును చూపని వారి నందఱను నాశనము చేయుదమనునది యొకపిడుగువంటి మాట. ప్రతిదియును గర్మసూత్ర మనునంతవఱకు నీవు సహేతుకము గానే మాటలాడుచున్నావు. అనంతకోటిజీవాత్మలు కలవని యును,జననమరణములు లేవనియును, కర్మసూత్రమందు నమ్మిక యును ఇవియన్నియు న్యాయము గానే యున్నవి సందేహము లేదు కారణము వినా కార్య ముండదు ప్రకృతమునకుఁ బూర్వ మందుఁ గారణ ముండవలయును నుందునకుఁ బ్రకృతమందుఁ గారణ ముండవలయును కర్మ జడ మనియుఁ జైతన్యము లేద నియుఁ గాఁబట్టి యీకర్మఫలము ననుభవములోనికిఁ దీసికొని వచ్చుట కొక చైతన్యముండవలయుననియు హిందువులందురు. ఏదైన నొక మొక్కను ఫలమునకుఁ దీసికొనివచ్చుటకుఁ జైతన్య మవసరమా? నీరుపోసి బీజమును నాటినఁ జైతన్య మవసరము లేదే; మొదటఁ గొంత చైతన్య మున్నదనియు నాజీవాత్మలే చైతన్యము లనియు వేరు చైతన్య మక్కఱలేదనియు మీరు రన

వచ్చును మానవాత్మలకది యున్నయెడల భగవంతుఁడేల యని యాత్మను నమ్మి భగవంతుని నమ్మమని జైనులందురు. సహేతుక మెక్కడ? నీతి యెక్కడ? అద్వైత మవినీతిదాయక మని నీవు నిందింపఁబోవునప్పుడు ద్వైతులేమి చేయుచున్నారో న్యాయ స్థానముల కేమివచ్చుచున్నదో కొంచెము చూడుఁడు అద్వైతులం దెందఱు దుర్మార్గులున్న నందఱు దుర్మార్గులు ద్వైతులందును గలరు. ఇంకను సాధారణముగా ద్వైతులందే యెక్కువ యుందురు ఏమన, నద్వైతమును గ్రహించుట కెక్కువ మనోబలము కావలయును ఈరీతిని బౌద్ధు లడిగినప్పుడు మీ కేమి దిక్కు? బౌద్ధులబారినుండి తప్పించుకొన దారియేది? నీవు వేదములను జూపింతువా వానిని నాతఁడు నమ్మఁడు

బౌద్ధులు, "మా త్రిపిటకమునందు వేఱువిధముగా చెప్పుచున్నవి వాని కాద్యంతములు లేవు బుద్ధుఁడు వానిని వ్రాయనే లేదు ఆతఁడు పునరుచ్చారణము చేయుచున్నాననిచెప్పినాఁడు. అవి శాశ్వతములు" అని చెప్పెదరు. అంతటితో నూరకుండక "మీ వేదములు తప్పులు మావే సత్యము లయిన వేదములు మీవి బ్రాహ్మణగురువులచేఁ గల్పింపఁబడినవి వానిని ద్యజింపుఁ" డని కూడఁ జెప్పను నీవెట్లు తప్పించుకొందువు? తప్పించుకొనుటకు మార్గ మిఁగో మొదటి యాక్షేపణమును దీసికొనుఁడు వస్తువును గుణములును వేఱనునది మొదటి యాక్షేపణము అవి వేఱు కావని యద్వైతి యనును వస్తువునకును గుణమునకును భేదము లేదు; రజ్జువును జూచి సర్ప మనుకొనినప్పుడు పామును జూడఁగానే రజ్జువు కనిపింపదుగదా! వస్తువును గుణము నని తార్కికుల భేదమేగాని వస్తుతః అట్టి

భేదము లేదు నీవు సాధారణుఁడవైనచో వస్తువును గాంతువు. గొప్పయోగి వైనయెడల గుణమును గాంతువు; కాని, రెండును ఎప్పుడును జూడవు గావున, వస్తువును గుణములును గూర్చిన బౌద్ధుల వివాదము ప్రయోజనము లేనిది గుణరహిత మైనవస్తు వొక్కటే ఆత్మనుండి గుణములు వేఱుపడి యని మనస్సునం దున్నవని కనఁబఱచినచో, రెండాత్మ లుండ నేయుండవు ఈగుణ విశేషమే యొక యాత్మకును మఱియొక యాత్మకును భేదమును గల్పించినది ఒకయాత్మ యింకొకయాత్మకంటె భిన్నమని నీకెట్లు తెలియును? కొన్ని భేదము లయిన గుణములనుబట్టియు గుణము లనుబట్టియు భేదము కనిపించుచున్నది అట్టిగుణము లే లేనప్పుడు భేద మెట్లువచ్చును? కావున, రెండాత్మలు లేవు పరమాత్మ యని వేఱే యక్కఱ లేదు అది యాత్మయే. దానినే పరమాత్మ యందురు; దానినే జీవాత్మయందురు సాంఖ్యాది ద్వైతు లార ! ఆత్మ సర్వవ్యాపియని చెప్పెడి మీరు ఆత్మలు రెండెట్లుం డఁగలవో చెప్పుఁడు అది యొక్కటియే అనంత మగునాత్మ యొక్కటియే; తక్కినదంతయు దాని పరిణామము అంతటితో బౌద్ధులూరకుందురు కాని యద్వైతి యంతటితో నాగఁడు పర విమర్శమాత్రమే యద్వైతిపని కాదు . ద్ధాది ఇతరమతస్థులు తుద కదిమీఁదికివచ్చినప్పుడునూత్రము విమర్శింతురు. విమర్శిం చినతరువాత తమసిద్ధాంతమును దెలుపుదురు ఏమఱ్శించి యం తటితో నాఁగనివాఁ డొక్కఁయద్వైతియే ప్రపంచము నిరంతర చలనము కలదని చెప్పుచున్నావు సృష్టియఁదు సమస్తమును జలించుచున్నది నీవు,నేను, నీబల్ల సమస్తముఁ జలించుచున్నది.

సంసారము నిరంతరచలనముగలది అదియే జగత్తు, గనుక, యీ జగత్తున మూర్తిమత్త్వమనునది యుండదు మూర్తిమత్త్వమనఁగా మార్పులేకుండునది మార్పులతోఁగూడిన మూర్తిమత్త్వ మెక్కడనుండదు. కాఁబట్టి యీమనజగత్తునందు మూర్తిమత్త్వ మనునది లేదు. ఆలోచన, భావన,మనస్సు, శరీరము నివి యన్నియు నెల్లపుడు మాఱుచున్నవి ప్రపంచమంతయు నేకముగాఁ దీసికొనిన నది కదలునా? కదలదు కదలుట యనునది దానికంటె తక్కువ వేగముతోఁగదలుదానితోఁగాని, కేవలముకదలకయున్న దానితోఁగానిపోల్చినప్పుడే కదలుటగాని కేవలముకదలుట లేనే లేదు కాఁబట్టి, ప్రపంచమంతయు నేకముగా నిశ్చలమయినది మార్పులులేనిది నీవు,ప్రపంచమైనప్పుడే మూర్తిమత్త్వము కలవాఁడవు గనుకనే వేదాంతి రెండున్నంతవఱకు భయముపోదని చెప్పుచున్నాఁడు అంతయు నొక్కటియై రెండవ వస్తువును జూడక భావింపక యుండునప్పుడే మరణరాహిత్యమును సంసారరాహిత్యమునుగలుగుచున్నవి కనుక,అద్వైతముమనుష్యుఁడు ప్రపంచములో నొక్కఁడైనప్పుడే మూర్తిమత్త్వము కలవాఁడు గాని వేఱుగానున్నంతవరకుఁ గాఁడని చెప్పుచున్నది. నీవుపూర్ణుఁడవైనప్పుడే నాశనరహితుఁడవు నీవు ప్రపంచమవైనప్పుడు భయరహితుఁడవు మరణరహితుఁడవు. అప్పుడు నీవు ప్రపంచమనునదియే భగవంతుఁడు సత్తు పూర్ణము మనుజు లందఱు నేకమనస్కులై మనము చూచినట్టుగానే యందఱు నీప్రపంచమును సూర్యచంద్రులను జూచెదు నా విభాగరహితమైన యున్కియే యునికి కొంచెము మంచికర్మచేసినవా రింకొక

యొక్కవస్థితికి వచ్చి మరణానంతరము స్వర్గమును, నింద్రాదులను జూతురు. అంతకంటె గొప్పవాఁడు బ్రహ్మలోకమును జూచును పూర్ణ లేలోకమును జూడరు ఈలోకము తిరోహితమై దాని స్థానమున బ్రహ్మము గాన్పించును ఈబ్రహ్మమును మనము తెలిసికొనఁగలమా? సంహితయందలి వర్ణనమును గూర్చి నేను జెప్పుచున్నాను

ఇందు మఱియొకభాగము చర్చింపఁబడినది అంతరంగము నందలి యవ్యక్తము దిసికొనఁబడినది ఇదివఱకు పదార్థావ్యక్తము ఇప్పుడాత్మికావ్యక్తము అచ్చట భావార్థకమగు భాష యుపయోగింపఁబడినది ఇచ్చట నట్టి భాష చాలనందున నభావార్థకము వ్యతిరేకార్థము నగు భాష యుపయోగింపవలసి వచ్చినది ఇక్కడ ప్రపంచమున్నది అది బ్రహ్మ మని యొప్పుకొనినను మనము దానిని దెలియఁగలమా? లేము ఈసంగతినే విస్పష్టముగా నెఱుఁగవలయును ఇది బ్రహ్మమైన యెడల మనమెట్లు తెలిసికొనఁగలమను సంశయము పలుమాఱు కలుగుచుండును "విజ్ఞాతారమరే కేన విజానీయాత్" "దేనివలన, నో మైత్రేయీ! సర్వము తెలిసినవానిని దెలిసికొనఁగలను? సర్వము నెఱిఁగినవానిని నెట్లు తెలియఁగలను?" కన్నులు ప్రతివస్తువును జూచును గాని తమ్ముఁ దాము చూడఁగలవా? చూడలేవు. తెలిసికొనుట యనఁ బదభ్రష్టత్వముల సూచించును. ఆర్యులారా! ఈసంగతి మీరు జ్ఞాపకమునందుంచుకొనవలయును దీని కొకపెద్దగాథ కలదు. చెప్పెదను వినుఁడు

ప్రకృతము మనలను మోహింపఁజేయు పశ్చిమశాస్త్రముల కన్నిటికిని మూలము విషయజ్ఞాన ముత్తమ మనునది యాధారము మనదేశమం దాపదార్థముకంటె దానిజ్ఞానము తక్కువది యని యభిప్రాయము ఏమన నది యవధితోఁ గూడినది నీవేవస్తువును దెలిసికొనఁ గోరుదువో యావస్తువు నీమనస్సువలన నిర్బంధింపఁబడును వెనుకఁ జెప్పిన ముత్యపుచిప్పసంగతిని జ్ఞప్తికిఁ దెచ్చుకొని జ్ఞాన మవధిగలది యెట్లయ్యెనో, ఆలోచింపుఁడు వస్తువును మనబుద్ధికి గోచరమగు స్థితిలోనికిఁ దెచ్చి మన మెంత తెలిసిన నంతయే వస్తువుగా గ్రహించుచున్నాము గాని, వస్తువును బూర్ణముగా మనము తెలియుట లేదు. ఇది జ్ఞానమంతకును వర్తించును ఈప్రకారముగా నీబుద్ధి యావరణములోని కవ్యక్తపదార్థమును దే గలవా? సర్వజ్ఞానసారమై సర్వసాక్షియై యెవఁడు లేక జ్ఞానముండదో, ఎవఁడు గుణరహితుఁడో, ప్రపంచమున కంతకును సాక్షి యెవ్వఁడో, మన యాత్మసాక్షి యెవ్వఁడో, యాతనివిషయముని మనమట్లు చేయఁగలము? నీ వేరీతి నాతని బంధింపఁగలవు? ప్రపంచమంతయు నట్టి వృథాప్రయత్నమే జరుగుచున్నది ఆత్మ తన్నుఁ దాను చూచుటకుఁ బ్రయత్నించుచున్నది జంతువు లన్నియు నత్యల్పజంతువు మొదలు దేవతలవఱ కందఱుఁ దమ్ముఁదాము ప్రతిఫలింపఁజేయు దర్పణములవలె నున్నారు అవి చాలక మఱి కొన్నిఁటిని దీసికొనుచున్నారు ఇట్లు చిట్టచివరకు మానవశరీరమును బొంది యిదియంతయు వ్యక్తమేయనియు నవ్యక్తము వ్యక్తమందు గోచరింపదనియుఁ దెలిసికొనును పిమ్మటఁ దిరిగి వైరాగ్య మేమనుచు? తిరిగి యింద్రియములఁ జేరకుమని చెప్పు

చున్నది. ఇదియే నీతి శాకరము ఇదియే క్షేమమునకుఁ గుదురు ప్రపంచమే (తపస్సు) వైరాగ్యముతోఁ బ్రారంభమయినది. ఇట్లు వెనుకకుఁ బోఁగాఁబోఁగా నన్ని రూపములు నీకుఁ గనఁబడి యొకదాని తరువాత నొకటి త్యజింపఁబడి తుదకు వాస్తవమైన నీ వొక్కఁడుమాత్రమే నిలుతువు. ఇదియే మోక్షము.

'విజ్ఞాతారమరే కేనవిజానీయాత్' 'సర్వమెఱిఁగినవానిని దెలియుటెట్లు?' తెలిసినవానిని దెలియఁజాలను ఏమన, నెప్పుడు తెలిసికొంటిమో యప్పుడది తెలిసినదిగా నుండఁజాలదు ఒక యద్దమందు నీకన్నులను నీవు చూచితివేని, ఆ ప్రతిఫలించినది ప్రతిఫలముగాని, నీకన్నులుగావు కదా అట్లయిన ననంతమగు నాత్మ సాక్షిమాత్రమేయైనఁ బ్రయోజనమేమి! అది మనవలె జీవించి సంచరింపఁజాలదు సాక్షి యెట్లనుభవించునో జనులకుఁ దెలియదు "ఓహిందువులారా! మీరందఱు సాక్షులను సిద్ధాంతమును నమ్మి చెడుచున్నవారు మొట్టమొదట ననుభవించునది సాక్షియే ఇక్కడ నొక కుస్తీ జరగుచున్న ననుభవమెవ్వరిది? చూచువారిదా? చేయువారిదా? ఇదియే యానందము నీవు ప్రపంచమునకు సాక్షి వైనప్పుడే యవ్యక్తానందము. అప్పుడే నీవు ముక్తుఁడవు సాక్షిమాత్రుఁ డయినవాఁడు మాత్రమే కోరిక లేక స్వర్గము నపేక్షింపఁడు నింద యని వెఱవక, స్తుతిని గోరక పని చేయఁగలుగును. అతఁడే యనుభవించువాఁడు గాని, యితరులు కారు ఇఁక నీవిషయమున వేదాంతమునకును అద్వైతనీతికి నొకసంబంధము కలదు అదియే మాయాసిద్ధాంతము అద్వైతమందలి విషయముల నొక్కొకదానిని జెప్పుటకు

నెలలును బోధపఱచుట కేంద్రమును గావలయును కాఁబట్టి నేను సూచనఁగాఁ జెప్పినందులకు మన్నింపవలయును ఈమాయా సిద్ధాంతమును దెలిసికొనుట యెప్పుడును మిక్కిలి కష్టమయిన పని వాస్తవముచేత నది యొకసిద్ధాంతమే కాదు అది దేశ కాలనిమిత్తముల సమామ్నాయము. దేశ కాల నిమిత్తములకు నామరూపములు కల్పింపఁబడినవి సముద్రమందు దొకతరంగ మున్నపుడు తరంగమునకును సముద్రమునకును నామరూపము లందు మాత్రమే భేదము ఈనామరూపములకుఁ దరంగముల కంటె భిన్నమాయినయునికి లేదు తరంగ మణఁగిపోయినవెనుకఁ గూడ నీటిమొత్తము మునుపటియంతయే యుండును తరం గముయొక్క నామరూపములు నశించినను భేదము రాదు కావునఁ, నీకును నాకును అన్నిజంతువులకును మనకును జనుల కును భగవంతునికిని భేదమును గల్పించునది మాయ వాస్తవ ములచేత నీయాత్మ నిన్నిజంతువులలోఁ జిక్కుకొనునట్లు చేసి నది మాయయే నామరూపములే ఈనామరూపములు పోయి నప్పు డంతయు వాస్తవమయిన నీవే అది యొకసిద్ధాంతము. వాస్తవప్రవచనము, ప్రకృతివాదులు చెప్పినట్లు లీప్రపంచము సత్యము కాదు వారలీబల్లకు వేతే స్వతంత్రమగు నునికి గల దందురు దానియునికి కితరవస్తువులతో సంబంధము లేదం దురు ఈ ప్రపంచమంతయు నశింపఁజేసినను గూడ నది యథా స్థితియందుండునఁట! ఏమాత్రము జ్ఞానమున్నను నది సరికా దని తెలియును ఈవిషయప్రపంచమునందలి ప్రతివస్తువును బరస్పరానుబంధము కలది.

ఒకదానియునికి కింకొకటి యాధారము. మనకుఁగలవస్తుజ్ఞానము మూఁడువిధములు. మొదటిది ప్రతివస్తువును వేఱనియు నితరవస్తువులతో సంబంధము లేదనియు, రెండవది ప్రతివస్తువునకుఁ బరస్పరసంబంధ మున్నదని తెలిసికొనుటయు, మూఁడవది యున్నదొక్కవస్తువేయనియు దానిని పెక్కువస్తువులుగా మనముచూచుచున్నామనునదియు తెలియనివాఁడు మొట్టమొదట దేవుఁడు ప్రపంచమున కావల నెక్కడనోయున్నాఁడనుకొనును. ఈయభిప్రాయము కేవలము భగవంతుఁడు మనుష్యునివంటివాఁడని చెప్పుటయే యగును అనఁగా అతఁడును మనుష్యుఁ డేమి చేయునో యదియే చేయును అయినను కొంచె మెక్కువగాఁ జేయును భగవంతుఁ డట్టివాఁడే యనునది యెంత హేతురహితముగాను జాలనిదిగానున్నదో తెలిసికొనియున్నాము పిమ్మట యభిప్రాయము ప్రతిచోటను గనిపించెడు నొకశక్తి చండియని చెప్పఁబడునది శక్తియే ఇది సుగుణములపుంజమే కాదు సుఁడీ ఇద్దఱుదేవులు లేరు ఒకఁడు దేవుఁడు, ఒకఁడు సైతాను అని యిద్దఱులేరు ఒక్కఁడే కలఁడు అతఁడే మంచివాఁడును జెడ్డవాఁడును, ఏమయినను సరియే యొక్కఁడే

"అందఱిహృదయములయందును శాంతస్వరూపముతోడ పరమపావనివై నివసించి యుండునో దేవీ! నీకు నమస్కరించుచున్నాము" "ఓగార్గీ! ఎక్కడ నానందమున్న నక్కడనెల్ల నీయంశము కొంత యున్నది"ఎట్లుతీసికొన్నను దీసికొనవచ్చును. మన యెదుటనున్న జ్ఞానముమూలమునసే యొకబీదవానికి మూఁడురూపాయీలనీయఁ బ్రయత్నింతుము. మఱియొక్కఁడు

తప్పువ్రాలును జేయ సాహసించును. జ్ఞాన మిరువురకును సమానమే ఇది రెండవమెట్టు మూఁడవది భగవంతుఁడు ప్రకృతికిఁ లోపలను లేఁడు, వెలుపలను లేఁడు దేవుఁడు, ప్రకృతి, ఆత్మ యివి యన్నియుఁ బర్యాయపదములు రెండువస్తువులు లేనే లేవు. పదముల భేదమునుబట్టి భ్రమించుటయేగాని, రెండువస్తువులు లేనే లేవు నీవొకశరీర మనుకొని దాని కాత్మయొకటి కలదని యీ రెంటిను గలిపి నీవని నీవనుచున్నావు అది యెట్లు? నీవు నన్నునన నీ వాలోచించుకొనుము మాలో నొకయోగియున్న యెడల నాతఁడు తానే చైతన్యము ననుకొనును శరీరము లేకయేపోవును సామాన్యమనుష్యుఁడు తాను శరీరమనుకొనుచున్నాఁడు అప్పుడాత్మ లేకపోయినది శాస్త్రమందు మనుజునికి శరిరము, ఆత్మ, యివియన్నియు నున్నవను నభిప్రాయము లున్నందున నివియన్నియు నేక కాలమందే యున్నవని మనమనుకొనుచున్నాము ఒక్క కాలమందొకేవస్తువును జూచునప్పుడు భగవంతునిమాట వలదు. కార్యమే చూతువు కాని కారణమును జూడవు కారణమును జూచినపుడు కార్యము లేకపోవును ఏమయిన దీప్రపంచము? ఎవరు దానిని దీసికొనిపోయిరి?

సర్వగుణాతీతుఁడును నిరుపమానుఁడును రూపావరణరహితుండును నగువాఁడు సమాధియందు ఋషులహృదయమం దుండును

మహాప్రపంచమందు సర్వము జలమయమయి పైనఁ గ్రింద నన్నిప్రక్కలను జలమై యొక్కచిన్నయలయైనను లేక నిశ్చలమై యుండులాగున సకలజననమరణాతీతుఁడై నిస్తులుం

నగు నవ్యక్తపరబ్రహ్మము సర్వభ్రమశూన్యం బై సర్వకలహములును వివాదములు నివారితములై సమాధియందు నీహృదయమునందుఁ బ్రకాశించును అట్టి స్థితికి వచ్చినప్పుడు లోకమంతర్ధాన మగును.

ఈ బ్రహ్మము తెలియఁబడనిదియు తెలియ నశక్యమయినదియు నని మనము చూచియున్నాము ఎందుచేత ? సంశయవాదులనునట్లు కాదు. దానిని తెలియుటయే యొకయపచారము. ఏమన, నీవేయయియున్నావు. మఱియు, నీవల్ల బ్రహ్మము కానుగాదు బ్రహ్మమునగును నామరూపములనుదీసి వేయఁగా మిగిలిన సత్యమేదో యది బ్రహ్మము ప్రతివస్తువునందును సత్యమతఁడు.

నీవు స్త్రీవి, నీవు పురుషుఁడవు యౌవనగర్వమున సంచరించువాఁడవు నీవ కఱ్ఱయూతగొని తొట్రుపడు ముసలివాఁడవును నీవ అంతయు నంతయు నీవ నేనును నీవ ఇది యద్వైతసిద్ధాంతము ఇచ్చట వస్తుసార మున్నది ఇదియే మన మన్నివిధముల నవీనశాస్త్రసంశయములకును ధైర్యముగ సమాధానము చెప్పఁగల తావు ఇచ్చటనే వివేకమునకుఁ దగిన పునాది యున్నది ఇందుఁ బూర్వావస్థలను నిరసించుటయు లేదు అవియును నిశ్చయములే యని యంగీకరింపఁబడును కాని యవి వాస్తవములే యయినను మనము వానిని గ్రహించుటయందును వచించుటయందును భ్రమపడుచున్నారమని హిందూ వేదాంతి యనును. గాని, వానిని నిరసింపఁడు అవి యొకేవస్తువయినను మాయావృతమయిన యింద్రియములతోఁ జూడఁబడుచున్నవి. అవియు సత్యములేగాని యితరములు కావు లోకమునకు వెలుపల

నున్నాఁడని యజ్ఞుఁడనుకొనినను,కించిద్‌జ్ఞుఁడు ప్రపంచమందు న్నాఁడని యనుకొనినను,విశేషజ్ఞుఁడు తనయాత్మయు,సర్వప్రపంచము నాతఁడే యని యనుకొనినను, నివియన్నియు నొక్క దేవునిగూర్చియే ఒకే పదార్థమును బహురీతులఁ దలంచినారు పలుతెఱఁగులగు మాయాదర్పణముతోఁ జూచినారు పలుతెఱఁగులగు మనస్సులతోఁ జింతించినారు ఇవియే భేదములకుఁ గారణము ఇంతియ కాక, ఇవియన్నియు నొకదానికొకటి మార్గదర్శకములు శాస్త్రమునకు సామాన్యజ్ఞానమునకును దారతమ్యమేమి? వీథిలోనికిఁబోయి యచ్చట నేమయినఁ జరుగుచున్నప్పుడేమూర్ఖునైన నది యేమని యడిగిన వాఁ డేదో భూత మట్లు చేయుచున్నదనును వాని కెల్లపుడును దయ్యములు భూతములు దోఁచుచుండును కార్యములకంటెఁ భిన్నముగఁ గారణము లుండుననుట యజ్ఞానము ఒకరాయి భూమిపై పడిన యెడల మూఢుఁడు వాని నొకదయ్యము పడవైచెనని చెప్పును శాస్త్రమెఱిఁగినవాఁ డది యాకర్షణశక్తి యనియుఁ బ్రకృతిధర్మమనియుఁ దెల్పును

ప్రకృతిశాస్త్రమునకును మతమునకుఁ బ్రతిచోటనుగల వివాదమేమి? మతమందు విశేషముగఁ గార్యభిన్నములగు కారణములు చెప్పఁబడియున్నవి సూర్యునందొక దేవత, చంద్రునందొకయధిదేవత ఈప్రకారము నంతముగ నున్నారనియు, వర్తనమంతయు నాభూతములమూలమునఁ జరుగుచున్న దనియు మొదలగు నంశములుండును ఇఁక శాస్త్రమందు కారణమువస్తుతత్త్వమునుబట్టి గ్రహింపఁబడును శాస్త్రమువృద్ధిచెందినకొలఁది

నీదయ్యములయు భూతములయు సమాధానములు నశించి యద్వైతము పరమశాస్త్రసమ్మత మగునట్టి మతముగా నిర్ణయింపఁబడినది ఈప్రపంచమును పైనున్న దేవుఁ డెవ్వఁడో సృజించి యుండ లేదు స్వయంభువును, స్వచ్ఛందరహితుండును, స్వయంప్రకాశుండును, అవ్యక్తుఁడు నగుబ్రహ్మమే సృష్టికర్తకాని, భిన్నుఁ డయిన వేఱు వాఁడెవ్వఁడును గాఁడు కావున నీయద్వైతము గాక మఱేదియును బ్రకృతిశాస్త్ర సమ్మతమగు మతము కానేరదు ఈ మిడిమిడిజ్ఞానముగల ప్రకృత హిందూదేశమందు దినదినము జరగుచుండు ప్రకృతిశాస్త్రచర్చ లెన్నియున్నను మన మనుదినమువినుచున్న హేతువాదము లెన్నియున్నను, మీారందఱు ధైర్యముతో నద్వైత మవలంబించి బుద్ధునివలెఁ "బలువుర మేలుకొఱకును, బలువురసుఖముకొఱకును"నిర్భయముగఁ దానిని బోధింపవచ్చును అట్లు చేయనియెడల మీారు వట్టిపిఱికివార లగుదురు. మీారు ధైర్యశాలులు గాక భయమును శరణుచొచ్చితిరేని, మీారితరులనుగూడ, నట్లే క్షమియింపవలయును (అనఁగా, పరమతస్థులతో వాదింపక యూర కుండవలయును) ప్రతిమారాధకులను నలఁగద్రొక్కవలదు వారినిబిశాచము లని తిట్టవలదు. మీాతో నేకీభవింపనివారి కెద్దియో బోధింపఁ గడంగకుఁడు మొదట, మీారు భీరువులయినపుడు, మీారు సంఘమునకు వెఱచునప్పుడు, మీారు పూర్వపు మూఢాచారములకు వెఱచునపు డీయాచారాదులు మూర్ఖుల నెంత భయపెట్టునో చూడుఁడు. అది యద్వైతియొక్క స్థితి. ఇతరుల యెడసహనముండవలయును ప్రపంచములోనందఱుఁ గేవలము

మాటలచేతఁ గాక, ఆచరణమునఁ గూడ నద్వైతు లగుదురు గాక. అట్లు పొసఁగకున్న వారికందఱకుఁ జేయూఁతనిచ్చి క్రమ క్రమముగ నెవరివారు వారిని బైపైకి నడిపించుకొని పోవల యును మతాభివృద్ధివిషయమునఁ బ్రతిసోపానమును గూడ హిందూదేశమునకు లాభకరముగాని యన్యము కాదు. మన మతమునందుఁ గీడునుండి మేలునకు మరలుటకుఁ గీడు లేనే లేదు. ఒకటి మేలు, రెండవది దానికంటెను మేలు ఇట్లు మేలు నందే తరతమస్థితులు గాని మనమతము కీడెఱుంగదు.

నీతివిషయమున నింకఁ గొంత నుడువవలసి యున్నది. ఇప్పటివారు కొంద ఱెచ్చట నేర్చిరో గాని యద్వైతము మను జుల నవినీతిపరులను గాఁ జేయుననియు, మనమందఱ మొక్క టియేయయి, మనము భగవంతుఁడును గూడ నొక్కటే యగునప్పుడు మనము నీతిమంతులముగా నుండ నవసరము లేదనియుఁ బరిహాసములోఁ బలుకుచుందురు. అట్టి నరపశువు లకుఁ జెఱుకుగాన నాటునట్లు కొరడాదెబ్బలతోవలె సమా ధానము చెప్పవలయును మీరట్టిపశువులై కొరడాదెబ్బలుగాని మీకు నచ్చనియెడల నట్టి మానవజన్మము నెత్తి మనుటకంటె నాత్మహత్య చేసికొనుట మేలు కొరడా తప్పించుకొననియెడల మీరందఱు రాక్షసులగుదురు. అదియే వాస్తవమయినయెడల నట్టివారినందఱను జంపినను బాపము లేదు. అట్టివారికి వేఱు తెరవో పాయమును లేదు. వారెల్లప్పుడు ప్రహారణములను దిను చుండవలసినదే గాని యొండుపాయము లేదు. మీరు తలంచు నట్లు గాక యిదియే నీతిబోధకమగు మతము. సమస్తమైన

నీతులకుఁ బ్రధానము పరోపకార మని యన్ని మతములును బోధించుచున్నవి ఎందుచేతఁ బరోపకారము చేయవలయును? స్వార్థపరుఁడవు గాకుమందురు. ఏల? ఎవఁడో దేవుఁడు చెప్పి నాఁడు గనుకనా? అతఁడు నాకు దేవుఁడు గాఁడు; కొన్ని గ్రంథ ములు చెప్పినఁ జెప్పనిమ్ము; అవి నాకుఁ బ్రమాణములు గావని యెడ వారందఱుఁ జెప్పినను నాకుఁ బ్రమాణము కావందురు ఎవరు చెప్పిననేమి? 'ఎవరికి వారే యమునాతీరే' యనునదియే యిప్పటికాలమందుఁ జాలమందికిఁ గల నీతి నేనేల నీతిమంతుఁ డనుగా నుండవలయును [అనిఁ దీనికి సమాధానము 'వారట్లు చెప్పిరి, వీ'రిట్లు చెప్పిరి యనిగాని యా గ్రంథమందున్న దీ గ్రంథమందున్నది గనుక, మనము నీతి నవలంబింపవలయునని గాని, పైరీతి నిది ఖండింపఁబడుచున్నది] దీనికి సమాధానము, తెలిసినవాఁడు గాని చెప్పఁజాలఁడు.

తనయందుఁ బ్రతివానిని, ప్రతివానియందును దన్నును జూచునట్లు ప్రతివానియందును భగవంతునిఁ జూచిన మహాను భావుఁ డెన్నఁడు నొక శరీరి యింకొక శరీరికి హానిచేయనొల్లఁడు అట్టివారి కెవరికి హానిగల్గినను దనదే యని తెలియును ఇది యద్వైతము చేఁ గాని సిద్ధింపదు వారందఱు నీవ తెలిసినను దెలియకున్నను రాజమందిరములందు భోగము లనుభవించు మహారాజవు నీవ వీథులంబడి కష్టములఁగుడుచు భిక్షుకుఁడవు నీవ పండితులయందును నీవుగలవు. పామరులయందును నీవు గలవు బలహీనులందును నీవుగలవు బలవంతులందును నీవు గలవు దీనిం దెలిసి యందఱియెడ నను రాగము గలిగియుండుము.

తెలిసియైనను, దెలియక యైనను నన్ని చేతులతోను బనిచేయు చున్నవాఁడవు నీవ. అన్ని పాదములతోడను నడచుచున్నావు. కాఁబట్టియే నేను తిండిలేక నవసినను విచారింపను. ఏమనఁ గోటి నోళ్లు భుజించుచున్నవి అవి యన్నియు నా యవియ. కావున, నే నేమయినను నావి యేమయినను నాకు విచారము లేదు. ఏమి? ఈ ప్రపంచమంతయు నాయదియె అందలి సుఖ మంతయు నే ననుభవించుచున్నాఁడ అట్టి ప్రపంచమయుఁడ నయిన నన్నెవ్వఁడు చంపఁగలఁడు? అని యద్వైతి తలంచు చుండును కావున, నద్వైతము నీతిమతము ఇతరమతములు నీతిని బోధించుఁ గాని, కారణమును జెప్పఁజాలవు అద్వైతము కారణమును బోధించుచున్నది.

ఇఁక, దీనివలని లాభ మేమి? యను విషయ మాలోచింతము. "శ్రోతవ్యః మంతవ్యః నిదిధ్యాసితవ్యః" ప్రపంచము నావరించియున్న మాయ యను తెఱను దీసివేయుము మానవుల కెన్నడును బలహీనకరము లగు మాటలును, ఆలోచనలును జెప్పకుము అన్ని పాపములకును, అంత కీడునకును మూలము బలహీనత. దుశ్చేష్టల కన్నింటికిని గారణము దుర్బలము. మనుష్యులచేతఁ జేయరానిపనులను జేయించునది దుర్బలము. మనుష్యని సత్యస్వభావము గోచరింపకుండుటకుఁ గారణము దుర్బలము తా మెవ్వరో దానిని తెలిసికొనవలయును. వారి నిక్కమగు స్వాభావ మిట్టిదని వారికి సదా బోధింపవలయును 'సోహ' మ్మనువాక్యము స్తన్యపానముతోఁ గూడఁ జెప్పవలెను ఎదిగిన తరువాత దానింగూర్చి వారు చింతింపవలయును. అట్టి చింత

వలన లోక మెఱుఁగని ఘనకార్యములు ఫలించును అద్వైత
మాచరణసాధ్యము కాదే! ఏమిసేయుద మని కొంద అందరు
ఆచరణీయము కాదనిన నైహికవిషయములం దుపయోగమున
కింకను రాలేదనుట. అదియును గొంతవఱకు నిశ్చయమే.
"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ఓమిత్యేకాక్షరంపరమ్" అని వేద
ములు నుడువుచున్నవి "ఓమ్" అనునది మహారహస్యము
అదియే పెన్నిధి ఈరహస్య మెఱింగినవానికిఁ గావలసినవన్నియు
లభించు కాఁబట్టి దానిరహస్యమును దెలిసికొనవలయును.
మీారే యది యెఱుంగవలయును. 'తత్త్వమసి' యను దాని
రహస్య మెఱుంగవలయును. అప్పుడు నీవెద్దికోరినను వచ్చును.
నేనల్పమయినబుద్బుదమునైనను, నీవుపర్వతోన్నతమైనతరంగ
మవైనను, మన రెంటికిని మూలాధారము భగవత్సముద్రుఁ
డనియు, నతఁడే మనదార్ఢ్యమునకు మూలమనియు నతనినుండి
మనకెంతబలము గావలసినను బొందఁగల మనియుఁ దెలిసికొను
నది కావున, మనయందుమనకు నమ్మకముండవలయును. ఇదియే
అద్వైతముయొక్క రహస్యము మొకట నిన్నునీవునమ్మిపిమ్మట
నితరులను నమ్ముము అనునదియే యద్వైతము లోకచరిత్ర
మునుజూచినను పరాపేక్షలేక స్వవిశ్వాసముగలదేశము ప్రబలి
యున్నతదశకువచ్చుటనుజూచుచున్నాము అట్టిదేశములందలి
ప్రజలలో స్వశక్తియందు నమ్మకము గలవారలు ఘను లగుచు
న్నారు మున్ను మన దేశమున కాంగ్లేయుఁ డొకఁ డొకచిన్న
లేఖరి యుద్యోగమునకై వచ్చి ధనసాధనసంపత్తిలేక రెండు
మాఱు లాత్మహత్యకుఁ బ్రయత్నించియుఁ వెంటనే తాను మన

కార్యముల నిర్వహించుటకుఁ బుట్టినవాఁడ నని దృఢమైన నమ్మకముగలవాఁడయి యది మానుకొని తుదకాతఁడొకరాష్ట్రస్థాపకుఁడై ప్రసిద్ధిఁగాంచెను అతఁడే లార్డుక్లయివు అతఁ డట్లు గాక పాదిరులు చెప్పినమాట విని "భగవంతుఁడా! నేను దుర్బలుఁడను నీచుఁడను," అని ప్రాకులాఁడుచుండిన నేమగును? ఉన్మాద వైద్యశాల కంపఁబడియుండును. ఇట్టి దుర్బోధవలన వారు జనులకు మతిఁబోఁగొట్టుదురు ప్రపంచమునం దంతట నిట్టి దుర్బోధలవలన నష్టము సంభవించుచుండుట నే నెఱుఁగుదును. మన పిల్లలు నిట్టి యుపదేశములతోడనే పెరిఁగినప్పుడు వారలకప్పుడే సగము మతిపోయియుండు ననిన నాశ్చర్య మేమి ?

ఇది యాచరణవిషయము. మీకు భాగ్యము కావలయు ననిన మిమ్ము మీరు నమ్మవలయు అట్టి నమ్మికతోఁ బనిచేసినచో భాగ్యమును, బుద్ధి వృద్ధిని కోరినవారలు దానియందే బుద్ధిని వినియోగించి పనిచేసిన బుద్ధియును వృద్ధినొందును మోక్షము కావలయునినిన నాత్మవిచారమందు వినియోగింపవలయును అప్పుడు మీరే దేవు లగుదురు నిర్వాణము లభించును ఉన్న లోప మిది. అద్వైతసిద్ధాంతము నాత్మవిచారమునందు మాత్రమే యుపయోగించుచున్నంతెవఱకంతియే ప్రాపంచికవిషయమునకుఁ గూడ దాని నుపయోగింపవలసిన కాలము వచ్చినది ఇప్పుడు కూడ నది రహస్యమై యడఁగి హిమాచలాది నగములయందును వనప్రదేశములయందును, మాత్రమేయుండ రాదు జనుల దినచర్యయం దంతట నుండవలయును రాజుల భవనములందును, సన్యాసుల మఠములందును, బీదల కుటీరములందును,

వీథులందు బికిర మెత్తువారియందును గూడ నది యాచరణలోనికి రావలయును "స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్" అని గీత వచియించుచున్నది. కాఁబట్టి, శూద్రులయినను స్త్రీలయినను మఱే యెవ్వరయినను భయపడ నవసరము లేదు ఎంత యల్పముగఁ జేసినను మహాఫలము కలుగునని శ్రీకృష్ణుఁడు చెప్పినాఁడు కావున, నో యార్యపుత్త్రులారా! ఊరక కాలక్షేపము చేయకుఁడు మేల్కాంచి లేచిఫలసిద్ధి కలుగు వఱకు విడువక పనిచేయుఁడు అద్వైత మాచరణములోనికిఁ దెచ్చుటకుఁ దరుణము తటస్థించినది దానిని స్వర్గమునుండిభూమి మీఁదికిఁ దేవలయును ప్రకృతకార్య మిది మన పూర్వుల వచనములు మనల నచ్చటఁ 'ఆఁగుఁడు, ఆఁగుఁడు' అని కేకలువేసి చెప్పుచున్నవి లోకమంతటను వ్యాపించి సంఘమం దామూలాగ్రము విస్తరించి యద్వైతధర్మములు ప్రతివానికిఁ గరతలామలకము లగువఱకును, ప్రాణములతో నైక్యములగువఱకును రక్తనాళములలోఁ బ్రవేశించి ప్రతిరక్త బిందువునందును గలియువఱకును నద్వైతము బోధింపవలయును మీా కాశ్చర్యముగఁ గనిపించునేమో కాని, వాస్తవముచేత నైరోపీయులు మనకంటె నెక్కువ వేదాంతులుగ నున్నారు నేను, న్యూయార్కు పత్తనమున సముద్రపుగట్టున నుండి చూచినప్పుడు వేలకొలఁది జనులు పలుదేశములనుండి పతితులయినవారు జీర్ణవస్త్రములకంటె వేఱుధనములేనివారు మనుష్యునివంకఁ దేఱి చూచుటకైన భయపడుచు రక్షకభటులను జూచిన వడఁకుచు వచ్చినవా రాఱునెలలలో మంచిదుస్తులు ధరించి

ప్రతివారి నెదిరించి చూచుచు నిశ్శంకముగ వీథులందుఁ దిరుగు చుండిరి ఈమార్పునకు గారణమేమి? అట్టివా రార్మీనియా నుండియో లేక "మొదటినుండియు నీవు పుట్టుబానిసవు జన్మాంతమువఱకు నీవిట్లే యుండవలయును. ఇందులకువ్యతిరేకముగ నేమాత్రము ప్రయత్నించినను నిన్నడఁగ ద్రొక్కుదుము" అని చెప్పెడు మఱి యేదేశము నుండియో వచ్చినారని తోఁచెడిని. ఆదేశమందుఁ బ్రతివారును "నీవు బానిసవు నీకింక గతిలేదు. ఇట్లే నీదినములు గతింపవలయును" అని చెప్పుచుండిరి. గాలి కూడ యట్లనుచు వీచుచుండెను అట్టివాఁడాన్యాయార్కునకు బోఁగానే యొక పెద్దమనుష్యుఁడు, మంచివేషముగల వాఁ డాతనికిఁ జే యిచ్చి యాదరించెను

ఒకఁడు జీర్ణవస్త్రధారియనియుఁ దాను విలువగలవస్త్రములను ధరియించితి ననియు భేద మతఁడు పాటింపఁ డయ్యె అతఁడికఁ గొంచెము దూరముపోయిన నొక్కయన్నవిక్రయసత్రమునందుఁ బెద్దమనుష్యులు గొందఱు భుజించుచుండఁగా వారి పంక్తి నాతనికిఁగూడ వడ్డింపఁబడెను ఇట్లు చూడంజూడఁ దానుగూడ నందిఱితోఁ పాటొక మనుష్యుఁడనే యని యాతనికి ధైర్యము కలిగెను. అతఁడు వాషింగ్టనునకుఁబోయి సముదాయరాష్ట్రముల యగ్రాసనాధిపతితోఁ జేయూచి మాటలాడియు నుండవచ్చును అక్కడఁ దనవలెనే దరిద్రులయివచ్చియున్న వారలనేకు లాయగ్రాసనాధిపతిచే మైత్త్రిమెఱయ నాదరింపఁబడు టయుఁజూడవచ్చును అపుడీమాయ యాతనికిఁదొలఁగిపోయెను.

బానిసగాను,దుర్బలుఁడుగాను,మాయచేఁజేయఁబడిన బ్రహ్మమే గనుక యాతఁడు లేచి మరల మనుజుఁడై విలసిల్లెను వేదాంత మునకుఁ బుట్టినిల్లయిన మనదేశమందుఁ గూడ సామాన్యజను లిట్టి మాయాంధకారమగ్నులయిరి వారి నంటుట దోషము. వారితోఁ గూర్చుండుట పాపము వారికిఁ దగుణోపాయమే లేదు ఇట్టి దురభిప్రాయములతో మనుజు లధోగతిపాలయి యణఁగి యణఁగి యెంత దుస్థితికి రావలయునో యంతదుస్థితికి వచ్చి యున్నారు మనుష్యుఁడు పశువులతోఁబాటు నిద్రింపవలయు ననియు, నందుచేత నెవ్వరును దెలియనివారు చేసెడు తప్పులను జేయరాదనియు, నేదేశమునఁ గలదు? దీనికంతకును ఫలమిచ్చుటనే కెలుగుచున్నది కారణము నిచ్చటనే యున్నది. మనదే తప్పు. ధైర్యముగఁ దప్పు నొప్పుకొనవలయును ఇతరులమీఁదికిఁ ద్రోసి వేసినఁ బోదు మన తప్పులన్నింటికి మనమే యుత్తరవాదులము.

ఓ లాహోరుయౌవనులారా? దీనిం దెలిసికొనుఁడు. తర తరములనుండిమనతలపై నీమహాపాపమున్నదని తెలిసికొనుఁడు. మనకింక వేఱుదారిలేదు మీరెన్ని సభలుచేసినను, ఎన్ని రాజ కార్యసంఘము లేర్పఱచినను, ఏఁబదివేలసమాజము లేర్పఱచి నను, ప్రేమానురాగములు విలసిల్లి బుద్ధునికరుణాసార మిం కొక్కసారి యీదేశమందుఁ బ్రవహించి శ్రీకృష్ణునివచనమున లాచరణలోనికి వచ్చినంగాని మనకింక నాశలేదు. మీరూరక యైరోపియనుల సంఘములను సభలను ననుకరించుచున్నారే గాని నేనొక్కటి చూచుచున్నాను దానిఁ దెల్పెద వినుండు.

ఇచ్చటి తెల్లవారు కొందఱు ఒక బర్మాదేశీయుల వర్తక సంఘమును లండనునకుఁ గొంపోయిరి అచ్చట వారు యూరేషియను లయిరి పిమ్మట వారిని, ఆస్ట్రియాదేశములోనికిఁ గొంపోయిన ధనమునంతను దీసికొని యచ్చట విడిచిరి పాపము! వారికొక్క యైరోపీయభాషయును రాదు, కాని,పాపము! ఆస్ట్రియాయందలి యింగ్లీషు కాన్సలుగారు వారిని మరల లండనునకుఁ బంపెను వా రచ్చట నెవ్వరి నెఱుంగరు గనుక, నిస్సహాయులయి యుండిరి అట్టివారి నొకదొరసాని గాంచి తనకొలువులోనికిఁ దీసికొని యీవిషయమును వార్తాపత్రికలలోఁ బ్రకటించెను అందు మీఁద బర్మాదేశీయు లాగ్రహావేశులయి ధనమును, కొల్లలుగాఁ బంపఁగా వారిని మరలఁ బర్మాకుఁ బంపివేసిరి. సంఘము లన్నియు నిట్టి యనురాగముతోఁ బయులుదేఱుచున్నవి వారి కట్టి దయాదాక్షిణ్యములు మూలాధారములుగ నున్నవి వారు ప్రపంచమునం దనురాగము లేనివారుగావచ్చును వారి కెందఱు శత్రువులు గావచ్చును కాని, యాదేశమందు వారియం దనురాగమును సత్యన్యాయధర్మముల కొఱకె తమలయందు దయయును గలవు. ఆదేశమందు నాకు వారెంత యాదరణమును గనఁబఱచిరో యెల్లప్పుడు నందఱతోడను జెప్పుకొన కుంటినా నేను కృతఘ్నుఁడ నగుదును ఇక్కడ నట్టి కనికరముగలవా రేరీ? నన మొక చిన్న వర్తకసంఘమేర్పఱుపఁగనే యొకరినొకరు మోసపుచ్చుకొని మూఁడవనాఁటికి సంఘ మప్పులపా లగును అట్టిమనము వారిననుకరించి వారివలె నున్నతస్థితికిరావలయు నని యపేక్షింతుము అందు

లకుఁ గావలసిన యుపకరణము లేవి? మన పునాదులు గండ్రయిసుక పునాదులు. గనుక, క్షణములోఁ గూలిపోవుచున్నవి.

కావున లాహోరుసోదరులారా! యింకొకసారి యద్వైతధ్వజమును త్రిప్పుఁడు అప్పుడుగాని పరస్పరప్రేమ యుదయింపఁజాలదు అంతట నొకే ప్రభువగు నీశ్వరుఁడున్నాఁడని తెలియవలయును అను రాగధ్వజమెత్తి విజృంభింపుఁడు "మేల్కాంచి లేచి గమ్యస్థానముఁ జేరువఱకు విరమింపక పనిచేయుఁడు. వైరాగ్యము లేక యేమియుఁ జేయఁజాలము నీ వితరులకుపకారము సేయఁగోరితివేని "అహా" మ్మనునది నశింపవలయును క్రైస్తవులు చెప్పినట్లుగా ధనమును దైవమును నొకసారి సేవింపఁజాలము. ఘనకార్యముల నాచరించుటకై మనపూర్వులు ప్రపంచమునే త్యజించినారు ప్రస్తుతము మోక్షముకొఱకై లోకమును ద్యజించెడువారును గలరు ఇతరులకొఱకు సర్వమును ద్యజింపవలయును మన మోక్షమును సయితము విడువవలయును మీరు సదా పెద్దమాటలతోఁ గాలక్షేపము సేయుచున్నారు ఇదిగో! ఆచరణీయ మగు వేదాంతము మన ప్రాణములు పోయిననేమి? సంఘము నిలిచియుండునప్పుడు మన ప్రాణము పోయినను లోపము లేదు రాను రాను సంఘము క్షీణించుచున్నది కోట్లకొలఁది జనులు మనలను నిందించుచున్నారు పిపాసార్దితులయి మ్రింగుచుండు వారి కెదుటనున్న శుభ్ర నదీజలములకు మాఱుఁగ బల్వలోదకములను ద్రావనిచ్చుచున్నాము కావలసినంత యుండియును క్షుద్బాధచే మన కన్నులముంద నేకులు

పరలోకగతు లగుచున్నారు పెక్కువేలమందికి మన మద్వైత మునుగూర్చి యూరక వట్టిమాటలుపల్కి చేతనైనంతవఱకు వారిని ద్వేషించినారము. అందఱును సమానులే యని గుము నందఱియందు నీశ్వరుఁ డున్నాఁడనియుఁ జెప్పియును వీసమైన నాచరణములేక లోకాచారము లనుపేరుతోఁ గొన్ని సిద్ధాంతములను గల్పించి యనేకులను బాధించుచున్నారు. అట్టివా రందఱును మనకు శాపములను బెట్టుచున్నారు "ఇదం తయును మనస్సునందే గాని, యాచరణము సున్న" యను కళం కమును మనము పాపుకొనవలయును ఇంక నీనిద్రనుండి లేచి మేల్కొనుఁడు ఈయల్పప్రాణముపోయిన నేమి? పుణ్యపురుషుఁ డైనను, పాపి యైనను, ధనికుఁ డైనను, దరిద్రుఁ డైనను, ప్రతి వాఁడును జావవలసినదే శరీర మెవ్వరికిని శాశ్వతము కాదు. కావున, నిద్ర మేల్కొని పూర్ణమైన పూనికతో శక్తివంచనలేక పాటుపడవలయును. మనదేశమునఁ గాపట్యము మిగుల ఘోర ముగ నున్నది. మనకుఁగావలసినది సద్వర్తనము.వర్తకమే మనల నెప్పుడును భల్లూకమువలె విడువక పట్టుకొని యుండునది. "నిందంతు నీతినిపుణా యదివా స్తువంతు" పుణ్యపురుషులు నిందించినను స్తుతించినను లక్ష్మివచ్చినను బోయినను మృత్యు విప్పుడే తటస్థించినను నూఱేండ్లతరువాత వచ్చినను, సత్పథము నుండి తప్పనివాఁడే పుణ్యపురుషుఁడు మనకు వ్యర్థవచనముల తో దినములుగడిచిపోవుచున్నవి త్వరలో మేల్కొనుఁడు.స్వల్ప విషయములకొఱకు లేనిపోనివివాదములు గట్టిపెట్టుఁడు. దేశము పాడగుచున్నప్పు డిట్టి యల్పాంశము లేల? మొదట మహాత్మ

దీయులు మనదేశమునకు వచ్చినప్పు డఱువదికోట్ల హిందువులు కలరు. ఇప్పు డిరువదికోట్లకుఁ దక్కువగ నున్నారు. దినదినము నిట్లు తక్కువయై తుదకు నశించునట్లున్నది వారితోఁడ నాయుద్భూతము లగు సిద్ధాంతములుగూడ వానియందలి లోపములతోడను, దురభిప్రాయములతోడను నశించును ఆత్మవిద్యాభూషణమగు నీయద్వైతముకూడ నదృశ్యమగును మనకుఁ బ్రకృతమునఁ గావలసిన దంత యద్వైతము కాదు అందుఁ గొంచె మైహికవృద్ధికి సాధనార్థమై తెచ్చుకొనవలయును ముందు భిక్ష కుదిరినం గాని జపము కుదరదు కడుపు మాడుచున్న వారి నోటిలో మతము క్రుక్కినయెడల నేమిలాభము? ఆఁకలి ప్రేవులను మాడ్చుచుండఁగ నెన్నిసిద్ధాంతములు చెప్పిన నేమిప్రయోజనము? ఇట్టి దశకు రెండుదోషములు కలవు మొదటిది మన దౌర్బల్యము, రెండవది మనయీర్ష్యయు ఱాతిగుండెయు.నీవు వేయిసిద్ధాంతములను జెప్పినను వేయిమతములు బోధించినను నీకుఁ గరుణలేక పోయెనా నిష్ప్రయోజనము. వేదములు చెప్పునట్లుగ నందఱు నీవయని యెంచి యందఱు నీశరీరమునందలి యవయవము లనుకొని ధనిక దరిద్ర తారతమ్యమును, బుణ్యపాపవివక్షయు లేక, యందఱు నొక్కటేయగు ననంత బ్రహ్మముయొక్క భాగములని యెంచి యనురాగమును జూపవలయును

ఆర్యు రారా! ఇంతవఱకద్వైతసిద్ధాంతమునందలి ప్రధానము లయిన విషయములను గొన్నింటినిమాత్రము చెప్పి దాని

నాచరణములోనికిఁ దెచ్చుటకు మనదేశమునందే గాక ప్రతిచో టను దరుణము వచ్చియున్నదని చెప్పినాఁడను ప్రతి ద్వైత మతమును బ్రకృత నవీనప్రకృతి సిద్ధాంతములు సమ్మెటలవలెఁ గొడిచేయుచున్నవి. ద్వైతమతములు మనదేశమందే గాక, యూ రోపునందును అమెరికాయందును గూడ గ్రంథములను బెనవేసి శాస్త్రసమ్మతమయిన వ్యాఖ్యానములకొఱకుఁ బ్రయత్నించుటయే గాక ఆప్రయత్నము విఫలమయి మూలమూలలకుఁ బోయి డాఁగుచున్నవి. అచ్చటఁగూడ నిండియానుండి కొంత బోధ యావసరమయి యున్నది. ఇదివఱకచ్చట గొంతవఱకది వ్యాప్త మయియున్నది. ఇంకను వృద్ధియయి యచ్చటి నాగరికతను గూఁడఁ గాపాడవలయును అక్కడఁగూడఁ బూర్వపుపద్ధతులు మాఱి ధనార్జనముమాత్రమే పరమప్రయోజనముగ నెంచు క్రొత్తక్రొత్తపద్ధతులు వచ్చుచున్నవి ఈ ధనార్జనాపరాయణ త్వముకంటె మునుపటి యసంపూర్ణమతమే మేలు అట్టి పునాది మీఁద సంఘభవనములు నిలువఁజాలవు దేశచరిత్రలవలన నట్లు కనిపించుచున్నది అట్టి తరంగము వచ్చి యిండియాను ముంచ కుండ మనము చూడవలయును కావున, నవీనప్రకృతిశాస్త్ర ములను ధిక్కరించి నిలుచుట కద్వైతమును బ్రతివానికిని బోధింపవలయును. ఇంతియగాక, మీరితరులకు సాయపడవల యును మీబుద్ధి యూరపునకును అమెరికాకును దోడుపడవల యును మనము చేయవలసినపని కొంతయున్నది. దీనిని మఱవ కుఁడు. అందు మొదటిపని, మునిఁగిపోవుచున్న హిందువులను లేవనెత్తుట. శ్రీకృష్ణుఁడుచెప్పిన " శ్లో ఇహైవ తైర్జిత స్సర్గో

యేషాంసామ్యేస్థితం మనః, నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తేస్థితాః." బ్రహ్మమునందు మనస్సునిలిపినవాఁ డిచ్చ టనే స్వర్గమును జూఱగొనును. భగవంతుఁడు పరిశుద్ధుఁడు. అందఱకును సముఁడు. కావున, అట్టివారు భగవంతునియొద్ద నుందురు" అను వాక్యములను జ్ఞప్తియం దుంచికొని వారికి చేయూఁతనిచ్చి లేవఁదీయుఁడు

అనంతరము 1901 సం ఏప్రల్ నెల 6 తేది చంద్రనాథ్, కామాఖ్యము, అను స్థలములకుఁ జని, కొన్ని యుపన్యాసము లొసంగి, మరల కలకత్తానగరమును జేరిరి శరీరము క్రమక్రమముగా ఆరోగ్యము నొందుచుండెను స్వామి లెప్పటివలె మహోత్సాహముతోఁ దమపనిని చేయుచుండిరి వారి శిష్యులును స్నేహితులును స్వాములు అనేక కార్యము లొనర్తురని భావించియుండిరి. అయినను స్వాములు 1902 జూలై నెల 4 తేది బేలూరు మఠమునందు బ్రహ్మైక్యమునొందిరి

## స్వదేశ చరమోపదేశము.

ఓహిందూదేశమా! సీత, సావిత్రి, దమయంతి మొదలగు పతివ్రతాతిలకములను మఱవకుము నీయొక్కపరదేవత, యోగులలో నుత్తముఁడైన యోగియగు ఉమాపతి శంకరుఁడనుటను మఱచిపోకుము. నీయొక్కవివాహమును, నీసంపదయు, నీజీవితమును, నీయింద్రియభోగములకుఁ గాదనుటను మఱవవలదు. నీవు పుట్టినదిమొదలు జగన్మాతకొఱకే సమర్పింపఁ బడియుండు

టను మఱచిపోవద్దు నీజనసమూహము అనంతస్వరూపిణియైన మహామాయయొక్క ఛాయామాత్ర మనుటను మఱవరాదు. మిక్కిలితక్కువజాతివాఁడైనను, తెలివిలేనివాఁడైనను, చదువులేనివాఁడైనను, బీదవాఁడైనను, మాలవాఁడైనను నీరక్తమునఁ గలసినవాఁ డనుటను, నీసోదరుఁడనుటను మఱచిపోకుము ఓ వీరుఁడా! ధైర్యముతో నుండుము నీవు భారతపుత్త్రుఁడనెడి గౌరవమును వహింపుము "నేను భారతదేశీయుఁడను, ప్రతి భారతపుత్త్రుడును నాసోదరుఁడే" అని చెప్పుము "చదువని హిందువును, బీదహిందువును, బ్రాహ్మణహిందువును, పంచమ జాతి హిందువును అందఱును నా సహోదరులే" అని చాటింపుము. గొంతను కప్పుకొని గంభీరధ్వనితో "హిందువులే నా సోదరులు, హిందువులే నాప్రాణము,హిందువులే నాపరదైవము, హిందూజనసమూహమే నేనుపుట్టిపెరిగిన తొట్ల, నా యౌవన నందనవనము, నా వార్ధక్యతపోవనము" అని గౌరవముతోఁ బల్కుము సోదరుఁడా!"భారతవర్షము యొక్క పుణ్యభూమియే నాకు శ్రేష్ఠమైన స్వర్గము! హిందూదేశ క్షేమమే నా క్షేమము" అని చింతించి "హేభగవతీ! హేజగన్మాతా! నాకు పౌరుష మును ప్రసాదింపుము; హే ఫలదాయినీ! నాబలహీనతను పోఁగొట్టి, నాషండత్వమును బోఁగొట్టి నన్ను పురుషునిగా నొనర్పుము." అని రేయింబవలు ప్రార్థింపుము.

## మహాసమాధి.

శ్రీవివేకానందస్వాములవారు 1902 సం జూలై నెల 4 తేది ఉదయము ఎప్పటికంటె ఐదు గడియలసేపు అధికముగా

ధ్యాన నిష్ఠయం దుండిరి ఆదినము పాణినీయ వ్యాకరణమును జాము సేపు శిష్యులకుఁ బాఠము చెప్పుచుండిరి ఆదినము శరీరమున కారోగ్యము కలుగుచున్న దని చెప్పిరి ఆదినము మధ్యాహ్నా త్పరము కొంచెముదూరము నడచిపోయి వచ్చిరి సాయంకాలము వారు నివసించు గదికిఁ బోయి జపమాలికను గైకొని జపము చేయందొడంగిరి వారికి శుశ్రూష చేయుచున్న బ్రహ్మచారినిఁ జూచి "నీవు బయటఁగూరుచుండి జపము చేయుచుండు" మని అనిరి అనంతరము రెండుగడియలకు, ఆశిష్యుని బ్రహ్మచారిని గదిలోనికి రమ్మని చెప్పి వీవనతో విసరుచుండుమని నియమించి శయనించిరి రాత్రి 9 గంటలకు స్వాములవారు తటాలున లేచి నిట్టూర్పుఁ బుచ్చిరి. బ్రహ్మచారికి ఆ నిట్టూర్పు లిట్టివని తెలియదు అయినను ఆ బ్రహ్మచారి యొక వృద్ధసన్న్యాసినిఁ బిలిచెను అతఁడు గదిలోనికిఁ బోయి స్వాములవారి నాడినిఁ బట్టిచూచెను నాడి యాడకుండెను

పిమ్మట, వృద్ధసన్న్యాసి, అది మహాసమాధిగానుండునని భావించి, గురువులవారి దివ్యనామమును వారి కుడిచెవిలోఁ జెప్పిరి చాలసేపుదాఁక స్వాములవారికి హెచ్చరిక కలుగలేదు. తరువాత, డాక్టరును రావించిరి అతఁ డెన్నియో ప్రయత్నము లొనర్చెను. మేల్కొనరైరి పిదప వివేకానందస్వాములు మహాసమాధి సిద్ధినొందిరని నిశ్చయించిరి మఱునాఁడు గంగాతీరమున మఠముతోఁ జేరిన ప్రదేశమునందు బిల్వవృక్షము క్రింద స్వాములవారికి అగ్నిసంస్కార మొనర్చిరి.

శ్రీవివేకానందస్వాములు తమ ఆశ్రమధర్మమునకు (దగి
నట్లు వారు లోకోపకారముగను, నిష్కామ్యముగను, కైంకర్య
మొనర్చి, మహాయోగులకు లభ్యమగు అనాయాస సుఖనిర్యా
ణము నొందినందులకై మనము భక్తిశ్రద్ధలతో కీర్తింపవల
యునే గాని, విచార మొందఁదగదు శ్రీమచ్ఛంకరాచార్య
స్వాములవారు 33-వ సంవత్సరమున కైలాసమున కేగిరి శ్రీ
వివేకానందస్వాములు తమ 39-వ సంవత్సరమున మహాసమాధి
స్థితులైరి ఉభయులయొక్క లోకోద్ధారకార్యము లించు
మించుగా సమానకాలముగనే యుండును

ఓ భరతఖండమా! నీవు శ్రీవివేకానందస్వాముల వారి
వంటి మహానుభావులను శీఘ్రమున ప్రసాదింపుము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఓం తత్సత్.

## సర్వార్థ మతలక్ష్యము

శ్రీవివేకానందస్వాములవారు ఏస్థితిలోనుండి హిందూ
మతమునుగూర్చి యుపన్యసించిరని కొందఱు ప్రశ్నింపవచ్చును.
అట్లే ఏమతమునుగూర్చి ప్రసంగింపవచ్చును మఱియు వారే
కార్యమును సాధించుటకై యవతరించిరని యడుగవచ్చును.
అనఁగా, వారు ఉన్నదానిని వృద్ధిచేయవలయుననియే బోధిం
చిరి గాని, ఉన్నదానిని నాశముచేయవలయునని కాదు. సామా
న్యముగా "మతము" అని దానియందెంతటి యభిప్రాయము
లణఁగియున్నవో, వానినే ప్రసంగించిరి మఱియు మనుజాని

క్రమక్రమముగా అధ్యాత్మమార్గమునఁ బ్రవేశింపఁజేసి పూర్ణస్థితి నొందునట్లు చేయవలయుననుటయే వారి యుద్దేశ్యము. ఈవిషయమునందు వారు జాతిమతభేదములను పాటించలేదు. వారి యభిప్రాయము లన్నియు "సర్వార్థమతలక్ష్యము" అను ప్రసంగమును జూచిన బోధమగును ఆప్రసంగము నీదిగువ నుదహరింపఁ బడియెడిని

ఎచ్చటచ్చట నేదేది మన బుద్ధీంద్రియములు ప్రవేశించు చున్నవో, దేనిని మన మనస్సు సంకల్పించుచున్నదో, అచ్చటచ్చట ద్వివిధశక్తులయొక్క ప్రవృత్తు లుండుటను మనము చూచుచున్నారము ఆ రెండుశక్తులు నొకదానికొకటి ప్రతిహతముగాఁ బనిచేయుచు మనచుట్టును మనస్సులందును జరగెడు వ్యాపారముల కన్నిటికిని గారణభూతము లగుచున్నవి ఆశక్తి బాహ్యప్రపంచమం దాకర్షణాపకర్షణరూపములతోడను, భూాగర్భాకర్షణశక్తిరూపములతోడను వ్యక్తమగుచున్నది ఆంతరప్రపంచమందు రాగద్వేషపుణ్యపాపాది విషయజ్ఞానములకు సమాధానములను గల్పించుచున్నది కొన్ని పదార్థములను మనము దరిఁజేరనీయము కొన్నిటియందు మన కనురాగను కలుగును ఆరీతినే మనయందుఁ గొందఱి కనురాగము కలుగును. కొందఱికి ద్వేషము పుట్టును. పలుమాఱు కారణ మేమియు లేకయే కొందఱియందు మనకు ఘక్కలి ప్రేమకలుగును. అట్లనే మఱియొకప్పు డద్భుతముగాఁ గొందఱియం దకారణవైరము కలుగును ఇది యందఱకును దెలిసినవిషయమే. కార్య మెంతవిస్తారమైనదో యాశక్తి యంత

ప్రత్యక్షముగాను బ్రసిద్ధముగాను వ్యక్తమగును మతము మనుష్యుని బుద్ధి మిక్కిలి విశేషముగా నుపయోగింపఁదగిన విషయము కాఁబట్టి యందలి శక్తులయొక్క వ్యాపారములు మిక్కిలి వ్యక్తములై యుండును ఎన్నఁడు లోక మెఱుఁగని ప్రేమవిశేషము మతమునుండి కలుగును ఎన్నఁడును లోక మెఱుఁగని ఘోర మగు వైరమును మతమునుండి కలుగును. ప్రపంచమం దెన్నఁడు విన నొప్పడనంతటి యను రాగ వాక్యములును మతమందు వినవచ్చును భూమిమీఁద వినరాని పరుష వాక్యములును మతమునుండి వచ్చును విషయగౌరవమును బట్టియు, స్వభావసూక్ష్మతనుబట్టియు నాశక్తియొక్క వ్యాపారము లెక్కువగా నుండును ఈహేతువుచేతనే మతమందు దాని వ్యాపారము లంత ప్రత్యక్షముగాఁ గనఁబడుటకుఁగారణము మతాభిమానముగాక మఱే యేయభిమానమును బ్రపంచమును రక్తప్రళయమున ముంచలేదు ఆమతాభిమానమే మరల వైద్యశాలలను దరిద్రరక్షకశాలలను గట్టించినది మతాభిమానము దక్క మఱియొక్కటి మానవకోటినే గాక యత్యల్పజంతువులను గూడ నంతజాగ్రత్తతోఁ గాపాడలేదు. మనల నతిక్రూరులనుగా నొనరించునదియు, నతిదయాళువులనుగాఁ జేయునదియు మతము దక్క వేఱొండు లేదు. ఇఁకముందు నుండదు ఈయల్లకల్లోలమును గలహములు, నీర్ష్యాసూయలు మతవైరములు నిట్లుండ వీనిమధ్య నెడము కలుగఁజేసికొని భూనభోంతరాళములు నిండున ట్లప్పడప్పుడు శాంతివాక్య మొక్కటి వినవచ్చును. అది యెన్నఁడైన వచ్చునా?

ప్రస్తుతవివాదాంశ మీకలహము లణఁగి యున్నఁడైన శాంతించునా యనువిషయము ఈశతాబ్దము చివరభాగమం దీవిషయమై యనేకచర్చలు జరిగి కొంత యల్లరి కలిగినది.

అనేకపద్ధతు లాలోచింపఁబడి వానిని నెఱవేర్చుటకై ప్రయత్నములు జరిగినవి కాని యది యెంతకష్టమో మనకుఁ దెలిసినదిగదా. మానవకోటియందలి జీవనముకొఱకైన కలహముల నణఁచి మనుష్యుని శూరత్వము డించుట కసాధ్య మని జనులంతఱుఁ దలంచిరి బాహ్యవిషయములనుఁ గూర్చిన యీ స్వల్పవిషయములయందలి కలహముల నణఁచుటయును కొంత్యనురాగముల నెలకొల్పుటయును నంతకష్టమైనప్పుడు మానవుని యంతరంగమందు నెమ్మదిఁ గలుగఁ జేయుట మఱి వేయిరెట్లధిక శ్రమ కలుగఁజేయును కొంతవఱకుఁ బదాడంబరమును మాని యావలనుండి వెలికి వచ్చితివా నిన్నుఁ గొన్ని విషయము లడుగుచున్నాను మనము చిన్ననాఁటనుండియుఁ బ్రేమ, నెమ్మది, భ్రాతృత్వము, సమత్వము, విశ్వభ్రాతృత్వము లోనగు మాటలను వినుచున్నాము అట్లు వానితాత్పర్య మెఱుఁగక చిలుకలవలెఁ బలుకుచున్నాము అది స్వభావసిద్ధము మొట్టమొదట నీవిషయములు కొందఱు మహాత్ములకు బోధపడి యీ పదములను వాడుకలోనికిఁ దెచ్చినారు ఆ కాలమందు వీని తాత్పర్యము కొందఱకు బోధపడియుండెను తరువాతఁ దెలియనివారు సయిత మీపదములను బట్టుకొని యిచ్చవచ్చినట్లు వానితో నాటలాడుచు వచ్చుటచేతమతము కేవల పదాడంబరమాత్రమై యాచరణశూన్య మైనది "నాతండ్రిమతము" మీసంఘము

యొక్కమతము" "మీదేశమతము" లోనగునవి యై పోయి
నవి అది దేశాభిమానముయొక్క యొకయవస్థను దెలిపునది
యైనది అట్టిమతమం దైకమత్యమును గలిగించుట మిక్కిలి
కష్టము. అయినను నీవిషయమై చర్చించుటకుఁ బ్రయత్నింతము

ప్రతిముఖ్యమయిన గొప్ప మతమందును మూఁడుభాగ
ములు కలవని మన మెఱుఁగుదుము అందు మొదటిదగు తత్వ
శాస్త్రము, మతనిబంధనలు, మతముయొక్క లక్ష్యములు, మత
విస్తారము, నందలిభక్తులు, నామతావలంబకులు, నామతో
ద్దేశము లక్ష్యమును జేరుమార్గము వీనిని గుఱ్చి చెప్పును.

రెండవది పురాణములు ఈపురాణములందు మీఁదఁ
జెప్పిన శాస్త్ర మిమిడియున్నది ఈపురాణములు పురుషుల
యొక్కయు, మహాత్ముల యొక్కయుఁ జరిత్రరూపకముగా
నుండును. అందు శాస్త్రమునందుఁ గల గూఢవిషయములు
సులభగ్రాహ్యము లగునట్లె ప్రత్యక్ష ప్రమాణము లగుచరిత్ర
ములరూపకముగా వివరింపఁబడును మూఁడవభాగము కర్మ
కాండము. ఇది పురాణములకంటెను విస్పష్టముగాఁ బ్రతిమలుఁ,
గర్మలు, నంగన్యాసాదులుఁ, బుష్పధూపములు లోనగు
మనోరంజకము లగుపద్ధతులమూలముగాఁ దత్వసూత్రరహస్య
ములను బోధించును ప్రతిశాస్త్రసమ్మత మయినమతమునందు
నీమూఁడు భాగములు కలవు కొన్నిమతములయం దొకభాగ
మునకును మఱికొన్నిటియందు మఱియొకభాగమునకును

ప్రాముఖ్యముండును. మొట్టమొదట శాస్త్రవిషయము నాలో చింతము లోకమంతకు నొక్కశాస్త్రము కలదా ? ఇప్పటికి లేదు ప్రతిమతమును దానిసిద్ధాంతములను దీసికొని వచ్చి యవియే సత్యము లనుపట్టుదలగలిగియుండును అట్లునమ్మటయే గాక వాని నమ్మనివా రందఱు నధోగతిపా లగుదురని కూడఁ జెప్పును. కొంద ఱంతటితో నూరకుండక కత్తిదూసి యితరులను నమ్మునట్లు బలాత్కారము చేయుదురు ఇదిదుష్టస్వభావముచేతఁ గాదు మతోన్మాద మనునొకజబ్బుచేత ని ట్లాచరింతురు ఈ యున్మత్తులకుఁ గపటము లేదు నిష్కపటులలో వీర గ్రగణ్యులే కాని మతిభ్రష్టుల చేష్టలకు వా రెంత బాధ్యులో వీరును నంత మాత్రము బాధ్యత కలవారలే

ఈయున్మాదము వ్యాధు లన్నిటిలో మిక్కిలి యపాయ కరమయినది అది మనుష్యస్వభావమునందుఁ గలదౌష్ట్యము నంతను బైకి లేవఁదీయును కోపముచెలరేఁగి శౌర్యము ప్రబలి మనుష్యులు వ్యాఘ్రములవ లె నగుదురు పలుమతములయొక్క పురాణములయందొ కదానిపోలిక మఱియొక దానికిఁ గాని యైక మత్యము గాని కలదా ? లేదు లేదు ప్రతిమతమునకును, బురా ణములు కలవు గాని, ప్రతివారును "మావిమాత్రము పుక్కిటి పురాణములుగావు మిథ్యలుగావు సత్యము"లనియొవరిమట్టుకు వా రనుచుందురు ఈవిషయమును గూర్చియొక్క చిన్న యుదా హరణ మిచ్చెదను ఒక మతమును నిరసించు తాత్పర్యము నాకు లేదు సుఁడీ! క్రైస్తవులు భగవంతుఁడు పావురమురూపమును ధరించి భూమి మీఁదికి వచ్చె నని యనిరి, ఇది సత్యమైన చరి

త్రముగాని మిథ్యాపురాణము కాదని చెప్పుదురు హిందువులు భగవంతుఁడు గోరూపమును ధరించె నని నమ్ముదురు దీనిని గ్రైస్తవులు మిథ్యయనియు, సత్యముకా దనియు, మూఢభక్తి యనియు నిరసింతురు యూధులు పెట్టెరూపముగానొకబొమ్మను జేసి యిరుప్రక్కల నొక్కొక దేవదూతను జెక్కినయెడ నది పవిత్రాతిపవిత్రస్థానముందుంచనర్హమయినదిగాఁ దలంతురు అది జెహూవాకుఁ బ్రీతి దానినే స్త్రీరూపముగాఁగాని, పురుష రూపముగాఁగాని చేసినచో నది ఘోరమైన విగ్రహము. దీనిం బగులఁ గొట్టుఁడందురు పురాణములయం దున్నయేకమత్య మిట్టిది ఒకఁడు మా దేవుఁ డిట్టిట్టి పనులఁజేసె నని చెప్పినా యితరు లది మూఢభక్తి యందురు కాని వారిదేవుఁ డంతకంటె నద్భుతమైన పనులఁజేసినాఁడు అవి వారు సత్యము లందురు నేనెఱిఁగినంతవఱ కీలోకమం దెవ్వరును వీరిమనస్సులం దున్న చరిత్రమునకును బురాణమునకును నెట్టితారతమ్యము కలదో యూహింపఁదగి యుండలేదు. ఈకథలన్నియుఁ గొంచెము సత్యమిళితములైనపురాణములు

పిమ్మటఁ గర్మకాండవిషయము. ఒకతెగవారి కొకరీతి కర్మ లుండును. అవియే పావనకర్మ లనియుఁ, దక్కిన వన్నియు నట్టిదుష్టమగు మూఢవిశ్వాస మనియు వారందురు ఒక్కవిధ మైన ప్రతిమ నొకశాఖవారుపూజించిన రెండవశాఖవారు దానిని ఘోరకృత్య మందురు ఇందుల కుదాహరణముగా సర్వ సాధారణమైన ప్రతిమను దీసికొందము "ఫాలాసు" అనుప్రతి మవాస్తవముచేత నది విషయికమయినదైనను గ్రమముగా నది

మఱచి సృష్టికర్తను దెలుపుచిహ్నముగా నంగీకరించుచు వచ్చిరి. ఈ ప్రతిమను బూజలను వారు దానిని చిహ్నమాత్రము గ్రహింతురే కాని యది ఫాలాసని యెన్నఁడుదలంపరు. కాని యితరులు దానిని ఫాలాసేగాని మఱియొకదానినిగాఁ దీసికొనక దానిని నిందించునట్లే వారు చేయునది యీఫాలాసును బూజించు వారికి ఘోరముగాఁగనుపించును. నేను రెండుదాహరణములను దీసికొందును ఫాలాసొకటి, క్రైస్తవుల "శాక్రమెంట"ను సంస్కారకర్మ రెండవది క్రైస్తవులకు ఫాలాసుఘోరము. హిందువులకు శాక్రమెంటు ఘోరకృత్యము ఒకమనుష్యుని సుగుణసంపత్తిని బొందుటకై వానినిజంపి యాతనిమాంసమును మెక్కి రక్తమును బానముచేయుట నరమాంసభక్షణము వలె ఘోరాతిఘోరముగా హిందువుల కగపడును. అది కొందఱు కిరాతజాతివారొనరించు ఘోరకృత్యము వారు ధైర్యశాలియైన మనుష్యుఁడు కనిపించెనా వానినిజంపి వానికిఁ గలధైర్యస్థైర్యములు తమకుఁ గలుగుననుతలంపుతో వానిగుండె కాయను దిందురు. సర్ జాన్ లబ్బకంతభక్తిగల పరమక్రైస్తవుఁడు దీని నంగీకరించి యీశాక్రమెం టాకిరాతకృత్యమునందలి దని యొప్పుకొన్నాఁడు క్రైస్తవులు సాధారణముగా దీని నంగీకరింపరు అందున్న యర్థము వారికెప్పుడును స్ఫురింపదు. అదియొక పావనకర్మయని మాత్రము వారెఱుంగుదురు కనుక కర్మలయందును లోకమందఱిచే నంగీకరింపఁబడిన సామాన్య కర్మలు లేవు ఇఁక లోకైకమత్య మెక్కడిది? అట్టిసంగతిలో నొక సామాన్యమతమున కవకాశ మెక్కడ? అదియును గాదు. విశ్వ

భ్రాతృత్వమును సంఘములన్నియు దానిని బోధించుచుండుట యు మనము వినుచున్నాము నాకొకకథ జ్ఞాపకమునకు వచ్చు చున్నది హిందూదేశమందు మద్యపానము మిక్కిలి నింద్యము. ఇట్లుండఁగా నిద్దఱన్నదమ్ములు రహస్యముగా నొకరాత్రి మద్య పానము చేయఁగోరి యొకచోటికిఁ బోవుచుండ నాసమీపమున నొక గదిలోఁ బూర్వపుపద్ధతులలోనివాఁడగు వారిమామ నిద్రించుచుండెను అందుచేత వారు త్రాగుటకుఁ బూర్వము "మామ లేచును.సద్దుచేయకుము" అని యొకరితో నొకరు చెప్పు కొనిరి వారు త్రాగుచుఁగూడ నీప్రకారము గట్టిగా "మామ లేచును సద్దుచేయకు" మని కేకలు వేయఁజొచ్చిరి ఈకేకలకు మామ లేచి గదిలోనికి వచ్చి సంగతియంతయుఁ గనిపెట్టను ఇట్లనే లోకసౌభ్రాతృత్వమునను "మనమందఱమొక్కటి గనుక యొకతెగగానేర్పడుదము" తెగ యేర్పాటు కాఁగానే సమత్వ మునకు వ్యతిరేకింతుము దానితో సర్వము సున్న యగును. మహమ్మదీయులు సర్వజనులు సోదరు లందురు కాని వాస్తవ మేమిజరగుచున్నది? ఎవ్వఁడు మహమ్మదీయుఁడు కాఁడో వాని నంగీకరింపరు వానిగొంతుకకోయఁగోరుదురు. క్రైస్తవులు సమ స్తజనులను సోదరులందురు కానిక్రైస్తవులు కాని వారందఱు నచ్చటికిఁ బోయి శాశ్వతనరకము ననుభవింపవలెను ఈరీతిని మనము విశ్వభ్రాతృత్వము సర్వసమత్వము భాగ్యసమత్వము బుద్ధిసమత్వమునన్నిటియందు సమత్వమునను నాలోచనలోఁబడి మోసపోవుచున్నాము అట్టిశబ్దములు విన్నప్పుడు కొంచెము మౌనము వహించి యించుక యాలోచించి జాగ్రత్త పడవలసి

యున్నది ఆబోధనలు పలుమాఱు పయోముఖవిషకుంభముల వలెఁ గేవలస్వార్థపరత్వజనితములు గానుండును శీతకాలమందు మబ్బుపట్టి తెగయుఱిమి యుఱిమి తుదకొక్కచినుకైనఁ బడదు. వర్షకాలమందుఱుమున్నది లేకయే మేఘములు లోకము వెల్లిగొన వర్షించును. కావున, వాస్తవముగాఁ బనిచేయువాఁడును, నిశ్చయముగా లోకసౌభ్రాతృత్వము నచ్చినవారును పలుమాటలాడక పలుతెగల నేర్పఱపక వారికార్యములందును బ్రవర్తనయందును గమనభోజనపానాదిప్రతిచేష్టయందును మానవకోటియందును గనికరమును భ్రాతృత్వమును గనఁబఱతురు వారు కార్యములు చేయుదురుగాని మాటలు చెప్పరు. లోకమంతయు మాటలతో నిండియున్నది మనకుఁ గార్యమెక్కువ మాటలుతక్కువ కావలెను

ఇంతవఱకు సర్వసమ్మతములైన యభిప్రాయము లేవియుఁ గానరాక పోయెనుగాని యట్టివి కలవని మన మెఱుఁగుదుము. మన మందఱము మనుష్యులమే కాని మనమందఱము సమానులమా! కాము. మనమందఱము సమానుల మని యెవ రెఱుఁగుదురు? మతిపోయినవాఁడు మనుష్యు లందఱు సమానులని యనునే కాని మఱియెవ్వరు ననరు మనబుద్ధియందుఁ గాని శక్తియందుఁగాని శరీరములయందుఁగాని మనము సమానులమా? ఒకరికన్న నొకరు బలవంతులు ఒకరికన్న నొకరు బుద్ధిమంతులు మనమందఱము సమానుల మైనయెడల నీతిభేదమేమి? ఈభేదము నెవ్వరు కలుగఁజేసిరి? మనమే శక్తియందును,బుద్ధియందును, దేహబలమందును నెక్కువతక్కువలున్న వి

గనుక, భేదముకలిగి తీరవలెను కాని సమత్వసిద్ధాంతము మనకుఁ దప్పక స్ఫురించును ఇంకొకటిం దీసికొనుఁడు. మనమందఱము మానవులమే కాని కొందఱు పురుషులు, కొందఱు స్త్రీలు; ఇక్కడఁ గొందఱు నల్లనివారు, నక్కడఁ గొందఱు తెల్లనివారు. కాని యందఱు మనుష్యులే అందఱు మానవకోటియే అనేక విధముల ముఖములు. ఇక్కడ నున్న రెండుముఖము లొక్క రీతిగా లేవు. అయినను మనమందఱము మనుష్యులమే ఈమనుష్యత్వ మెక్కడనో నాకుఁ గనుపించుట లేదు దానివిడఁదీసి చూడనున్న నాకు గోచరించుట లేదు పురుషుఁడో స్త్రీయో, నల్లనివాఁడో తెల్లనివాఁడో, యిట్టిభేదము లన్నియు నుండఁగా వీనికన్నిటికి సామాన్యమైన యామానవత్వ మెక్కడనున్నదో పట్టుకొంద మని, చూతమని, గ్రహింత మని, ప్రత్యక్షము చేసి కొంద మని, ప్రయత్నించినప్పుడు నాకుఁ గానరాకున్నది అది మనోబుద్ధీంద్రియాగోచరమై యున్నది అయినప్పటికి నదియున్న దని ధ్రువముగా నాకుఁ దెలియును. ఇక్కడ నన్నిటిలో ధ్రువమయిన విషయమే యందఱకు సమానమైన మనుష్యత్వము కాని యదినాకుఁ గనుపింపదు ఇదియే భగవంతుఁడు. "ఆతనియందే మనము నివసించుచున్నాము. సంచరించుచున్నాము బ్రతుకుచున్నాము" మనయునికియు మనమనికియు నాతనియందే యాతనిమూలముననే వానిమూలముననే స్త్రీనిగాని పురుషుని గాని చూడఁగలుగుచున్నాము. కాని వానినిబట్టుకొని నిరూపింతమన్న నెక్కఁడను గనుపింపఁడు. ఏలయన; నది యింద్రియాగోచరము. కాని దానియందే ప్రతివస్తువును గలదని మనమెఱుఁ

గుదుము సర్వలోకసామాన్యమయిన యేకమతముకూడ నిటు వంటిదే అదియును శాశ్వతముగా నుండి తీరవలెను "ఈమ త్యము లన్నిటియందు నున్నసూత్రమును నేను" ప్రతిమత్యము నొకొక్కకమతశాఖ. మతములన్నియు మత్యములు భగవం తుఁడు వానియందలిసూత్రము ఈవిషయమును చాలమంది యెఱుఁగరు కాని వారందఱు దానియందును దానిమూలము నను బనిచేయుచున్నారు ఒకనిమిషమైనను వారు దానిని విడిచి యుండఁజాలరు దానియందే కాని యేపని చేయుటయు నశ క్యముగానిదాని నిట్టిదని నిరూపింపఁజాలము అదియే భగ వంతుఁడు భేదమం దైక్యము ప్రపంచముయొక్క రహస్యము మనమందఱము మనుష్యులమై యందఱమును భేదముగలిగి యున్నట్టే మనుష్యధర్మమునుబట్టి నేను నీవు నొక్కటే యైనను నేనొకడననునపుడు నీకంటె భిన్నుఁడను నీవు పురుషుఁడవై స్త్రీకంటె భిన్నుఁడవగుచున్నావు మనుష్యులు జంతువులకంటె భిన్నమైనను స్త్రీయును, పురుషుఁడును, జంతువును, మొక్కలును నన్నియు నొక్కటియే. ఉనికి చెప్పినప్పుడును మనమును సర్వ ప్రపంచమునొక్కటియే ఆయునికియే కేవల మేకపదార్థమగు భగవంతుఁడు అతనియందు మన మందఱమొక్కటే కాని పరి ణామవిజృంభణమం దీభేదము లుండి తీరవలెను మన పని యందును వ్యక్తమయ్యెడు పనులయందును యీభేదము లుండితీరవలెను సర్వసమ్మతమైన మతమన్నప్పు డందఱు నొక్క సిద్ధాంతము నమ్ముటయనియంటి రేని యది యశక్యము. అందఱ ముఖము లొక్కరీతినుండవలెననునట్లే యసంభవము. లోకమం

చటకు నొకే పురాణము లుండవలెనన్న నదియును దుర్ఘటమే. అందఱ కొక్కకర్మకాండయుండవలెనన్న నదియు నశక్యమే. అట్టికాలము వచ్చినప్పుడు ప్రపంచమంతయు నాశనముగును. ఏమన; జీవనమునకు భేదము ప్రధానము. మన కీదేహము లెక్లేర్పాటుకాఁబడినవి భేదమూలమున సర్వసమత్వమే నాశనము వ్యాప్తము ధర్మముగాఁగలిగిన యీగదియందలి యుష్ణమంతయు వ్యాపించిపోయిన నిఁక యుష్ణమే యుండదు గదా. ప్రపంచమందుఁ జలనమున కాధారమేమి' సమత్వరహితత్వమే అట్టి సమత్వము ప్రపంచనాశమందుఁగాని కలుగదు అట్టివెన్నఁడును కోసఁగదు అంతియఁగాక, యది యపాయకరము కూడ నగును మనమంగఱ మొక్కరీతినే యాలోచింపవలెనని కోరరాదు అప్పు డాలోచించుట కాలోచనయే యుండదు వస్తుప్రదర్శనశాలయందొక దానివంక నొకటి నిర్ఘాంతపడి చూచుచుండెడియీజిప్టుదేశపు మమ్మీబొమ్మలవలె నందఱము సమానముగా నుందుము ఈబుద్ధిభేదాలోచనాభేదములే మన యభివృద్ధికి నాలోచనమునకు నాధారములు అట్టిభేద మెప్పుడును గావలెను.

ఇఁక సర్వజనసమ్మత మైన మత మన నాయభిప్రాయ మేమంటిరేని, సర్వజనులకు నొకేశాస్త్రమనియు నొకేపురాణ మనియు నొకే కర్మకాండ మనియు నా తాత్పర్యము కాదు ఈయద్భుతములయిన చిక్కు లన్నియును నుండవలెననియే నాయభిప్రాయము. మరలలో మరలున్నట్లు ప్రపంచమం దాభేదము లన్నియు నుండవలెను. మనము చేయఁగలిగిన దేమి? చక్రము

లకుఁ జమురుపూసి రాపిడి తగ్గించి మరలు బెట్టులేకుండ సరళముగా జరగిపోవునట్లు చేయఁగలము ఎట్లు? భేదము నంగీకరించి, స్వభావముచేతనే మన మైక్యము నంగీకరించినట్లుగానే, భేదమునుగూడ నట్లంగీకరింపవలెను సత్యము ననేకవిధములుగాఁ దెలుపవచ్చును ప్రతివిధమును సత్యమే ఒకేవస్తువు ననేకసందర్భములయం దనేకవిధములుగాఁ జూతుము చూచినప్పటికిని వస్తువదియే. ఇందు కుదాహరణముగా సూర్యుని దీసికొనుఁడు సూర్యుఁ డుదయించి నప్పు డొకపెద్దచెండువలెఁ గాన్పించును ఒకఁడొకప్రతిమను ముద్రించుపెట్టెను దీసికొని సూర్యుని జేర బయలుదేఱి ప్రతి వేయి మైళ్లదూరమునకును సూర్యునిబింబమును దీసికొనుచుండినఁ బ్రతిచోటను బింబము వేఱుగా నుండును అతఁడు మరల వచ్చినప్పుడు సూర్యుని బింబములు వేలకొలఁది దెచ్చును ఒకదానిఁ బోలియొక్కటి యుండదు కాని యీబింబము లన్నియు నొక్కసూర్యునివే యని మనమెఱుఁగుదుము అట్లే భగవంతుని విషయమును కొద్దిదైనను గొప్పదైనను ఎక్కువశాస్త్రమైనను దక్కువశాస్త్రమైనను గొప్ప నిబంధనమయినను గొంచెపు నిబంధనములయినను, నది నాగరికమైన పురాణముల మూలమున నయినను మిక్కిలి మోటుపురాణములమూలమున నైనను, ప్రతిశాఖ, ప్రతియాత్మ, ప్రతిమతమునుగూడఁ దెలిసియో దెలియకయో భగవంతునిఁ జేరుటకుఁ బ్రయత్నించుచున్నవి ప్రతిచోటను భగవంతుఁడే కనఁబడుచున్నాఁడు గాని మఱియొకటి కాదు. మన మందఱముఁ దలకొకపాత్రమును దీసికొని యొక తటాకమునుండి నీటిని దెచ్చుట కేగినప్పు డొకఁడు గిన్నెను,

మఱియొకఁడు కూజాను, నింకొక్కఁడు జాడీని దీసికొనిపోయిన పక్షమందు మనము నీరుముంచిన తరువాత యేపాత్రలోని నీరాపాత్రాకారమును దాల్చియుండును గిన్నెఁ దెచ్చినవానికి గిన్నెయాకారమున నీరుండును జాడీ దెచ్చినవానికి జాడీరూపమున నీరుండును కాని ప్రతివాని కడ నున్నదియు నీరే కాని మఱియొకటి కాదు అట్లే మతవిషయమున మనమనస్సు లీకుండలవంటివి మనమందఱమును భగవంతుని జూచుచున్నాము భగవంతుఁడే కుండలనింపెడు నీటివంటివాఁడు ప్రతిపాత్రయందు నాపాత్రాకారముగా భగవంతుని రూపను కనఁబడును కాని యతఁడొక్కఁడే ప్రత్యంశమునందును నతఁడు భగవంతుఁడే మనకు సాధ్యమయిన యంగీకార మిట్టిది

శాస్త్రరీతిగా నింతవఱకంతయు సరియే కాని దాని నాచరించుటకు మార్గ మేమయినఁ గలదా ఈపలువిధము లయిన మార్గము లన్నియు నిజమన్నసంగతి యిదివఱకుఁ జాల పూర్వకాలమున నంగీకరింపఁబడిన విషయమే ఇండియాయందును, అలగ్జాండ్రియాయందును, చైనాయందును, జపానునందును, తిబెట్టునందును, మొన్న మొన్నను అమెరికాయందును నింకను బలుదేశములయందు నీపోట్లాట మాన్పించి యందఱకొక్కమతమును గల్పించుట కనేక ప్రయత్నములు జరగినవి నిరర్థకములయినవి ఎందుచేత? ఆచరణమార్గము లేనందుచేతనే అన్ని మతములును వాస్తవమతము లని యంగీకరించిరి గాని యన్నియు యథాప్రకార ముండఁగా వాని నన్నిఁటిని సమావేశపఱచుటకు మార్గ మేమియుఁ గానరాదయ్యె ఏమతముయొక్క పృథక్త్వ

మును జెడఁగొట్టక ప్రతిమతమునకును సామాన్యమైన, యైక్య స్థానము నొకదానిని గనఁబఱచెడు మార్గ మేదో యొకటి కనఁబఱచిన నాచరణీయ మగును ఇంతవఱకు వాడుకలోనికి వచ్చిన మార్గములన్నియు నీభేదములన్నిఁటిని బాటించు నుద్దేశముతోఁ బ్రారంభ మయినను దుద కాచరణమందుఁ గొన్ని సిద్ధాంతములు మట్టుకు వచ్చినందునఁ గొనసాగక యింకొకశాఖ యేర్పాటయి కలహములు పెరుగుచువచ్చినవి. నామట్టుకు నేనొక చిన్నపద్ధతిఁ జెప్పుచున్నాను అదియునుగొనసాగునో లేదో తెలియదు కాని దానిని జర్చించుటకు మీకు నివేదించుచున్నాను నాపద్ధతి యేమంటిరేని వినవలయు మొట్టమొదటఁ బ్రజలందఱు "నాశనము చేయకుఁడు" అను సూత్రము నంగీకరింపవలెను విగ్రహనాశకులగు సంస్కారులు ప్రపంచమునకు మేలు చేయఁజాలరు దేనినిగాని పాడుచేయ రాదు సృష్టింపవచ్చును. చేతనైనచో, సహాయముచేయవలెను లేకున్నఁ జేతులు ముడుచుకొని యేమి జరగునో చూచుచు నూరకుండవలెను సాయముచేయలేకున్నఁ హానిచేయకుఁడు కాఁబట్టి పాడుచేయకుఁడు ఎవ్వరి నమ్మకము గాని వారు కపటములేకయున్నంతవఱకుఁ జెడఁగొట్టకుఁడు ఏస్థితిలో నున్నవాని నందుండనిచ్చి యక్కడనుండియొక మెట్టువాని నెక్కింపుఁడు. భగవంతుఁడు కేంద్ర మనియు మనమందఱము పరిధికడనుండి కేంద్రమునకుఁ గొనిపోవు రేఖలమీఁదఁ బ్రయాణముఁ జేయుచున్నా మనియుఁ జెప్పుసిద్ధాంతము వాస్తవమయినయెడల, నీరేఖలన్నియుఁ గలసికొనెడు కేంద్రస్థానమందన్ని భేదములునుమాని, యేకత్వము సంప్రాప్తమగుటయు,నంతవఱకు భేదముండుటయు,విధాయకముగదా. ఈ రేఖలన్నియుఁ

గేంద్రమందుఁగలసియేతీరవలెనుగదా. ఒకఁడొకరేఖమీఁదను, మఱియొకఁడుమఱియొకరేఖమీఁదను,నడచుచున్నారము ఆమార్గములనేమనలమందునకొక్క త్రోవ త్రోసిరా "నదీనాం సాగరోగతిః "యన్నట్లు కేంద్రమును జేరుదుము. కావున నున్నదానిని జెఱుపరాదు ప్రతివానిఁ జాఁగును దనస్వభావము ప్రకారము వృద్ధిఁ జెందుచున్నాఁడు ప్రతిస్వభావమును సత్యమును జేరితీరును. మనుష్యులు తమకుఁదామే గురువులుగా నుండవలెను నేనును, మీరును నేమిచేయఁగలము ఒక్క పిల్లవానికయినను మనము బోధచేయఁగలమా. బోధింపఁజాలము బాలుని కాబాలుఁడే గురువు ఆటంకములను తొలఁగించుటనీకువిధి ఒకమొక్క పెరుగుచున్నదిగదా, నీ వామొక్క నెదిగించఁగలవా? చుట్టును గంచె వేసి యేజంతువును దినివేయకుండ జాగ్రత్తపెట్టు భారము నీది. అంతటితో నీపని తీరుచున్నది మొక్క దానియంతట నది యెదుగవలెను, ఆధ్యాత్మికవిషయమును నొక్కరు నీకు బోధించువారు లేరు నిన్నొకరు పరమార్థజ్ఞానినిగాఁ జేయఁజాలరు నీకునీ వేయుపదేష్టవు కావలెను వృద్ధినీలోపలనుండికలుగవలెను పైనున్న గురువేమి చేయఁగలఁడు ఆటంకములను గొంచెము తొలఁగింపఁగలఁడు అంతటితో నతనిపని దీరును. కావునఁ జేతనయినయెడల సాయముచేయుము. లేకున్న నూఱకుండుముగాని హానిచేయకుము నీవు మనుష్యులను బరమార్థులనుగాఁ జేయఁగలుగుదు ననుటనువిడిచిపెట్టుము. అదియసంభవము నీయాత్మకంటె నీకు వేఱుగురువు లేఁడు. దీని నంగీకరింపుము 'సంఘమందు మానవకోటియొక్క స్వభావమందనేకభేదములుగలవు మనుష్యలబుద్ధులయందును ధోరణులయందు ననేక వేలభేదములు గలవు

వాని నన్నిటి నొక్కసమానాధికరణములోనికిఁ దెచ్చుట యసాధ్యము గాన వానిని నాలుగు భాగములుగాఁ జేసినాను అందు మొదట కర్మిష్ఠి. ఆతఁడు కర్మల నాచరింపఁగోరును అత్యధికమైన భుజబలమును ధాతుపుష్టి నపేక్షించును. ఆతఁడు సదా పనిచేసి వైద్యశాలలు కట్టించుట, నూతులు గట్టించుట, ధర్మకార్యములు చేయుట లోనగు వివిధము లయిన పనులను జేయును భక్తిపారవశ్యముగలవాఁడు రెండవవాఁడు ఆతఁడుత్కృష్టమై సౌందర్యమున కాకరమయిన ప్రతివస్తువును బ్రేమించును ఆతఁడెప్పుడు సృష్టియందలి సౌమ్యపదార్థములను గూర్చి చింతించుచు భగవంతుని కరుణ లోనగువానిని దలంచుచుండును ఆతఁడు భగవంతుని యవతారములగు నాపూర్వపు మహాపురుషులయెడ భక్తిఁ గలుపును క్రీస్తుపుట్టుటయు, బుద్ధుఁడుంటయు సహేతుకములా, కానా, యనుదానిగో నతనికిఁబనిలేదు కొండమీఁదఁ గ్రీస్తుబోధ యేవాఁడు గావించెనో క్రీస్తుపుట్టిన సరియైన దిన మెద్దియో వాని కక్కఱలేదు అతనికిఁ గావలసినదెల్ల వారి మూర్తిమత్త్వమే తనయెదుటఁ దోఁచెడు భావమే వారు వారుండిరా లేరా యను విషయమును రుజువుచేయుటతోఁగాని చేయలేకపోవుటతోఁ గాని యాతనికిఁ బనిలేదు. అట్టివాఁడు భక్తుఁడు. రాజయోగి మూఁడవవాఁడు అతఁడు మనుష్యుని మన స్సెట్లు వర్తించునో, దానియందే యేశక్తులు పనిచేయునో తెలిసికొని, యాత్మ, మనశ్శాస్త్రమును నేర్చుకొని, దానిని స్వాధీనపఱచుకొనఁ గోరును ఇతఁడు రాజయోగి కడపటివాఁడు తత్త్వశాస్త్రజ్ఞుఁడు ఇతఁడు ప్రతివిషయమును జర్చించి తన బుద్ధిబలముచేత శాస్త్రమునుగూడ నతిక్రమింపఁగోరును.

మానవజాతి కంతకును దృష్టి నొసఁగెడు మత మీమాంస భేద ములగు మనస్సులన్నింటికిని జాలినంతయుపహారము నీయఁగలిగి యుండవలెను ఇది లేనందున మతములన్నియు సంపూర్ణము లయి యొక్కొక్క మార్గమునుమాత్రము కనఁబఱచునవియై యున్నవి ఒకమతము భక్తినిదెల్పు నను అది గానము, రోదనము, భక్తిలోనగువాని నన్నిటిని జక్కఁగాఁ దెల్పును కాని యొక్కఁడువచ్చి "ఇవియన్నియు సరియే కాని నాకుఁ గొంచెము తర్కమును శాస్త్రమును గావలెను నేను వస్తుతత్త్వ మును గ్రమక్రమముగాఁ దెలిసికొనఁగోరితిని" అని యడిగిన వానిని దఱిమివేయుటయేగాక వాని నధోగతిపాలు చేయఁజూ తురు దీని కర్థమేమి, ఆమత మట్టి భక్తులకే కాని యితరులకు సహకారి కాదనుట వీరుఇతరులకు సాయమొనరింపఁజాలకపోవు టయేగాక, మిక్కిలి ఘోరముగా నితరులను బాధుచేయుదురు వారు నిష్కపటులైనను వారిని నమ్మరు వారి నెంతత్వరలో వదల్చుకొనిన నంత మేలుగని యెంతురు ఈప్రకారముగా సర్వము నిష్ప్రయోజన మగును ఇఁకనీవు తత్త్వశాస్త్రజ్ఞులతోఁ జర్చసేయుచుఁ బెద్దపెద్దమాటలు ప్రయోగించు చున్నప్పుడు, నీవు వారికడకుఁబోయి "అయ్యా నాకుఁబరమార్థసాధన మేదైన సెలవిచ్చెదరా" యనిన, వారు పరిహాసముతో "నీకుఁ దర్క మేమియును రాదు నీకుఁ బరమార్థమేమి తెలియు" నందురు ఈ గొప్ప తత్త్వశాస్త్రజ్ఞులు నీకు దారి చూపువారు కారు ఇఁక మనశ్శక్తినిగూర్చియు, స్థూలసూక్ష్మాదిశరీరములను గూర్చియు, ముచ్చటించు రాజయోగులకడ కేఁగి "నేను జేయఁగలిగిన పుణ్య కార్య మేదైన సెలవీయుఁడు మీవంటి తంత్రములు నాకుఁ

తెలియవు. నాకుఁ దగిన దేశయిన సెలవిత్తురా" యన, వారు నవ్వి, "ఈ బుద్ధిహీనుని జూడుఁడు. వీఁడెవ్వఁడు? వీనికిఁ జెప్పఁ దగిన దెల్ల గొంతుక కోసికొ మ్మనుటయే మఱియు వానితో నీజీవనము వృథా"యని చెప్పుదురు. ప్రపంచ మీరీతిగానున్నది. ఒకొక్క మతమందును, అతిభక్తి, పట్టుదల గల యొకొక్కనినిఁ బట్టి వీరి నందఱను నొక్కగదియందుఁ బెట్టి, వీరొకరినొకరు జూచి నవ్వుకొనునప్పుడు బొమ్మదీసిన బాగుండునని తోఁచుచున్నది

ప్రస్తుత మున్నస్థితి యిట్టిది. నే నిప్పుడు చెప్పఁబోవునది జనుల కందఱకు సమానముగా రుచింపఁగల మతము అందుఁ దత్త్వమును, భక్తియు, యోగమును, గర్మయు, సమానముగా నుండవలెను కళాశాలల నుంచి, అందు శాస్త్రజ్ఞులు, పదార్థ తత్త్వశాస్త్రజ్ఞులు మొదలగు గురువులు కావలసినంత మంది యుండవలెను. వారు నొక్కస్థానముఁ జేరినతరువాత నింతకు ముందు పోవద్దందురు. ఇది వారి మూఢభక్తి "ఈభగవంతుఁడు, ముక్తి, లోనగునవి యన్నియు మూఢభక్తి, వీనినివిడువుఁడు" అనిన "ఓతత్త్వశాస్త్రజ్ఞా!(ఫిలాసఫరుగారూ!) ఈశరీర మంతకంటెను మూఢవిశ్వాసము మీరు దీనిని విడిచిపెట్టుఁడు; ఇంటికిఁ బోవద్దు మీరు పారము చెప్ప కుర్చీలోనికిఁ బోవద్దు. శరీరమును విడువఁగలిగితిరా విడువుఁడు. లేదా మాటలాడక కూర్చుండుఁడు" అని నేను జెప్పుదును.

మతమందాభాగము నుండవలెను ఈప్రపంచ మంతయు నొక్కటే యనియు లోకము నెల్ల నొక్కజీవనమే గలదనియుఁ జెప్పెడు తత్త్వశాస్త్రము ననుభూతికిఁ దెచ్చుకొనుట యెట్లో

మనము చూపింపఁగలిగి యుండవలెను అట్లే రాజయోగి వచ్చిన యెడల మనశ్శాస్త్రమును విప్పి చెప్పవలెను ఇదిగో, రమ్ము. రహస్యమేమియు లేదు అని చేసిచూపింపవలెను. భక్తులువచ్చిన యెడల వారితోఁగలిసి భజనచేసి భగవన్నామస్మరణపారవశ్యముచే మత్తెక్కినవారము కావలెను కర్మయోగి వచ్చెనా,వానితోఁగలిసి యావచ్ఛక్తిని బనిచేయవలెను ఇట్టిభేదములన్నియు పరస్పరవిరుద్ధములు గాకుండ మనుష్యుల మనస్సులందుఁగల్పించునటుల భగవంతుఁ డనుగ్రహించుఁగాక. ఇందేదయిన నొకటి రెండుమాత్ర మున్నయెడల మనుష్యుఁడుపరిపూర్ణుఁడు కాఁడని నాతాత్పర్యము. అందుచేత నీప్రపంచమందుఁ జాలమంది తమ కలవాటుపడిన యొకమార్గమునువిడిచి రెండవదారినిఁ బోయి యాపదపా లగుచున్నారు మనుష్యు లీనాల్గింటయందు సమానునిగాఁ జేయుటకై పాటుపడుటయే నామతము దానికే హిందూదేశమందు "యోగ" మనిపేరు యోగమనఁగా భగవంతునికిని మనుష్యునికిని గూడిక, జీవాత్మకునుబరమాత్మకును గూడిక, కర్మయోగప్రకారము మనుష్యునకు మానవకోటి కంతకునుగూడిక, భక్తునిప్రకారముభగవంతునితో నైక్యము, తత్త్వజ్ఞానికి సర్వలోకైక్యము, యోగ మనఁగా నిది వీనికి సంస్కృతమందు నాల్గింటికి నాలుగు పేళ్లుగలవు. ఇట్టియైక్యమునకై పనిచేయువాఁడు కర్మయోగి, భక్తిసల్పువాఁడు భక్తియోగి, తంత్రవేత్తజ్ఞానయోగి. ఈప్రకారముగా రాజయోగి, తత్త్వవేత్త యోగమందు నాలుగుభాగములు గలవు

నేను ప్రథమమున రాజయోగమును దీసికొందును. మనస్సును వశపఱచుకొనెడు నీరాజయోగ మనసేమి? ఈదేశ

మందు యోగమనిన నన్నివిధములగు పిశాచపుటూహలను గలుపుచున్నారు. కనుక, మొట్టమొదట యోగమున కట్టి వానితో నేమియు సంబంధము లేదని తెలిపి మఱియు నుపక్రమింపవలసి యున్నది ఏయోగముగాని హేతురహితముగా నుండదు ఏయోగమును నీబుద్ధి నెట్టివారయినను సరే గురువుల కర్పితము చేయుమని చెప్పదు. ఎవరో దేవదూతకు నీవు నమ్రుఁడవు కావలయునని యేయోగమును దెల్పదు ప్రతి యోగమును నీబుద్ధిని గట్టిగా వినియోగింపుమనియు, బుద్ధి ననుసరింపుమనియుననియే చెప్పును ప్రతివారియందును మూఁడు జ్ఞానసాధనములు గలవు అందు మొదటిది పశుపక్ష్యాదులలోను గొంతవఱకు మనుష్యులలోను నుండెడు సహజజ్ఞానము ఇది, జ్ఞానములలో నెల్ల నధమమయినది రెండవజ్ఞానసాధనము తార్కికసంపత్తి అది మనుష్యులందు విశేషముగా నుండును. సహజజ్ఞానము సంపూర్ణము కాదు కావున, జంతువుల పనులు మిక్కిలి యల్పములై యంకనకుమాత్రమే యాజ్ఞానము వినియోగించును. అది మనుష్యునందుఁ దార్కికజ్ఞానముగాఁ బరిణమించును ఇక్కడ విరివి యెక్కువయినదిగాని యిదియు నింకఁ గొఱంతగానే యున్నది అదియును గొంతదూరముమాత్రము పోయి యచ్చట నిలుచును అక్కడ నది యింకఁబోలేనని మనకుఁజెప్పును మనమింకను ముందునకుఁ బోవుదమంటిమా కలవరముగాని వేతేమియు లేదు అక్కడ హేతువే లేదు. హేతుశూన్యమగును. తర్కమంతయు మొదటికి వచ్చును. ఇందుకు నుదాహరణముగా మనకు విషయమూలములగు పదార్థము శక్తిని దీసికొందుము పదార్థమన నేమి. శక్తి దేని మీఁదఁ బనిచేయునో యది. ఇఁక శక్తి యననేమి పదార్థము

మీఁదఁ బనిచేయునది. తార్కికుల డోలికావలన మనేడి పరస్పరాధారవాదమందలి చిక్కును జూచితిరా? పోనుపోను దర్కమున కొక్కగోడ యడ్డువచ్చును అది దాఁటి బుద్ధిపోనేరదు కాని యావలనున్న యనంతమును బొందఁగోరును. ఈ మన ప్రపంచమును మన యింద్రియగోచరమగు విశ్వమంతయు నాయనంత బ్రహ్మాండములలో వ్యక్తమైనయొక్క లేశమాత్రములు మనబుద్ధి మనకు వ్యక్తమయిన యీయల్పావరణమందు మాత్రముపనిచేయును గాని యావలఁజనఁజాలదు అందునకుగాను మనల నావలకుఁ గొనిపోవుటకు మఱియొక సాధనము కావలెను అది యావేశజ్ఞానము దైవజ్ఞానము. ఇట్లు జ్ఞానము సహజము, తార్కికము, దివ్యము నని మూఁడు విధములు. మొదటిది జంతువులకును, రెండవది మనుజులకును, మూఁడవది, దైవజ్ఞులకు నుండును కాని మానవకోటియందుఁ బ్రతివారియందును గూడ నీమూఁడింటియొక్క యంకురములు నుండును అవి వృద్ధికావలెను. కానియవియుండియున్నవి. ఇంకొక్క విషయము మనముజ్ఞప్తియందుంచుకొనవలెను అదియొక దానిని పట్టి యొకటి కలిగినవి గాని పరస్పరవిరుద్ధములు గావు ఆవేశజ్ఞానము తార్కికమును బట్టి కలుగునది. కాని దానితో విరోధించునదిగాదు వార్ధక్యము బాల్యముయొక్కయంత్యావస్థగాని దానికి విరుద్ధము గాదుగదా అయినవొక్కఁడుపాయము దటస్థించుచున్నది పలుమాఱుసహజజ్ఞానమునావేశముగాఁ బ్రపంచమునందుఁ గనఁబఱుపఁబడినందున లేనిపోని యధికారములు బయలుదేఱుచు వచ్చినవి తెలివితక్కువవారును సగము పిచ్చివారును దమకుఁగలిగినయాలోచనలన్నియు నావే

శకములేయనుకొని వానినన్నిటిని జనులవలంబింపవలెననికోరుదురు. ఇట్టి పిచ్చితలంపులన్నియు నావేశకములక్రింద మాటి ప్రపంచమం దనేకవిపరీతము లయినట్టియుఁ బరస్పరవిరుద్ధము లయినట్టియు వివేకరహితమగు నిరర్థకప్రసంగములు వ్యాప్తమయినవి.

బుద్ధికి వ్యతిరేకముగా నుండకపోవుట మొదటి ప్రమాణము. యోగములన్నిటికిని నదె మూలాధారము. మానసిక యోగ మగు రాజయోగముఁ దీసికొందము అదియొక పెద్ద విషయము గనుక యందలి ప్రధానాంశమును మాత్రము చూపింతును. మనకుఁగల జ్ఞాన మంతటియందు నొకవిధమయిన పద్ధతిగలదు అత్యల్పులు మొద లతిఘనులవఱకునుబురుపు మొదలు యోగివఱకు నాపద్ధతినే గమనింపవలెను. అదియే జాగ్రత. తదేకనిష్ఠ తనయౌషధశాలయందుఁ బనిచేయు రసవాదశాస్త్రజ్ఞుఁడు తాను మనస్సునంతను దదేకనిష్ఠగా లీనముచేసి భూతములందు వినియోగించును గనుక యవియన్నియు విడివిపోయి యతనికి జ్ఞానము గలుగును అట్లే ఖగోళశాస్త్రజ్ఞుఁడు తనబుద్ధినేకాగ్రముగా దుర్భిణియందుఁ బ్రయోగించును గావున నక్షత్రకుటుంబములు తమ రహస్యము నాతనికివెల్లడిచేయును అట్లే ప్రతివారివిషయమునను గురుపీఠమునను స్తగురువులవిషయమునను బుస్తకము చేతఁబట్టిన శిష్యుని విషయమునను నిట్లు జరుగును. ఇపుడు మీరు నన్ను వినుచున్నారుగదా. నామాటలు మీకు రుచియించిన మీమనస్సు వానియందు లీనమగును. అప్పు డిక్కడ గడియారము కొట్టినను, మఱేమిజరిగినను మీకు వినిపించదు. మీరు మనస్సును లీనము చేసినకొలఁది నేను

జెప్పినదానిని మీరు బాగుగా గ్రహింపఁగలుగుదురు నాబుద్ధి
శక్తులను నేనెంత లీనము జేసిఁజెప్పఁదలఁచికొన్న విషయము
నంత బాగుగాఁ జెప్పఁగలుగుదును మనస్సునకీశక్తి యెంత
యెక్కువగా నుండినసంతజ్ఞానము నది సంపాదింపఁగలదు జ్ఞాన
సంపాదనమున కిదియే ప్రధానమైన పద్ధతిగదా జోళ్లకు రంగు
వేయువానికి నిష్ఠయెక్కువయున్నచో వాఁడురంగు బాగుగా వే
యును వంటలవాని కున్న వంట బాగుగాఁ జేయును ధనార్జన
మందుఁగాని దైవపూజనమందుఁ గాని శ్రద్ధ యెక్కువ యున్న
కొలఁదిని గార్యము బాగుగ జరుగును. ప్రకృతిభవనముయొక్క
తలుపులను దెఱచి యందలి రహస్యములను వెల్లడిచేయుసాధన
మీశ్రద్ధయే ఆధ్యాత్మముల కిదియొక్కటియే బీగము రాజయో
గము చాలభాగము దీనింగూర్చి చెప్పును మనప్రస్తుతశరీరావస్థ
యందు మనస్సు పరిపరివిధములఁ బలుదిక్కులకుఁ జెదరియనేక
వేలవస్తువులమీఁదికిఁ బోవుచుండును ఏదైన నొకవిషయము
మీఁద మనస్సును బ్రయోగించి తలఁపు నిలిపి జ్ఞానము సంపా
దింతునంటినా వేనవేలాలోచనలు కలిగి మనస్సును గలఁచి
వేయును అట్టిదానిని లోఁబఱచుకొని స్వాధీనపఱచుకొనుటకు
మార్గమును దెలుపుటయే రాజయోగమందలి విషయము
పిమ్మటఁ గర్మయోగమును విచారింతము సంఘము ప్రత్యేక
మాలోచనలతో నూరకుండలేక యేదో యొకపని ప్రత్యక్ష
ముగాఁ జేయుచుండినఁ గాని తనివినొందక కర్మనిరతులగువా
రనేకు లుండుట మన మెఱుఁగుదుము దానికిఁ గూడ నొక
శాస్త్రము కావలెను. మనమందఱమును గర్మ నాచరించు
చున్నాము గాని కర్మరహస్య మెఱుఁగకమనశక్తిని జాలభాగము

వ్యర్థముగా వ్యయము చేయుచున్నాము ఎక్కడఁ బనిచేయవలెను? ఎట్లు చేయవలెననునదియే రహస్యము మనకుఁగల పనియందు మనశ్శక్తినంతను వినియోగపఱచుటెట్లు? దీనితో నింకొక్క యడ్డంకి కలుగును పనికి బాధకరము దుఃఖమును బాధయును రాగమునుండి కలుగును నేను బనిచేయఁ గోరుదును అట్టియుపకారమును బొందినవారిలో నూటి కొక్కఁడు నాకుఁ గృతఘ్నుఁడై వ్యతిరేకియైనయెడల నది నాకు బాధకరముగా నుండును. అందుమూలమున మనుష్యులు పనిచేయుట మానుదురు. ఈభయమును దుఃఖమును మానవకోటియొక్క విశేషమైన పుణ్యకర్మను, శక్తిని, వ్యర్థము చేయును అట్టివిషయమునఁ గర్మయోగము నిష్కామకర్మయై యెవరికుపకారముఁ జేయుచున్నామో యేలజేయుచున్నామో? యను విచారము లేక, కర్మకొఱకే కర్మనాచరించు మార్గము నుపదేశించును. కర్మయోగి కర్మనాచరించుట మంచిది గనుకయుఁ, దనకు స్వభావము గనుకయుఁగర్మ చేయును గాని యాతనికి వేఱొకయుద్దేశము లేదు ఈతఁ డెప్పుడును దాతగానుండును, గాని ప్రతిగ్రహీత కాఁడు అతఁడు దానిచ్చునట్టిఁగును గాని దానికిఁ బ్రతిఫలము నపేక్షింపఁడు కావున నాతనికి దుఃఖము లేదు రాగమునకుఁ బ్రతిక్రియగా వచ్చునదియే దుఃఖము పిమ్మట భక్తులకు భక్తియోగము గలదు భక్తునికి భగవద్భక్తి, పూజ, పుష్పములు, ధూపమును, నందమయిన యాలయములు ప్రతిమలు లోనగునవి కావలెను. అవియన్నియు దప్పులనియా నీతాత్పర్యము? నేనొక్కసంగతి చెప్పుచున్నాను గొప్ప యాత్మజ్ఞులు, పురాణములును, బ్రతిమారాధనకర్మలును, విశేషముగా నున్నమతములనుండి బయలుదేఱిరనియీ దేశమందలి (ఇంగ్లాం

డు) మీరుజ్ఞాపకముంచుకొనుఁడు ప్రతిమాచారరహితముగా దైవపూజనము గావింపఁగోరువారు నిష్కరుణులై సుంవరము లగు ప్రతిదానిని బాడుచేయుచు వచ్చిరి. వారి మతము వట్టి మూఢమతము గాని మఱియొకటి గాదు ఇంహునకుఁ బ్రపంచముయొక్క చరిత్రమే ప్రబలసాక్ష్యము. కావున నీకర్మలను బురాణములను నిందింపకుఁడు. జనులు వానిని బెట్టుకొందురు గాక కావలసినవా రామార్గములఁ బోవుదురు గాక. "వారు బుద్ధిహీనులు. వారి కవి యుండుఁగాక" యని పరిహసింపను గూడదు. నేను జూచినవారిలో సత్యధికులీమార్గమునుండియే వచ్చినారు. నే నట్టివారి పాదములకడ నిలుచుండుటకైన నర్హుఁడనుగాను నేనా వారిని విమర్శించుట? దేనిని గ్రహింపవలెనో దేనిని ద్యజింపవలెనో, యీయభిప్రాయము లెట్లు పనిచేయునో నేనెఱుఁగుదు. మనములోకమందలి ప్రతివిషయమును నిందింతుము కావున నెవరికిఁ గావలసినది వారికుండనిండు నీ సత్యనిర్వచనమున కీభక్తులెవరునులక్ష్యపెట్టరు వారికి భగవంతుఁ డొక్కఁడే సత్యము వా రాతనిని జూతురు విందురు ప్రేమింతురు విభాగజ్ఞానముతో వారికి నిమిత్తము లేదు. సుందర మైన విగ్రహమును జూచి దాని దేనితోఁ జేసినారో చూత మని దానిని పగులగొట్టుకారణవాదివారికి మూర్ఖుఁడుగాఁ గనిపించును. వారికి హరి భగవంతుఁ డుండుఁగాక భక్తియోగమువలన ఫలాపేక్ష లేక భగవంతుని ప్రేమించుట యెట్లో ఆపుణ్యమును బుణ్యమనియే గాని స్వర్గప్రాప్తికిని, సంతానముకొఱకును, భాగ్యముకును, మఱి దేనికిని గాక. ప్రేమించుట యెట్లో బోధించును భక్తికి భక్తియే పర

మప్రత్యుపకార మని బోధించును. భక్తియే భగవంతుఁ డని పూర్వసిద్ధాంతము. సృష్టికర్త, సర్వాంతర్యామి, సర్వశక్తుఁడు, ప్రభువు, తల్లి, దండ్రియు నగు నాసర్వేశ్వరునికి సమస్తమును గానుకగా నర్పింపవలెననియు, భగవంతునిఁ గూర్చి మనము తెలిసికొను మహావిషయ మతఁడు భక్తివరదుఁ డనియే యనియు భక్తియోగము దెల్పును ఎక్కడభక్తియున్న నక్కడ నాతఁ డుండును. "ఎక్కడేమాత్రమును భక్తి యొసఁగుచున్న నందు సర్వేశుఁ డాతఁ డలరుచుండు" కాంతుఁడు తన ప్రేయసిని ముద్దిడిన నాముద్దునందును, దల్లి పిల్లను ముద్దిడిన నందును స్నేహితులు పరస్పరకరగ్రహణముఁ జేసిన నందును గూడ భగవంతుఁడు భక్తిరూపుఁడై యున్నాఁడు. ఒకఘనుఁ డెవఁడైన లోకమున నుపకారము చేయఁబూనిన నందు భక్తిరూపుఁడై భగవంతుఁ డున్నాఁడు. ఎక్కడ వాత్సల్యముండునో యచట నెల్ల నాతఁ డున్నాఁడు భక్తియోగము దీనిని బోధించును

కట్టకడపటఁ దత్త్వజ్ఞుఁడగుజ్ఞానయోగికడకు వచ్చితిమి. అతనికిఁ బ్రపంచమందలి యల్పవస్తువులతోఁ దృష్టిలేదు నిత్యములయిన యన్నపానాదుల మీఱిపోవలెనని యాతనికోరిక వేయిపుస్తకముల బోధించిన నాతనికిఁ దృష్టిలేదు ఈశాస్త్రము లన్నియు నతనికిఁ దనివిసీయఁజాలవు అవిచేయునదెల్ల నీప్రపంచము నాతని ముందునీకుఁ దెచ్చుటగాని యంతకంటెఁ బ్రయోజకములు గావు. ఈగోళము లన్నియును గగనమార్గమును, నీ విశ్వమంతయుఁ దత్త్వసముద్రమందొకయణుమాత్రములుగాని వేఱుకావు సత్యముగాఁ జూచి తత్త్వహృదయమును దెలిసిన

గాని యాతని యాత్మకుఁ దృష్టిలేదు. దాని ననుభూతికిఁ దెచ్చుకొని సట్లయి విశ్వముతో నైక్యమైనగాని యాతనికిదృష్టిలేదు అట్లు తత్త్వజ్ఞునకు భగవంతుఁడు తల్లియుఁ దండ్రియు మాత్రమును, సృష్టికర్తయు రక్షకుఁడును, నియంతయు, మాత్రమే కాఁడు అతని కిఁభగవంతుఁడు ప్రాణమునకుఁ బ్రాణము ఆత్మకాత్మ భగవంతుఁడే తనయాత్మ, ఆతని కేమియును మిగులదు. నశ్వరములయిన శరీరావయవము లన్నియుఁ దనతత్త్వశాస్త్రప్రభావము ముందఱ తుడుచుకొని పోవును భగవంతుఁడొక్కఁడే మిగిలి యుండు వాఁడు

ఒక చెట్టుమీఁద రెండుపక్షు లొకటిపైన నొకటిక్రిందను, రెండుకొమ్మలమీఁద నుండెను. పైనున్నది తనప్రభావము లో మునిఁగిపోయి నిశ్చలముగాను నిశ్శబ్దముగా నుండెను. క్రిందనున్నది చేఁదుపండ్లను దియ్యనిపండ్లను దినుచు నొకకొమ్మ నుండి మఱొకకొమ్మమీఁదికి దాఁటుచు సుఖదుఃఖముల ననుభవించుచుండెను. కొంతకాలమైన తరువాత నొకనాఁడు మిక్కిలి చేఁదుపండు నొక దానిని దిని విసిగి వేసారి పైకిఁజూచి బంగారు రంగులుగల పైపక్షిని గాంచెను అది చేఁదును దినదు తీపిని దినదు కావున దానికి దుఃఖమును లేదు సుఖమును లేదు. ఎల్లప్పుడు నెమ్మదిగలిగి తనయాత్మనేగాని యన్య మెఱుఁగక, యాత్మగతమై యుండును కాని క్రిందిపక్షి యది మఱచి యా వృక్షముయొక్క చేఁదుపండ్లను, దియ్యనిపండ్లను, మఱలఁ దినే మొదలుపెట్టెను. కొంత సేపటికి మరల నొకవిషఫలము లభించెను దానికి ఖేదపడి, పైకిఁ జూచి, ముందునకు జరగి, యాపై

పక్షిని సమీపింపఁ గోరెను, గాని మరలమఱచిపోయి వెనుకటి వలెనే, దినసాగెను; తిరిగి చేఁదు నోటఁబడినప్పుడు కొంచెము పైకి వచ్చెను ఇట్లు రాఁగా రాఁగా యా పై పక్షియొక్క కాంతులు తనయందుఁ బ్రసరించి తాను గరఁగిపోయినట్లు కనుపించెను ఇంకను సమీపింపఁగా నేమియు లేకపోయి చిట్టచివరకుఁ గలరూపు తెలియవచ్చెను క్రిందిపక్షి పైపక్షియొక్క ప్రతిబింబముగాని వేఱుకాను తానే పయిపక్షి ఈమధురవిషఫల భక్షణమును, సుఖదుఃఖములు నివియన్నియు స్వప్నములు.

దుఃఖాతీతమై ప్రభాపుంజముతో నిక్కముగు పక్షి పైన నిశ్శబ్దముగా నున్నది అపైపక్షి భగవంతుఁడు ఈప్రపంచమునకుఁ బ్రభువు ఈక్రింది పక్షి మానవాత్మ, లోకమందలి సుఖదుఃఖము లనుభవించు చుండఁగా నొకవిపత్తు వచ్చును అప్పుడు కొంచెము పశ్చాత్తాపపడి యోచించినఁ గొంత జ్ఞానము కలుగును అప్పుడీప్రపంచము వృథాయని యెంచి కొంచెముముందునకుఁ బోవురు గాని యింద్రియములు మరల నాతని నాక్రమించుటం జేసి తిరిగి సుఖదుఃఖముల పాలగును. తిరిగి యింకొక గట్టియాపదతటస్థించును; అప్పుడు మరలఁ గన్నులు దెఱచును; ఈప్రకారము రాను రాను భగవంతునిసమీపించితనయాత్మ నశించుటయును, దానే భగవంతుఁ డనియుఁ గనుఁగొనును. అతఁడు బాగుగ సమీపించి నప్పుడు "ఈవిశ్వమున కంతకుఁ బ్రాణమని యెవ్వరిని గూర్చి బోధించితినో జీవునందును, సూర్యచంద్రాదులందును గూడఁ గలఁడని యెవ్వరిని గూర్చి బోధించితినో యాతఁడే ప్రాణాధారమైనవాఁడు. ఆత్మకు మూలమైనవాఁడు.

వేయేల నీవే యాతఁడు ఇదే 'తత్త్వమసి' ఇట్లని" జ్ఞానయోగము బోధించుచున్నది. మనుష్యుఁడు వాస్తవముచేత భగవంతుఁడేయని యది బోధించును అది మానవకోటికి జీవనము యొక్క యైక్యమును బోధించును. మనయందఱుము భగవంతుఁడే యని బోధించును ప్రతిపస్తువును మనకాలిక్రిందఁ బ్రాకెడు పురువు మొదలు మనమతి గౌరవముతోఁజూచు మహాత్ములవఱకందఱును గూడ నొకేభగవత్స్వరూపములని మనకుబోధించును.

మఱియు, వివిధములగు యోగములన్నియు నాచరణములోఁ బెట్టవలెను. సిద్ధాంతములమట్టుకు మొదట మనకుఁ జాలవు పిమ్మట నాలోచించవలెను చర్చింపవలెను అనుభూతికిఁ దెచ్చుకొనవలెను అట్లుగాక కేవలసిద్ధాంతములుగానుండ రాదు అది మనతో నైక్యము కావలెను మతమనఁగా స్వానుభూతియే గాని, ఉత్తమాటలు కావు. అభిప్రాయమును గాదు. వాదమును గాదు. ఇవి యంతయు వృథాలాపము లగుటంబట్టి ప్రయోజన మొసంగవు మతమనఁగా, స్వాత్మనిష్ఠయు స్వానుభూతియు నేగాని, కేవలము చెవులతో వినుటమాత్రముచేతనే తృప్తి నొందుట కాదు. అది ఉత్త మానసిక సమ్మతియును గాదు మఱియు మనము, ఏతత్త్వమును సమ్మియున్నామో ఆతత్త్వముగా మన స్వరూపము నంతయు మార్చుకొనుటయే మతమనఁబడును. ఉత్తమానసిక సమ్మతిచే నేఁటికి పలుతెఱఁగు లగు మూఢవిశ్వాసముల నంగీకరించి తేపటికే మరల మనస్సు నంతయు మార్చుకొనవచ్చును అయినప్పటికిని, ఈనిష్ఠయు, అనుభూతియు, మాత్రమే సత్యమైన మతధర్మము

ఓం తత్సత్.

# శ్రీ వివేకానందవిజయము

## లేఖాసంగ్రహము.

(శ్రీ వివేకానందస్వాములవారికి అప్పుడప్పు డితరులు వ్రాసినలేఖలకు, స్వాములవారొసంగిన ప్రతి లేఖాసంగ్రహము)

541 డియర్బార్న్ యెవెన్యూ.
3—3—1894

ప్రియమైన ................................ గారికి

నీ యభిప్రాయప్రకారము భక్తివలన ముక్తికల్గును గాని, అందువలన పురోవృద్ధికి భంగకరమైన మూఢావేశము కలుగవచ్చును జ్ఞానము మంచిదైనను, అది రసహీనమైన బుద్ధి విశేషముగఁ బరిణమింపవచ్చును భక్తిశ్రేష్ఠమైనప్పటికిని, దానివలన పెక్కు అనుమానములు జనింపవచ్చును కావున వీనికన్నిఁటికి పరస్పరము మైత్రి కావలసి యున్నది. ఈమైత్రి శ్రీరామకృష్ణపరమహంసవలనఁ గల్గును వీరిబోధములను ఆదర్శముగ నుంచికొని మనము వర్తింపవలయును అందఱును ఆమహానుభావునివంటివారు కాకపోయినప్పటికిని మనమందఱము నైకమత్యముతో నుండిన సాధింపవచ్చును

మన యభిప్రాయములు మఱొక నూతనమతమును సృష్టించునది గా నుండఁగూడదు సాంఘికవిషయములయందు సర్వసమత్వమును గాని, భిన్నత్వమును గాని బోధింపకూడదు. ఒక్కొక్కఁడును సమానాధికారముగలవాఁడనియును, అభిప్రాయములయందును, కర్మలయందును, సకలవిధముల స్వాతంత్ర్యము కల్గియుండవలయుననిమాత్రము బోధింపుఁడు

ఏమతస్థుఁడైనను ఏదేవతను బూజించువాఁడైనను తుదకు నాస్తికుఁడైనను ఏవిధమైన వర్తనకలవాఁడైనను సరియే శిష్యుఁడుగా నుండఁదగును అయినను, ఓర్పును పట్టుదలయు లేనివారు శిష్యులుగానుండుటకు అర్హులు గారు మఱియు, ఆశిష్యులవలన నితరులకు ఎంతమాత్రమును హాని గలుగఁ గూడదు

వృద్ధికి భంగకరమును, క్షీణతకుఁగారణముగ నుండునది యేదియో అది 'దుర్వృత్తి' యగును వృద్ధికిని, ఐకమత్యమునకును ఆధారమగున దేదియో అది 'సద్వృత్తి' యగును

ఎవరి కేది యర్హమో దానిని వారనుష్ఠించుటకు బాధ్యులే దీనికి దృష్టాంతము—ఒకరికి మాంసాహారము కావలయును; వేఱొకరికి శాకాహారము కావలయును; వీరు తమ కనువగుదానినే గ్రహింపవచ్చును కొందఱకు గృహస్థధర్మము నం దభిరుచియుండును కొందఱకు సన్న్యాసధర్మమునం దిష్టముండును వీరిరువురును పరస్పరము నాక్షేపింపఁ దగదు

ఒక్కొక్క జీవియు ఈశ్వరాంశసంభూతుఁడని గ్రహింపవలయును ఒక్కొక్క ఆత్మయు నజ్ఞానమనెడి మేఘముచేఁ గప్పఁబడిన సూర్యునివలె నుండును. ఒకయాత్మకును మఱొక

యాత్మకును వారివారి యజ్ఞానబలము ననుసరించి భేదముగఁ గన్పట్టుచుండును మనము గ్రహించినను, గ్రహింపకున్నను పైనిచెప్పిన యభిప్రాయమే మతమునకు మూలభూతమని యును, అదియే స్థూలమానసాత్మవిషయములయందు మానవ వ్యక్తి పరిణామము గోచరించుచుండునదనియు నెఱుంగఁదగు. అనఁగా ఒకక్షరమాత్మయే సర్వమునందును వ్యాపించి యున్నదనియు నభిప్రాయము

కాఁబట్టి ప్రతిజీవుని దేవతలుగ నెన్నవలయును. కాన, ఇతరులను దూషించుటయు, ద్వేషించుటయు, అపకృతిచేయు టయుఁ గూడదు ఇష్టభావమును సన్న్యాసులే గాక ప్రతిస్త్రీ పురుషులును గల్గియుండవలయును ఇదియే వేదసారము

ఆత్మకు స్త్రీ నపుంసక భేదముగాని, జాతిభేదముగాని, ఏలోపములుగాని లేదు ఈ యభిప్రాయమే వేదములందును, దర్శనములందును, పురాణములందును, ఆగమములందును చెప్పఁబడియున్నది కావున, సంఘసంస్కరణమునకును, మత మునకును సంబంధము లేదనువారివాదమును మే మంగీకరిం పము అనఁగా, మతమునకు పరస్పరము విరుద్ధము కలిగించెడి యధికారము లేదు మూర్ఖవాదములను నిర్మూలించుటయే మతధర్మము

భిన్నాభిప్రాయములచేక్రమక్రమముగా సమత్వమును, ఐక్యమును గల్గునందురేని బురదచే బురదను కడుగుటవంటి దగును ఇది అవివేకుల యభిప్రాయము.

సాంఘికనిర్మాణములు, ఆర్థికస్థితులనుబట్టి మతధర్మ ప్రకారము కావింపఁబడియున్నవి కాన, మతమునకు సాంఘిక

విషయములందు ప్రసక్తి యెంతమాత్రమును లేదు ఉండను గూడదు మీరు సాంఘికవిషయములయందుఁ బ్రవేశింపఁ దగదు విద్యనునేర్పుట మానవునియం దిమిడియుండు పరిపూర్ణత్వమును ప్రకాశింపఁజేయుట యనియును, మతమనఁగా మనుజునియందలి పరిపూర్ణత్వమును బ్రకాశింపఁజేయుట యనియుఁ దెలియఁదగును. మీఁదఁజెప్పిన రెండువిషయముల లోని ప్రతిబంధములనుమాత్రమే మనము తొలఁగింపవలయును మనము సాంఘికవిషయములయందుఁ జొచ్చి పరులకు బాధ కలుగఁజేయఁ గూడదు

హిందూదేశములో మహోత్కృష్టములైన గ్రంథములను మాంసభక్షకులగు క్షత్రియులే రచియించిరి ఉపనిషత్తులను రచియించినవా రెవరు? శ్రీరాముఁడు, శ్రీకృష్ణుఁడు, గౌతమబుద్ధుఁడు, తీర్థంకరులు, వీరందఱును క్షత్రియులేకదా? వీరు మతమును సకలజనులకును బోధించిరి బ్రాహ్మణులు బోధించినప్పుడంతయు పరులహక్కుల నిరసించుచుండిరి భగవద్గీతను, బ్రహ్మసూత్రములను బఠింపుఁడు భగవద్గీత సకల జాతులవారికిని సమముగ ముక్తిమార్గమును సూచించుచున్నది. వ్యాసులు వేదములకు, అపార్థము కల్పించి శూద్రులను మోసగించెను శ్రీరామకృష్ణపరమహంసస్వామి దివ్యచరిత్రను రచియింపుఁడు ఆచరిత్ర మాయన యుపదేశమున కనుగుణముగ నుండవలయును ఆచరిత్రలో నన్నుఁగాని, యితరులనుగాని యుదాహరణముగఁ దీసికొనరావలదు ఆ చరిత్రమునకు నూతనవికాసమును, నూతనజీవనమును మాత్రము ముఖ్యముగ నుండఁదగును. ఇతరుల కెవ్వరికిని

విరోధాభిప్రాయము కలుగనీయకుఁడు. పెఱవారియాచారాదులను నిందింపవలదు

---

న్యూయార్కు.
9—4—1894.

మిత్రులగు గారికి,

నన్ను భరతఖండమునకు వచ్చి పనిచేయవలసినదని కార్యదర్శిగారు తెలియఁజేసిరి అట్లే మనముకూడ హిందూదేశమునంతయుఁ బ్రకాశింపనెంచియే యున్నాము తొందరపడనేల? దైవానుగ్రహమువలన నన్నియు నగును అమెరికా దేశమునందు పలుతావుల నుపన్యసించితిని పెక్కండ్రు నాకు మిత్త్రులైరి వారిలో ననేకులు పలుకుబడి గలవారు క్రైస్తవ ప్రవక్తలుమాత్రము నాకు విరోధులుగ నున్నారు నాతో వివాదము చేయుటకుఁ జేతకాక నన్ను దూషించుచున్నారు ఈశ్వరుఁడు వారిని రక్షించునుగాక! మిత్త్రమా! విఘ్నములులేక యేకార్యమును నెఱవేఱదు కదా అంతమువఱకు పట్టుదలగలవారే జయమొందుదురు ముందు సత్త్వయుగము రాఁగలదు అపుడందఱునొక్క జాతియు నొక్కమతము వారు నగుదురు ఎల్లవారును సాధువు లగుదురు సమత్వబుద్ధిగలవా రగుదురు మీరు మేల్కొని పనిచేయందొడంగుఁడు. సర్వమును విజయవంత మగును

---

న్యూయార్కు.
18—11—1894

కలకత్తా నగరమందిరమునఁ జేయఁబడిన తీర్మానములను నా మిత్రులుబంపిన అభిమాన సూచకవాక్యములను గైకొంటిని

నేఁజేయు స్వల్పకార్యములకు మీరు అభినందించితిరి. అందులకై నేను కృతజ్ఞుఁడను ఒకసంఘముగాని యొక మనుష్యుఁడుగాని యేకాంతముగనుండి పనిచేయుట గానేరదనియు, గోప్యధనమును గోప్యరహస్యమును మాయందున్న వనెడి దురభిప్రాయముతో నేకాంతమునుండి కార్యములను గొనసాగించుకొందుమని తలంపఁ గూడదనియు నా యభిప్రాయము

సంఘముచుట్టును పరజనద్వేషకారణం బగు ఆచారమనెడి యావరణమును బెట్టుటవలననే హిందూదేశక్షీణతకును హైన్యమునకును గారణము పూర్వము బౌద్ధులను మనమతములోనికిఁ బ్రవేశింపనీ- చేయుటకై మనవారు ఆచారముల నేర్పఱచియుండిరని నాకుఁ దోఁచుచున్నది

పూర్వులు గాని యిప్పటివారు గాని ఆచారములను సమర్థింపఁ బూనినచో దానిఫలము ననుభవించియే తీరవలయును కాఁబట్టియే సకల సంఘములలోను శ్రేష్ఠమగు మనసంఘము ప్రకృతము పరిహసింపఁ బడునట్టి స్థితికి వచ్చెను ఇతరులను ద్వేషించువాఁడు దూషింపఁబడుననెడి నీతిశాస్త్రవాక్యము విరుద్ధమగునా?ఆవాక్యమును ప్రప్రథమమున నెఱింగినమనమే, దాని నుల్లంఘించి వర్తించు సంఘములకెల్ల జ్ఞానోపదేశము

చేయవలయును. హిందూదేశ మింకొకసారి ఔన్నత్యమును గాంచవలసియుండె నేని, తన నిక్షేపములనంతయుఁ బ్రకటించి లోకములోని ప్రతిసంఘమునకును బోధించి, వారివలన గ్రహింపవలసినదానిని కూడ మనము గ్రహింపవలయును వికసనము జీవము ముకుళనము మరణము ప్రేమ ప్రాణము. ద్వేషము మరణము మన మితరసంఘముల నెప్పుడు ద్వేషింపఁ దలంచితిమో యప్పుడే మరణము సంభవించెను ఇఁక ప్రేమను వ్యాపింపఁ జేయమైతిమేని మనసంఘము జీవింపదు కావున, మనము సకల సంఘములవారియందును, ప్రేమ గల్గి వర్తింపవలయును తాము ననుభవింపక పరులను అనుభవింపఁజేయ లేకయుండు స్వార్థపరాయణులయిన యనేకులకంటె, పరదేశములయందు సంచరించువాఁ డొక్కండే తనదేశమున కుపకారము చేసినవాఁ డగును పాశ్చాత్యసంఘములకన్నిటికిని సద్వర్తనమే ప్రాణాధారమై యున్నది మనము నట్టి సద్వర్తనముగలవారై యుండవలయును గాని వ్యర్థముగాఁ గోపము తెచ్చికొనుటచే ఫలము కలుగదు

ఇతరులకు స్వేచ్ఛ నొసంగనివాఁ డెప్పుడును స్వేచ్ఛను బొందనేరఁడు వ్యర్థముగా నాగ్రహించుటను మాని శాంతితోను సాహసముతోను మనము పనిచేయవలయును సత్యముగ మనము పొందఁదగిన మేలులను పొందనీక చేయుట కెవ్వరిచేతను గాదని నా నమ్మకము పూర్వమునందున్న ఉన్నతస్థితి సత్యమే అదే ఇఁక రాఁగలదని నా తలంపు మనకు పట్టుదలయును, ఓర్పును పరిశుద్ధహృదయమును భగవంతుఁ డనుగ్రహించును గాక !

26—11—94

క్రీస్తువులు తమపత్త్రికలలో నన్నప్పుడప్పుడు, ఆక్షేపించుచున్నారని వింటిని వారికి ప్రతివచనములు చెప్పుటకు నాకిష్టములేదు ఒకవేళ మీరు అట్టిపత్త్రికలను బంపినప్పటికిని నేను వానిని చెత్తతొట్టిలో పాఱవేయుదును మనము కొంచెమాందోళనము చేయవలసి యున్నది అది జరుగుచునే యున్నది నన్నుగూర్చి యెవరేమన్నను మీరు లక్ష్యపెట్టక మీపనిని మీరు చేయుచుండుఁడు మంచిచేయువాఁడెప్పుడును మేలొందును అని భగవంతుఁడు గీతయందు చెప్పియున్నాఁడు వార్తాపత్త్రికలందు నన్నుఁగూర్చి వ్రాయంబడు ఆక్షేపములనుగాని, పొగడ్తలనుగాని నేను బాటింపను మీరు సద్వర్తనముతో మీవిధులను క్రమముగఁ జేయుఁడు 'సత్యమేవ జయతి' క్రీస్తువుల అసత్యచరిత్రములు మనకు ఆలోచనీయములు గావు మౌనమే వానికి ఖండనము మీరట్లు చేయుదురుగాక.

---

30—11—94.

శ్రీరామకృష్ణపరమహంసులవారినిఁగూర్చి ప్రచురింపఁబడు అద్భుతచరిత్రములను బ్రచురించువారితో మీరు కలియవలదు ప్రపంచమందంతట ప్రపూర్ణముచేయఁగల జ్ఞానమాయ నీయందుఁ గలదు సత్యములేయైనను ఆయన మహిమలను ప్రశంసింపనేల? స్థూలవిషయములన్నియు ఆత్మజ్ఞానలాభములు కానేరవు అద్భుతక్రియలకును ఈశ్వరుఁడు, ఆత్మ, అమరత్వము అను వీనికిని సంబంధము లేదు శ్రీరామ

కృష్ణపరమహంసులవారి యుపదేశములనుమాత్రము ప్రకటింపుఁడు

---

చికాగో

సోదరుఁడా!

**హిందూ** దేశ వార్తాపత్రికలనుగూర్చియు, అందలి యా క్షేపములనుగూర్చియు వ్రాసినదానిని తుదివఱకుఁ జదివి నాఁడను ఆ వ్రాయువాని కది స్వాభావికమే. **బానిస**జాతు లన్నిటికిని ఓర్వలేనితనముండును అసూయకును, ఐకమత్య రాహిత్యమునకును పూనిన యీ పత్రికలు బానిసతనమునకుఁ గారణము లగుటయేగాక, పరులను సైతము బానిసలనుగాఁ జేయును ఈ విషయమునందలి సత్యమును హిందూదేశము నుండి పరదేశములలో సంచారము చేసినచోఁ దెలిసికొన వచ్చును. పరస్పరము ప్రేమచేతను, జాగ్రత్తచేతను వెల్లడి యగుచుండు ఐకమత్యముచేతనే పశ్చిమఖండవాసులను జయశీలురగున ట్లొనర్చుచున్నది ఒకసంఘమునందు సామర్థ్య మును తక్కువ యగుచుండుకొలఁదిని యోర్వ లేనితన మెక్కుడగుచువచ్చును అయినను బానిసజాతివా రేకార్యమునుజేసి సాధింపరని నిక్కముగా నమ్ముము సత్కా ర్యములను జేయువారిని నిందించుచుండు జీవచ్ఛవములను పునర్జీవితులం జేయఁగలవా? పనిజేయుటకే నీకధికారముకలదు. దానిఫలమునందు నీకధికారము లేదు అనెడి గీతావాక్యము నుమఱవవలదు పర్వతమువలె స్థిరముగనుండుము సత్యమే జయించును శ్రీరామకృష్ణపరమహంసుల శిష్యులందఱును

సత్యసంధులై యుందురేని సకలకార్యములును చక్కఁబడును. పరిణామఫలమును జూచుదాఁక మనము జీవింపకుండవచ్చును గాని, ఆఫలముమాత్ర మెప్పటికైనను కలుగకపోదు.

జాతీయవృద్ధికై పాటుఁబడుచుండుఁడు మీరు పరిశుద్ధులుగను, సత్యసంధులుగను, ధర్మబుద్ధిగలవారుగను నుండుఁడు స్వధర్మాచరణమే శ్రీరామకృష్ణపరమహంసులవారి శిష్యుల యొక్క ప్రధానగులామని తెలియుము ఇట్టివారొకనూఱు గురుమాత్రమేర్పడిన కృతకృత్యుఁడనైనట్లెంతును దారిద్ర్యముచేతను, మతగురువులచేతను, దౌర్బల్యముచేతను క్షీణమొందిన భారతీయులనుగూర్చి రేలుంబవలు భగవంతునిఁ బ్రార్థింపుఁడు ధీమంతులమనియు, ధనికులమనియు నహంకరించినవారలకై చింతింపఁబనిలేదు నేనువేదాంతినిగాను తత్త్వజ్ఞుఁడనుగాను మహాత్ముఁడనుగాను నేను దీనుఁడను నాకు దీనులయెడ అభిమానమెక్కుడుకలదు దారిద్ర్యమునకును, అజ్ఞానమునకును దాసులైన యిరువదికోట్ల స్త్రీపురుషులను గూర్చి చింతించువా రెవ్వరు? వారు స్వతంత్రముగా విద్యాజ్ఞానమును సంపాదించుకొనలేరు కదా? కావున, మీరు అట్టివారి నుద్ధరింపుఁడు వారికొఱకు ప్రయత్నింపుఁడు దీనుల నుద్ధరించినచో మిమ్ము దేవుఁడు రక్షించును విద్యలేకయు, అన్నమునకులే-యు పీడింపఁబడు ఇరువదికోట్లజనులు పీడింపఁబడుచుండఁగా వారికేసహాయమునుజేయక, వారిని బాధించి వారిధనమంతయుఁగైకొని,విలువగల వలువలుధరించి మెలఁగువారు దుర్మార్గులే కదా ఇట్టివారే దేశద్రోహులు సోదరులారా! మనము బీదలము. ప్రఖ్యాతి లేనివారము అయినను

మనవంటివారే భగవంతుని సేవకులము సర్వేశ్వరుఁడు మిమ్ముఁ గాపాడునుగాక

---

యునైటెడ్ స్టేట్సు.

హిందూదేశంబున బోధించెడి క్రీస్తుమతమునకును, అమెరికాదేశములో బోధించెడి క్రీస్తుమతమునకును చాల వ్యత్యాసము కలదు. ఎపిస్కోపిలు, ప్రిస్బిటేరియన్ అను నీ రెండుతరగతుల క్రీస్తుమతాంతరులలో ననేకులు మహాబుద్ధిశాలురును విశ్వాసపాత్రులు నగువా రనేకులు నాకు మిత్రులు గలరు ఆత్మజ్ఞానాభిలాషులగువా రెచ్చటనున్నప్పటికిని ధర్మబుద్ధిగలవారుగనే యుందురు మతబోధను వర్తకముగఁ జేసికొని ప్రపంచవిషయవ్యాపారమునందు మగ్నులై పోటీచేయుచు పోరుసల్పుటకు ప్రయత్నించుచు నుండువా రెప్పుడును దుర్బుద్ధిగలవారుగనే యుందురు

---

యునైటెడ్ స్టేట్సు

నన్ను నమ్మినవారలను రక్షింతునని శ్రీకృష్ణమూర్తి చెప్పియున్నాఁడు మనము పరోపకారమును సదుపదేశమును జేయుచుండవలయును పరోపకారముచేయువాఁడే బాగుగ నధికారము చేయఁదగినవాఁడుగ నుండును మనము యత్నించినకార్యమును మానరాదు సత్యమును మఱవకూడదు వేరు ప్రతిష్ఠలకాసించి యేపనియుఁ జేయఁదగదు స్వార్థపరిత్యాగముతో పనిచేయుచున్నచో జయమొందఁగలము నాశిష్యులు సకలసత్కార్యములు చేయుటకునుసంసిద్ధులైయుండవలయును

వేదాంతబోధకొఱకు కొకపత్రికను స్థాపించినయెడల మనప్రయత్నము సులభమగును ఇతరులను దూషింపవలదు. ఏమతస్థుని నిందింపవలదు ఇతరుల భిన్నాభిప్రాయములయెడ నోర్పు గలిగియుండుఁడు పరిశుద్ధము, పూనిక, శాంతము, ఇవి జయమునొసంగును

---

12—1—95

పేరుప్రతిష్ఠలతో నాకుఁ బనిలేదని మీకు వ్రాసియుంటినిగదా. ప్రోపకార్థముకొఱకు నా యభిప్రాయములను ప్రకటింపఁగలను మీరు నన్ను పనిచేయుచుంటిరిగాని, చాలవఱకు నాయశస్సు కొఱకు పనిచేసితిరి మీరు హిందూదేశాభివృద్ధికి పాటుపడుఁడు సదుద్యములకై పనిచేసినట్లు కనంబడలేదు హిందువులకు పరస్పరానురాగము కలుగునట్లు చేయవలయును నేనిచ్చటఁ గావించిన కార్యములను గూర్చి కలకత్తాలో నైదువేలజనులు సభచేసి ప్రశంసించిరి ఇది గొప్పవిషయమే యైనప్పటికిని, ఒకొక్కరిని ఒకొక్కరు అణా నిమ్మనిన నిత్తురా? మనవారిలో పరతంత్రులుగ నుండుస్వభావ మెక్కువ అన్నముగూడ నోటిలోఁ బెట్టిన మంచిదని కోరువారును గలరు మ్రింగించిన మఱియు సంతసింతురు మనకు మనమే సహాయము చేసికొనకపోయినచో జీవింపనేరము నాప్రతిష్ఠకొఱకు పాటుపడవలదు నా యభిప్రాయములను మాత్రమే యెల్లవారును తమయనుభవమునకుఁ దెచ్చికొనవలయును పూర్వపు మతాచార్యులశిష్యులు, వారి గురుబోధములతోఁగూడ వారి జీవితచరిత్రలను గలిపి ప్రసిద్ధికిఁ

దెచ్చినందుననే, ఆబోధలన్నియు రూపుమాసినవి! శ్రీరామ కృష్ణులశిష్యు లట్టిమార్గము నవలంబింతురుగాక జీవిత చరిత్రలనుమాని బోధనలనుమాత్రము ప్రకటింపుడు భగవంతుఁడు మీకు సహాయుఁ డగును

---

23—1—95

మీరు జీవితపర్యంతము సత్యసంధులై యుండుఁడు విశ్వాసముగలవారే నాకు వలయును జయముకల్గినను, అపజయముకల్గినను నాప్రయత్నము నిర్దోషముగ నుండవలయును అనేకవిఘ్నములు సంభవించిన మీఁదఁగాని జయము చేకూఱదు పట్టుదలగలవా రేనాఁటికైనను జయమొందుదురు న్యూయార్కులోని ప్రజలు మనపక్ష మవలంబించిరి గాని, యందులకై చాలశ్రమపడవలసివచ్చినది న్యూయార్కులోను ఇంగ్లండులోను నేను నా సామర్థ్యమునంతయు నుపయోగించినాఁడను ఇఁక నీచోటులందు నాప్రయత్నములు నెఱవేఱునని తోఁచెడిని.

హిందూమతములోని సారాంశములను ఆంగ్లేయులకు బోధచేయుట యనునది యెంతటిప్రయాసకరమైనదో, ఆవిషయము అట్టికార్యమునకుఁ బూనినవారికిమాత్రమే తెలియును. దుర్గ్రాహ్యమగు అద్వైతమును జనసామాన్యమునకుఁ గ్రాహ్యమగునట్లు బోధింపవలయును యోగశాస్త్రమునుండి మానసికశాస్త్రమును నేర్పవలయును వీనినంతయు తేటతెల్లముగ పసిబాలురకుఁగూడ సుబోధమగునట్లు తెలియఁజేయవలయును

ఇదే నాముఖ్యప్రయత్నము నాకీశ్వరుఁడెంతవఱకుఁ దోడ్పడఁ గలఁడో తెలియదు స్త్రీలయందును ధనమునందును అభిలాష లేనివారిని వా రెప్పుడును జూచియుండలేదు కావున, వారిప్పుడు శమదమాదిగుణములుగలవారు మనలో నున్నారని తెలిసికొనిరి అట్టివారియెడ వారికి గౌరవము మెండగుచున్నది

ఇతరులు హిందూమతమును దూషించుచుండఁగా, హిందూదేశములోని ముప్పదికోట్లజను లేమిచేయుచున్నారు? వారిలోను పండితు లేమిచేయుచున్నారు ఈవివాదకార్యము నకు మీరు పూని, నన్ను బోధచేయుటకు మాత్రము వదల కూడదా? వివాదమునందు నేఁ జొచ్చి సత్ప్రయత్నమును మానుకొనఁ దగునా? హిందూదేశమునుండి పదుగురు తగిన వారిని పరదేశమునకుఁ బంపుదు రేని, మీరు హిందూదేశమునకు నీతిమార్గవిషయములయందును రాచఱికవిషయము లయందును మహోపకారము చేసినవా రగుదురు మీరు చాల మోటువారనియు, మీకు బలాత్కారముగ నాగరకత నేర్పవలయుననియును పాశ్చాత్యులు కొందఱు తలంచెదరు గదా? అది సరికాదని మీ రేల వారికిఁ దెలియఁజేయఁగూడదు. దూరదేశములో నే నొక్కఁ డేమిచేయనగును?

హిందూదేశమునుండి యీ పశ్చిమఖండదేశములకు వచ్చిన హిందువులు స్వలాభమునుగోరి, మనమతమును మన వారిని తూలనాడిరి నేను ప్రతిష్ఠకొఱ కిచ్చటికి రాలేదని మీ రెఱుంగుదురు నేను హిందూదేశమున కేల రావలయును? చెన్నపురినుండి మతబోధచేయుట కీదేశమునకు నొక్కరైన

నాసైరి స్వదేశముకొఱకుఁ బ్రయత్నించినవాఁడను నేనొక్కఁడనే యిచ్చట నున్నాఁడను. ఏ హిందూదేశీయుఁడును ఈదేశస్థులకుఁ దెలుపనివిషయములను నే నొక్కఁడను దెలిపినాఁడను ఇచ్చట నామతము ననుసరించినవారు వేలకొలఁది జనులున్నారు క్రమముగా నింకను జేరుచున్నారు నేనిచ్చట నుండి వీరితోఁగలిసి పనిచేసిన నింకను మతము వృద్ధియగును నాజీవితమును సార్థకమగును

న్యూయార్కులో సర్వజనాదరణీయ మగుమందిరము నిర్మింపబడినది దీనికి స్థిరమైనయేర్పాటులు చేసినాఁడ ఇట్టిదే అమెరికాలోఁగూడఁ గట్టఁబోయెదరని వింటిని ఇచ్చటఁగల నాశిష్యులకు యోగము, జ్ఞానము, భక్తి అనునివి బోధింప నిశ్చయించితిని పిమ్మట నాప్రయత్నమును వారు నిర్వహింతురు మీరును క్రియాపరులు కాఁగోరెద

ఇంకొకనెలలో పత్రికకై కొంతధనము నంపెదను హిందూదేశములోని పేదలయొద్ద ధనమును గైకొనవలదు నే నిచ్చటనుండియే ఆకార్యమును నెఱవేర్పఁగలను శ్రీరామకృష్ణులవారిజీవితమునుగూర్చిఆర్భాటముచేయక యుండుఁడు.

మన మతమంతయు ఉపనిషత్తులయందిమిడియున్నది ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము ఇవి పరస్పరము ఒకదానికొకటి సోపానమువంటివి ప్రతిమతమును ఆవశ్యకముగ నున్నది మనమతము వివిధాచారములతోఁ గూడియుండినప్పటికిని వేదాంతమునకు విరుద్ధము గాదు ద్వైతమతమే ఆంగిలేయుల యాచారములతోఁ గలిసి క్రీస్తుమతముగ నేర్పడినది సెమిటిక్ జాతివారియాచారములతోఁ గూడి

మహమ్మదీయమతముగ నైనఁ యోగాభ్యాసమార్గము నవలంబించి అద్వైతమతమునుండియే బౌద్ధమతము కలిగినది కనుక మతమనఁగా వేదాంతమని తెలియఁదగు మతాచారము లనేకములుగఁ గనంబడుటకుఁ గారణము వారివారి సంఘావశ్యకము ననుసరించియున్నవి దీనికి దృష్టాంతము కలదు శైవులకును శాక్తేయులకును సిద్ధాంత మొక్కటే యైనను ఆచారములుమాత్రము వేర్వేఱుగా నున్నవికదా! మీరు పత్రికయందు ద్వైతాద్వైత విశిష్టాద్వైతములనుగుఱించి వ్యాసములు వ్రాయుచుండుఁడు పరస్పరము సఖ్యము కలుగునట్లు చేయుఁడు మీరు పరుల ఆచారములను తిరస్కరింపక జ్ఞానకాండమును బోధింపుఁడు స్వాభిమానమును త్యజింపుఁడు పరులయందు ప్రేమ గలిగియుండుఁడు ద్వేషమువలన కార్యసిద్ధి కలుగదు. అహంకారము అనర్థమును దెచ్చును ......

---

"భారతి" పత్త్రికాధికారిణికి వ్రాసిన లేఖ

మీ "భారతి"పత్త్రికారాజము చేరెను నాప్రయత్నమునకు సహాయముగా మీ రొనర్చుకార్యమునకు మిక్కిలి సంతసించెద

నా జీవితయాత్రలో నూతనమార్గముల నవలంబించు పురుషు లగపడుట యరుదు అట్లు అగపడినను అట్టివారికి ప్రోత్సాహము చేయఁగలస్త్రీలుండుట యరుదు పురుషు లనేకులు చేయు కరతాళధ్వనులకంటె నొక్క బంగాలీయువతీరత్నముయొక్క పొగడ్తనందుట మిక్కిలిశ్రేష్ఠము. మీవంటి

స్త్రీలు పెక్కండ్రుగలిగి మాతృదేశము నుద్ధరించునట్లు భగవంతుఁడు సంకల్పించునుగాక

పశ్చిమఖండవాసులకు మతబోధము చేయుట యనునది హిందూదేశక్షేమార్థమై యున్నది మన దేశాభివృద్ధికి వారి సాహాయ్యము వలయును మనదేశమం దింకను గుణగ్రహణశక్తియు ధనసాహాయ్యమును కలుగకున్నది ఆచరణములేమి అంతకంటె శోచనీయము. మనకు బుద్ధిబలము కలదు గాని ఆచరణమందు పట్టుదల లేదు మన వేదాంతాదిశాస్త్రములయం దనేకసదనుష్ఠానములు కలవు గాని ఆప్రకార మాచరించుటకు శక్తిలేదు స్వార్థత్యాగమును, నిష్కామకర్మమును హిందూదేశమునందే ప్రథమమున నుపదేశింపఁబడెను అయినను ఇప్పుడు తుచ్ఛమైన శరీరసౌఖ్యములనుమాత్రమే గోరుచు దయలేనివారై క్రూరకార్యములు చేయం దొడంగి యున్నారు

ఈస్థితి సత్కార్యాచరణమును ప్రారంభించుటకు అనువై యున్నది ఇప్పుడే గుణదోషములను గ్రహింపనగును సంసారదుఃఖమునకును ప్రస్తుతస్థితికిని రోదనము చేయుచు, నొకచేత కన్నీటిని దుడిచికొనుచు, రెండవచేతితో మోక్షమార్గమును జూపుచునుండువాఁడే ధీరుఁడు వాఁడే శూరుఁడు స్థావరములవలె పూర్వాచారపరాయణు లొకవైపునను, అత్యాతురులై దీర్ఘాలోచనలేక త్వరపడెడి సంఘసంస్కర్తలొకవైపున నుండఁగా, వీరిరువురికిని మధ్యస్థముగ నుండుటయే సరియైనమార్గము

జపానుదేశములోని బాలికలు తమ యాటబొమ్మలను వాస్తవముగఁ బ్రేమించిన, నవి సజీవము లగునఁట

కాఁబట్టి వారు తమబొమ్మలను చాల జాగ్రత్తతో నుంచికొని యుందురు

మనదేశములో పేదలును, వివేకశూన్యులును, నిష్ప్రయోజనముగ జగడమాడువారు నగు మనదేశీయులయెడ, సంపూర్ణవిశ్వాస ముంచి, బోధగావించిన, మనదేశము క్షేమ పడునని నా యభిప్రాయము సత్కార్యపరత్వమును, నీతియు, ప్రేమయు నుండినచో దేశమునంతయు జయింపవచ్చునని నేను గ్రహించినాఁడను కోట్లకొలఁది మూర్ఖులగు వేషధారులను సద్గుణములుగలవాఁ డొక్కఁడు మట్టుపఱచ వచ్చును

---

24—4—97

పూజ్యురాలా! *

మనము చాలకాలముగా బానిసలవలె నున్నారము హిందూదేశములో సాధారణముగాఁ బ్రజలకు వారి యంతరాత్మను బ్రబోధించు నుపదేశములను జేయువారు లేకున్నారు. పాశ్చాత్యులుమాత్రము స్వాతంత్ర్యమును సంపాదించుకొనుచు ధన్యు లగుచుండెదరు ఈ దేశమునందు సకల విషయములందును తుదకు భోజనవిషయమునందును రాజులు నియమించునట్లు నడుచుకొనవలసి యున్నది ఇతరదేశములందు సాంఘికవిషయములందు రాజున కధికారము లేదు హిందూదేశమున ప్రజల కేస్వాతంత్ర్యమును లేదు. ఆత్మగౌరవమును లేదు పాశ్చాత్యులు సంఘీభవించి యాలోచించి యొక్కొక

* ఇదియు భారతీపత్త్రికాధికారిణికి వ్రాయఁబడిన లేఖయె

కార్యమును జేయుచున్నారు అది వారి మేలునకేగాని మన కొఱకుఁ గాదు ఇచ్చట పెద్దలు లేరు మన మెవ్వరితో నాలోచింప వగును? మనకు బలము తక్కువ కాఁబట్టియే వంగదేశమున వాగాడంబరముమాత్రమే జరగుచున్నది గాని పని జరగుటమాత్రము లేదని నా యభిప్రాయము

మఱియు మనదేశములోని ధనికులును నే సహాయమును జేయుట లేదు మన తలంపు ప్రకారము నడచుకొనుటకు సంసిద్ధులైయున్న యౌవనులవలననే కార్యము నెఱవేఱవలసి యున్నది ఆంగ్లేయులు విద్యచే మిక్కిలి నాగరకులైరి కావున మనదేశమునందుఁగూడ విద్య వ్యాపింపవలయును గర్వముచేతను శాసనాధికారముచేతను మనదేశపు జనసామాన్యమునకు విద్యను లేకుండ చేయుచున్నారు విద్య లేమియే దేశక్షీణతకుఁ గారణము అన్ని దేశములవలె మనము వృద్ధినొందఁ గోరుదుమేని ప్రజలయందు విద్య వ్యాపింపవలయును

ఏఁబదియేండ్లుగా సంఘసంస్కరణమునకై ఆడంబరము చేయుచున్నారు అయిన నేమి? ఎచ్చోటనైన నిదివఱకు దేశక్షేమముకొఱకు స్థాపింపఁబడిన సంఘ మొక్కదానినైన నేను జూడలేదు

మహమ్మదీయు లెంతమంది సిపాయీలను వెంటఁబెట్టుకొని యీదేశమునకు వచ్చిరి? ఆంగ్లేయు లెందఱు వచ్చిరి? హిందూదేశమునఁ దప్ప వేఱే యేదేశములోనైనను ఆఱు రూపాయల జీతములకొఱకు తండ్రులయు సోదరులయు గొంతులనుగోయు లక్షలకొలఁదిజనులు దొరకుదురా? మహమ్మదీయులు రాజ్యముచేసిన 700 సంవత్సరములలో ఆఱుకోట్ల

తురకలును, ఆంగ్లేయులు రాజ్యముచేసిన 100 సంవత్సరములలో ఇరువదిలక్షల క్రీస్తువులును ఈదేశమున నుండుటకుం గారణమేమి? మనవారి కల్పనాకౌశల మేమయినది? ఆంగ్లేయులతో పోటిచేయుటకుఁ గాక మనపనివాండ్రు మాయమైరి. ఆంగ్లేయుల కర్మవిద్యలనన్నిటిని స్వల్పకాలములో జర్మనీవా రెట్లు గ్రహించిరో కనుఁగొనుఁడు దీనికిం గారణమేమి?

## విద్యయే!

పశ్చిమఖండములో బీదలుసైతము సౌఖ్యము ననుభవించుచు విద్యావంతులై యున్నారు అచ్చటివారినిఁ జూచి మనదేశపు బీదలను దలంచికొని పలుమఱు కన్నీరు నించినాఁడను కాఁబట్టి విద్యయే సకలసౌఖ్యములకును ఆత్మగౌరవము నకును గారణము ఆత్మగౌరవముచే బ్రహ్మము ప్రకాశించును

ప్రకృతవిద్యాపద్ధతి మనదేశమును క్షీణింపఁ జేయుచున్నది దీనిచే శ్రద్ధ నశించి పోవుచున్నది శ్రద్ధచేత నేకదా నచికేతుఁడు యమునికూడ ధిక్కరించినాఁడు ఇపుడు శ్రద్ధ లేకపోయినది శ్రద్ధలేనివారు నశింతురని గీతలో 4 అ 40 శ్లో చెప్పఁబడియున్నది కావున మనకు ప్రకృతము మంచివిద్య కావలసియున్నది ప్రథమమున మనకు ఆత్మజ్ఞానవిద్య కావలయును అనఁగా సన్న్యాసియై ఏకాంతముగఁ గూర్చుండువిద్య యని తలంపకుఁడు జన్మబంధమునుండి విముక్తి నొంది యిహసౌఖ్యంబుల నొసంగువిద్యయే కావలయును ఈవిద్యకల్గిన, జ్ఞానమును ముక్తియు తప్పక గలుగును స్వాతంత్ర్యము, నిష్కామము, వైరాగ్యము, ఇవి గలవానికి భవభయము

కలుగదని భగవంతుఁడు గీత 2 అ 40 శ్లో చెప్పియున్నాఁడు కదా

ఒక్కొక ప్రాణియందును శక్తి (ఆత్మ) యున్నదని మన దేశమందలి సకలమతములవారు నొప్పుకొనియుండు విషయమే కదా ? కావున, మనము ఈశక్తిని ప్రకాశమగునట్లు ప్రతిమనుష్యునకును బోధింపవలయును

ఇట్టు శక్తిని ప్రకాశమగునట్లు చేయుటయేగాక, విద్యనుగూడ నేర్పవలయును ఉత్తములును నిష్కాములు నగు ప్రజలెందరో గలరు వారు జీతమును గోరక మతబోధ చేయుటకుఁ బ్రయత్నింపవలయును ఇట్టివారినే ఉపాధ్యాయులుగను నియమింపవచ్చును ఈపద్ధతి మొట్టమొదట రాజధానీ స్థలములం దేర్పడవలయును పిమ్మట దేశమందంతట వ్యాప్తము చేయవచ్చును ఇట్టియేర్పాటులు చెన్నపురియందును, కలకత్తాయందును గలవు ఇంకను ననేకనగరములలో నేర్పడ వలసి యున్నది

కొన్నిదినములకు విద్యను బోధనరూపముగా వ్యాపింపఁజేసి, పిమ్మట పాఠశాలల నేర్పఱుపఁ దగును. మఱియు వ్యవసాయము, చేతిపనులు మొదలగునవి నేర్పెడి పాఠశాలలును స్థాపింపవలయును ఇట్టి పాఠశాలలను స్త్రీలకొఱకుఁ గూడ నేర్పఱుపవలసి యున్నది ఈ మహాకార్యములకు చాలధనము కావలయును ఆధనమును ఇంగ్లండు మొదలగు దేశములలోనుండి గ్రహింపవలసి యుండుటంబట్టి మనము ఐరోపా అమెరికా దేశములకేగి వారికి మతబోధ చేయుటకుఁగడంగవలయును ప్రకృతము మన హిందూమతమును ఐరోపావారును అమెరికావారును గోరుచున్నారు గాన,

ఆలస్యముచేయక మన మతబోధకు లాదేశమునకుఁ బోవలయును

పశ్చిమదేశములందు స్త్రీలే సర్వాధికారములను జేయుదురు వారికి విద్య, ధైర్యము, సాహసము మెండు మిము బోఁటి విదుషీరత్నము లాదేశమున కేఁగినచో ననేకులు హిందూమతము నవలంబించి తరింపఁ గలరు ఈ దేశము నుండి పోయిన రామాబాయి యొక్కతయే ఆ దేశమువారిని ఆశ్చర్య మొందునట్లు గావించెను మీ యంతవిద్య యామె కున్నచో నింకను నాదేశమునం దొక యాందోళనము కలిగి యుండును ఇంక నమెరికావారి స్థితినిఁగూర్చి చెప్పవలసినదే లేదు హిందూ స్త్రీయొక్కతె, ఆదేశస్థులకు హిందూవేదాంతమును బోధించెనేని ప్రపంచమంతయు మేలొక్కనును మైత్రేయి, సావిత్రి, లీలావతి మొదలగు స్త్రీరత్నము లున్న భరతఖండములో నిట్టి కార్యమొనర్చుటకుఁ దగిన స్త్రీలు లేకయుందురా ?

మనము ఇంగ్లండును ఆత్మశక్తిచే జయింపవలయును నేను దేశద్రిమ్మరినై, విరాగినై, దీనుఁడనై, ఏకాకినై యున్నాఁడను నాచే నిట్టిపని యెట్లు నెఱవేఱును ? విద్యయు, ధనమును, బుద్ధియు గలమీరు ప్రయత్నము చేయఁదగును ఈసమయమును వ్యర్థముచేయుటకు మీకు మనసొప్పదని తలంచెదను ఇంగ్లండు అమెరికాదేశములను జయించుట యందు మనమందఱము నొక్కొక్కఁడిగాఁ బనిచేయవలయును ఇట్లుచేసిన మనదేశము క్షేమ మొందును. మనమతమును ప్రపంచమందంతట వ్యాపింపఁ జేయవలయును

దేవగిరివైద్యనాథము
23—12—1 00

మిత్రులగు గారికి,

మీ యుత్తరముచేరి చాల సంతసించినాఁడను మీయభిప్రాయము నిజమే "అవాచ్యం బగుప్రేమయే సర్వేశ్వరునిస్వభావము" అని నారదమహర్షి చెప్పినవిషయమును నే ననుసరించినవాఁడను

అనేకముయొక్క పేరికయే "సమష్టి" యనఁబడును అనఁగాసంపూర్ణము ప్రత్యేకప్రత్యేకముగా నుండుట "వ్యష్టి" యనఁబడును అనఁగా అసంపూర్ణము నీవు, నేను, పశువు, భూమి, వృక్షము, నక్షత్రము అనునివి వ్యష్టి నీవు, నేను, ఇంకను పలువురు చేరినసంఘము సమష్టి అనఁగా బ్రహ్మా విష్ణు రుద్రాదులును ప్రపంచమును సమష్టి యనఁబడును

ప్రకృతమున సమష్టి ఆవశ్యకమా? వ్యష్టి ఆవశ్యకమా? అను విషయమునుగూర్చి చర్చించుచున్నారు పాశ్చాత్యులు వ్యష్టిస్వాతంత్ర్యమును సమష్టి యధికారమునకు లోఁబడియుండవలయు ననెదరు సమష్టివలనను వ్యష్టివలనను గలుగు ప్రత్యక్షలాభములను హిందూదేశమునుండియే యెల్లరును దెలిసికొనిరి ఈదేశమున ప్రజలు శాస్త్రనిర్ణయముల ననుసరించియే జన్మింతురు ఈదేశమునందే ఆహారవిహారములకు, వివాహాది సకలకర్మలకును శాస్త్రము నిబంధించినచొప్పున జరగుచుండును మూఁడుతాలసుజేర్చి ప్రొయ్యికావించి నాలుగుపుల్లలతో వంటచేయుటకును, నాలుగుమూరలచోట కాళ్లను పల్లమునసుంచికొని నాలుగణాలవెలగల చేతిమగ్గ

ముతో నొకమూరగుడ్డ పదిరూపాయల వెలగలదాని నేయు టకును చింపిరిచాఁపపైఁ గూరుచుండి మూఁడుదమ్మిడీల ఆము దము దీపతో మహాగ్రంథములు రచించుటకును ఈదేశము వారికిఁ గాక, వేఱే యేదేశీయులకు సాధ్యమగును? కురూపి యగుపత్నిని భర్త కాపాడుచుండుటయు, నిరర్థకుఁ డగు భర్తను భార్య పూజించుచుండుటయుఁ గూడ నీ భరతఖండ మునందే గదా? ఇంతయే మనదేశమున మసకుఁగల మహోప కృతులు

ఇవన్నియు యంత్రములవలె నడపఁబడునట్టి మనుష్యు లకృత్యములు వీనివలన మనోవికాసమును, చైతన్యలక్షణ ములును, ప్రేమప్రసారమును గలుగవు మఱియు జ్ఞానోద యము గాని, నూతనాశయములయందుఁ గోర్కిగాని, నవీన కల్పనాశక్తిగాని, కలుగుట కవకాశము లేదు మనవారికి ప్రకృతస్థితికంటె శ్రేష్ఠమైన యుత్తమస్థితికలదని తోఁచుట లేదు అట్లు తోఁచినను దానియందు నమ్మకము లేదు. నమ్మక ముండినను ప్రయత్నము లేదు ప్రయత్నముండినను ఉత్సా హము లేదు కావున సర్వమును పాడగుచున్నది

ఒక్కొక మనుజుఁడును ధర్మశాస్త్రప్రకారము వర్తింప వలయును. పూర్వుల యాచారములచొప్పున నడుచుచు భక్తియుక్తుండై యుండవలయును శిలలు భౌతికశాస్త్రమును మీఱియుండుట లేదు పశ్వాదులు దుష్కర్మల నాచరించుట యెందేనియుఁ జూడఁబడుట లేదుకదా?

ధూమశకటము మొదలగుయంత్రములకు చలనాది శక్తులు కలవు గాని, వానికి బుద్ధిలేదు. ధూమశకటముఁ బో

యెడు దారిలోని పురుగులు ఆమార్గమును వదలిపోవుచున్నవి వానికున్నంత తెలివికూడ ధూమశకటమునకు లేదు కదా? అనఁగా పురుగులకు బుద్ధియున్నది ధూమశకటమునకది శూన్యము బుద్ధి ప్రకాశించినకొలఁది ఆనంద మధికమగుచుండును జీవి క్రమక్రమముగా పరిణామదశను బొందును

విద్య యనఁగా విషయగ్రహణము కాదు మనస్సును స్వాధీనము చేసికొనుటయు దానిని క్రమముగా నుపయోగించుటయు విద్య యనఁబడును అంతియగాని, నూతనసంకల్పముల కాలవాలమై పూర్వమున్న తెలివియు నిర్మూలమై పోవునట్టివిద్య యేదికలదో అది విద్య యగునా?

ఏదియో యొక శాసనమునను సరించి యంత్రములవలె వర్తించుట శ్రేయస్కరము కాదు ఇంతకంటె బుద్ధిపూర్వకముగా అక్రమము చేయుట శ్రేయస్కరముగ నుండునని నా యభిమతము నిర్జీవయంత్రములవలెను, పలుగురాళ్ల గుట్టవలెను గుంపుగానుండుటయే సంఘీభావమని తలంపరాదు ఆ సంఘమువలన నెవరి కేమి ప్రయోజనము? చాలదినములుగ బానిసలై యుండు మనము బానిసలు కామనియు మనవారు మూఢులనుటకుమారుగా సకలదేశములకు జ్ఞానమును ప్రవహింపఁ జేయువారమనియును పేరెత్తవలయును

పలువుర మేలుకొఱకు ఒక్కఁడు ఆత్మత్యాగము చేయుట సద్ధర్మము కాదా? యనఁగా అది మేలే యగునుగాని, బలవత్ప్రయత్నముచే ప్రేమ జనింపదు కదా? పరమదరిద్రునకు వైరాగ్యముచే గౌరవము వచ్చునా? ఇంద్రియపాట

వము లేనివాఁడు ఇంద్రియనిగ్రహుఁడనినంత నేమిప్రహిమ? సంకల్పశక్తియు, దయాగుణమును, శ్రేయస్సును, సంఘాభిమానమును లేనివాఁడు స్వార్థపరిత్యాగమున కెట్లర్హుఁడగును? బలాత్కారముగ సహగమనమునకు భార్య లోఁబడినంత మాత్రమున భర్తయందు భక్తిగలది యగునా?

ప్రజలకు మూఢాచారములను బోధింపక, స్వాతంత్ర్యమును బోధించి, వారిని బంధవిముక్తులగునట్లు కావింపుఁడు సంఘాభిమానమునకై సర్వశక్తులను వినియోగింపుఁడు బురదచే బురదను, పాపితత్వముచే పరతంత్రమును నివర్తింపదు. సకలసౌఖ్యంబులను విసర్జించి ప్రజలకు మేలుచేయువాఁడు మాత్రమే బుద్ధునివంటివాఁడగును అపుడే నీకు విముక్తి కల్గును ఇట్టిగుణము స్వభావముచేఁ గలుగవలయునేగాని బలవంతముననలనఁ గలుగదు కదా.

ప్రకృతము మనదేశమునందు "వితంతువులు వైరాగ్యధర్మము నవలంబించి యున్నారు ఇట్టి శిష్టాచార మేదేశమునందైనఁ గలదా? బాల్యవివాహములు వినోదకరములు ఇందువలన భార్యాభర్తలకు మిక్కిలి యనురాగము కలుగును." అని పురుషులు బోధించుచున్నారే గాని, వారికి మాత్రము స్వార్థత్యాగ మక్కఱలేదా కాఁబోలు! పరోపకారమునకంటె శ్రేష్ఠమైనధర్మ మేమికలదు? అయిన నిది బ్రాహ్మణుల కక్కఱలేదట! ఇతరులనుమాత్రము చేయుఁడనెదరు వివాహవిషయమునందు ఇతరుల యాక్షేపములను దప్పించుకొనుటకును, స్వలాభమును జూచుకొనుటకును, తమబిడ్డలు మొదలగువారి మేలులను మఱచి తలిదండ్రులును చుట్టములును మెలంగుటయే యిట్టిస్థితికి కారణము. మనదేశమునందు పరంపరగా

వచ్చుచుండుబోధలు వారిమనంబులను శిలలం జేయుచున్నవి గాని వేఱు కాదు

ధీరులుమాత్రమె స్వార్థపరిత్యాగము చేయుదురు. భీరులు నొకవైపు చేయుచు నొకవైపు చేయుకున్నట్లు కన్పట్టుచుందురు ఇందువలన లాభమేమి? ఇది లోకోపకృతి యగు. ప్రేమ యనఁబడదు గదా? చిన్న మొలకలను కించెవేసి కాపాడవలయును స్వార్థపరాయణతలేక యొక్కదానిని ప్రేమింప నారంభించితిమేని క్రమముగా సర్వమునందును ప్రేమ జనించును ఒక యిష్టదేవతయందు భక్తికల్గినచో జగన్నిర్మాణకర్త యగు విరట్పురుషునియందును భక్తి కల్గును మొదట ఒక్కరియెడ ప్రేమగల్గిన పిమ్మట నందఱియెడ ప్రేమగల్గును ఆరంభమునందే అందఱియెడ ప్రేమగలుగదు కామ్యకర్మచే నిష్కామకర్మ లభింపఁగలదు ప్రారంభమునందే ఆశలేనివారికి ఆశావిసర్జన మెట్లు లభ్యమగును అనఁగా క్రమముగా స్వార్థత్యాగము నలవఱచుకొని సంఘమునకు కం. కారము చేయఁ గడంగవలయును

అశోకవృక్షకూడదు ఏచెట్టునకుఁ దగినంతగాలి యుండును ననునట్లు, ఆయాఅంతస్తునకుఁ దగినంత ఆశ యుండును అగ్నిని క్రిందుమీఁదుచేసిన నది ప్రజ్వలించును పామును దలమీఁదఁ గొట్టిన నది రోషముతోఁ బడగనెత్తును అట్లే కష్టపరంపర లొక్కమాఱు పైఁబడునప్పుడు ఆశయడుగంటఁ దొడంగును అప్పుడే బ్రహ్మతేజస్సు ప్రకాశించును ఎంతటి అగర్భశ్రీమంతుఁడైనను అశ్రుకణములు రాల్పనివాఁడు గౌరవమును బడయఁడు అట్టివానియందు బ్రహ్మతేజస్సు ప్రకాశించునా? దుఃఖమునకు భయపడ నేల? దుఃఖింపుఁడు! ప్రలపింపుఁడు!

అప్పుడు కన్నులు తేటపడి దివ్యదృష్టి కల్గును మఱియు ప్రేమ మును బ్రహ్మమనెడిజ్ఞాన ముదయించును. సకల భ్రమలు నివృత్తి యగును ఆపిమ్మట ఆత్మను ఆత్మచే హింసించుటమాని పరమపదము గల్గును (గీత. 13 అ 28 శ్లో)

ఇట్లు,
వి వే కా నం ద

---

చెన్నపురి 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము —1931.

# ఆంధ్రగ్రంథములు.

## వచనగ్రంథములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారి, ఆంధ్ర కవిజీవితములు | 3 | 8 |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, 3 సంపుటములు | 7 | 8 |
| డిటో ఒకటేసంపుటము . | 6 | 8 |
| తిలకుగారి సెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | 0 | 14 |
| మదనమోహనమాళవ్యగారి జీవితము, పంజాబుఅల్లరి, చిత్రపటములతో | 0 | 8 |
| యజుర్వేదకథాసంగ్రహము | 0 | 8 |
| ప్రాచీనదేశచరిత్రలు . | 1 | 12 |
| పతివ్రతలచరిత్ర ... | 1 | 8 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము ... | 0 | 12 |
| ,, రెండవభాగము ... | 0 | 8 |
| వీరాంగనలు . | 0 | 12 |
| శ్రీ మహాభక్తవిజయము, ప్రతిమలతో | 6 | 0 |
| నవనాథభక్తులచరిత్ర | 2 | 0 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది | 0 | 6 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | 0 | 6 |
| హితోపదేశము, సులభశైలి | 0 | 12 |
| సంగ్రహరామాయణము ... | 0 | 10 |

| | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|
| సంగ్రహభారతము | 1 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | 0 | 4 |
| సంస్కృతనాటకకథలు | 1 | 4 |
| దశకుమారచరిత్రము, సంజీవరాయశాస్త్రి | 1 | 8 |
| మదనకామరాజుకథ, చక్కనికూర్పు | 0 | 14 |
| దక్కనుపూర్వకథలు | 1 | 8 |
| దేశింగురాజుకథ, జంగంకథ | 0 | 6 |
| భోజునికథలు | 0 | 8 |
| విక్రమార్కునికథలు | 0 | 8 |
| బేతాళునికథలు | 0 | 8 |
| పరమానందశిష్యులకథలు | 0 | 3 |
| వైద్యులకథలు | 0 | 4 |
| చార్దర్వేషుకథలు | 0 | 8 |
| తాతాచార్యులకథలు | 0 | 6 |
| నలుగురుమంత్రులకథలు | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథలు | 0 | 6 |
| శ్రీ గైక్వారుగారి ఉపన్యాసములు | 0 | 2 |
| సూరతుకాంగ్రెస్సు ఉపన్యాసములు | 0 | 2 |
| స్వామిరామతీర్థజీవితము | 0 | 2 |
| శ్రీరామానుజాచార్యచరిత్ర | 0 | 2 |
| శాలివాహనచరిత్ర | 0 | 3 |
| శ్రీలాలాలజపతిరాయిజీవితము | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్రము | 0 | 3 |
| బాలగంగాధరతిలకుచరిత్రము | 0 | 4 |
| శ్రీగోపాలకృష్ణగోఖ్లేజీవితము | 0 | 2 |
| శ్రీమహాదేవగోవిందరానడేజీవితము | 0 | 2 |

| | ప్రతి 1-కి రూ | అ. |
|---|---|---|
| శివాజీచరిత్ర, ప్రతిమతో | 0 | 8 |
| బుద్ధచరిత్రము ,, | 0 | 4 |
| శ్రీశంకరాచార్యచరిత్ర, ప్రతిమతో | 0 | 3 |
| శ్రీ వేమనయోగిజీవితము ,, | 0 | 2 |
| దాదాభాయినౌరోజీచరిత్ర ,, | 0 | 2 |
| గౌరాంగస్వామిచైతన్యజీవితము | 0 | 2 |
| శ్రీ కరంచంద్ గాంధిజీవితము, ప్రతిమతో | 0 | 4 |
| నెపోలియన్ చక్రవర్తి చరిత్రము ,, | 0 | 4 |
| సోదరినివేదితజీవితము ,, | 0 | 2 |
| శ్రీ గైక్వారుగారిజీవితము ,, | 0 | 2 |
| వివేకానందస్వామిజీవితము ,, | 0 | 2 |
| శ్రీ కృష్ణదేవరాయచరిత్ర ,, | 0 | 3 |
| ఆనిబిసెంటుచరిత్ర ,, | 0 | 4 |
| లార్డుక్లైవుజీవితము ,, | 0 | 8 |
| చిత్తరంజనదాసుజీవితము ,, | 0 | 4 |
| ఆలీసోదరులజీవితము ,, | 0 | 4 |
| మైరావణచరిత్ర, చక్కనిబొమ్మ | 0 | 1 |
| పండిత మదనమోహనమాళవ్యాజీవితము | 0 | 2 |
| అనంతసాగరం బుక్కరాయసముద్ర చరిత్రము | 0 | 12 |
| రామదాసుచరిత్ర, ప్రతిమతో | 0 | 12 |
| ఈసపునీతికథలు 1-వ భాగము | 0 | 6 |
| డిటో 2-వ భాగము | 0 | 8 |
| అరేబియన్ నైట్సుకథలు | 1 | 4 |
| రేచుక్కపగటిచుక్కకథలు | 0 | 3 |
| షేక్స్పియర్ నాటకకథలు | 1 | 8 |

| | | ప్రతి 1-కి రూ | అ |
|---|---|---|---|
| శుకసప్తతికథలు | ... | 0 | 6 |
| పరిహాస్యవినోదకథలు | | 0 | 12 |
| రోషినార, చరిత్రవిషయకమగు నవల | .. | 0 | 12 |
| పంజాబు అల్లరి | | 0 | 8 |
| సీతారామము | | 1 | 4 |
| ఐవ్హానో, నవల | | 0 | 8 |
| మదాలస, నవల | | 0 | 10 |
| సుజనరంజని ,, | | 0 | 8 |
| విజ్జలదేవి ,, | | 1 | 0 |
| ఉన్మాదిని ,, | | 0 | 4 |
| రాధారాణి ,, | | 0 | 4 |
| అస్తమయము ,, | | 1 | 8 |
| సత్యసేనవిజయము ,, | | 0 | 4 |
| దుర్గేశనందని ,, | | 0 | 8 |
| కపాలకుండల ,, | | 0 | 12 |
| టిప్పుసుల్తాన్ ,, | | 1 | 4 |
| లీల ,, | | 0 | 4 |
| రాజర్షి ,, | | 0 | 14 |
| తారాబాయి ,, | | 0 | 12 |
| దిలారామ ,, | .. | 1 | 4 |